# మనవి

ఆంధ్రకవుల చరిత్రము, ఆంధ్ర కవిజీవితములు, ఆంధ్రకవి తరంగిణి, శతకకవుల చరిత్ర, తెనుఁగుకవుల చరిత్ర, దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము మొదలయిన ఆంధ్రకవి జీవితాదులను వివరించు గ్రంథము లచ్చుపడి యిదివఱకు దొరకుచుండినవి. వానిలో మిక్కిలి యెక్కువ వెల గలవి యే యొకటి రెండో తప్ప తక్కినవి యిపుడు దొరకకున్నవి. అవి యీ కఱవు కాలమున నింతలో—ఎంతలోనేని - అచ్చయి మరల దొరకఁగలవను నాశ చాల దూరములోనిది. ఒకవేళ నచ్చుపడినను మితిమీఱిన వెలకుఁగాని దొరకమి నిశ్చయము. సామాన్యజను లెక్కువ వెల పెట్టి వానిని విలిచి యుపయోగించుకొనఁజాలమియు నిశ్చయము. అంతియ కాక, వానిలో నే యొక్కటియును సమగ్రము గాదు. ఇట్టితఱి, తక్కువవెలకు దొరకునదియు, సమగ్రము, సంగ్రహము నయినదియు నగు కవిచరిత్ర యొకటి నే డాంధ్ర జాతి కావశ్యక మగుచున్నది. ఈ యావశ్యకమును సమకూర్చుటకో యన్నట్లీ యదనున "ఆంధ్రకవి సప్తశతి" అను నపూర్వ నామముతో నవతరించినది యీ గ్రంథము.

తమువఱకు వివిధ గ్రంథరత్నములను రచించి ఆంధ్రవాణిని గై సేసి చిరంజీవులయి వెలసియున్న యేడువందలమంది తెలుఁగు కవులయొక్క జీవితచరిత్రాదులు సంగ్రహముగ గలవు. ఇది వఱకు వెలువడిన తెలుఁగు కవి చరిత్రగ్రంథములు కవుల యొక్క కాలము, దేశము, గ్రామము, జాతి, శాఖ, మతము మొదలగువాని విషయమున మిక్కిలి మెండుగ జరిగిన వాద ప్రతివాదములు, ఖండనమండనములు మొదలగువానిమూల మున నమితముగఁ బెరిగి పెద్దవయినవి. కాని, వివాదవిషయ ములు మాత్రము గట్టి సిద్ధాంతములు లేకయే నిలిచియున్నవి. కాఁబట్టియే కాఁబోలును-అట్టి వాదప్రతివాదముల కిందు చోటు లేకపోయినది. అయిననేమి? ఆ యా వాదముల సార మొండు రెండు మాటలలో నిందుఁ జేరి వాదవిషయములను బోధపఱుచు చున్నది. అందుచే నా పెద్ద గ్రంథములవలనఁ గలుగు ప్రయో జన మించుమించుగ నీ చిన్న గ్రంథమువలననే కలుగఁగలదు. కావున, తెలుఁగు చదువరు లందఱికి, విశేషించి విద్యార్థులకు దీని యుపయోగ మపరిమితము. ఉపాధ్యాయులకును నిది చేఁదో ంగ నుండఁగలదు.

గ్రంథకర్త శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు పండి

# కృతజ్ఞత

'ఆంధ్రకవి సప్తశతి'ని రచించుటలోఁ నీ క్రింది గ్రంథములును, సారస్వత పత్రికలును మిక్కిలి యుపయోగపడినవి. ఆ యా గ్రంథకర్తలకును, వ్యాసకర్తలకును నమోవాకములు :

ఆంధ్రకవితరంగిణి - శ్రీ చాగంటి శేషయ్యగారు
ఆంధ్రకవుల చరిత్రము - శ్రీ కందుకూరి వీరేశలింగముగారు
ఆంధ్ర రచయితలు - శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు
ఆంధ్రవచనవాఙ్మయము - శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు
ఆంధ్రవాఙ్మయచరిత్రము - శ్రీ వంగూరి సుబ్బారావుగారు
ఆంధ్రవాఙ్మయచరిత్ర సంగ్రహము - శ్రీ కే. వేంకటనారాయణరావుగారు
ఆంధ్రవాఙ్మయ సూచిక-శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు-(సంపాదకులు) :
ఆంధ్రాలంకార వాఙ్మయచరిత్రము - శ్రీ బులుసు వేంకటరమణయ్య
ఉదాహరణ వాఙ్మయచరిత్ర - శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు
కవిజీవితములు - శ్రీ గురుజాడ శ్రీరామమూర్తిగారు
గోలకొండ కవులసంచిక-శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు (సంపాదకులు)
చాటుపద్యమణిమంజరి-శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు (సంపాదకులు)
తెనుఁగుకవుల చరిత్ర - శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు
దక్షిణదేశీయాంధ్రవాఙ్మయము - శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు
ప్రబంధరత్నావళి - శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు (సంపాదకులు)
**Biographical Sketches of Dekkan Poets** -
శ్రీ కావలి వేంకటరామస్వామిగారు
శతకకవులచరిత్ర - శ్రీ వంగూరి సుబ్బారావుగారు
శతకవాఙ్మయ సర్వస్వము - శ్రీ వేదము వేంకటకృష్ణశర్మగారు
శృంగార శ్రీనాథము - శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు
వివిధగ్రంథములు - వాని పీఠికలు
ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలు
ఆంధ్రసాహిత్య పరిషత్పత్త్రిక, భారతి, చంద్రిక, కిన్నెర, పరిశోధన మున్నగు పత్రికలు.

—బులుసు వేంకటరమణయ్య

క్రమమున నుండుటవలనను, ఆ యా కవులు రచించిన గ్రంథముల పట్టిక యొకటి యా తీరుననే చేరి యుండుటవలనను దీని యుపయోగ మిను మిక్కిలి యగుచున్నది. ఈ గ్రంథము నీ క్రమమున సమకూర్చి ప్రకటించిన గ్రంథకర్త కృషి మెచ్చఁదగినది.

24-8-1956,
మదరాసు.

గన్నవరపు సుబ్బరామయ్య

# ఆంధ్రకవి సప్తశతి

## అంకభూపాలుఁడు - దామెర

ఈతఁడు పద్మనాయక వంశీయుఁడు. ఇనగాల గోత్రుఁడు. చెన్న భూపాలునకును, తిమ్మాంబకును పుత్రుఁడు. బహుళాశ్వచరిత్రమును రచించిన దామెర - వెంగళభూపాలుఁ డీతనికిఁ బినతండ్రి.

ఈ కవి 'ఉషాపరిణయము' అను నైదాశ్వాసముల ప్రబంధమును రచించి శ్రీరామచంద్రున కంకిత మిచ్చెను. ఇతని యన్నయగు వేంకట భూపాలుఁడు వాలూరి పురమున కధీశ్వరుఁడఁట! అదియే యిప్పటి వేలూరఁట!

ఉషాపరిణయము ముద్రితము కాలేదు. ఇందు చెన్నపట్టణపు నిర్మాణ విషయము కలదు. కావున నియ్యది క్రీ. శ. 1639 సం. కుఁ దర్వాత రచిత మైనదని చెప్పవలెను.

ఇందలి రచన సరళమై యుండును.

## అక్కనామాత్యుఁడు

ఈతఁడు భారద్వాజ గోత్రుఁడు. లింగోజీ పుత్రుఁడు. శహాజీ (1684-1712) కాలమున నుండినవాఁడు. ఇతఁడు 'బాలకృష్ణ లీలా విలాస'మను యక్షగానమును రచించెను. ఈ గ్రంథ మముద్రితము.

## అఖండ సచ్చిదానందావధూత

ఈతఁడు 'పురూరవశ్చరిత్ర' మను వేదాంతగ్రంథమును రచించెను. అందు పురూరవసునకు నారదుఁడు తత్త్వోపదేశము చేసిన విషయము వర్ణితము. ఈతని పూర్వాశ్రమ వృత్తాంతము తెలియలేదు.

ఈతని గ్రంథ మెన్ని యాశ్వాసములో తెలియదు. ఒక్క యాశ్వాసము మాత్రము మద్రాసు-ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో నున్నది. రచన సరళమైనది.

## అథర్వణాచార్యుఁడు

ఈతఁడు జైన సంప్రదాయమునకుఁ జెందిన యాంధ్రవిద్వత్కవి. ఇతని కృతి యని చెప్పఁబడు వికృతి వివేక మను వ్యాకరణగ్రంథమునఁ జెప్పఁబడిన లిపి స్వరూపమునుబట్టి యీతఁడు 12-వ శతాబ్దిలోనివాఁడని డాక్టరు బర్నెలు దొరగా రభిప్రాయపడి యున్నారు. నన్నయ, తిక్కనల నడిమికాలమున భారతము నాంధ్రీకరింపఁ బూనుకొన్నందున నీతఁడు 12-వ శతాబ్దివాఁడని కొంద ఱందురు.

ఈతఁడు భారతములోని కొన్ని పర్వములను, ఒక ఛందోగ్రంథమును, సంస్కృతభాషయందు కూర్పఁబడిన 'అథర్వణకారికావళి (వికృతి వివేకము)' అను వ్యాకరణమును రచించెనని చెప్పుదురు. ఇతని భారతము లభింపకున్నను లక్షణగ్రంథములందు లభించిన పద్యములనుబట్టి యీతఁడు భారతమున ఆదిపర్వము మొదలు శల్యపర్వాంతము రచించి నట్లు తెలియుచున్నది. తక్కిన పర్వములను రచించెనో, లేదో నిశ్చయముగాఁ జెప్ప వలనుపడలేదు. ఇతని ఛందస్సు లభింపలేదు.

ఈతని భారతరచన సంస్కృతపదభూయిష్ఠ మగుటచేఁ బ్రజాదరమును బొందలేక, ప్రచారమునకు రాలేకపోయెనని కొందఱి యాశయమ్మును కాని జిలిబిలి పలుకుల నుడికారముతోఁగూడిన పద్యములును చాలను లభించినందున నీతని కవితాలోపము నెన్నరాదనియు, కవి జైనుఁడగుండటనో, కవిత్రయభారతమునెదుర నిది నిలువలేక పోయినందుననో పుర అథర్వణ భారతమునకుఁ బ్రచారము కల్గలేదని శ్రీ తిమ్మావజ్ఝల - కోద [illegible]కవి. రామయ్యగారు తలఁచుచున్నారు.

## అనంతకవి - చిత్రకవి

ఈతఁడు 'ఇందుమతీపరిణయము' అను ప్రబంధమును, రామరాజభూషణ కవికృతమగు హరిశ్చంద్ర నలోపాఖ్యానమునకు వ్యాఖ్యానమును రచించెను. ఇతఁడు చిత్రకవి పెద్దనకుఁ గుమారుఁడు; సాంబవిలాసాదు లను రచించిన చిత్రకవి వేంకటరమణకవికిఁ దండ్రి; హనుమద్భక్తుఁడు.

ఈ కవి పయి గ్రంథములనే కాక 'హరిహరశ్లేషోదాహరణము, సకలజీవన సంజీవనము, వంశావళి' అను గ్రంథములనుగూడ రచించినట్లు వేంకటరమణకవి రచించిన సాంబవిలాసమునుబట్టి తెలియుచున్నది. హరిశ్చంద్రనలోపాఖ్యాన వ్యాఖ్య తప్ప మిగిలిన గ్రంథములు లభింప లేదు.

చిత్రకవి పెద్దన క్రీ. శ. 1550 ప్రాంతమున లక్షణ సారసంగ్రహ మును రచించినందున, అతని పుత్రుఁడగు నీతఁడు క్రీ. శ. 1550 తర్వాత నుండి యుండవచ్చును. మఱియు నీ కవి గండికోటను పాలించిన పెమ్మసాని - చిన తిమ్మానాయని కాలమున నున్నట్లీతని వ్యాఖ్యవలనఁ దెలియు చున్నది. అతఁడు 1580 ప్రాంతమున నుండినవాఁడు.

## అనంతభూపాలుఁడు - తుపాకుల

ఈతఁడు నేఁటి దక్షిణార్కాడు జిల్లాలో నున్న చెంజిదుర్గమునకు [illegible] 1730 ప్రాంతమునఁ బరిపాలకుఁడుగా నుండిన ప్రభువు, కృష్ణరాజు [illegible]ఁడు; వచన రచయితలలోఁ బేరెన్నికఁ గన్నవాఁడు.

ఈతఁడు విష్ణుపురాణము, భగవద్గీత-అను గ్రంథములను వచనములుగా నాంధ్రీకరించెను. రామాయణమునందలి సుందరకాండ [illegible]చనముగా నాంధ్రీకరించెను. విష్ణుపురాణ, భగవద్గీతలు ముద్రితము [illegible] రామాయణ సుందరకాండము ముద్రితము కాలేదు.

ఈతఁడు కళువె-వీరరాజునకు మిత్రుఁడు. ఆతఁడు రచించిన సభా, భీష్మపర్వముల యనువాద కార్యమున నీతఁడు సాయపడెనఁట !

## అనంతభూపాలుఁడు - మట్ల

ఈతఁడు క్షత్రియుఁడు. తండ్రి యెల్లభూపాలుఁడు; తల్లి రంగాంబ. ఇతఁ డొక చిన్న రాజ్యమున కధిపతి. ఈ తండ్రియును, పుత్రుఁడును గోలకొండ నవాబగు ఇబ్రహీంషా కాలమున రాజ్యపాలనము చేయుచున్నట్లు చరిత్రలో నిదర్శనములు కానవచ్చుచున్నందున నీతఁడు క్రీ.శ. 1550-80సం. ప్రాంతమున నుండినట్లు చెప్పవచ్చును. ఇతఁడు తిరుమల తోళప్పాచార్యుల శిష్యుఁడఁట !

ఈతని గృహనామము 'మట్లి'వారని 'ఆంధ్రకవితరంగిణి'లోఁ జెప్పఁబడినది.

ఈతఁడు కకుత్స్థవిజయ మను అయిదాశ్వాసముల ప్రబంధమును రచించి తన తండ్రికే యంకిత మిచ్చెను. ఇందు సూర్యవంశపు రాజులలో ప్రసిద్ధుఁడగు కకుత్స్థుని వృత్తాంతము వర్ణింపఁబడినది.

ఈతని కవిత్వము నిర్దుష్టమై హృదయంగమముగా నుండును.

## అనంతయజ్వ - రేవూరి

ఈతఁడు వెలనాఁటి వైదికబ్రాహ్మణుఁడు. కౌండిన్యగోత్రుఁడు. బాలకవి అనంతయ్య పౌత్రుఁడు. కాళహస్తికవి పుత్రుఁడు. బాలకవి బిరుదాంకితుఁడు. ఈ కవి 18-వ శతాబ్ది మధ్యమున నుండి యుండవలెను.

ఈ కవి శ్రీముష్ణమాహాత్మ్యమను అయిదాశ్వాసముల ప్రబంధమును రచించి వెంగుళము - కృష్ణభూపాలున కంకిత మొనర్చెను. శివరహస్యఖండ మను తొమ్మిది యాశ్వాసముల ప్రబంధమును రచించి తీర్థపుర (తుర్తైయూరు) నందీశ్వరున కంకితముచేసెను. కోడూరు - వేంకటాచలకవి రచించిన శివరహస్యఖండము వేఱొకటి కలదు.

## అనంతయ్య - మడికి

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. భారద్వాజగోత్రుఁడు. అయ్యలమంత్రికిఁ బుత్రుఁడు. సింగనకవికిఁ దమ్ముఁడు. నేఁడు చింతలపల్లి - యెల్లనామాత్యుని కృతిగాఁ బ్రకటింపఁబడిన విష్ణుమాయానాటక మను ప్రబంధమున కీతఁడే కర్తయని 'ఆంధ్రకవి తరంగిణి'లో వివరింపఁబడినది.

విష్ణుమాయానాటకపు వ్రాఁతప్రతులు రెండు మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయములోను, ఒకటి కాకినాడ పరిషత్కార్యాలయములోను ఉన్నవఁట! చెన్నపురి ప్రతుల గద్యలో నిది చింతలపూడి - యెల్లనార్య కృతి యైనట్లును, పరిషత్కార్యాలయ ప్రతిలో అనంతయ్య కృతి యైనట్లును కలదు. కృత్యాది యే ప్రతియందును లేదు. మడికి-సింగన తనకు అనంతయ్య యను సోదరుఁ డున్నట్లు చెప్పెను. సింగన క్రీ. శ. 1375-1435 నడుమ నుండుటచే అనంతయ్యయు నప్పటివాఁడే యగును. రాధామాధవకవి యను బిరుదు కల యెల్లనామాత్యుఁడు రాయల కాలమున నున్నవాఁడు. రాధామాధవకవి, తా నీగ్రంథమును వ్రాసినట్లు చెప్పలేదు. శైలి భిన్నము. కావున లేఖకుఁ డెవ్వఁడో - గ్రంథాంతరములు రచింపమిచేఁ బ్రసిద్ధికెక్కని యనంతయ్యపేరు మార్చి సుప్రసిద్ధుఁడగు రాధామాధవకవినామము గద్యమునఁ జేర్చి యుండును.

విష్ణుమాయానాటక మైదాశ్వాసముల చక్కని ప్రబంధము. ఇందు విష్ణువు చేసిన మాయలు మిక్కిలి రసవంతముగ వర్ణింపఁబడినవి. కవిత్వము మిక్కిలి మనోహరము.

## అనంతయ్య - రేవూరి

ఈతఁడు వెలనాఁటి వైదికబ్రాహ్మణుఁడు. కౌండిన్యగోత్రుఁడు. కాళహస్తికవి పౌత్రుఁడు; లింగకవి పుత్రుఁడు. కాళహస్తిమహాకవికిఁ దమ్ముఁడు. శ్రీముష్ణమాహాత్మ్యమును రచించిన అనంతయజ్వ యీతని

మనుమఁడు. కావున ఈ కవి 17-వ శతాబ్ది ప్రారంభమున నున్నట్లు తలంపవచ్చును.

ఈ కవి గాధేయోపాఖ్యానము, వృద్ధాచల మాహాత్మ్యము, శేషార్యోదాహరణము - అను మూఁడు గ్రంథములను రచించెను.

గాధేయోపాఖ్యాన మైదాశ్వాసముల ప్రబంధము. ఇందు మేనకా విశ్వామిత్రుల శృంగారము వర్ణితము. కవి యీ గ్రంథమును బదిర కృష్ణ ప్రభువున కంకిత మిచ్చెను. ఈతఁడు శూద్రకుల సంజాతుఁడఁట!

వృద్ధాచల మాహాత్మ్యము, వృద్ధాచల క్షేత్రవిషయమును తెల్పును. ఇది పంట లింగాజి రెడ్డి కంకితము.

శేషార్యోదాహరణము శేషార్యుఁడను నొక పురుషుని ప్రశస్తిని వివరించు నుదాహరణ కావ్యము.

## అనంతరామకవి - పరశురామపంతుల

ఈతఁడు సుప్రసిద్ధుఁడగు పరశురామపంతుల - రామమూర్తి కుమారుఁడు. లింగమూర్తి మనుమఁడు. ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు.

ఈతని నివాసము నిజామురాష్ట్రమునందలి వరంగల్లు. ఈ కవి క్రీ. శ. 1830 ప్రాంతమున నుండియుండును. హనుమద్విజయ మను నొక కావ్యము నీతఁడు రచించెను. అయ్యది యసంపూర్ణముగ లభించినది. ఈతఁడు మఱికొన్ని గ్రంథములనుకూడ రచించెనఁట! అవి లభింపలేదు.

## అనంతామాత్యుఁడు

ఈతఁ డాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు. కౌండిన్యగోత్రుఁడు. ఈతని ముత్తాత యగు బయ్యనమంత్రి తిక్కనసోమయాజిచే 'భవ్యభారతి' అను బిరుదమును పొందెనఁట! అనంతుని తాత మున్మడన్న; తండ్రి తిక్కన్న. ఈతని నివాసము ధ్రువపురి. అది యెచ్చటిదో తెలియదు. అది ధూళిపూఁడి యని కొందఱును, దరువూరని శ్రీ నిడుదవోలు-వేంకటరావు

పంతులుగారు ననుచున్నారు. ఇతని రసాభరణము క్రీ. శ. 1435 లో ధ్రువపట్టణాధిపున కంకితమగుటచే నితఁడు 15-వ శతాబ్ది ప్రథమపాదమున నుండెనని చెప్పవలెను.

అనంతామాత్యుఁడు భోజరాజీయము, ఛందోదర్పణము, రసాభరణము అను మూఁడు గ్రంథములను రచించెను. భోజరాజీయము తొలి గ్రంథము; ఏడాశ్వాసములు కలది. ఇది అహోబల నృసింహస్వామి కంకితము. ఇందు చిత్ర విచిత్రములగు కథలు కలవు. ఛందోదర్పణము నాల్గాశ్వాసముల లక్షణ గ్రంథము. ఇయ్యది అనంతమూర్తి యగు శ్రీకృష్ణున కంకిత మొనర్పఁబడినది. రసాభరణ మీతని మూఁడవ గ్రంథము. ఇయ్యది శృంగారరస స్వరూపమును వివరించు నలంకార గ్రంథము; నాలుగాశ్వాసముల పరిమితి గలది. ధ్రువపట్టణాధిపుఁ డగు శ్రీ కృష్ణదేవున కంకితము.

## అనంతార్యుఁడు - ఏనుఁగు

ఈతఁ డార్వేల నియోగి బ్రాహ్మణుఁడు. వాధూలగోత్రుఁడు. లక్ష్మణకవి మనుమఁడు. తిమ్మకవి పుత్రుఁడు. సుప్రసిద్ధుఁడగు ఏనుఁగు లక్ష్మణకవి కగ్రజుఁడు. కావున నీతఁడు 1700 ప్రాంతమున నుండి యుండును.

ఈతఁడు 'గౌరీ పరిణయ' మను కావ్యమును రచించినట్లు లక్ష్మణకవి రచించిన సుభాషిత రత్నావళినిబట్టి తెలియుచున్నది. అనంతార్యుని యీ గ్రంథము లభించలేదు.

## ✓అన్నమయ్య - యథావాక్కుల

ఇతఁడు ప్రాచీనులగు శివకవులలో నొకఁడు. 13-వ శతాబ్దివాఁడు. ఈతని 'సర్వేశ్వర శతకము' క్రీ. శ. 1242 లో రచింపఁబడినది.

ఈతఁడు సర్వేశ్వరశతకము, లీలానందసర్వేశ్వరశతకము అను రెండు గ్రంథములను రచించెను. వీనిలో సర్వేశ్వరశతకమును శతకమని

యనుటకంటె స్తోత్రమనుటయే యుచితమని విమర్శకుల యభిప్రాయము. శ్రీకాళహస్తీశ్వరశతకము, శ్రీవేంకటేశ్వరశతకము నివియును నొకే వ్యాకరణమునుండుటచే నిట్లూహింపవలసి యున్నది. ఇతని శతకములోని పద్యములు సరళముగను సంగీతమునకు ననుకూలముగను నుండును. ఈ ప్రకారమే సకల శతకములను చెప్పవచ్చును. శ్రీకాళహస్తీశ్వరుని సుప్రభాతము, సహస్రనామావళి యని యితఁడు రచించెనట. లీలానంద సర్వేశ్వరశతకము మాత్రము శతకము కాదగునఁట!

అన్నమయ్య కవిత్వము మిక్కిలి ప్రౌఢమైనది.

## అన్నమరాజు - కౌనుకొలను

ఈతఁడు నియోగి బ్రాహ్మణుఁడు. అన్నమయ్య యనునది యితని నామాంతరమఁట! సంస్కృతమునందలి 'అమరుక కావ్యము' నీతఁడాంధ్రీకరించినట్లు జగ్గన (1560) కూర్చిన ప్రబంధరత్నాకరమునుబట్టి తెలియుచున్నది. ఈ 'అమరుక కావ్యము' లభింపలేదు.

ఈతని నివాసమగు 'కానుకొలను' ఎచ్చట నున్నదియుఁ దెలియదు. ఈ యన్నమరాజు క్రీ. శ. 1484 లో నుండిన ట్లొక శాసనమువలనఁ దెలియవచ్చుచున్నదని శ్రీ నిడుదవోలు - వేంకటరావుగారు తెలుపుచున్నారు. దానింబట్టి యీతని తాత సూరపరాజనియు, తండ్రి అన్నయ్య యనియు, నితఁడు భాస్కరక్షేత్ర నివాసి యనియుఁ దెలియవచ్చుచున్నది.

## ✓ అన్నమాచార్యులు - తాళ్లపాక

ఈతఁడు నందవరీక బ్రాహ్మణుఁడు; కాని వైష్ణవమతమును స్వీకరించి యాచార్యస్థానమును సంపాదించెను. ఈతఁడు భారద్వాజ గోత్రుఁడు. ఇతనికి 'అన్నమయ్య, అన్నయాచార్యులు, అన్నమయ్యంగారు, అన్నయార్యుఁడు మున్నగునవి వ్యవహారనామములు. ఇతని నివాసము తొలుత కడపమండలములోని తాళ్లపాక. కొంతకాలమైన పిదపఁ దిరుపతికి వచ్చి యితఁడు శ్రీ వేంకటేశ్వరుని సేవించుచు నచ్చటనే నివసించెను. తిరుపతిలో రాగిరేకులపై లిఖింపఁబడిన యీతని సంకీర్తన గ్రంథాదియందీ కవి క్రీ.శ. 1424 మొదలు 1502 వఱకును గేయములను రచించుచుండెనని తెలియవచ్చుచున్నది. ఈతఁడు తన పదునాఱవ యేటనే సంకీర్తనలు రచించుటకుఁ బ్రారంభించెను. కావున నీతఁడు క్రీ. శ. 1408 లో జన్మించి 1503 వఱకు జీవించి యుండెనని తెలియుచున్నది.

ఈతఁడు సంస్కృతాంధ్రములలో 32 వేలకుఁ బైగా కీర్తనలను రచించెను. అందుఁ జాల తక్కువగనే ముద్రితములైనవి. ఇతని కీర్తనలలో జోలపాటలు, ఉయ్యాలపాటలు, తలుపుదగ్గఱపాటలు, మేలుకొలుపులు, తుమ్మెదపదాలు, మంగళహారతులు మున్నగునవి కలవు. ఇట్లు కీర్తనలనే కాక వేంకటాచల మాహాత్మ్యము, ద్విపద రామాయణము అను గ్రంథములనుకూడ నితఁడు రచించెనని చెప్పుదురు.

ఇతని సంకీర్తనలలో శృంగార సంకీర్తనలు, అధ్యాత్మసంకీర్తనలు, శృంగారమంజరి ముఖ్యములు. సంస్కృతభాషలో నీతఁడు సంకీర్తన లక్షణ గ్రంథమును వ్రాసెను.

ఈతని 'వేంకటేశ్వరశతకము' నుండి పెదపాటి - జగన్నాథకవి కూర్చిన 'ప్రబంధరత్నాకరము'లో నుదాహరించిన పద్యమునుబట్టి యీతఁడు 'వేంకటేశ్వరశతకము'ను రచించినట్లు తెలియుచున్నది.

ఈతని కవిత్వము లలిత పదగుంభనముతోఁగూడి సర్వజనాహ్లాదకరమై యుండును.

## అన్నయ - తెనాలి

ఈతఁడు ప్రథమశాఖాబ్రాహ్మణుఁడు. కౌండిన్యగోత్రుఁడు. తెనాలి నివాసి. రామయమంత్రిపుత్రుఁడు. సుప్రసిద్ధుఁడగు తెనాలి-రామకృష్ణకవికిఁ దమ్ముఁడు. ఇతఁడు తొలుత శైవుఁడైనను, పిదప వైష్ణవమును గ్రహించి కందాళ - శ్రీరంగాచార్యుల శిష్యుఁడైనాఁడు. 16-వ శతాబ్దివాఁడు.

ఈతఁడు 'సుదక్షిణాపరిణయ' మను నైదాశ్వాసముల ప్రబంధమును రచించి, పులిజాల - సోమయామాత్యున కంకితమొనర్చెను. ఈ సోమయామాత్యునకుఁ బోషకుఁడగు కోనేటి-రామరాజుయొక్క జననము క్రీ. శ. 1530 ప్రాంతము. అతని కాశ్రితుఁడైన సోమనామాత్యున కీ

యన్నయకవి క్రీ.శ. 1560 ప్రాంతమున సుదక్షిణాపరిణయకావ్యము నంకిత మిచ్చి యుండునని 'ఆంధ్రకవితరంగిణి'లో చెప్పఁబడియున్నది.

ఇక్ష్వాకువంశజుఁడగు దిలీపుని చరిత్రమును, ఆతఁడు సుదక్షిణాదేవిని వివాహమాడిన విషయమును 'సుదక్షిణాపరిణయము'న వర్ణింపఁబడినవి. ఇందలి కవిత్వము ప్రౌఢమై, సలక్షణమై, మనోహరముగా నుండును.

## అన్నయ - వెన్నెలకంటి

ఈతఁ డన్నయామాత్యుని మనుమఁడు. సూరామాత్యుని కుమారుఁడు. సూరామాత్యుఁడు మంత్రి సత్తముఁడు. కావ్యపురాణవేత్త. అన్నయ షోడశకుమారచరిత్ర మను పద్యకావ్యమును రచించి తన తండ్రికే కృతియిచ్చెను. ఇతని యాశ్వాసాంతపద్యములను కొన్నింటిని జక్కన తన విక్రమార్కచరిత్రయం దనుసరించి యున్నందున నీతఁడు క్రీ. శ. 1250 ప్రాంతమువాఁడయినను, పశ్చిమచాళుక్య చక్రవర్తి యగు సర్వజ్ఞ సోమేశ్వరునితోను, జగదేకమల్లునితోను తన తండ్రిని పోల్చియున్నందున నీ కవి 1150 ప్రాంతమువాఁడైనను కావచ్చునని శ్రీ నిడుదవోలు - వేంకటరావుగారి యాశయము.

షోడశ కుమారచరిత్రము పూర్తిగా లభింపలేదు. కవిభల్లటుని కృతిగా లక్షణగ్రంథములం దుదాహరింపఁబడిన 'బేతాళపంచవింశతి' లోని భాగములును, షోడశకుమారచరిత్రలోని భాగములును అభిన్నములై యున్నవి. షోడశకుమారచరిత్రములోని పద్యములను బేతాళ పంచవింశతి లోనివిగా శ్రీ చిన్నయసూరిగారు చెప్పియున్నారఁట!

ఇందలి రచన రసవంతమై నిర్దుష్టముగా నున్నది.

## ✓ అప్పకవి - కాకునూరి

ఈతఁడు వైదిక బ్రాహ్మణుఁడు. భారద్వాజ గోత్రుఁడు. వెంగనకును, సేనమకును పుత్రుఁడు. కామెపల్లిలోని గోపాలకృష్ణున

కీతఁడు భక్తుఁడు. ఇతని వంశపూర్వపురుషుఁడు సోమయ్య 'అభినవ చూతవర్ధాగ్రామము'లో నుండెనఁట! ఇది 'క్రొత్తమామిడిపల్లి'అని కొందఱభిప్రాయపడిరి. ఇయ్యది హైదరాబాదురాష్ట్రములోని 'లేమావిళ్లు' అని శ్రీ బూర్గుల-రామకృష్ణరావుగారు సవిమర్శముగ నిర్ణయించి యున్నారు. అప్పకవి క్రీ. శ. 1656 లో కామెపల్లిలోనుండఁగా స్వప్నము కల్గినట్లును, తర్వాత అందే అప్పకవీయము రచింపఁబడినట్లును చెప్పఁబడినది.

అప్పకవి సంస్కృతమున 'ఆపస్తంబ షట్కర్మ నిబంధనము'ను, 'కాలబాలార్ణవము'నకు శ్లోకరూపమగు సంగ్రహమును రచించెను. తెలుఁగులో అనంతవ్రతకథను, శ్రీశైల మల్లికార్జునుని మీఁద శ్లేషనిందాస్తుతిగర్భ సీసపద్యశతకమును, కవికల్పకమను లక్షణగ్రంథమును, స్త్రీలకు ధర్మద్విపదను, అంబికావాదమను యక్షగానమును, అప్పకవీయమను ప్రసిద్ధి పొందిన ఆంధ్రశబ్దచింతామణి యను పద్యలక్షణ గ్రంథమును రచించెను.

అప్పకవీయ మెనిమిదాశ్వాసముల గ్రంథముగా నుండవలెనని కవి నిర్ణయము. కాని యప్పకవి దీనిని సమగ్రముగ రచింపనట్లు తోఁచుచున్నది. అయిదాశ్వాసముల గ్రంథమే లభించుచున్నది. ఆ యైదాశ్వాసములలోను క్రమముగ భాషావిషయము, వర్ణవిషయము, వళిప్రాసములు, పద్యలక్షణములు, సంధివిషయము వివరింపఁబడినవి.

ఇతని యితర గ్రంథము లేవియును లభింపలేదు.

## అప్పనమంత్రి

ఈతఁడు నియోగి బ్రాహ్మణుఁడు. భారద్వాజ గోత్రుఁడు. గోవిందార్యునకును, నాగమాంబికకును పుత్రుఁడు. వల్లభార్యుని యన్నసింగనామాత్యుని మేనల్లుఁడు. ఉభయభాషా కవిత్వ విశారదుఁడు.

ఈతని పద్యము నొకదానిని మడికి-సింగన తన 'సకల నీతిసమ్మతము' లో నుదాహరించినందున, ఆతనికంటెను అప్పన పూర్వుఁ డనవలెను. మడికి సింగన క్రీ. శ. 1375-1435 నడుమ నున్నవాఁడు.

ఈతఁడు 'చారుచర్య' అను వైద్యగ్రంథమును తెలిఁగించెను. దానిని సంస్కృతమున భోజరాజు రచించెను. ఇది యాత్మసంబోధన గ్రంథము. భోజకృతి కిది సంగ్రహానువాదమగు చిన్న గ్రంథమని పీఠికలో శ్రీ వేటూరి-ప్రభాకరశాస్త్రిగారు వ్రాసి యున్నారు.

ఈ కవి 1350 ప్రాంతమువాఁడని 'ఆంధ్రకవి తరంగిణి'లో నున్నది.

## అప్పనార్యుఁడు - నెప్పల్లె

ఈతఁడు వీరశైవుఁడు. కౌండిన్య గోత్రుఁడు. బ్రహ్మలింగార్యుని పుత్రుఁడు. ఇవటూరి - రామనారాధ్యుని శిష్యుఁడు. ఈకవి శైవాగమ శిఖామణి యను నైదాశ్వాసముల పద్యకావ్యమును రచించి శ్రీశైల మల్లికార్జునస్వామి కంకిత మొసర్చెను. ఇందు శివలింగ, శివపూజా, రుద్రాక్షాదుల మాహాత్మ్యములు తెలుపఁబడినవి.

ఈతఁ డివటూరి-రామలింగయ్య (రామనారాధ్యుని) శిష్యుఁడగుట నిజమేని, ఇతని కాలము క్రీ. శ. 1575-1625 నడుమ నయి యుండునని 'ఆంధ్రకవి తరంగిణీ' కారుల యాశయము.

## అప్పప్పకవి - రత్నాకరము

బ్రాహ్మణార్చన తత్పరుఁడును, సంస్కృతాంధ్రములలో సమర్థుఁడు నగు నీ కవి యాంజనేయకవి, శేషమాంబల పుత్రుఁడు. వందివంశమునకుఁ జెందినవాఁడు. ఈతనికాలము సరిగాఁ దెలియదు. కాని యీ కవి కంకంటి - పాపరాజును స్తుతించి యుండుటచే, నతనికంటె నవీనుఁడని మాత్రము చెప్పవచ్చును.

ఈతఁడు 'శశిరేఖాపరిణయ'మను నైదాశ్వాసముల ప్రబంధమును రచించి, గోపాలదేవున కంకిత మొనర్చెను. ఇందు శశిరేఖాభిమన్యుల వివాహకథ చక్కఁగా వర్ణింపఁబడినది. రచన సరళమై, హృదయంగ మముగా నుండును.

## అప్పయకవి - వైజర్సు

ఈతఁడు మాధ్వబ్రాహ్మణుఁడఁట! ఈ కవి విశాఖపట్టణమండల నివాసి. 18-వ శతాబ్ది ప్రారంభమున నుండిన కాకర్లపూఁడి - రామభద్ర పాయక రాయప్రభుని కాలమున నున్నవాఁడు. ఈతఁడు 'కటివేల్పు' శతకమును, ఉపమాక వేంకటేశ్వరశతకమును రచించెను. ఇందు ఉపమాక వేంకటేశ్వరశతకము కాకర్లపూఁడి రామభద్ర పాయక రాయప్రభువున కంకితమొనర్పఁబడినది. ఉపమాక విశాఖపట్టణ మండలములోని యొక క్షేత్రము.

ఇతని రచన ప్రౌఢమై, హృదయంగమమై యుండును.

## అప్పయ్య - జూలూరి

ఇతఁడు మాధ్వబ్రాహ్మణుఁడు. బ్రౌనుదొరగారివద్ద నుండిన పండితుఁడు. క్రీ. శ. 1810 ప్రాంతమువాఁడు. ఈతఁడు తన పోషకుని యానతి ననుసరించి పెక్కుగ్రంథములకు వ్యాఖ్యానమును రచించుటయే గాక 'శ్రీనివాసతారావళి, రామపంచాశత్కందములు, యదువంశభూషణ శతకము' అను మూఁడు గ్రంథములను రచించెను. ఆ మూఁడు గ్రంథ ములును ముద్రితములు.

యదువంశభూషణశతకమునకు 'కృష్ణ! హరీ! యదువంశభూషణా!' అనునది మకుటము. ఇందు చంపకోత్పలమాలలు కలవు. రచన ప్రౌఢమై హృదయావర్జకమయి యుండును.

## అప్పలాచార్యులు - కౌమసముద్రము

ఈతఁడు శ్రీవైష్ణవబ్రాహ్మణుఁడు. కృష్ణమాచార్యుల కుమారుఁడు. గద్వాల సంస్థానమున సోమభూపాలుని యాస్థానకవిగా నుండెను. కావున 18-వ శతాబ్ది యుత్తరార్ధమున నీతఁడుండి యుండవలెను.

ఈ కవి సంస్కృతమునందలి కృష్ణలీలాతరంగిణిని 'ఆంధ్రాష్టపది' అను పేర నాంధ్రీకరించెను. మఱియు యథాశ్లోక తాత్పర్యరామాయణమునందలి కిష్కింధాకాండమును మూఁడాశ్వాసములుగాఁ గూర్చెను. ఈతనికి విద్వత్కవికుంజర మను బిరు దుండినది.

## అప్పలాచార్యులు - సంబతిఘులు

ఈతఁడు శ్రీవైష్ణవబ్రాహ్మణుఁడు. వేంకటాచార్యుల కుమారుఁడు. హైదరాబాదు రాష్ట్రములోని హుజూరునగరమునకుఁ జేరువనున్న శుక్రవీడుగ్రామ మీతని నివాసము. 120 ఏండ్ల క్రిందట నుండి యుండెనఁట.

ఈతఁడు ధరాసాగరేశ చరిత్రమును రచించి ఏనూళ్ల గోత్రజుఁడగు పరాంకుశభూపాలుని కంకితము చేసెను.

## అప్పావుమొదలి - మాత్తూరి

ఈతఁడు ద్రావిడుఁడైనను తెలుఁగుభాషపై అభిమానముకల కవి. కోటగిరి వాస్తవ్యుఁడు. మరింగంటి - రంగార్యుని శిష్యుఁడు. ఇతఁడు 1800 ప్రాంతమున నుండి యుండవచ్చును. ఇతఁడు 'తల్లినిబోల రెవ్వరుశా' అను మకుటముతో చంపకోత్పలమాలలలో 'మాతృశతకము' ను రచించెను. ఇది 1861 లో ముద్రితమైనది. చక్కని నీతులతోఁ గూడినది.

## అబ్బయామాత్యుఁడు - కనుపర్తి

ఈ కవి యార్వేల నియోగి బ్రాహ్మణుఁడు. కొండిన్యగోత్రుఁడు. రాయనమంత్రి, నరసమాంబల పుత్రుఁడు. తన తాత యగు నబ్బయామాత్యుఁడు కొండవీటిరాజులవలన మన్ననల నందెనని కవి వ్రాసికొనెను. కాని యప్పటి కా రాజ్యము తురుష్కులకు స్వాధీనమైనది. పరిశీలింపఁగా, అబ్బయామాత్యుని తాతకు ముత్తాతయైన బసవనామాత్యుఁడు మాత్రమే కొండవీటిరాజుల మంత్రి యైనట్లు తెలియుచున్నది. ఈ యబ్బయామాత్యుఁడు 18-వ శతాబ్దిమధ్యమున నుండి యుండునని శ్రీ వీరేశలింగము పంతులుగారి యాశయము. ఈతఁడు మంగళగిరిలోని నరసింహస్వామికి భక్తుఁడు.

ఈ కవి 'అనిరుద్ధచరిత్రము, కవిరాజ మనోరంజనము' అను రెండు ప్రబంధములను రచించెను. అనిరుద్ధచరిత్రము తొలి రచన. కావున నంత ప్రౌఢముగా లేదు. కవిరాజమనోరంజనమున పురూరవశ్చక్రవర్తి చరిత్రము వర్ణింపఁబడినది. దీనికి 'పురూరవశ్చరిత్ర'మను నామాంతరము కలదు. ఇందలి రచన ప్రౌఢము. వసుచరిత్రపుఁ బోకడ లిం దెక్కువగా నున్నందున దీనికి 'పిల్ల వసుచరిత్ర'మను ప్రసిద్ధి కలిగినది.

## అమరేశ్వరకవి - చిమ్మపూఁడి

లక్షణగ్రంథములందు ఉదాహరింపఁబడిన యీతని పద్యములవలనను, పెక్కుమంది కవు లీతనిని స్తుతించినందునను 'అమరేశ్వరుఁడు' సుప్రసిద్ధుఁడగు కవి యని తెలియుచున్నది. అనంతామాత్యుఁడు స్తుతించినందునను, శ్రీనాథుఁడు క్రీడాభిరామమున నీతనిని ప్రశంసించి యున్నందునను, అమరేశ్వరుఁడు వీరిరువురికంటెఁ బ్రాచీనుఁడని చెప్పవలెను.

ఈతఁడు 'విక్రమసేన' మను కావ్యమును రచించినట్లు కూచిమంచి-తిమ్మకవి రచించిన సర్వలక్షణసార సంగ్రహమువలనఁ దెలియవచ్చు

చున్నది. పెదపాటి-జగ్గనయు విక్రమసేనమునందలి పద్యము నుదాహరించి యున్నాఁడు.

కౌఅవి గోపరాజీ యమరేశ్వరుఁడు తన కులమువాఁడని చెప్పినందున నీ కవి నియోగిబ్రాహ్మణుఁడని తెలియుచున్నది.

ఈతని కవిత్వము రసవంతమైనది.

## అమరేశ్వరశాస్త్రి - కంఠంపాటి

ఈతఁడు విచారదశకమను పది ప్రకరణములు కల 'అజ్ఞానధ్వాంతచండభాస్కర' మను అద్వైతవేదాంతగ్రంథమును చక్కని వ్యావహారిక భాషలో వచనకావ్యముగా రచించెను. ఈ కవి క్రీ. శ. 1760 ప్రాంతమున నుండినవాఁడు.

## అమృతనాథుఁడు

ఈతఁ డే గ్రంథములను రచించెనో తెలియదు. ఈతఁడు మైలమభీమనను గూర్చి చెప్పిన పద్యము కాచన-బసవన రచించిన 'కవిసర్వగారుడము'న నుదాహరింపఁబడినదఁట! మైలమ భీముఁడే చిక్కభీముఁడఁట! క్రీ. శ. 1160 నాఁటి యీతని శాసనమొకటి దాక్షారామమున నున్నది. కావున నీ కవియు నప్పటివాఁడే కావలయును.

## అయ్యనకవి - కంచర్ల

ఈతఁడు నియోగి బ్రాహ్మణుఁడు. ఆత్రేయగోత్రుఁడు. మల్లన, గురవమ్మల పుత్రుఁడు. ఈతఁడు 'కాశీఖండము' ను ద్విపదకావ్యముగా రచించెను. ఈ యంశ మీతని పౌత్రుఁడును, అధ్యాత్మరామాయణకర్తయు నగు శరభకవి చెప్పియున్నాఁడు. ద్విపద కాశీఖండము లభింపలేదు.

ఈ కవి 15-వ శతాబ్ది చివరను, 16-వ శతాబ్ది ప్రారంభమునను ఉండెనని యూహింపఁబడుచున్నది.

## అయ్యమాచార్యులు

ఇతఁడు శ్రీ వైష్ణవ బ్రాహ్మణుఁడు. వనపర్తి ప్రాంతనివాసి. నూటయిర్వది యేండ్ల క్రిందట నీతఁ డుండి యుండవచ్చునఁట!

ఈతఁడు చెన్నకేశవ విలాసము, రామేశ్వర విజయము నను రెండు గ్రంథములను రచించెను.

## అయ్యల భాస్కరకవులు - అయ్యలరాజు

వీ రిరువురును జంటకవులు. అయ్యలకవి పిన యక్కయామాత్యుని కుమారుఁడు; భాస్కరకవి నాగయామాత్యుని పుత్రుఁడు. వీరిరువురును కాల స్వరూపాదులను తెలిపెడి 'రెట్టమత' మను గ్రంథమును కన్నడభాషనుండి యైదాశ్వాసముల పద్యకావ్యముగా నాంధ్రీకరించి యున్నారు. కన్నడమున నీగ్రంథమును రెట్టఁడు అనునతఁడు రచించెను.

ఈ యాంధ్ర ప్రబంధము గొంట్రాజు - పెద తిమ్మరాజునకుఁ బుత్రుఁడును, మంగయ గుర్వరాజునకు దౌహిత్రుఁడును అయిన వేంకట రాజున కంకితము.

గ్రంథముచివరి పద్యమునుబట్టి యిది క్రీ. శ. 1770 ప్రాంతమున రచింపఁబడినట్లు కానవచ్చుచున్నది. కాని యీ కాలము లేఖకునిదయి యుండవలెను. కృతిపతి యగు వేంకటరాజు (వేంకటాద్రి) చిక్కాచార్యుని శిష్యుఁడు. తెనాలి-రామకృష్ణకవియు నీ చిక్కాచార్యుని శిష్యుఁడే! కావున నీ కవులు క్రీ. శ.16-వ శతాబ్ది చివరివారని గ్రహింప వలసి యున్నది.

## అళఘరికవి - వెలిదండ్ల

ఈతఁడు మధురాధిపతి యగు విజయరంగ చొక్కనాథుని కాలమున (1706-31) నుండెను: ఆ ప్రభుని యానతి ననుసరించి 'సుదంతాపరిణయ' మను ప్రబంధమును రచించి శ్రీరంగనాథున కంకిత మొనర్చెను. ఈతని తాత వేంగళార్యుఁడు. తండ్రి పెదరాఘవార్యుఁడు.

సుదంతాపరిణయమున సుదంతాదేవికిని, శ్రీకృష్ణునకును జరిగిన వివాహము వర్ణితము. రచన హృదయంగమము. గ్రంథ మముద్రితము.

## అష్టావధానికవి

ఇయ్యది కవి బిరుదు కావలెను. అష్టావధానమువలన నది వచ్చి యుండును. కవి పేరేమో తెలియదు. ఇతఁడు శహాజీకాలమున నుండి యుండునని శ్రీ నిడుదవోలు - వేంకటరావుగారి యభిప్రాయము. ఈతఁడు 'చంద్రశేఖర విలాసము'ను రచించెనఁట!

## అహోబలపతి

'ఆంధ్రశబ్ద చింతామణి'కి వ్యాఖ్య 'అహోబలపండితీయము'కలదు. అదియు మూలమువలెనే సంస్కృతమున రచింపఁబడినది. దానికి 'కవిశిరోభూషణ' మనునది తొలిపేరు. అహోబలపతిపండితుఁడు రచించుట వలన 'అహోబలపండితీయ' మను పేరు వచ్చినది.

అహోబలపతి యింటిపేరు ప్రభంజనమువారు లేక 'వాతూల' వారఁట! ఆ పదములు 'గాలి' అనుదాని సంస్కృతపర్యాయము లందురు. అహోబలపతి పదము 'నరసయ్య'ను తెల్పునఁట! కావున నీ యహోబలపతి గాలి-నరసయ్య యని యందురు.

ఈతనింగూర్చి విశేషముగాఁ దెలియదు. ఈతఁడు పోలూరు-మాధవయ్యకు మేనల్లుఁడనియు, ఆ మాధవయ్య గొప్ప విద్వాంసుఁడనియు మాత్రము తెలియుచున్నది. అహోబలపతికి 'మహోపాధ్యాయ భట్టారక' బిరుద మున్నది. ఈతఁడు తన గ్రంథములో అప్పకవి నుదాహరించెను. కావున నతనికంటె నవీనుఁడు (క్రీ. శ. 1657 తర్వాతివాఁడు) కావలెను.

ఈతఁడు కాళిందీ కన్యాపరిణయ మను ప్రౌఢప్రబంధమును కూడ రచించెను. అది ముద్రితము; శ్రీరామున కంకితము.

## ఆంధ్రకాళిదాసు

ఇది బిరుదనామమో, కవినామమో తెలియదు. ఈతఁడు కృష్ణాతీర నివాసి యనియు, సంస్కృతాంధ్రములందు విద్వాంసుఁడనియు, శంకర

విజయము నాంధ్రీకరించెననియు శ్రీ కావలి-వేంకట రామస్వామిగారు వ్రాయుచున్నారు. ఇతని కాలము తెలియదు.

## ఆంధ్రభోజుఁడు

సంస్కృతమున సుప్రసిద్ధుఁడగు భోజరాజకవి యున్నట్లు, అతని పేర నొక యాంధ్రకవి యుండెను. భోజుఁడనునది కవినామమో, బిరుద నామమో తెలియరాదు.

ఈతఁడు 'నీతిభూషణ' మను రాజనీతి గ్రంథమును రచించెను. అందలి పద్యములు మడికి సింగన కూర్చిన సకలనీతి సమ్మతమునం దుదాహరింపఁబడినవి. సింగన 14-వ శతాబ్దివాఁడు. కావున అంధ్రభోజుఁ డతని కంటెఁ బ్రాచీనుఁడు. రచననుబట్టి యీతఁడును, క్షేమేంద్రుఁడును సమకాలికు లని చెప్పవచ్చునని శ్రీ నిడుదవోలు - వేంకటరావుగా రను చున్నారు. నీతిభూషణము లభింపలేదు.

## ఆదిశేషకవి - గాదె

ఈతఁ డార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. హరితసగోత్రుఁడు. అప్పయకుఁ బుత్రుఁడు. ఈతఁడు 'నందివెలుఁగు' గ్రామనివాసియు, కర్మకుశలుఁడును, సంపన్నుఁడు నగు కన్నెకంటి - వేంకటసుబ్బయ్య ప్రేరణమున 'శాచ్చేర్లధామ !' యను మకుటముతో నొక సీసపద్య శతకమును చెప్పెను. ఇందు గర్భకవిత్వముతోఁ గూడిన పద్యములును గలవు. కవిత్వము ప్రౌఢము. ఈతఁడు 1835 ప్రాంతమున నుండెనని 'శతక వాఙ్మయ సర్వస్వము'లోఁ గలదు.

## ఆనందకవి - మంగళగిరి

ఈతఁడు క్రైస్తవమతము నవలంబించిన నియోగిబ్రాహ్మణుఁడు; వేదాంతరసాయన మను నాలు గాశ్వాసముల గ్రంథమును రచించి నిడి

మామిళ్ల-దాసయామాత్యున కంకితముచేసెను. ఇది క్రైస్తవమత స్థాపకుఁడైన ఏసుక్రీస్తుయొక్క చరిత్రము.

ఈ కవి యీ గ్రంథము నే కాక విజయనందన విలాస మను మఱియొక పద్యకావ్యమును గూడ రచించెను; మార్కు, మత్తయి, లూకా సువార్తలను గ్రీకుభాషనుండి భాషాంతరీకరించుటలో పాశ్చాత్య విద్వాంసులకు మిగుల తోడుపడెను.

వేదాంత రసాయనము క్రీ. శ. 1700 ప్రాంతమున రచింపఁబడినట్లు బ్రౌనుపండితుఁ డభిప్రాయపడెను. కాని దాసయామాత్యుని సోదరుఁడగు రాజప్ప కర్ణాటకదేశపు నవాబగు మహమదల్లీచేత సత్కరింపఁబడిన ట్లిందు చెప్పఁబడుటచే నియ్యది క్రీ. శ. 1750 తర్వాతనే రచియింపఁబడియుండు నని శ్రీ వీరేశలింగము పంతులుగా రభిప్రాయపడినారు.

## ఇమ్మడి జగదేవరాయలు - రాణా

ఈతఁడు చతుర్థకులజుఁడు. విష్ణువర్ధనగోత్రుఁడు. మైసూరు రాజ్యమందలి చెన్నపట్టణప్రాంతమునకు క్రీ. శ. 1620 ప్రాంతమున పరిపాలకుఁడై 'చెన్నపట్టణము'ను నిర్మించెను. పొన్నతోఁట-ఓబళకవి యీతనికే వామనపురాణమును కృతి యిచ్చెను.

ఈతఁడు తెలుఁగున 'అధ్యాత్మరామాయణ' కావ్యమును వ్రాసినట్లు ఓబళకవి చెప్పెను. ఆ గ్రంథము లభింపలేదు. ఈతఁడు పెక్కు గీతప్రబంధములను కూడ వ్రాసెనఁట! అవియు లభ్యములు కావు.

## ఉదయాదిత్యుఁడు

ఈతఁడు వర్ధమానపుర ప్రభువు. ఈ కవి 11-వ శతాబ్ది చివఱ నుండెనఁట! ఈతఁడు 'ఉదయాదిత్యాలంకార' మను గ్రంథమును రచించెను. ఇయ్యది ఆంధ్రగ్రంథమని కొందఱును, కన్నడ గ్రంథ మని కొందఱును చెప్పుచున్నారఁట! గ్రంథము లభింపనందున నేమి నిశ్చయించుటకును సాధ్యపడకున్నది.

ఇతనింగూర్చిన పై విషయము 'గోలకొండకవుల సంచిక'లోఁ గలదు.

## ఎల్లనకవి

ఈతఁడార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. శ్రీవత్సగోత్రుఁడు. కూచన మంత్రి, ముత్తమ్మల పుత్రుఁడు. అష్టభాషాకవితా ప్రవీణుఁడు. ఇతనికి "నవఘంటసురత్రాణ' బిరుదు కలదు.

ఈతఁడు 'రతిరహస్య'మను నామాంతరము కల కొక్కోకమును, సకలనీతి కథానిధానమును, పురాణసారమును రచించెను. కొక్కోకమును కంటముక్కల-మల్లమంత్రికిని, సకల నీతి కథానిధానమును తిరుపతి వేంకటేశ్వరస్వామికిని, పురాణసారమును కంటముక్కల - మల్లమంత్రి సోదరుని కుమారుఁడైన పినభైరవామాత్యునకును అంకితముచేసెను. ఈతని కవిత్వము ప్రౌఢమై, రసికజనహృదయంగమమై యుండును.

ఈ కవి రావిపాటి - త్రిపురాంతకుని, శ్రీనాథుని స్తుతించి యున్నాఁడు. ఈతని గ్రంథములను కృతి నొందినవా రిర్వురును గజపతి రాజులవలన 'పాత్ర' బిరుదమును పొందిరి. కావున కృష్ణా, గుంటూరు జిల్లాలలో గజపతులు పాలకులుగా నున్న కాలమున (క్రీ. శ. 1470-1515) ఎల్లనకవి యుండెనని చెప్పవచ్చును. ఈతఁడు 1480 ప్రాంతమున కొక్కోకమును, 1500 ప్రాంతమున మిగిలిన గ్రంథములను రచించి యుండ వచ్చునని "ఆంధ్రకవి తరంగిణి'లోఁ గలదు.

## ఎల్లభూపతి - బద్దెపూఁడి

ఈతఁడు విజయరంగ చొక్కనాథుని కాలమున (1706_31) బద్దెపూఁడి కధికారిగా నుండిన ప్రభువు. విజయరంగ చొక్కనాథుని కాశ్రితుఁడు. ఈతఁడు 'యువజనహృదయానంద'మను ప్రబంధమును రచించెను. అందు రెండాశ్వాసములు మాత్రము లభించినవి. గ్రంథ ము ముద్రితము.

## ఎఱ్ఱయకవి - ఎడపాటి

ఈతఁడు నియోగి బ్రాహ్మణుఁడు. సోమయామాత్యుని పుత్రుఁడు. కౌండిన్యగోత్రుఁడు. ఎడపాడు గ్రామము కరణము. ఆ గ్రామమునుబట్టియే యీతని యింటిపే రేర్పడి యుండవచ్చునఁట ! ఈతని యింటిపేరు 'పెదపాటి' యని కొన్నియెడలఁ గానవచ్చుచున్నను, అది సరికాదని 'ఆంధ్ర కవి తరంగిణి' చెప్పుచున్నది.

ఈ కవి మల్హణ చరిత్రమును మూఁ డాశ్వాసముల ప్రబంధముగా రచించెను. 'కుమార నైషధమును' కూడ నీతఁడు రచించినట్లు జగ్గనకవి ప్రబంధ రత్నాకరమున నిచ్చిన యుదాహరణములనుబట్టి తెలియు చున్నది. కాని యా గ్రంథము లభింపలేదు. దీనింబట్టి యీతఁడు పెదపాటి జగ్గనకుఁ బూర్వుఁడనుట స్పష్టము. ఈతఁడు తన మల్హణ చరిత్రమును కృష్ణరాయల కీయక దాచి యుంచి, తన యా ప్రబంధువగు చుండి - కాళయామాత్యున కంకిత మొనర్చెనఁట! అట్లు దాఁచి యుంచుటకుఁ గారణము తెలియలేదు. ఈ కృష్ణరాయలు తుళువ కృష్ణరాయలే కావచ్చును. అట్లయినచో నీతఁడు 16-శతాబ్ది ప్రథమపాదమున నుండెనని చెప్పవచ్చును.

మల్హణచరిత్రమున శివభక్తుఁడగు మల్హణుని వృత్తాంతము కలదు. కవిత్వము మృదు మధురమై యింపుగా నుండును.

## ఎఱ్ఱాప్రెగ్గడ

ఈతఁడు శ్రీవత్స గోత్రుఁడు. నియోగి బ్రాహ్మణుఁడు. ఎఱపోతసూరి మనుమఁడు. పోతమాంబా, సూరనార్యుల పుత్రుఁడు. పాకనాఁటి యందలి గుడ్లూ రీతని నివాసము. ఈతని యింటిపేరు చదలువాడవారని కొంద అందురు. కాని యట్లు చెప్పుటకుఁ దగిన యాధారములు లేవఁట ! ఎఱ్ఱన తండ్రి సూరనామాత్యుఁడు 'ఉభయకవిత్వ ప్రౌఢుఁ'డఁట!' అతని గ్రంథము లేవియు లభింపలేదు.

ఎఱ్ఱాప్రెగడ తాను రచించిన రామాయణమును, హరివంశమును వేమారెడ్డి కంకితముచేసెను. వేమారెడ్డి క్రీ. శ. 1324-1349 ల మధ్య రాజ్యముచేసి యుండుటచే నీ కవియు నా కాలమున నుండి యుండును. అంతకుఁ బూర్వమే యీతఁడు భారతారణ్యపర్వ శేషమును, నృసింహ పురాణమును రచించి యుండెను. కావున నీతఁడు క్రీ. శ. 1280 ప్రాంతమున జన్మించి యుండుననియు, అరణ్యపర్వ శేష, నృసింహ పురాణములను క్రీ. శ. 1315-1325 నడుమ రచించి యుండుననియు, పిదప 1330-40 నడుమ రామాయణ, హరివంశములను రచించి యుండుననియు, 1345 ప్రాంతమున కీతనికి 65 సంవత్సరముల వయ స్సుండుననియు 'ఆంధ్ర కవి తరంగిణి'లోఁ గలదు.

శివభక్తుఁ డగుటవలన నీతనికి శంభుదాసుఁడను నామాంతరము ప్రసిద్ధికి వచ్చినది. కవితా సామర్థ్యమును బట్టి యీతనికి 'ప్రబంధ పరమేశ్వర' బిరుదు వచ్చినది.

ఎఱ్ఱాప్రెగడ భారతారణ్య పర్వ శేషమును 'నన్నయభట్టు రచించినట్లే' వ్రాసి రాజరాజనరేంద్రునకే యంకితముగనిచ్చెను. నృసింహ పురాణము నహోబల నృసింహస్వామి కంకితమొనర్చెను. వానిని రచించిన తర్వాత వేమారెడ్డి సోదరుఁడగు మల్లారెడ్డి పరిచయము సంపాదించి యాతని మూలమున వేమారెడ్డిని దర్శించి గౌరవింపఁబడి రామాయణ, హరివంశముల నాతనికిఁ గృతియిచ్చెను. రామాయణము తప్ప మిగిలిన మూఁడు గ్రంథములును లభించినవి. అవి ముద్రితములైనవి. రామాయణములోని పద్యములు కొన్నిమాత్రము కూచిమంచి తిమ్మకవి-సర్వలక్షణసార సంగ్రహముననుు, శ్రీ ప్రభాకరశాస్త్రిగారు కూర్చిన ప్రబంధరత్నావళియందును కానవచ్చుచున్నవి.

ఈతఁడు 'కవి సర్పగారుడ'మను నొక ఛందోగ్రంథమును రచించినట్లు కస్తూరిరంగకవి రచించిన 'ఆనందరంగరాట్ఛందస్సు'న నుదాహరింపఁబడిన కొన్ని పద్యములనుబట్టి తెలియవచ్చుచున్నది. బసవన యను కవి కవిసర్పగారుడమును రచించినట్లు తెలియుచున్నది. పట్టాభిరామ

కవియు దీనిని రచించెనఁట ! ఎఱ్ఱన దీనిని రచించినట్లు వేరెవ్వరును చెప్పలేదు.

ఎఱ్ఱాప్రెగ్గడ భారతారణ్యపర్వ శేషమును రచించెనా ? లేక నన్నయ మూఁడు పర్వములను రచింపఁగా - పిదప ఖిలమైన భాగమును పూరించెనా ? అను విషయ మీ నడుమనే చర్చకు వచ్చినది. ఎఱ్ఱనకంటెఁ బూర్వుఁడగు తిక్కనసోమయాజియు, మార్కండేయ పురాణమును రచించిన మారనయు నన్నయ మూఁడు పర్వములను రచించినట్లు చెప్పి యున్నారు. నన్నయ మూఁడు పర్వములను రచింపఁగా, ఖిలమైన భాగమునే పూరించినచో, ఎఱ్ఱాప్రెగ్గడ తాను 'నన్నయ రచించినట్లుగా రచించితి' నని చెప్పుటయుఁ గుదురదు. నన్నయ యరణ్యపర్వములోఁ జాల భాగమును రచించి యుండుటవలన - తిక్కన, మారనలు 'నన్నయ పర్వత్రయమును రచించె' నని చెప్పి యుండవచ్చునేమో !

ఈ నడుమ శ్రీ నిడుదవోలు - వేంకటరావుగారు పరిశోధనలు చేసి, ఎఱ్ఱాప్రెగడ భారతారణ్యపర్వ శేషమును తిక్కన భారతరచన ప్రారంభించునాఁటికే పూర్తి చేసెననియు, అందువలన నప్పటి కరణ్య పర్వము సమగ్రముగా నున్నదనియు, అది నన్నయ కృతిగానే రచింపఁ బడుటవలన తిక్కన, మారనలు 'నన్నయభట్టు మూఁడు పర్వములను రచించె' నని చెప్పి యుందురనియు తెలిపి యున్నారు. దీనింబట్టి తిక్కన భారతరచనకుఁ బూర్వమే యెఱ్ఱాప్రెగ్గడ భారతారణ్యపర్వ శేషమును రచించెనని శ్రీ వేంకటరావుగారి యభిప్రాయ మనుట స్పష్టము. శ్రీ వేంకటరావుగారు - తిక్కనయు, ఎఱ్ఱనయు సమకాలికులనియు ననుచున్నారు.

## ఎల్లన - చింతలపల్లి

ఈతఁడు మహబూబునగరు జిల్లాయందలి గంగాపురపు నివాసి. రమారమి 220 ఏండ్ల క్రిందట నుండినవాఁడఁట ! ఈతఁడు శిరోభూషణ మను గ్రంథమును రచించినట్లు తెలియుచున్నది. అయ్యది లభింపలేదు.

## ఎల్లనార్యుఁడు - చింతలపూఁడి

ఈతఁడు నియోగి బ్రాహ్మణుఁడు. శ్రీవత్సగోత్రుఁడు. కృష్ణ భట్టారకుని పౌత్రుఁడు. కామయప్రభుని పుత్రుఁడు. ఇతని తల్లి పేరు లక్ష్మమ్మ. ఈతనికి 'రాధామాధవకవి' అను బిరుదుపేరు ప్రసిద్ధము. రాధా మాధవమను ప్రబంధమును చక్కఁగా చెప్పినందున శ్రీకృష్ణరాయలు సంతోషించి యీతని కీ బిరుదనామ మిచ్చెనఁట! ఈ యంశమును కవియే చెప్పి యున్నాఁడు. ఈతఁ డా గ్రంథమును క్రీ. శ. 1520-1530 నడుమ రచించి యుండునని 'ఆంధ్రకవి తరంగిణీ' కారులు వ్రాయు చున్నారు.

ఈతఁడు రాధామాధవ మను 5 ఆశ్వాసముల ప్రబంధమును రచించి అచ్యుతున కంకిత మొనర్చెను. ఇతని రెండవ గ్రంథము తారక బ్రహ్మ రాజీయము. అది నాలుగాశ్వాసములవఱకే కానవచ్చుచున్న దనియు, ఎన్ని యాశ్వాసముల గ్రంథమో తెలియరాదనియు 'ఆంధ్రకవి తరంగిణి' లోఁ గలదు. ఇయ్యది అచ్యుతరాయలయొద్ద నుద్యోగియు, నం జయకుఁ బుత్రుఁడు నగు తిమ్మరుసు కోరికపయి శ్రీరామచంద్రున కంకిత ముచేయఁబడినదఁట! ఇది వేదాంత గ్రంథము. సుప్రసిద్ధమగు 'విష్ణుమాయా నాటకము' నీతఁడు రచించెనను ప్రతీతి కలదు. కాని, అయ్యది మడికి - అనంతయ్యకృతము కాని యెల్లనార్యరచితము కాదని 'ఆంధ్రకవిత రంగిణీ' కారులు విపులముగా నిరూపించి యున్నారు.

ఈతని రచన ద్రాక్షాపాకమున మృదుమధురమై, హృదయంగ మమై యుండును.

## ఎల్లనార్యుఁడు - పింగళి

ఈతఁడు శైవుఁడైన నియోగి బ్రాహ్మణుఁడు. భారద్వాజ గోత్రుఁడు. పింగళి నాగయామాత్యుని పుత్రుఁడు. ఈతఁడు గుంటూరు మండలములోని కొండవీటి సీమ నివాసి. ఈతఁడు తుమ్మ-రాయపరెడ్డి ప్రేరణమున సర్వేశ్వర మాహాత్మ్య మను నామాంతరము గల తోభ్యచరి

త్రమును రచించెను. ఈ యంశ మా గ్రంథమునందలి కృత్యాదినిబట్టియే తెలియుచున్నది.

తోభ్యచరిత్రము క్రైస్తవమత ప్రతిపాదకమగు నాలుగాశ్వాసముల ప్రబంధము. ఈ కవి శైవుఁడయ్యు నిట్టి గ్రంథమును రచింపఁబూనుకొనుటకు ధనాపేక్షగాని, వేఱేదైన సంఘటన గాని కారణమై యుండవచ్చును. ఈ గ్రంథము సర్వేశ్వరాంకితము.

ఈతఁడు దామెర - వేంకటాధిపుని కాలములో నుండినట్లు స్పష్టమగుచున్నది. వేంకటాధిపుఁడు 17-వ శతాబ్ది ప్రారంభమున నుండెను. ఈ వేంకటాధిపుఁడు బహుళాశ్వచరిత్ర కృతికర్త కాక యాతని మనుమఁడని యనుకొన్నను, ఈ కవి 17-వ శతాబ్ది మధ్యమున నుండెనని చెప్పవచ్చును.

## ఎల్లయకవి

ఈతఁడు సేలమువద్ద నుండు ఉద్దండమల్ల సముద్రము నివాసి. ఈ కవి 'చంద్రతారా విలాస' మను పేర తారా శశాంకుల ప్రేమగాథను యక్షగానముగా రచించెను. ఈ కవి క్రీ. శ. 1846 లో ఈదోడ్డు పట్టణమున నున్నట్లు కోలా - శేషాచలకవి తన 'నీలగిరియాత్ర'లో చెప్పియున్నాఁడు.

ఎల్లయ కొన్ని నాటకప్రబంధములను వ్రాసెనఁట! వానిలో నిదియొక్కటియే కానవచ్చుచున్నది. ఇది అముద్రితము.

## ఎల్లయకవి - రావూరి

ఈతఁడు నియోగి బ్రాహ్మణుఁడు. శ్రీవత్సగోత్రుఁడు. వెంకనామాత్యుని పుత్రుఁడు. తిరుమల - తిరువేంకటాచార్యుఁ డీతని గురువు. ఱమ్మెర - కేసన, మల్లనకవుల గురువును తిరుమల - తిరువేంకటాచార్యులే! ఈ గురువు లిర్వురు నభిన్నవ్యక్తులైనచో, ఈ కవియు క్రీ. శ. 1600 ప్రాంతమువాఁడై యుండునఁట! లేదా-ఎఱ్ఱన సమకాలికుఁ డైనచో 1500 ప్రాంతీయుఁడగునఁట! ఈ తిరువేంకటాచార్యు లిర్వురు కానవచ్చుచున్నారు.

ఈతఁడు మిత్రవిందా పరిణయ మను ప్రబంధమును, బ్రహ్మాండపురాణమను ఆ ఆశ్వాసముల పద్యకావ్యమును రచించెను. మిత్రవిందాపరిణయమునందే కవి తన వంశమునుగూర్చి చెప్పెనఁట! కాని, అది లభింపలేదు.

బ్రహ్మాండ పురాణమున అర్ధ పంచకవివరణ ఖండము మాత్రమే రచింపఁబడినట్లు కవియే చెప్పికొనెను.

ఈతని కవిత్వము లలితమై మనోజ్ఞముగా నుండును.

## ఎల్లారెడ్డి - కామినేని

ఈతఁడు నిజామురాష్ట్రములోని మెదకుజిల్లా బిక్కనవోలు నివాసి. దోమకొండ సంస్థానాధిపతి యగు మల్లారెడ్డి సోదరుఁడు.

ఈతఁడు క్రీ. శ. 1550-1580 నడుమ నుండినవాఁడు. వాసిష్ఠము, లింగపురాణము - ఈతని రచనలని తెలియుచున్నది. కాని యా గ్రంథములు లభింపలేదు.

పట్టమట్ట-సోమనాథకవిరచితమైన బ్రహ్మోత్తరఖండ మీతని కంకితముగాఁ గూర్పఁబడినది.

## ఏకామ్రనాథుఁడు

ఈ కవి యోరుగంటి ప్రాంతపు నివాసి. క్రీ. శ. 14 శతాబ్దిలో నుండెనఁట! ఈతఁడు ప్రతాపచరిత్ర మను వచనమును, ద్వాత్రింశత్సాలభంజికల కథలను రచించెను.

ప్రతాపచరిత్రమునఁ ఓరుగంటి రాజుల చరిత్రము వివరింపఁబడినది. ద్వాత్రింశత్సాలభంజికల కథలు విక్రమార్కుని సింహాసనము నెక్కుటకు వచ్చు భోజునిఁగూర్చి ప్రతిమలు చెప్పిన కథలు.

## ఏకోజీమహారాజు

తంజావూరిని పాలించిన మహారాష్ట్ర రాజులలో నీతఁ డొకఁడు. ఇతఁడు రెండవ యేకోజీ ప్రభువు. 1737 లో నీతఁడు ప్రభువై యొక్క వత్సరము మాత్రము రాజ్యమును పాలించెను. ఇతఁడు రామాయణ ద్విపద

కావ్యమును, విఘ్నేశ్వర కల్యాణ మను నాటకమును, కొన్ని నీతి పద్యములను రచించెను. విఘ్నేశ్వరకల్యాణము సంస్కృతాంధ్రభాషామయము.

## ఓబళకవి - పొన్నతోఁట

ఈతని కులగోత్రములు తెలియవు. తండ్రిపేరును ఓబళుఁడే! ఈతఁడు మార్కండేయ పురాణమును, వామన పురాణమును రచించి, మైసూరు రాష్ట్రమందలి చెన్నపట్టణమునకుఁ బాలకుఁడుగా నుండిన రాణా-జగదేవభూపతి కంకిత మొనర్చెను. మార్కండేయ పురాణ మముద్రితము. అది పది యాశ్వాసముల ప్రబంధము. వామనపురాణము లభింపలేదు.

ఈ కవి కందాళ - భావనాచార్యుని పుత్రుఁడగు శ్రీరంగాచార్యుల శిష్యుఁడు. తెనాలి - అన్నయ్య, కలిదిండి - భావనారాయణయు నీ శ్రీరంగాచార్యుల శిష్యులే! ఆ కవుల సమకాలికుఁ డగుటచే నీతఁడును క్రీ. శ. 1540 ప్రాంతపువాఁడని నిశ్చయింపవచ్చును.

## కంఠీరవరాజు

ఈతఁడు క్రీ. శ. 1704 నుండి 1713 వఱకును మైసూరురాజ్యమును పాలించిన ప్రభువు. చిక్కదేవరాయల కుమారుఁడు. ఈతఁడు పుట్టుకచే మూఁగవాఁడు. కాని గొప్ప ప్రతిభావంతుఁడై నందున దక్షిణభారత భాష లన్నింటియందును, సంస్కృతమునందును విద్వాంసుఁడై, కవియై యుండెను. పెక్కు గ్రంథములను వివిధభాషలలో రచియించెను. వాని వివరణములు -

1. కొఱవంజికల్లె - ఇందు తెలుఁగు, కన్నడము, తమిళము, ప్రాకృతము - అను నాల్గు భాషలలో వ్రాయఁబడిన కొఱవంజులు కలవు. తెలుఁగు కొఱవంజిలో ఎఱుకత వచ్చి కంఠీరవరాజున కెఱుక చెప్పి పాంచాల రాజ పుత్రి యగు కాంచనలత నతఁడు వివాహమాడునట్లు చేయుట కలదు.

2. పంచాయుధకల్లి - విష్ణుదేవుని పంచాయుధములును కంఠీరవ రాజును రక్షించునట్లు ఇందు వర్ణన కలదు.

3. లక్ష్మీవిలాసము - లక్ష్మీదేవి రాజు నాశీర్వదించు వర్ణనము.

4. కలవాణీవిలాసము - కలవాణి యను వేశ్య కంఠీరవరాజుం జూచి మోహించిన కథ.

5. నాట్యవిద్యావిలాసము - ఇది సంస్కృతాంధ్ర మిశ్రమము. నాట్యకర్తలు తమ తమ సామర్థ్యములను వివరించు గ్రంథ మిది.

6. వసంతోత్సవవిలాసము (వసంతసమయ వర్ణనము). 7. విభక్తి కాంతావిలాసము. 8. అష్టదిక్పాలక విలాసము. 9. పావకినాటకము. 10. వైవస్వతనాటకము. 11. నైఋతినాటకము. 12. వారుణి నాటకము. 13. వాయవినాటకము. 14. కౌబేరినాటకము.

వీనిలో-ఆ యా దేవతల ప్రశస్తి కలదు. ఇవి యక్షగానములు. కంఠీరవరాజు వీనినే కాక కొన్ని పదములను గూడ రచించెను.

## కందనామాత్యుఁడు

మడికి - సింగన తన సకలనీతిసమ్మతమునం దుదాహరించిన పద్యములనుబట్టి కందనామాత్యుఁడు 'నీతితారావళి'యను గ్రంథమును రచించి నట్లు తెలియుచున్నది. ఇందు 27 పద్యము లున్నవో, ఎక్కువే యున్నవో తెలియరాదు. ఈ కందనామాత్యుఁడే మడికి - సింగన రచించిన పద్మపురాణమునకుఁ గృతిభర్త.

ఇతఁడు క్రీ. శ. 1380-1440 నడుమ నుండినవాఁడు. నీతితారావళి లోని నాల్గు పద్యములు మాత్రము లభించుచున్నవి.

## కదిరీపతి - పాలవేకరి

ఈ కవి నాయకకులజుఁడు. కరియ మాణిక్యనృపుని పౌత్రుఁడు; కదిరిరాజు పుత్రుఁడు. నెల్లూరుమండల నివాసి. తనకుఁ గదిరి నృసింహస్వామి కటాక్షమునఁ గవిత్వ మబ్బినట్లు కవియే చెప్పియున్నాఁడు ఇతని కాలము తెలియదు.

ఈతఁడు శుకసప్తతి యను పద్యకావ్యమును రచించెను. అది సమగ్రముగా లభింపలేదు. ఈతని కవిత్వము ప్రౌఢమై యుండును.

## కమలనాభామాత్యుఁడు

ఈతఁడు పాకనాఁటి నియోగి బ్రాహ్మణుఁడు. భారద్వాజ గోత్రుఁడు. కవిసార్వభౌముఁ డగు శ్రీనాథునికిఁ దాత. ఈతనిం గూర్చిన ప్రశంస భీమఖండమునను, కాశీఖండమునను గలదు. ఈతఁడు కాల్పట్టణాధీశ్వరుఁడని శ్రీనాథుఁడు చెప్పియున్నాఁడు. ఈ పట్టణ మెచ్చటిదో నిశ్చయముగాఁ దెలియదు. ఇది నెల్లూరు జిల్లాలోని క్రొత్తపట్టణమని కొందఱు, కృష్ణాజిల్లాలోని కాళీపట్టణమని కొందఱు ననుచున్నారు.

ఈ కవి 14-వ శతాబ్ది ప్రాంతమున నుండి యుండవచ్చును.

ఈతఁడు 'పద్మపురాణ సంగ్రహము' అను కావ్యమును రచించె నని శ్రీనాథుఁడే చెప్పి యున్నాఁడు. ఆ గ్రంథము లభింపలేదు.

## కవిభల్లటుఁడు

భల్లటనామ మాంధ్రులలో ప్రసిద్ధము కాదు. ఇది కయ్యట, జయ్యట, మమ్మటాదుల వంటిది! వీరందఱును కాశ్మీరదేశీయులు. భల్లటుఁ డొకఁడు కాశ్మీరదేశీయుఁ డున్నాఁడు. ఒకవేళ తెలుఁగు కవి కియ్యది బిరుదు నామమయి, క్రమముగ నదియే వాడుకలోనికి వచ్చెనేమో !

ఈతఁడు 'గణమంజరి, విక్రమార్క చరిత్రము' అను గ్రంథములను రచించెనని గోలకొండ కవుల సంచికలోఁ గలదు. ఈతఁడు తాను గోన-బుద్ధారెడ్డిచే సత్కారములు పొందినట్లు చెప్పికొని యున్నాఁడు. బుద్ధారెడ్డివలెనే యీతఁడును రాయచూరుమండల నివాసియఁట! కాఁగా ఈతఁడు క్రీ. శ. 1230 ప్రాంతమువాఁడని తోఁచుచున్నది.

ఈతఁడు గణమంజరి, పదమంజరి, విక్రమార్క చరిత్రము, వ్యాకరణము (లక్షణగ్రంథము) లను రచించినట్లు తెలియుచున్నది. పదమంజరీ, గణమంజరులు సంస్కృత గ్రంథములు. ఇతని వ్యాకరణము గాని, విక్రమార్క చరిత్రము గాని లభింపలేదు.

## కవిరాక్షసుఁడు

ఈతఁడు గోదావరి జిల్లాలోని దాక్షారామ నివాసి యైనట్లును, ఒక లక్షణ గ్రంథమును రచించినట్లును, అప్పకవీయమువలనఁ దెలియ వచ్చుచున్నది. ఆ గ్రంథము లభించలేదు. ఈతఁడే వేములవాడ భీమకవి యనుకొనుట నిరాధారము.

ఈతఁ డాదినారాయణ చరిత్రమును వ్రాసినట్లొక లక్షణ గ్రంథ మునుబట్టి తెలియుచున్నది. దేవకీనందన శతకము కవి రాక్షస కృతి యని యొక పద్యమువలనఁ దెలియుచున్నది. కాని, అది వెన్నెలకంటి-జన్నయ కృతిగా ప్రసిద్ధము. కవిరాక్షసీయములోని పద్యములు కొన్ని 'ఆనంద రంగరాట్ఛందము'న నుదాహృతములు. కవిరాక్షసుఁడు షడర్థనిర్ణయ మను నిఘంటువును, నూఱు శ్లోకముల 'కవిరాక్షసీయము'ను సంస్కృత మున రచించినట్లు చెప్పుదురు. ఆ గ్రంథములు లభింపలేదు.

అప్పకవీయమునుబట్టి కవిరాక్షసుఁ డనంతామాత్యునికంటెఁ బ్రాచీనుఁడని తెలియుచున్నది. ఈతని కాలము సరిగాఁ దెలియుట లేదు.

## కసవరాజు - తెళ్లపూఁడి

ఈతని 'కళావతీ శతకము' లోని పద్యములు 'ప్రబంధ రత్నావళి' -లో నుదాహరింపఁబడినవి. కొన్ని పద్యముల చివఱ నీ 'కళావతీ!' అను సంబోధన లేనందునను, విభిన్న చ్ఛందములలోఁ బద్యము లుండుటవలనను, ఇది యొక శతకము కాక శృంగారవర్ణనతోఁ గూడిన చిన్న గ్రంథమని తోఁచుచున్నది. కవి క్రీ. శ. 1560 కంటెఁ బ్రాచీనుఁడు.

## కస్తూరిరంగకవి

ఈతఁ డార్వేల నియోగి బ్రాహ్మణుఁడు. వేంకటకృష్ణయామా త్యుని పుత్రుఁడు, ఇతని తల్లి కామాక్షమ్మ. ఆలూరి - కుప్పన కవి కీతఁడు గురువు. ఈతఁడు ఫ్రెంచి దొరతనమువారి గవర్నరు డూప్లే ప్రభువునకు దుబాసిగా నుండిన ఆనందరంగపిళ్లె యాస్థాన కవి. క్రీ. శ. 1750 ప్రాం తమున నుండినవాఁడు.

ఈతఁడు 'లక్షణచూడామణి' (ఆనందరంగరాట్ఛందము) అను ఛందోగ్రంథమును ఆనందరంగపిళ్లై కంకితముగ రచించెను. మఱియు 'సాంబ!' అను మకుటముతో సీసశతకరూపముగ 'సాంబనిఘంటువు'ను రచించెను; కృష్ణార్జున చరిత్రము, పద్మనాయక చరిత్రము నీతని యితర గ్రంథములు. ఇతనిరచన సరళమై హృదయంగమముగ నుండును.

## కాచవిభుఁడు, విఠలరాజు

రాయచూరి ప్రభువును, ద్విపదరామాయణ కర్తయు నగు గోన - బుద్ధారెడ్డికి వీరు కుమారులు. ఈ యిర్వురును సోదరులు. రాయచూరు ప్రాంతము వీరి నివాసము. క్రీ.శ. 1500 ప్రాంతమున వీ రుండిరని గోలకొండ కవుల సంచికలోఁ జెప్పఁబడినది. కాని బుద్ధారెడ్డి 1300 ప్రాంతీయుఁ డగుటచే వీరు 1350 లోపున నుండి యుందురు.

రంగనాథ రామాయణములోని ఉత్తరకాండము (ద్విపద) వీరిరచన కానవచ్చుచున్నది. అది వీరి తండ్రి యగు బుద్ధరాజున కంకితముగా రచింపఁ బడినది.

ఈ కవులనుగుఱించి తెలుఁపు శాసనము మహబూబునగరము జిల్లా లోని బూరవూరులో నున్నదంట !

ఈ కవులు తమ తాత గోన-గన్నక్షితీంద్రుఁడని చెప్పియున్నారు. మిగిలిన కాండములచివఱి ద్విపదలనుబట్టి బుద్ధరాజుతండ్రి విఠలరాజని తెలియుచున్నది. ఈ రీతి సమన్వయము కుదురకున్నది.

వీరిరచన సరళమైనది.

## కామకవి - మండపాక

ఈయన వేఁగినాఁటి వైదిక బ్రాహ్మణుఁడు. తండ్రి పేరయకవి. తల్లి కోనమ్మ. ఇతని నివాసము కామనవలస. ఈతఁడు క్రీ. శ. 1800-1870 నడుమ నుండినవాఁడఁట !

ఈతఁడు బలరామక్షేత్ర మాహాత్మ్యము, బ్రహ్మోత్తర ఖండము, కార్తికవ్రత మాహాత్మ్యము, రామచంద్రప్రభు శతకము, శ్రీసూర్యనారాయణ శతకము, జానకీరామశతకము మున్నగు గ్రంథములను, కొన్ని అష్టకములను, దండకములను రచించినట్లు తెలియవచ్చుచున్నది.

19-వ శతాబ్దిలోని సుప్రసిద్ధ విద్వత్కవి యగు మండపాక - పార్వతీశ్వరశాస్త్రి కీతఁడు జనకుఁడు.

## కామేశ్వరకవి - జయంతి

19-వ శతాబ్దిలోని విద్వత్కవులలో నీతఁ డొకఁడు. న్యాయవాది. రామభక్తుఁడు. ఉదారుఁడు. వెలనాటి వైదిక బ్రాహ్మణుఁడు. ఈతఁడు మృదుమధురమగు శైలిలో 'జానకీవరా!' అను మకుటముతో నొక వృత్త శతకమును వ్రాసెను. దీనికి 'జానకీవరశతక' మని పేరు.

## కామేశ్వరకవి - ప్రయాగ

ఈతఁడు వైదికబ్రాహ్మణుఁడు. కౌశికగోత్రుఁడు. నరసింహుని పౌత్రుఁడు. సర్వేశ్వరుని పుత్రుఁడు. విశాఖపట్టణ మండలములోనివాఁడు. ఈతఁడు 150 ఏండ్లక్రిందట నుండి యుండునని ఆంధ్రకవుల చరిత్రమును బట్టి తెలియుచున్నది.

ఈ కవి గోపాల లీలాసుధాలహరి యను మూఁడాశ్వాసముల ప్రబంధము రచించి శ్రీరామతీర్థమునందలి శ్రీరామున కంకిత మొనర్చెను.

## కాశకవి - చెంగల్వ

తంజావూరు రాజ్యమును క్రీ. శ. 1633-73 నడుమ నేలిన విజయరాఘవ నాయకుని యాస్థానమున నీ కవి యుండెను. ఈతఁ డార్వేల నియోగి. బ్రాహ్మణుఁడు; ఇతని తాత కాశయ; తండ్రి వెంకటయ్య; తల్లి కృష్ణమ్మ. ఇతనిది శ్రీవత్సగోత్రము.

ఈతఁడు 'రాజగోపాలవిలాస' మను అయిదాశ్వాసముల ప్రబంధ మును రచించి, విజయరాఘవ నాయకుని కాతఁడు రాజ్యమునకు వచ్చిన తొలి సంవత్సరముననే కృతి యిచ్చెను. ఇందు మన్నారుగుడిలో వెలసిన రాజగోపాలస్వామి విలాసములు వర్ణితములు. రచన సరళమై, మనోహర ముగ నుండును.

## కిచ్చయ్య - అవుడూరి

ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁడు. హారిత సగోత్రుఁడు. గురువయా మాత్యుని పుత్రుఁడు. చెన్నకృష్ణశాస్త్రి శిష్యుఁడు. ఇతఁ డిప్పటికి నూట యేఁబది, రెండువందల యేండ్లక్రిందట నుండి యుండునని శ్రీ వీరేశ లింగము పంతులుగా రూహించుచున్నారు.

ఇతఁడు కాళిదాసు సంస్కృతమున రచించిన 'రఘువంశము'ను పది యాశ్వాసముల పద్యకావ్యముగా రచించెను; ఇంతియేకాక 'మాధవాభ్యుదయము' అను ప్రబంధమును కూడ రచించెను.

## కుప్పనకవి - ఆలూరి

ఇతఁడు వైదిక బ్రాహ్మణుఁడు. వేంకటగిరి పౌత్రుఁడు. వేంకటే శ్వరునకును, నరసమ్మకును పుత్రుఁడు. కాశ్యప గోత్రుఁడు. తంజావూరు ప్రభువగు తుళజేంద్రుఁడు తన 'కాంధ్రకాళిదా'సను బిరుద మిచ్చినట్లు కవి చెప్పికొని యున్నాఁడు. ఈ తుళజాజీ శహాజీకుమారుఁడు. క్రీ. శ. 1729 నుండి 1735 వఱకును రాజ్యపాలన చేసెను. కుప్పనకవి తాను కస్తూరి రంగ కవికి శిష్యుఁడనని చెప్పికొని యున్నాఁడు. కావున నీ కవి 18-వ శతాబ్ది నడుమ నుండెనని చెప్పవచ్చును.

కుప్పనకవి చాల గ్రంథములను రచించెను. ఆనందగిరి రచించిన శంకరవిజయమును 'ఆచార్యవిజయ'మను నాలాశ్వాసముల పద్యకావ్య ముగా రచించెను. పంచనదీస్థలీపురాణమును తెనిఁగించెను. రామాయణ

భాగవతములను యక్షగానములుగాఁ గూర్చెను. పరమభాగవత చరిత్రము, ఇందుమతీ పరిణయము, హరికథా సుధారసము - అను కావ్యములను రచించెను. వీనిలో భాగవతము దశమస్కంధ యక్షగానము లభించు చున్నది. పంచనదీస్థలీపురాణ, పరమభాగవత చరిత్ర, ఇందుమతీపరిణయ, హరికథాసుధారసములు లభింపలేదు.

ఆచార్య విజయము నీతఁడు చెన్నపట్టణములో నున్న నియోగుల ప్రార్థనపయిని రచించినట్లు చెప్పుకొని యున్నాఁడు. ఇందలి కవిత్వము సరసమైనది.

## కుమార ధూర్జటి

ఈతఁడు పాకనాటి నియోగిబ్రాహ్మణుఁడు. కాళయామాత్యుని పుత్రుఁడు. ధూర్జటికవి పౌత్రుఁడు. ధూర్జటికవి రాయల యాస్థానమున నుండినందున - ఇతఁడప్పుడు బాలుఁడై యుండి క్రీ. శ. 1550 ప్రాంతమున 'కృష్ణరాయవిజయము'ను రచించి యుండునని శ్రీ వీరేశలింగము పంతులుగారి యభిప్రాయము.

ఈతఁడు 'కృష్ణరాయవిజయ'మను నాలుగాశ్వాసముల ప్రబంధమును శ్రీరామాంకితముగా రచించెను. ఇందు శ్రీకృష్ణదేవరాయల చరిత్రము వర్ణింపఁబడినది. ఇయ్యది, ఆకువీటిరాజైన చినవేంకటాద్రియొక్క ప్రోత్సాహమున రచింపఁబడినది.

'కుమారధూర్జటి' యనున దీతని బిరుదమై యుండవచ్చును. ఈ కవి "ఇందుమతీ పరిణయ'మను నాలాశ్వాసముల ప్రబంధమును రచించి వరసింహాప్పారాయని కంకిత మొనర్చెను.

ఇతని గ్రంథములు రెండును ముద్రితములు; రచన రసవంతమైనది.

## కుమార రుద్రదేవుఁడు

ఈతఁడు నియోగి బ్రాహ్మణుఁడు. బుద్ధయ మనుమఁడు; మారయ కుమారుఁడు. ఈతఁడు భాస్కర రామాయణములోని అయోధ్యా కాండము నేకాశ్వాసగ్రంథముగా రచించి,తన తండ్రి యగు సాహిణి మారయకే

యాంకిత మొనర్చెనని చెప్పుదురు. ఈ కవి 13-వ శతాబ్ది చివఱను, 14-వ శతాబ్ది ప్రారంభమునను ఉండి యుండునని 'ఆంధ్రకవి తరంగిణి' యందుఁ గలదు.

భాస్కర రామాయణమునందలి యయోధ్యాకాండమును మంత్రి భాస్కరుఁడే రచించెననియు, కుమార రుద్రదేవుఁడు కొంత భాగమును రచించి, యధికముగా నడుమఁ జేర్చి, యయోధ్యాకాండము స్వరచితమైనట్లు పద్యములోఁ జెప్పెననియు విమర్శకుల యభిప్రాయము.

## కుమారానంతరాజు - మల్ల

ఈ కవి 'కుముద్వతీ కల్యాణ' మను ప్రబంధమును రచించెను. అది యముద్రితము. మదరాసునకుఁ జెందిన ఆడయారు దివ్యజ్ఞాన సమాజము వారి గ్రంథాలయమున వ్రాఁతప్రతి కలదఁట! కవినిగూర్చి కాని, గ్రంథమునుగూర్చి గాని విశేషములు తెలియలేదు.

## కూర్మనాథకవి - గోగులపాటి

ఈతఁ డార్వేల నియోగి బ్రాహ్మణుఁడు. ముద్గలగోత్రుఁడు. సూరనార్యుని పౌత్రుఁడు; బుచ్చన్న, గౌరమాంబల పుత్రుఁడు. ఇతని జన్మస్థలము విశాఖపట్టణము మండలములోని గజపతినగరమునకు సమీపమునఁ గల దేవుపల్లి. తర్వాత నితఁడు విజయనగర సమీపమునఁ గల శ్రీరామతీర్థమున శ్రీ తిరుమల పెద్దింటి - సంపత్కుమారాచార్యులయ్యవార్లంగారి వద్ద సంస్కృతము నభ్యసించి యచటి దేవస్థానమున నుద్యోగియై యచటనే నివసించుచుండెను. ఇతఁడు 18-వ శతాబ్ది ప్రారంభమున నుండినవాఁడు.

ఈ కవి మృత్యుంజయవిలాస మను మూఁడాశ్వాసముల యక్షగానమును, లక్ష్మీనారాయణ సంవాదమను ప్రబంధమును, సింహాద్రి నారసింహశతకము, విజయరామ శతకము, సుందరీమణి శతకము నను మూఁడు శతక

ములను, పెక్కు గేయములను రచించెను. విజయరామ శతకమున మూడు పద్యములు మాత్రము లభించినవి. తక్కిన గ్రంథము లన్నియును నముద్రితము లయినవి. ఇతని సింహాద్రి నారసింహ శతకము సుప్రసిద్ధమైనది. ఇతని కీర్తనలు, లక్ష్మీనారాయణ సంవాదమును శ్రీరామతీర్థము, పద్మనాభము, సింహాచలము, శ్రీకూర్మము మున్నగు దేవస్థానములలో నేటికిని పాడఁబడు చున్నవి.

## కృష్ణకవి-కాకరపర్తి

ఈతఁడు వైదిక బ్రాహ్మణుఁడు. కాశ్యపగోత్రజుఁడు. తిరుపతి పాత్రకవికిని, సీతమాంబకును కుమారుఁడు. తిరుపతిపాత్రకవియు విద్వత్కవి యఁట! అతఁడు సత్యభామాకృష్ణసంవాదాది గ్రంథములను రచించి విశాఖపట్టణమునందలి జమీందారులగు శ్రీరాజా గోడే-నారాయణ గజపతి రాయనింగారి పూర్వుఁడైన జగ్గారాయనింగారివలన అగ్రహారాదులను గ్రహించెనఁట! ఈ కృష్ణకవి మునిమనుమఁడు 1900 ప్రాంతమున జీవించి యుండెనఁట! కావున నీతఁడు 1800 ప్రాంతమున నుండి యుండునని శ్రీ వీరేశలింగముపంతులుగా రాంధ్ర కవుల చరిత్రలో వ్రాసి యున్నారు.

కృష్ణకవి శశిరేఖాపరిణయము, ముఖలింగ క్షేత్రమాహాత్మ్యమును రెండు పద్యకావ్యములను రచించెను. శశిరేఖా పరిణయమున శశిరేఖాభిమన్యుల వివాహవృత్తాంతము వర్ణితము. ముఖలింగక్షేత్ర మాహాత్మ్యమునందు శ్రీకాకుళము జిల్లాలో నున్న సుప్రసిద్ధ ప్రాచీనక్షేత్రమగు ముఖలింగముయొక్క మాహాత్మ్యము వివరింపఁబడినది.

## కృష్ణకవి

ఈతఁడు శ్రీవైష్ణవ బ్రాహ్మణుఁడు. మైత్రేయ సగోత్రుఁడు. నరసింహార్యుని పుత్రుఁడు. ఈతఁడు నూటయేఁబది యేండ్ల క్రిందటివాఁడని శ్రీవీరేశలింగము పంతులుగారు తెల్పి యున్నారు.

ఈ కృష్ణకవి చిలుమామిళ్ల - పాపయ్య యను కమ్మనాయకుని ప్రేరణమున శకుంతలా పరిణయ మనెడి మూఁడాశ్వాసముల ప్రబంధమును రచించెను. ఇందు దుష్యంతుని చరిత్ర వర్ణితము. రామరాజభూషణుని వసుచరిత్రపుఁ బోకడ లిందుఁ గొన్ని కానవచ్చుచున్నవి. కావున దీనిని కొందఱు 'పిల్లవసుచరిత్ర' మని యందురఁట !

## కృష్ణకవి - బేతపూఁడి

ఈతఁడు ఆర్వేల నియోగి బ్రాహ్మణుఁడు. శ్రీవత్స గోత్రుఁడు. ఇతఁడు నూటయేఁబది యేండ్ల క్రిందట నుండెనని శ్రీ వీరేశలింగము పంతులుగారు వ్రాసినారు. ఈతఁడు జానకీరాఘవ మను నైదాశ్వాసముల ప్రబంధమును రచించి, అడపా - నారప్ప యను కమ్మప్రభువున కంకిత మొనర్చెను. ఈ కవి అలమేలుమంగా వివాహము, పండిత మనోభిరామము నను మఱి రెండు గ్రంథములను రచించెను- అందు మొదటిది జగన్నాయకున కంకితము. రెండవది ధవళాద్రినాయకున కంకిత మొనరింపఁబడినది.

## కృష్ణకవి - మంచెళ్ల

ఈతఁడు భారద్వాజ గోత్రుఁడు. పాపయమంత్రి కుమారుఁడు ఈ కవి క్రీ. శ. 1840 కంటెఁ బ్రాచీనుఁడఁట ! ఈతఁడు పురుషముఖ్య శతకమును, రంగశతకమును, రఘుపుంగవ శతకమును, వేంకటనాథ శతకమును, కృష్ణశృంగార కథావళి యను నాటకమును రచించెను. ఈతని రచన రసవంతమై, హృదయంగమముగా నుండును.

## కృష్ణదాసకవి

ఈతఁడు వేంకటదాసు కుమారుఁడు. ఈతనిం గూర్చి కాని, యీతని కాలమును గూర్చిగాని తెలియుట లేదు.

ఈ కవి 'రాధాకృష్ణ విలాస'మను మూఁడాశ్వాసముల పద్య కావ్యమును రచించెను. అయ్యది జయదేవకవి సంస్కృతమున రచించిన గీతగోవిందమున కనువాదరూపముగా వ్రాయఁబడినదఁట !

## కృష్ణదాసు - తిరుక్కూడయూరి

తెలుఁగు దేశములో ప్రసిద్ధముగా నున్న 'రామదాసు చరిత్ర' అను యక్షగానమును రచించిన కవి యీతఁడే కావచ్చునని శతకకవుల చరిత్రలోఁ గలదు. ఈతఁడు క్రీ. శ. 1800 లకుఁ బూర్వుఁడై యుండవచ్చునఁట! ఈతఁడు 'కృష్ణా!' అను మకుటముతో నొక కందపద్య శతకమును రచించెను.

ఈతని 'రామదాసు చరిత్రము'న గోపన్న రచించిన కీర్తనలును, పెక్కు శతకములనుండి పద్యములును ఉదాహరింపఁబడినవి. ఆ శతకములివి - రంగశాయి శతకము, జానకీపతి శతకము, మహీజాధిప శతకము, భావనారాయణ శతకము, రామతారక శతకము, ఆర్తరక్షామణి శతకము, దాశరథి శతకము, మానసబోధ శతకము.

## కృష్ణమాచార్యులు - కర్పూరము

ఈతఁడు నిజాము రాష్ట్రములోని నల్లగొండ జిల్లాలో నున్న చెర్లపల్లి నివాసియఁట! క్రీ. శ. 1650 ప్రాంతమున నీతఁ డుండెనని గోలకొండ కవుల సంచికలోఁ గలదు. ఈ కవి భగవద్గీతను ద్విపద కావ్యముగా రచించి, చెర్లపల్లిలోని కేశవస్వామి కంకిత మొనరించెనఁట!

## కృష్ణమాచార్యులు

ఈతని నివాసము కొల్లాపురము. 80 ఏండ్లక్రిందట నీతఁ డుండెనఁట! ఈ కవి నృసింహ విలాసమను పద్యకావ్యమును రచించి కొల్లాపుర ప్రభువులగు శ్రీరాజా జగన్నాథరావు బహద్దరువారి కంకిత మొనర్చెను.

## కృష్ణమాచార్యులు

ఈతఁడు శ్రీవైష్ణవ బ్రాహ్మణుఁడు. సింహాచల క్షేత్రనివాసి. వచనవాఙ్మయ కర్తలలో మొదటివాఁడు. సంకీర్తన వాఙ్మయమునకు మూలపురు

షుఁడు. కాకతీయ చక్రవర్తి యగు రెండవ ప్రతాపరుద్రుని కాలములో (క్రీ. శ. 1295-1326) నీతఁడుండినట్లు ఏకశిలా నగర వృత్తాంతము వలనను, ఏకామ్రనాథుని ప్రతాపచరిత్రమువలనను తెలియవచ్చుచున్నది.

ఈతఁడు సింహాచలమునందలి వరాహ నరసింహస్వామికి భక్తుఁడై యా దేవుని పేర ననేక సంకీర్తనలను రచించెను. ఈతఁడు వచన భేదము అగు చూర్ణికలను, సింహగిరి నరహరి వచనము లనెడి వచనములను, శఠకోప విన్నపము లనెడి విన్నపములను రచించెను. ఈతనిని సంకీర్తనాచార్యుఁడగు తాళ్లపాక - అన్నమాచార్యులును ప్రస్తుతించెను.

## కృష్ణమాచార్యులు - తిరుమల

ఈతఁడు గద్వాల సంస్థాన నివాసి. ఈ కవి 170 ఏండ్లక్రిందట నుండెనఁట! శ్రీ గద్వాల సోమభూపాలుని యాస్థానకవి. అష్టభాషాకవితాధురంధరుఁడు. ఈతఁడు యథాశ్లోక తాత్పర్య రామాయణమునందలి సుందరకాండమును మూఁడాశ్వాసములలో రచించెను.

## కృష్ణమూర్తిశాస్త్రి - శిష్టు

ఇతఁడు తెలగాణ్యపు వైదిక బ్రాహ్మణుఁడు. వసిష్ఠగోత్రజుఁడు. సర్వశాస్త్రి గవరమ్మల పుత్రుఁడు. తూర్పుగోదావరిజిల్లా రామచంద్రపురమునకు దగ్గఱ నున్న గొల్లపాలెమీతని నివాసము. క్రీ. శ. 1790 ఈతని జన్మసంవత్సరము. ఈతఁ డయినవల్లిలో బులుసు - అచ్చయ్యగారివద్ద సంస్కృతవిద్య నభ్యసించి బహుముఖ పాండిత్యమును సంపాదించెను. సంగీతమునందు నీతఁడు గొప్ప విద్వాంసుఁడు. ఈతని పాండిత్య విశేషమును గుర్తించి రామచంద్రపురము జమీందారులు శ్రీ కాకర్లపూఁడి-రామచంద్రరాజుగారును, ఆయన సోదరులు జగన్నాథ రాజుగారును, ఈతనిని తమ యాస్థాన విద్వాంసునిగా నొనర్చుకొనిరి.

ఈతని సమకాలికుఁడగు పిండిప్రోలు-లక్ష్మణకవి యీతనికిఁ బ్రతిద్వంద్వి. ఆతఁడు రామచంద్రపురము తాలూకాలోని కుయ్యేరు గ్రామనివాసి. ఆతఁడు తఱచుగ నీతని నవమానింప యత్నించుచుండెనఁట !

ఈతఁడు రామేశ్వరయాత్రకుఁ బోయి తిరిగి వచ్చునపుడు కాళహస్తి ప్రభువగు దామెర - వేంకటపతిరాయనింగారు రీతని పాండిత్యమును గూర్చి తెలిసికొని, తమ యాస్థాన విద్వాంసునిగా నొనర్చుకొనిరి. అచ్చట నీ కవి పదునాలేండ్లుండెనఁట ! కాళహస్తి యాస్థాన విద్వాంసుఁడగుటకు ముందో, ఆ యూరు విడిచి వచ్చిన తర్వాతనో - ఈతఁడు కాకినాడలో గోదావరిజిల్లా కలెక్టరు కచేరీలో సిరస్తాదారుగా నుండిన తులసింగ సెట్టి గారియింటఁ బురాణము చెప్పుచుండెనఁట! ఆతని ప్రోత్సాహముననే యీ కవి స్త్రీ నీతిశాస్త్రమను గ్రంథమును రచించెనఁట !

ఈతఁడు హరికారికావళి యను ఆంధ్రవ్యాకరణగ్రంథమును సంస్కృతమున రచించెను. దాని ననుసరించియే పరవస్తు - చిన్నయసూరి బాలవ్యాకరణమును రచించెనని శ్రీ కల్లూరి - వేంకటరామశాస్త్రిగారు వ్రాసియున్నారు. కాని గ్రంథద్వయమును పరిశీలించినచో బాలవ్యాకరణము ననుసరించియే కారికావళి వ్రాయఁబడినట్లు స్పష్టము కాఁగలదు.

ఈ కవి సంస్కృతాంధ్రములలో చాల గ్రంథములను రచించెను. అందు (I) సంస్కృత గ్రంథములు - 1. యత్యోల్లాసము. 2. వల్లీవల్లభోల్లాసము. 3. మదనాభ్యుదయము. 4. కంకణ బంధము. 5. అశ్వశాస్త్రము. 6. హరికారికావళి. 7. నీలశైలనాథీయము.

(II) ఆంధ్ర గ్రంథములు - 1. సర్వకామదా పరిణయము, 2. వేంకటాచల మాహాత్మ్యము. 3. స్త్రీనీతి శాస్త్రము. 4. పంచతంత్రము. 5. నాటకదీపము. 6. వాయుపుత్ర శతకము. 7. వసుచరిత్ర వ్యాఖ్యానము, కొన్ని దండకములు, మాలికలు, స్తోత్రములు మున్నగునవి.

'యశోల్లాస' మొక కావ్యము. వల్లీవల్లవోల్లాస, మదనాభ్యుదయములు భాణములు. కంకణబంధము రామాయణకథ. నీలశైలనాథీయము శ్రీ జగన్నాథ క్షేత్రయాత్రను తెల్పు గ్రంథము.

## కృష్ణమ్మ - మకతల

ఈతఁడు మహబూబు నగరము జిల్లాలోని ముక్తలనివాసి. ఈతఁడోక్తయుదాహరణ మను కావ్య విశేషమును రచించెను. అది లభింపలేదు.

## కృష్ణయ్య

ఈతఁడు స్మార్త బ్రాహ్మణుఁడు. భారద్వాజ గోత్రజుఁడు. చెంచయ్య కుమారుఁడు. ఈతని నివాసము పెన్నానది తీరమునఁ గల కామలాపురము. ఈతనికాలము సరిగా తెలియదు గాని, ఇప్పటికి రమారమి నూఱేండ్ల క్రిందట నీతఁడుండి యుండునని శ్రీ వీరేశలింగము పంతులు గారు తెల్పియున్నారు.

ఈతఁడు పార్వతీ పరమేశ్వరిపరిణయ మనెడి మూఁడాశ్వాసముల ప్రబంధమును రచించెను.

## కృష్ణయ్య - కామనూరి

ఈ కవి నందవరీక నియోగి బ్రాహ్మణుఁడు. గోవిందామాత్యుని కుమారుఁడు. ఈతఁడు 200 ఏండ్ల క్రిందట నుండి యుండు నేమో యని శ్రీ వీరేశలింగముపంతులుగారి యూహ.

ఇతఁడు రఘువంశ కావ్యములోని అజమహారాజు చరిత్రను గ్రహించి 'ఇందుమతీ పరిణయ' మనెడి అయిదాశ్వాసముల ప్రబంధమును రచించెను. ఇందలి కవిత్వము హృద్యముగా నుండునఁట !

## కృష్ణయ్య - వెలగపూఁడి

ఈతఁ డార్వేల నియోగి బ్రాహ్మణుఁడు. లోహిత గోత్రుఁడు. నరసింహార్యుని పౌత్రుఁడు ; నరహరి మంత్రి పుత్రుఁడు. ఈతని వంశపువారు

'గాంగేయోపాఖ్యానము, సుమంతోదయము, ఆంధ్రకర్ణామృతము, వజ్రభుజోపాఖ్యానము, సేతుమాహాత్మ్యము, దత్తాత్రేయ చరిత్రము, మర్యాదరామసచివ చరిత్రము మున్నగు గ్రంథములను వ్రాసిరఁట! కవి, మధురాధిపతి యగు విజయరంగ చొక్కనాథుని దండనాథుఁడగు సాంబయామాత్యుని మేనల్లుఁడు. కావున నీతఁడు క్రీ. శ. 1704-31 నడుమ నుండెననుట నిశ్చయము. 1720 లో భానుమద్విజయమును రచించెనఁట!

కృష్ణయ్య భానుమద్విజయ మను 5 ఆశ్వాసముల ప్రబంధమును, మాలినీ మాధవీయము, గాళికాశాస్త్రము, చతుర్విధ కందశతకము, వేదాంతసార సంగ్రహము నను కావ్యములను రచించెను. వీనిలో భానుమద్విజయము, గాళికాశాస్త్రము మాత్రమే లభించినవి.

ఈతని కవిత్వము రసవంతమైనది. భానుమద్విజయమునందు భానుమంతుఁడను విప్రకుమారుఁడు, ఉజ్జయినీరాజపుత్రి యగు పద్మావతిని వివాహమాడిన విషయము వర్ణితము.

## కృష్ణాధ్వరి

తంజాపూరిని పాలించిన రఘునాథనాయకుని కాలములో (క్రీ. శ. 1600-1631) నీతఁడుండెను. ఈతఁడు 'నైషధ పారిజాతీయ' మను ద్వ్యర్థికావ్యమును రచించి రఘునాథనాయకునకే అంకితమొనర్చెను.

నైషధ పారిజాతీయము నాల్గాశ్వాసముల గ్రంథము. ఇందు నలచరిత్రయు, పారిజాతాపహరణ కథయును ప్రతిపద్యమునను వచ్చునటు చెప్పఁబడినవి. ఇయ్యది అముద్రితము.

## కేతనమంత్రి - నందూరి

కేయూరబాహు చరిత్రమును వ్రాసిన మంచన వచనమునుబట్టి తత్కృతిపతి యగు నందూరి-గుండయమంత్రి యన్నయగు నీ కేతన, కవియైనట్లు తెలియుచున్నది. ఈతని గ్రంథము లేవో తెలియలేదు. కువలయాశ

చరిత్రమును కేతన రచించి నట్లున్న దనియు, ఆ కేతన యీతఁడేమో పరిశీలింప వలెననియు 'ఆంధ్రకవి తరంగిణి' కారులు వ్రాయుచున్నారు. ఈతఁడు క్రీ. శ. 1300 ప్రాంతమువాఁడఁట !

## కేతన - భాస్కరుని

ఈ కవి నియోగి బ్రాహ్మణుఁడు. తిక్కన సోమయాజి పెదతండ్రి యగు భాస్కరుని కుమారుఁడు. ఈతఁడు కవి యైనట్లు కేతన తన 'దశకుమార చరిత్ర' లోఁ జెప్పెను. పెదపాటి జగ్గన 'ప్రబంధరత్నాకరము' నందును, కస్తూరి రంగకవి 'ఆనందరంగరాట్ఛందస్సు' లోను, ఈతని 'కాదంబరి' లోని పద్యముల నొక్కొక్కదాని నుదాహరించినందున నీతఁడు 'కాదంబరి'ని పద్యకావ్యముగా నాంధ్రీకరించెనని తెలియ వచ్చుచున్నది. 'కాదంబరి' సంస్కృతమున బాణభట్టుకవి రచించిన గద్యకావ్యము. కేతన క్రీ. శ. 1260 నకు ముందుగనే కాదంబరిని రచించి యుండునఁట !

## కేతన - మూలఘటిక

ఈతఁడు నియోగి బ్రాహ్మణుఁడు. కౌండిన్య గోత్రుఁడు. ప్రొలనయకును, గంగమాంబకును పుత్రుఁడు. అభినవదండి బిరుదాంకితుఁడు. శివభక్తుఁడు. సర్వశాస్త్రముల నెఱిఁగినవాఁడు. ఈతఁడు తాను రచించిన దశకుమార చరిత్రమును కవిబ్రహ్మ తిక్కన కంకిత మొనర్చుటచే నీ కవి తిక్కన కాలమున నున్నవాఁడనుట స్పష్టము. కావున నీతఁడు 13-వ శతాబ్ది తొలిభాగమున నుండెనని చెప్పవలెను.

ఈతఁడు పెక్కు సంస్కృత కావ్యములను రచించెనఁట ! అవి యేవియు లభ్యములు కాలేదు. తెలుఁగులో 'దశకుమార చరిత్రము, ఆంధ్రభాషాభూషణము, విజ్ఞానేశ్వరీయము అనునవి యీతని రచనలు.

దశకుమార చరిత్రము 'దండి' రచితమగు సంస్కృత గద్యకావ్యము నకు పద్యానువాదము. దీనింబట్టియే యీతనికి 'అభినవదండి' యను బిరుదు వచ్చెను. ఇది తిక్కనసోమయాజి కంకితము. ఆంధ్రభాషాభూషణము కర్ణాటభాషాభూషణము ననుసరించి వ్రాయఁబడిన వ్యాకరణ గ్రంథము, ఇదియే తొలి తెలుఁగు వ్యాకరణ మని కేతనయే వ్రాసికొన్నాఁడు.

విజ్ఞానేశ్వరీయము ధర్మశాస్త్ర గ్రంథము. ఇందు యాజ్ఞవల్క్య స్మృతియందును, దాని వ్యాఖ్య యగు మితాక్షరియందును గల విషయ ములు కొన్ని సంగ్రహింపఁబడినవి. ఇది యథామూలమగు ననువాదము కాదు.

దశకుమార చరిత్రము తిక్కన భారత రచనకుఁ బూర్వమే రచింపబడినట్లు తోఁచుచున్నది. అందు భారత ప్రసక్తి లేదు. కేతన రచిత మగు కువలయాశ్వ చరిత్ర మొక టున్నట్లు ప్రబంధ రత్నావళి వలనఁ దెలియవచ్చుచున్నది. ఆ గ్రంథ మలభ్యము. ఆ కేతన యీతఁడో, వేఱొకఁడో తెలియదు.

## కేశవయ్య – సురపురము

ఈ కవి ఆత్మకూరు (నిజామురాష్ట్రము) ప్రాంత నివాసి. రమారమి 170 ఏండ్ల క్రిందట నుండెనని గోలకొండ కవుల సంచికలోఁ గలదు.

ఈతఁడు నిరోష్ఠ్య రామాయణమును రచించి ఆత్మకూరు సంస్థాన ప్రభువగు శ్రీరాజా సోమభూపాలున కంకితము చేసెనఁట! ఈ గ్రంథము పూర్తిగ లభింపలేదు. కొన్ని పద్యములు మాత్రము లభించినవి. రచన ప్రౌఢము.

## కేసన, మల్లన కవులు - బమ్మెర

ఈ యిర్వురును సోదరులు. నియోగి బ్రాహ్మణులు. బమ్మెర – పోతనామాత్యుని మునిమనుమలు. మల్లయామాత్యుని మనుమలు. ప్రౌఢ

సరస్వతియొక్క కుమారులు. నివాసము నిజాము రాష్ట్రమునందలి బమ్మెర గ్రామమఁట ! వీరి కాలము క్రీ. శ. 1650 ప్రాంతమని గోలకొండ కవుల సంచికలోఁ గలదు. వీరు 1550-1620 నడుమ నుండి యుందురని 'ఆంధ్ర కవి తరంగిణి' లోఁ గలదు.

వీరు దాక్షాయణీ పరిణయము, విష్ణుభజనానందము అను రెండు ప్రబంధములను రచించిరి. మొదటి గ్రంథము గుఱ్ఱాల పాలకుఁడగు పులి జాల - సోమమంత్రి కంకితము చేయఁబడినది. రెండవ గ్రంథము పెను మెత్స నారభూపాలున కంకిత మొనర్పఁబడినది.

వీరి కవిత రసవంతమై మనోహరముగ నుండును.

## కొండనార్యుఁడు - వేఁగినాఁటి

ఈతఁడు వేఁగినాఁటి నివాసి; నియోగి బ్రాహ్మణుఁడు. శ్రీవత్స గోత్రుఁడు. ఇంటిపేరు బళ్లపల్లివారు. ఇతఁడు నూటయేఁబది యేండ్ల క్రిందట నుండి యుండునని శ్రీ వీరేశలింగము పంతులుగారు వ్రాసి యున్నారు. ఇతని 'వివేక సింధువు' క్రీ. శ. 1600 ప్రాంతీయుఁడగు కాశీ చెన్నబసవేశ్వరుని వచనకావ్యము ననుసరించి వ్రాయఁబడినందున నితఁడు 18-వ శతాబ్దిలోనివాఁడై యుండునని శ్రీ నిడుదవోలు-వేంకటరావుగారి యాశయము. పెద్దనాదుల నీతఁడు ప్రశంసింపనందున నీతఁడు 16-వ శతాబ్దిలో నుండెనని చెప్పవచ్చునని 'ఆంధ్ర కవితరంగిణి' లోఁ గలదు. కవి మాత్రము తాను ముకుందయోగి రచించిన వచనకావ్యమును ప్రశంసించి యున్నాఁడు. కావున కాలమునుగూర్చి 'యిదమిత్థ' మని చెప్పుటకు వలను పడకున్నది.

ఈ కవి వివేక సింధు వను అయిదాశ్వాసముల వేదాంత గ్రంథమును, "దత్తయోగీంద్రవర్య!" అను మకుటముతో నొక సీసపద్య శతకమును రచించెను.

ఈతఁడు దత్తాత్రేయయోగి సంప్రదాయమునకుఁ జెందినవాఁడు.

## కొండ్రాజు - వరహగిరి

ఈతఁడు ప్రథమశాఖా బ్రాహ్మణుఁడు. భారద్వాజ గోత్రుఁడు. గంజాముజిల్లా నివాసి కావచ్చును. ఈతఁడు క్రీ. శ. 1790 ప్రాంతమున నుండి యుండునఁట! ఈతఁడు 'జగన్నాయకా!' అను మకుటముతో నొక వృత్త శతకమును చెప్పెను. రచన సరసమై, హృదయంగమమై యున్నది.

## కొండయ - బొడ్డపాటి

ఈతఁ డార్వేల నియోగి బ్రాహ్మణుఁడు. కృష్ణాజిల్లా - బెజవాడకు దగ్గఱనున్న బొడ్డపాడీతని నివాసము. ఈతఁడు భారద్వాజ గోత్రుఁడని "ఆంధ్రకవితరంగిణి" లోఁ గలదు. పెదపాటి జగ్గన కూర్చిన ప్రబంధ రత్నాకరమునుబట్టి యీతఁడు 'అంగభవభంగ! తిరుకాళహస్తిలింగ!' అను మకుటముతో కొన్ని పద్యములను చెప్పినట్లు తెలియుచున్నది. అయ్యవి శతకములోనివో, లేక 'తారావళి' వంటి చిన్న గ్రంథములోనివో తెలియదు. ఈతఁడు క్రీ. శ. 1560 కంటెఁ బ్రాచీనుఁడు.

## కొండుభట్టు - రామావఝ్ఝల

ఈతఁడు వైదిక బ్రాహ్మణుఁడు. హరితసగోత్రుఁడు. నరసావధానికిని, అక్కమ్మకును పుత్రుఁడు. ఇతని కాలము తెలియలేదు. కాని నూటయేఁబది యేండ్లక్రిందట నుండి యుండవచ్చునని శ్రీ వీరేశలింగము పంతులుగారి యాశయము.

కపిలగో సంవాద మను పేర నీతఁ డధ్యాత్మ విద్యాప్రతిపాదకమగు ఆఱాశ్వాసముల ప్రబంధమును రచించి అహోబల నృసింహస్వామి కంకితమొనర్చెను. ఈతని కవిత్వము మృదుమధురమైనదఁట!

## కొమ్మన్న - నిశ్శంక

శ్రీనాథమహాకవి సమకాలీనుఁడైన యీ కొమ్మన 'శివలీలావిలాస' మను ప్రబంధమును రచించెను. అందలి యాశ్వాసాంత గద్యలనుబట్టి

యీతఁడు నియోగి బ్రాహ్మణుఁడనియు, అష్టభాషాకవితా ప్రవీణుఁడనియుఁ దెలియుచున్నది.

శివలీలా విలాసము సమగ్రముగా లభింపలేదు. లభించిన రెండాశ్వాసములను ఆంధ్రసాహిత్య పరిషత్తువారు ప్రకటించుచున్నట్లు 'ఆంధ్రకవితరంగిణి'లోఁ గలదు.

శివలీలా విలాసము దొడ్డారెడ్డి మనుమఁడును, అల్లాడరెడ్డి పుత్రుఁడును, కాశీఖండ కృతిపతి యగు వీరభద్రారెడ్డికిఁ దమ్ముఁడు నగు దొడ్డారెడ్డికిఁ గృతి యీయఁబడినది. శ్రీనాథుఁ డీ దొడ్డారెడ్డిని కాశీఖండమున వర్ణించి యున్నాఁడు,

శివలీలా విలాసము క్రీ. శ. 1435 ప్రాంతమున రచింపఁబడియుండుననియు, కవి 1470 ప్రాంతమువఱకు నుండెననియు శ్రీ వీరేశలింగము పంతులుగారు తెల్పి యున్నారు.

ఈ గ్రంథమున శివుని విలాసములు ముప్పదియాఱు వర్ణింపఁబడినట్లు కవి గ్రంథాదిని చెప్పియున్నాఁడు. లభించిన రెండాశ్వాసములలోను పదునొకండు లీల లున్నవి. కవిత్వము ప్రౌఢమై యసర్గళధార కలిగి, క్రొత్త భావములతో మనోహరముగ నున్నది. సంస్కృతాంధ్ర పదములకు సమప్రాధాన్యము కలదు.

కొమ్మనకవి వీరమాహేశ్వర మను మఱియొక గ్రంథమునుకూడ రచించినట్లు 'ప్రబంధరత్నావళి'ని బట్టి తెలియుచున్నది. అయ్యది యలభ్యము. అది శివలీలా విలాసముకంటె భిన్నమో, లేక దీనికే యది నామాంతరమో తెలియకున్నదని 'ఆంధ్రకవితరంగిణి'లో వ్రాయఁబడినది.

## కోటయ్య - కొండవీటి

ఈతఁడు 1800 ప్రాంతీయుఁడు. నీతిని తెలుపు కందపద్యములతో నీతఁడు 'శివశతకము'ను రచించెను. అది 'నీతిశాస్త్ర' మనఁబడు సంస్కృతగ్రంథమున కనువాద రూపమఁట! రచన ప్రశస్తమైనది కాదఁట! ఈతనిం గూర్చిన విశేషములు తెలియలేదు.

## కోటీశ్వరకవి

ఈతఁడు నియోగి బ్రాహ్మణుఁడు. తండ్రి చక్రప్ప; తల్లి మంగమ్మ. ఈతని కాలము తెలియదనియు, ఈతఁడు రమారమి రెండు వందల యేండ్ల క్రిందట నుండి యుండుననియు శ్రీ వీరేశలింగము పంతులుగారు తలంచినారు.

ఈ కవి భోజకన్యా పరిణయమను నైదాశ్వాసముల ప్రబంధమును రచించెను. అందు రుక్మిణీకృష్ణుల వివాహకథ వర్ణింపఁబడినది.

## కోనరాట్కవి - వద్దిపర్తి

ఈతఁడు నియోగి బ్రాహ్మణుఁడు. శ్రీవత్స గోత్రుఁడు. రామరాజు పౌత్రుఁడు. వేంకటతమ్మయామాత్యుని పుత్రుఁడు. ఇతని తల్లి రామాంబ. సర్వసిద్ధి నివాసి. ఈతఁడు క్రీ. శ. 1754-1834 నడుమ నుండినవాఁడఁట!

ఈ కవి శ్రీ మహాలక్ష్మీ పరిణయము, రేవతీపరిణయము, వేంకటేశ్వరోపాఖ్యానము నను ప్రబంధములను, జానకీరామశతకమును, జమాబందీ దండకమును రచియించెను.

## కోదండపతి – గుడిపాటి

ఈతఁడు నందవరీక నియోగి బ్రాహ్మణుఁడు. భారద్వాజ గోత్రుఁడు. వెంగళమంత్రి పౌత్రుఁడు. రంగయామాత్యునకును, సీరమాంబకును పుత్రుఁడు. ఈతని కాలమును తెలిసికొనుటకుఁ దగిన యాధారము లేవియు లభింపలేదు. శ్రీ వీరేశలింగముపంతులుగా రీతఁడు రెండు వందల యేఁబది యేండ్లక్రిందట నుండి యుండవచ్చునని యూహించి యున్నారు.

కోదండపతి రసమంజరి యను శృంగారరస లక్షణ గ్రంథమును రచించి యున్నాఁడు. ఇది సంస్కృతమున భానుదత్త పండితుఁడు రచించిన రసమంజరి ననుసరించి వ్రాయఁబడినది. ఇది మూఁడు 'గుచ్ఛము'ల గ్రంథము. మొదటి రెండు గుచ్ఛములలో నాయికల స్వరూపభేద

ములును, మూఁడవ గుచ్ఛములో నాయకుల లక్షణములును వివరింపఁబడి నవి. శృంగారరసమునకు నాయికానాయకులే ఆధార మగుటవలన ఈ గ్రంథమునకు 'రసమంజరి' యను పేరు సార్థక మగుచున్నది.

## కోదండరామకవి - చింతకుంట

ఈతఁడు నందవరీక నియోగి బ్రాహ్మణుఁడు. అక్కన మంత్రి పుత్రుఁడు. రాయనభాస్కరుని వంశజుఁడు. ఈతఁడు క్రీ. శ. 1790 ప్రాంతమున నుండినవాఁడు.

ఈతఁడు సునందాపరిణయ మను నామాంతరము గల ప్రదీపచరిత్రము ను అయిదాశ్వాసముల ప్రబంధముగా రచించెను. ఈతని కవిత్వము రసవంతమయి హృద్యముగ నుండును.

## కోనేటి దీక్షితచంద్రుఁడు

ఈతఁడు తంజాపుర ప్రభువగు విజయరాఘవ నాయకుని కాలమున నుండినవాఁడు. కాన, 17 వ శతాబ్ది మధ్యభాగమున నుండెనని చెప్పవచ్చును. ఈతఁడు రాజగురువగు శ్రీనివాస తాతాచార్యుల శిష్యుఁడు. రామానుజాచార్యుల తనయుఁడు.

ఈతఁడు 'విజయరాఘవ కల్యాణము' అను యక్షగానము (నాటకము)ను రచించెను, ఇందు విజయరాఘవ నాయకునకు కాంతిమతి యను కన్యతో జరిగిన వివాహము వర్ణితము. ఇది యముద్రితము.

## కోనేరుకవి - దోనూరి

ఈతఁడు నియోగి బ్రాహ్మణుఁడు. శ్రీవత్స గోత్రుఁడు. నాగయ మంత్రి కుమారుఁడు. ఈ కవి బాలభాగవతమను పద్యకావ్యమును రచించి అర్వీటి-బుక్కరాయల మనుమఁడైన తిమ్మరాజున కంకిత మొనర్చెను. ఆ తిమ్మరాజు పుత్రుఁడగు తిరుమలరాజు కోరికపైనే కవి యిట్లొనర్చెనఁట! మఱియు నితఁడీ బాలభాగవతమునే ద్విపదకావ్యముగా రచించి, తిరు

మలరాజు కోరికపైనే, ఆతని రెండవ తమ్ముఁడైన చినతిమ్మరాజున కంకితము చేసెను. ద్విపద బాలభాగవతమును క్రీ. శ. 1547 లో రచించినట్లు కవియే చెప్పి యున్నాఁడు. అంతకుఁ బూర్వమే యీతఁడు పద్యకావ్యమును రచించెను. దాని రచన 1543 ప్రాంతమున జరిగి యుండునని 'ఆంధ్రకవి తరంగిణి' చెప్పుచున్నది.

ఈతని పద్య బాలభాగవతము ముద్రితము కాలేదు. ద్విపద బాల భాగవతమున చతుర్థ స్కంధములోఁ గొంతభాగమువఱకు ముద్రితమైన దఁట !

ఈతని రచన సరళమై, హృదయంగమమై యుండును.

## క్షేత్రయ్య

మువ్వ గోపాలునిపయి వేలకొలఁది పదములు కూర్చిన క్షేత్రయ్య కవి 17-వ శతాబ్ది ప్రారంభమున నుండినవాఁడు. ఈతఁడు తంజావూరు రఘునాథరాయలను దర్శించెను. ఈతని గీతములు శృంగారరస భూయిష్ఠములై మనోహరముగ నుండును. ఇవి కొన్ని ముద్రితములు.

## క్షేమేంద్రుఁడు

క్రీ. శ. 1060 ప్రాంతమున కాశ్మీరదేశమున క్షేమేంద్రుఁడను సంస్కృత విద్వత్కవి యుండెను. ఆ 'క్షేమేంద్ర' బిరుదుతో నొక యాంధ్ర కవి యుండెను. ఆతని పేరు లక్కాభట్టుఁట ! ఆతని గ్రంథములు శూద్రక రాజు చరిత్రము, శతపక్షి సంవాదము, ముద్రామాత్యము - అనునవి. తిక్కన కవి రచించినట్లు ప్రసిద్ధమైన 'కవి వాగ్బంధనము'న నీ కవియు, ఇతని గ్రంథములును పేర్కొనఁబడి యున్నందున, ఈతఁడు 12-వ శతాబ్ది వాఁడని చెప్పనచ్చునని తెలుఁగు కవుల చరిత్రలోఁ గలదు.

ఈతని గ్రంథములు లభింపలేదు.

## గంగనకవి

ఈతఁడు నియోగి బ్రాహ్మణుఁడు. బొప్పనామాత్యుని పుత్రుఁడు. ఈ కవి నిజాము రాష్ట్రనివాసి యయి యుండుననియు, పోతనామాత్యునకును, ఆతని శిష్యుఁడగు వెలిగందల నారయకును దగ్గర నుండి యుండుననియు 'ఆంధ్రకవితరంగిణి' యభిప్రాయము.

ఈతఁడు క్రీ. శ. 1450 ప్రాంతమువాఁడై యుండును.

ఈ కవి భాగవతమునందలి పంచమ స్కంధము నాంధ్రీకరించి శ్రీకృష్ణున కంకిత మొనర్చెను. ఈతని రచనగాఁ బ్రసిద్ధమైన పంచమ స్కంధములోఁ బోతన రచన కూడఁ గలదని 'ఆంధ్రకవితరంగిణి'లోఁ గలదు.

గంగనరచన పోతన యాంధ్రీకరణమువలెఁ బ్రౌఢముగా లేదనియు, కొన్నియెడల మూలానుగుణము కాదనియుఁ గొందఱి యాశయము. ఇతని రచన సరళము.

## గంగరాజు - చిరుమూరి

ఈతఁడు కళలవోపాఖ్యానమును రచించినట్లు 'ప్రబంధ రత్నావళి'ని బట్టి తెలియుచున్నది. ఈతని పద్యములు రెండు, అందు ఉదాహరింపబడినవి. ఈతఁడు క్రీ. శ. 1560 కంటెఁ బూర్వుఁడు.

## గంగాధరకవి - అద్దంకి

ఈతఁడు నియోగి బ్రాహ్మణుఁడు. వీరయామాత్యుని కుమారుఁడు. కేదారగురుని శిష్యుఁడు. గోలకొండ నివాసి. ఈతని గ్రంథము గోలకొండ ప్రభువగు మాలిక్ ఇబ్రహీము (మల్కిభరాము)న కంకిత మొనర్పఁబడినది. కృతిపతి క్రీ.శ. 1550-1580 సంవత్సరములమధ్య రాజ్యము చేసి యున్నందున నీ కవియు నప్పటివాఁడే యయి యుండును. ఈతని గ్రంథము 1565 ప్రాంతమున రచింపఁబడి యుండవచ్చునఁట !

గంగాధరకవి తపతీ సంవరణోపాఖ్యాన మను అయిదాశ్వాసముల ప్రబంధమును రచించెను. భారతములోని అరణ్య పర్వమునందలి తపతీ సంవరణుల కథ యిందు విపులీకరింపఁబడినది.

## గంగాధరకవి - చిత్తారు

ఈతఁడు నల్లగొండ జిల్లాలోని చర్లపల్లి నివాసి. ఈ కవి క్రీ. శ. 1823 ప్రాంతమున నుండెనఁట !

ఈ గంగాధర కవి కొలిపాకమాహాత్మ్య మను ద్విపద కావ్యమును, శృంగారభల్లాణ చరిత్రమును, శృంగార సిరియాళ చరిత్రమును, శుకసప్తతి వచనమును రచించెను.

## గంగాధరకవి

వీరశైవుఁడగు నీ కవి 'చెన్నమల్లేశ ! శివలింగ ! శరణు శరణు' అను మకుటములో నొక శతకమును రచించెను. అది సీసపద్య శతకము; 1844 లో ముద్రితమైనది. కవికాలాదులు తెలియవు. ఇతఁడు తన శతకములో వీరశైవులనే పేర్కొనెను. పోతనామాత్యుని పోలికలు కొన్ని యాతని రచనలో నున్నందున నీతఁడు పోతనకంటె నవీనుఁడు కావచ్చును.

ఈతఁడు భల్లాణరాయని కాలమున నుండినట్లు శ్రీ కావలి-వేంకట రామస్వామిగారు వ్రాసి యున్నారు.

## గంగాధరుఁడు - కాకమాని

ఈతని వంశమునుగూర్చి కాని, కాలమునుగూర్చి గాని విశేష మేమియుఁ దెలియదు. జగ్గకవి కూర్చిన ప్రబంధ రత్నాకరమునందు కాకమాని-గంగాధరకవి రచించిన బాలభారతమునుండి కొన్ని పద్యము లుదాహరింపఁబడి యున్నవి. కాకమాని మూర్తికవికిని, ఈతనికిని సంబంధ మున్నదో లేదో కూడఁ దెలియదు. ఈతఁడు క్రీ. శ. 1560 కంటెఁ బ్రాచీనుఁడని చెప్పవలెను.

కాకనూను గ్రామము గుంటూరు జిల్లా బాపట్లతాలూకాలో నున్నది. ఈతఁ డచ్చటివాఁడై యుండు నేమో యని 'ఆంధ్రకవితరంగిణి' కారుల యూహ.

## గట్టయ్య - కనకబండి

ఈతని నివాసము నిజామురాష్ట్రములోని నేలకొండపల్లియఁట! ఇతఁడు 170 ఏండ్ల క్రిందట నుండెనని గోలకొండ కవుల సంచికలోఁ గలదు. ఈతఁడు యాదవుఁడఁట!

ఈ కవి హరిశ్చంద్రకథను ద్విపదగా రచించెను. మఱియు కాటమ రాజు కథను, పోలరాజు కథను రచించెను.

## గణపతిదేవుఁడు - కొలని

ఈ కవి నియోగి బ్రాహ్మణుఁడు. కౌండిన్యసగోత్రుఁడు. తండ్రి యాదిమూర్తి. తాత గణపతి. కవికి ముత్తాత రుద్రదేవుఁడు. ఈ రుద్ర దేవుఁడు ప్రతాపరుద్రునియొద్ద మంత్రిగా నుండెను. ప్రతాపరుద్రుఁడు క్రీ. శ. 1326 వఱకు రాజ్యమును పాలించెను. కావున గణపతిదేవుఁడు 1400 ప్రాంతమున నుండెనని చెప్పవచ్చుననియు, 15 వ శతాబ్ది ప్రథమ భాగమున గ్రంథరచన చేసి యుండవచ్చుననియు 'ఆంధ్రకవి తరంగిణి' లోఁ గలదు.

గణపతిదేవుఁడు శివయోగసార మను గ్రంథమును రచించి యూడూరి - నూకనారాధ్యున కంకిత మొనర్చెను. కృతిపతి యింటిపే రిందులూరివారని శ్రీ చిలుకూరి - వీరభద్రరావుగారు వ్రాసినారఁట!

శివయోగసారము పూర్వభాగము, ఉత్తరభాగము నను రెండు భాగములు కలది. పూర్వభాగమున నెనిమిది ఆశ్వాసములు, ఉత్తరభాగ మున నాలుగాశ్వాసములు నున్నవఁట! ఉత్తరభాగము మాత్రము ముద్రిత మైనది. పూర్వభాగ మముద్రితము. అది శ్రీ వేమూరి - విశ్వనాథశర్మగారి యొద్ద నున్నట్లు శ్రీ చిలుకూరి - వీరభద్రరావుగారు వ్రాసినారఁట!

ఈ గ్రంథమున శివప్రతిపాదకమగు ఆధ్యాత్మిక విషయము, పంచ యజ్ఞముల వివరణము కలవు. కర్మ, తపో, జప, ధ్యాన, జ్ఞానయజ్ఞములు పంచ యజ్ఞములు. ఇందలి కవిత్వము ప్రౌఢమై, హృద్యముగా నుండును.

## గణపతిదేవుఁడు - అనియాది

ఈ కవి నియోగి బ్రాహ్మణుఁడు. మూలనామాత్యుని పుత్రుఁడు. ఈతని కాలము సరిగా తెలియదనియు, 250 ఏండ్ల క్రిందట నుండి యుండ వచ్చుననియు శ్రీ వీరేశలింగము పంతులుగారి యభిప్రాయము.

ఇతఁడు శివయోగసారమను ఎనిమిదాశ్వాసముల ప్రబంధమును రచించెను. ఇది రెండు భాగముల గ్రంథము. ప్రతి భాగమునందును నాలు గేసి యాశ్వాసములు కలవు. ఈతని కవిత్వము ప్రౌఢమయి, హృద్యముగా నుండును. ఇతని ప్రబంధమున శైవమత ప్రశస్తి, శివమాహాత్మ్యము వివరింపఁ బడినవి.

## గణపనారాధ్యుఁడు

ఈ కవి కౌండిన్యగోత్రుఁడు. గణ్ణయామాత్య, దేవమాంబల పుత్రుఁడు. ఓరుగల్లు ప్రాంత మీతని నివాసము. ఈతని యన్న యగు రామ రాజు కాకతీయరాజ్యపతనానంతరము డిల్లీ సుల్తానగు మహమ్మద్ తుగ్లాక్‌షా వలన మన్ననల నందెను. కావున నతఁడు క్రీ. శ. 1323-45 ల నడుమ నుండి యుండవచ్చును. గణపనారాధ్యుఁడును అప్పటివాఁడే యై యుండ వలెను. ఇతని తండ్రి ప్రతాపరుద్ర ప్రభుని మంత్రియఁట !

ఈ కవి యోగశాస్త్రవేత్త యైనందున యోగశాస్త్రముల నెన్నింటిని పరిశోధించి స్వరశాస్త్రమును ద్విపదగా రచించెను. ఈ కవినిగురించి శ్రీ నేలటూరి - వేంకటరమణయ్యగారు వ్రాసిన వ్యాసము నాధారముగాఁ జేసికొని ఆంధ్రకవి తరంగిణి కారు లీతని చరిత్రను వ్రాసి యున్నారు.

## గణపయ్య - రాయసము

ఈతఁడు 'సౌగంధికాపహరణ' మను గ్రంథమును రచించినట్లు 'ప్రబంధ రత్నావళి'ని బట్టి తెలియుచున్నది. ఈ కవి క్రీ. శ. 1560 కంటెఁ బూర్వుఁడు.

## గిరిరాజకవి

శహాజీమహారాజు నాస్థానమున నుండిన విద్వత్కవులలో నితఁ డొకఁడు. 17-వ శతాబ్ది చివరివాఁడు. ఇతనిది లోహిత గోత్రము. తండ్రి పోబళన్న ; తల్లి జానకమ్మ. వేంకటగిరి యీతని తమ్ముఁడు. ఈ కవి సంగీత సాహిత్యములు రెండింటను నిపుణుఁడు. ఇతఁడు శహాజీ కాలమునను, శరభోజీ కాలమునను కూడ నుండెను.

ఈతఁడు శాహేంద్ర చరిత్ర యక్షగానము, రామమోహన కొఱవంజి, లీలావతీ కల్యాణము, వాదజయము, సర్వాంగ సుందరీ విలాసము- అను గ్రంథములను రచించెను.

శాహేంద్ర చరిత్రమున శాహరా జొక కన్యను వలచి, వివాహ మాడుట వర్ణితము. రామమోహన కుఱవంజియు నిట్టి కథనే తెల్పును. ఈ రెండును శాహరాజున కంకితములు. లీలావతీ కల్యాణమున కల్యాణ పురాధీశ్వరుని కుమార్తె యగు లీలావతిని శరభోజీ పెండ్లియాడిన కథ కలదు. ఇది శరభోజీ కంకితము. వాదజయమును శహాజీ కంకితము.

## గురునాథము - వెండిగంటము

ఈతఁ డింతవఱకు నెవ్వరును వ్రాయని సరస్వతీ శతకమును రచించెను. అది 'సత్యవతీ ! సరస్వతీ ?' అను మకుటము కలిగి, చంపకోత్పల మాలలలో నడిచినది. ఈతఁడు 1854 లో నీ శతకమును రచించినట్లు చెప్పికొన్నాఁడు. ఇతని రచన రసవంతమైనది.

## గురుమూర్తిశాస్త్రి - రావిపాటి

ఈతఁడు గతశతాబ్దియందు మదరాసు నగరమందలి ఫోర్టు సెంటు జార్జి విద్యాలయములో ప్రధానాంధ్రోపాధ్యాయుఁడుగా నుండిన వాఁడు. గురుమూర్తిశాస్త్రి సంస్కృతాంధ్రములలో విద్వాంసుఁడు.

క్రీ.శ. 1770-1837 నడుమ నుండినవాఁడు. ఈతఁడు చిన్నయసూరి కంటె ఇరువది మూఁడేండ్లు ముందే ఒక వ్యాకరణమును రచించి లక్షణ కర్తగా ప్రఖ్యాతిఁ గాంచెను. మఱియు పంచతంత్ర కథలను, విక్రమార్కుని కథలను చక్కని వచనకావ్యములుగా రచించెను.

19-వ శతాబ్దిలో నుండిన విద్వత్కవులలో నీతఁడు పేరొందిన వాఁడు.

## గురురాజకవి - పడకండ్ల

ఈతఁడు భారద్వాజగోత్రుఁడు. బళ్లారి ప్రాంతమువాఁడు. ఆంధ్ర కర్ణాటభాషలందుఁ గవిత్వము చెప్ప సమర్థుఁడు. ఈతఁ డిప్పటికి డెబ్బది, ఎనుబది యేండ్ల క్రిందట నుండినవాఁడని శ్రీ వీరేశలింగము పంతులుగారు తమ ఆంధ్రకవుల చరిత్రములోఁ జెప్పి యున్నారు.

ఈ కవి శేషధర్మములను తొమ్మిదాశ్వాసముల గ్రంథముగా రచించి బళ్లారి మండలములోని జోహారాపురమునకు ప్రభువైన సంజీవిరెడ్డి కంకిత ము చేసెను. ఆ గ్రంథమునుబట్టియే యీతఁడు పద్మావతీ పరిణయము, అనిరుద్ధ చరిత్రము నను నాటకములను, రుక్మిణీ పరిణయమను గద్యపద్యాత్మక కృతిని, గుణాలంకారమణిమాలికను, రాఘవేంద్రాష్టకమును, చాటు పద్య సహస్రమును, భర్తృహరి శతకముల యాంధ్రీకరణమును, కొన్ని కన్నడ కృతులను రచించినట్లు తెలియుచున్నది.

## గుర్వరాజు - వణుకూరి

ఈతని 'శమంతకమణి చరిత్ర'లోని పద్య మొకటి, అప్పకవిచే (క్రీ.శ. 1650) నామాఖండయతి కుదాహరణముగా గ్రహింపఁబడినది. కావున, అప్పకవికంటె నీ కవి పూర్వుఁడు. ఈతని గ్రంథ మిపుడు లభింప లేదు.

## గోకర్ణుఁడు

ఈతఁడు సూర్యవంశ క్షత్రియుఁడు. వర్ధమానపురము నీతఁడు పాలించినట్లు కొందఱు చెప్పుదురు. ఈతఁడు 'గోకర్ణచ్ఛందము' అను ఛందోగ్రంథమును రచించి, దానికిఁ దనపేరు పెట్టుకొనెననియు, తన్నే సంబోధించుకొనుచుఁ బద్యములు చెప్పెననియు విమర్శకుల యాశయము. ఈతఁడు క్రీ. శ. 1140 ప్రాంతమువాఁడని గోలకొండ కవుల సంచికలోఁ గలదు. ఈతని శాసనము క్రీ. శ. 1127 నాఁటిది కలదని శ్రీ నిడుదవోలు-వేంకటరావుగారు తమ 'తెనుఁగు కవుల చరిత్ర'లోఁ దెల్పి యున్నారు.

గోకర్ణచ్ఛందములోని కొన్ని పద్యములు మాత్రమే లభించినవి. పూర్తిగా గ్రంథము లభింపలేదు.

## గోపన - పలుకలూరి

ఈతని చాటు పద్య మొకటి 'అప్పకవీయము'న నుదాహరింపఁబడి యున్నది. అయ్యది బాచమరుసును గూర్చినది. ఆ బాచమరుసు రామయామాత్య భాస్కరుఁడనియు, అతని శాసనములు క్రీ. శ. 1530-50 నడుమఁ గానవచ్చుచున్నవనియు 'ఆంధ్రకవి తరంగిణీ' కారులు వ్రాయుచున్నారు.

ఇతఁ డప్పకవి కంటెఁ బ్రాచీనుఁడని చెప్పవలెను.

## గోపన్న - కంచెర్ల

ఈతఁ డాత్రేయ గోత్రుఁడు. లింగన, కామమ్మల పుత్రుఁడు. ఇతఁడు రామదాసని పేరుపొంది, భద్రాద్రిరామభక్తుఁడైనట్లు ప్రసిద్ధి. 'దాశరథీశతక' మీతని రచనయఁట! 17-వ శతాబ్ది చివరివాఁడు. ఈతఁడు హైదరాబాదు ప్రాంతీయుఁడు. ఈతని రచన సరళమై, హృదయంగమమై యుండును.

## గోపన్న - పొట్టూరి

ఈతని పద్య మొకటి కాకనూరి - అప్పకవిచే నామాఖండ విశ్రమమున నుదాహృతిగా నీయఁబడినది. అది యే గ్రంథములోనిదో తెలియుటలేదు. కవి క్రీ. శ. 1650 కంటెఁ బూర్వుఁడనుట స్పష్టము.

## గోపమంత్రి - నాదెండ్ల

ఈతఁడార్వేల నియోగి. కౌశికగోత్రుఁడు. తిమ్మయమంత్రి, కృష్ణాంబల పుత్రుఁడు. నాదెండ్ల - అప్పామాత్యుని తమ్ముఁడు. తిమ్మరుసు మంత్రికి మేనల్లుఁడు. ఈతఁడు క్రీ. శ. 1485 ప్రాంతమున జన్మించియుండవచ్చునని 'ఆంధ్రకవి తరంగిణి'లోఁ గలదు. ఈతఁడు కొండవీటి దుర్గ పాలకుఁడు.

ఈ కవి కృష్ణార్జునసంవాదమను మూఁడాశ్వాసముల ద్విపద కావ్యమును రచించి, కొండవీటిలోని రాఘవేశ్వరస్వామి కంకిత మొసర్చెను.

## గోపమంత్రి

నిజాము రాష్ట్రములోని గార్ల యీతని నివాసము. ఈతని కాలము క్రీ. శ 1500 ప్రాంతమని గోలకొండ కవుల సంచికలోఁ గలదు. ఈతఁడు సింధుమతీ విలాస మను పద్యకావ్యమును రచించెను. ఇందు సింధుమతి యను వేశ్యకును, జయుఁడను యువకునకును గల సంబంధము వర్ణితము. ఇది శృంగారకావ్యము.

ఈ కవి భారద్వాజ గోత్రజుఁడు. నరసనామాత్యుని పుత్రుఁడు. ఈ కవి స్వయముగా వేదాంతదేశికులవలన ఉపదేశమును పొందెను. కావున నీతఁడు క్రీ. శ. 1370 ప్రాంతమువాఁడని శ్రీ నిడుదవోలు - వేంకటరావుగారు తెలుపుచున్నారు.

## గోపరాజు - కొఱవి

ఈ కవి యార్వేల నియోగి బ్రాహ్మణుఁడు. హరితసగోత్రుఁడు. గోపరాజు పౌత్రుఁడు. కనవరాజ, కామాంబికల పుత్రుఁడు, ఈతని నివాసము వేముగల్లు. ఈ పేరు గల గ్రామములు చాల ప్రాంతములలో నున్నవి. గ్రంథములోని వర్ణనలనుబట్టి యిది హైదరాబాదు ప్రాంతములోనిది కావచ్చును. ఈ గోపరాజు వంశమునకు మూలపురుషుఁడైన వెన్నయా

మాత్యుఁడు క్రీ. శ. 1180-1230 ప్రాంతమున నుండెనఁట! అతనికిఁ దొమ్మిదవ పురుషుఁడైన గోపరాజు 1430-1490 ప్రాంతమువాఁడై యుండునని 'ఆంధ్రకవి తరంగిణి'లో వివరింపఁబడి యున్నది.

గోపరాజు 'సింహాసన ద్వాత్రింశిక' యను పండ్రెండాశ్వాసముల ప్రబంధమును రచించెను. ఇందు భోజునకు ముప్పదిరెండు సాలభంజికలును విక్రమార్కుని గూర్చి చెప్పిన కథలు మనోహరముగ వర్ణింపఁబడినవి. కవిత్వము రసవంతమై, మృదుమధురమై యుండును.

## గోపరాజు - పెనుమెత్స

ఈతఁడు క్షత్రియుఁడు; ధనంజయ గోత్రుఁడు. ఇతని తండ్రి పద్మరాజు. తల్లి గన్నమాంబ. ఇతఁడు పెనుమెత్స - వేంకటాద్రికవికి సోదరుఁడు. కావున క్రీ. శ. 1500 ప్రాంతమువాఁడై యుండవచ్చును.

ఈతఁడు 'అంతర్వేది మాహాత్మ్యము' మున్నగు గ్రంథములను రచించి, రాజోలు తాలూకాలోని ర్యాలిగ్రామమందలి కేశవస్వామి కంకితమొనర్చినట్లు బమ్మెర కేసన, మల్లన కవులు రచించిన 'విష్ణు భజనానందము'ను బట్టి తెలియుచున్నది. ఇతని గ్రంథము లేవియును లభింపలేదు. ఈతని నివాసము 'ర్యాలి' యై యుండవచ్చునఁట !

## గోపాలకృష్ణకవి - కుండావఝ్ఝల

ఈతఁడు ములకనూరు (కరీంనగరు) నివాసి. రమారమి 140 సంవత్సరముల క్రిందట నుండినవాఁడఁట !

ఈ కవి బ్రహ్మవైవర్తమునందలి శ్రీకృష్ణ జన్మఖండమును రచించెనఁట ! అది యముద్రితము. హైదరాబాదులోని 'లక్ష్మణరాయ పరిశోధక మండలి' యందును, హనుమకొండ-పరిశోధక మండలిలోను దీని వ్రాఁత ప్రతు లున్నవఁట !

## గోపాలమంత్రి - చింతలపల్లి

నిజాము రాజ్యములోని గంగాపుర మీతని నివాసము. ఈతఁడు 350 ఏండ్ల క్రిందటివాఁడని గోలకొండ కవుల సంచికలోఁ గలదు. ఈ కవి 'ఆర్యాశతకము'ను రచించెనఁట! మధురవాణీ విలాసమును రచించిన వీరరాఘవకవి కీతఁడు పినతండ్రియఁట! గద్వాల, జటప్రోలు సంస్థానములలో పేరు పొందెనఁట!

## గోపాలయ్య - పల్లవి

ఈతని యింటిపేరు గుంటూరివారు. ఇతఁడు వెలనాటి వైదిక బ్రాహ్మణుఁడు; రామకృష్ణకవి మనుమఁడు. గోపాలకవి కుమారుఁడు. రాజగోపాలకవి యను పేరీతనికిఁ బ్రసిద్ధము; వాగ్గేయకారాగ్రణి యను బిరుదు కలవాఁడు. ఈతఁడు తంజావూరు ప్రభువులగు అమరసింహుని (క్రీ. శ. 1787-98) యొక్కయు, శరభోజీ (1798-1833) యొక్కయు కాలమున నుండినవాఁడు.

ఈ కవి 'భక్తజన పారిజాత' మను నాలుగాశ్వాసముల మహాప్రబంధమును రచించెను. ఇందు పరమభాగవతోత్తముల చరిత్ర వర్ణింపఁబడినది. గ్రంథ మముద్రితము.

## గోపాలరాయకవి - మానూరి

ఈతఁడు మైసూరు ప్రాంతమువాఁడు. ఈ కవి 'కీర్తికాంతా స్వయంవర'మను కావ్యమును వ్రాసి, మైసూరుప్రభువు శ్రీకృష్ణరాజేంద్ర భూపాలున కంకితముచేసెను. ఇది ముద్రితము.

## గోపాలరాయకవి - వికటకవి

'మధురమంగా పుంశ్చలీ లీలావిలాస' మను వచన కావ్య మితని రచన యని శ్రీ చల్లా-రాధాకృష్ణశర్మగారి యభిప్రాయము. ఇది చిన వెంగన రచించినదని శ్రీ నేలటూరి - వేంకటరమణయ్యగారి యభిప్రాయము.

## గోపీనాథకవి

ఈతఁడు సృష్టికరణ కులజుఁడు. భారద్వాజ గోత్రుఁడు. నారాయణమంత్రి పుత్రుఁడు. ఈతఁ డుత్కళదేశమందలి జయపుర సంస్థాన ప్రభువగు విశ్వంభర దేవునిచే సన్మానింపఁబడెను. ఈ కవి క్రీ. శ. 1670 ప్రాంతమున నుండెను.

ఉత్కళభాషలో సిద్ధేంద్రయోగి రచించిన 'విచిత్ర రామాయణము' నీతఁడు వచన కావ్యముగా తెలిఁగించెను. వాల్మీకి రామాయణమునందు లేని చిత్రకథ లెన్నియో యిందుఁ గలవు.

## గోవిందకవి - పోలూరి

ఈతఁడు తంజావూరి రాజుల కాలములో నుండెనఁట! ఈతఁడు పర్వత నారదోపాఖ్యానము, తాళదశప్రాణప్రదీపిక, రాగతాళ చింతామణి అను గ్రంథములను రచించెను. పర్వతనారదోపాఖ్యానము ముద్రితము. తక్కినవి ముద్రితములు. ఈతఁడు 'ఇందుమతీపరిణయము'ను కూడ రచించెనఁట. అది లభింపలేదు.

## గోవిందమంత్రి - కుంధుర్తి

ఈతఁ డార్వేల నియోగి బ్రాహ్మణుఁడు. శాండిల్య గోత్రుఁడు. అహోబల మంత్రి కుమారుఁడు. ఈతఁడు 'భారతీ పరిణయ' మను ప్రబంధమును రచించిన ట్లీతని మనుమఁడు కుందుర్తి - వేంకటాచలకవి తెలియఁ జేయుచున్నాఁడు. ఈ ప్రబంధము వీరవేంకటపతిరాయల కంకిత మొనర్పఁబడినదఁట! ఆ గ్రంథము లభింపలేదు.

ఈతఁడు క్రీ. శ. 1680-1700 ప్రాంతమున నున్నవాఁడు.

## గౌరనమంత్రి

ఈ కవి నియోగి బ్రాహ్మణుఁడు. గౌతమగోత్రుఁడు. అయ్యలు మంత్రికిని, పోతాంబకును పుత్రుఁడు. ఇతఁ డెల్లమంత్రి పుత్రుఁడని కొన్ని ప్రతులలోనున్నది. ఈతఁడు 'సరస సాహిత్య లక్షణ చక్రవర్తి' యఁట !

గౌరన పెదతండ్రి యగు పోతనామాత్యుఁడు మాధవనృపాలుని యొద్ద క్రీ. శ. 1376 ప్రాంతమున మంత్రిగా నున్నందున, అతని తమ్ముని కుమారుఁడైన గౌరన 1385-1445 నడుమ నుండి యుండవచ్చునని 'ఆంధ్ర కవి తరంగిణి' కారులు సవిమర్శముగా నిర్ణయించిరి. గౌరన శ్రీనాథుని సమకాలికుఁడు. శ్రీశైల మల్లికార్జునస్వామికి ధర్మకర్త యగు శాంతము త్తి భిక్షారాయని కోర్కెపై శ్రీనాథుఁడు శివరాత్రి మాహాత్మ్యమును పువ్వుల శాంతయ్య కంకిత మొసర్చినట్లు గౌరనయు నా ధర్మకర్త కోరికపైనే నవ నాథ చరిత్రమును శ్రీశైల మల్లికార్జునస్వామి కంకితము చేసెను.

గౌరన హరిశ్చంద్రోపాఖ్యానము, నవనాథ చరిత్రము నను రెండు ద్విపద కావ్యములను, లక్షణదీపిక యను నాంధ్రలక్షణగ్రంథమును సంస్కృతమునను రచించెను. హరిశ్చంద్రోపాఖ్యానము స్కాందపురాణోత్తర కథకు స్వేచ్ఛానువాదమఁట! శంకర కవియు, హరిశరభ కవియు నీతని ద్విపద ననుసరించియే పద్యకావ్యములను రచించిరి.

నవనాథ చరిత్రమున సుప్రసిద్ధ రసవాద సిద్ధులగు తొమ్మండుగురు సిద్ధుల కథలు వర్ణితము లైనవి.

ఈతఁడు 'సారంగధర చరిత్ర'ను ద్విపదగాఁ జెప్పెనని కొంద ఱందురు. సారంగధరుని కథ నవనాథ చరిత్రములోనిదే కాని ప్రత్యేక గ్రంథము కాదు. ఆ కథను వినినవా రది ప్రత్యేక గ్రంథమని భ్రాంతిపడి యుండవచ్చును.

ఇతని లక్షణ దీపిక అముద్రితము.

## గౌరనకవి

ఈతని 'నవగ్రహ స్తోత్రము'లోని పద్యములను జగ్గకవి తన 'ప్రబంధ రత్నాకరము'లో నుదాహరించి యున్నాఁడు. ఆ గ్రంథములభింపలేదు. ఈతఁడు 1560 కంటె ముందువాఁడు.

## గౌరనకవి

ఈతఁడు నియోగి బ్రాహ్మణుఁడు. కౌండిన్య గోత్రుఁడు. ఈ కవి కాలము తెలియలేదు. 'స్వరమంజరి' అను పేర తత్త్వసారము నీతఁడు కావ్యరూపముగా రచించినట్లు - ఈతని మనుమఁడగు కొండయ్య తన పల్నాటి వీర చరిత్రలోఁ జెప్పి యున్నాఁడట! ఇంతకంటె నితనిఁ గూర్చిన విశేషములు తెలియలేదు.

## గౌరరాజు

గౌరరాజుపద్యము నొకదానిని కాకునూరి - అప్పకవి తన 'అప్ప కవీయము'న నుదాహరించి యున్నాఁడు. ఆ పద్యమును బట్టి యీతఁడు లక్కన్నృపాలుని కాలములోనివాఁడని తెలియవచ్చుచున్నది.

ఈ కవి క్రీ. శ. 1480 ప్రాంతమున నుండి యుండునని 'ఆంధ్రకవి తరంగిణీ'లోఁ గలదు.

## గౌరీశంకరకవి - కాళ్లకూరి

ఈతఁడు నియోగి బ్రాహ్మణుఁడు. భారద్వాజ గోత్రుఁడు. సూర యామాత్యుని పుత్రుఁడు. శ్రీ కాకుళము జిల్లాలోని చీపురుపల్లికి సమీప మునఁగల గోప్పేట యితని నివాసము. ఈ కవి క్రీ. శ. 1770-1840 నడుమ నుండినవాఁడు.

ఈతఁడు ధర్మనందన విలాసమను ప్రబంధమును రచించి బంటుపల్లి నివాసియు, కమ్మకులస్థుఁడు నగు వెలిచేటి - గురురాయని కంకిత మొన రించెను.

## ఘట్టుప్రభువు (శేషకవి)

ఈతఁడు ప్రథమశాఖా బ్రాహ్మణుఁడు. ఎల్లనామాత్యుని పుత్రుఁడు. ఈతఁడు నెల్లూరుప్రాంతమువాఁడనియు, రెండువందల యేఁబది యేండ్ల క్రిందట (16-వ శతాబ్ది నడుమ) నుండినవాఁడనియుఁ దెలియుచున్నది. ఘట్టుప్రభు వనునది వ్యవహారనామమఁట! పేరు శేషకవి. ఇతఁడు 'ఘంటయ' అని శ్రీ కావలి - వేంకటరామస్వామిగారు వ్రాసినారు.

ఘట్టుప్రభువు మూఁడు పద్యకావ్యములను రచించెను. అవి 1. సురాభాండేశ్వరము 2. కుచేలోపాఖ్యానము 3. యాజ్ఞవల్క్య చరిత్రము - అనునవి. ఇవికాక 'సత్యభామా విజయ' మను ద్విపదకావ్యమును కూడ రచించెను. ఇవియన్నియు ప్రజాదరముఁగొన్న గ్రంథములు.

## చంద్రకవి

ఈతఁడు మైసూరు ప్రాంతీయుఁడు. 'శ్రీ కృష్ణభూపాలీయ'మను గ్రంథమును రచించి, మైసూరిప్రభువగు శ్రీకృష్ణరాజేంద్ర భూపాలున కంకిత మొనర్చెను. ఇది ముద్రితము.

## చంద్రమరాజు

ఈతఁడు హైదరాబాదురాష్ట్రములోని మహబూబునగరుజిల్లా భట్టుపల్లి నివాసి. 60, 70 ఏండ్ల క్రిందట నుండెనఁట! ఈతఁడు మనీషావ లోకన దర్పణము' అను గ్రంథమును రచించెనఁట!

## చంద్రమౌళికవి

ఈ కవి హరిశ్చంద్రకథను పద్యకావ్యముగా రచించినట్లు జగ్గకవి కూర్చిన 'ప్రబంధరత్నాకరము'ను బట్టి తెలియుచున్నది. ఇతఁడు శంకరకవి కంటెఁ బూర్వుఁడనియు, క్రీ. శ. 1480-1530 నడుమ నున్నవాఁడనియు 'ఆంధ్రకవి తరంగిణి'లోఁ గలదు. తురగా రామకవి, అయ్యంకి బాల సరస్వతికవి యీతనిని స్తుతించి యున్నారఁట!

## చంద్రశేఖరకవి - వెన్నెకంటి

ఈతఁడు వరంగల్లు నివాసియఁట! క్రీ. శ. 1700 ప్రాంతమున నుండినట్లు గోలకొండకవుల సంచికలోఁ గలదు.

ఈ కవి హరిశ్చంద్రచరిత్రను పద్యకావ్యముగా రచించెనఁట! ఇది రెండుభాగములు కలది.

## చిక్కయ్య - చెందలూరి

ఈ కవి రచించిన నాసికేతోపాఖ్యానములోని పద్యములు కొన్ని ప్రబంధరత్నావళిలో నుదాహరింపఁబడినవి. అవి జగ్గన కూర్చిన ప్రబంధరత్నాకరములోనివి; కవిత్వము హృద్యమై నిర్దుష్టమై యుండును.

ఈ కవి క్రీ. శ. 1560 కంటెఁ బూర్వుఁడు.

## చిదానందకవి - నుదురుపాటి

ఈతఁడు వేంకనార్యుని మనుమఁడు. మాతృభూతయ్య పుత్రుఁడు. రఘునాథతొండమాన్ రాజు పుత్రుఁడును, 1844-86 నడుమ రాజ్యము పాలించినవాఁడునగు రామచంద్రతొండమాన్ రాజునకంకితముగా చంద్రాననా దండకమును రచించెను. ఇతఁ డుద్దండ కవి బిరుదాంచితుఁడు. ఇతని కవిత్వము ప్రౌఢము.

## చినతాతాచార్యులు - తిరుమల బుక్కపట్టణము

ఈ కవి వైష్ణవబ్రాహ్మణుఁడు. శ్రీనివాసాచార్యుల పౌత్రుఁడు; వేంకటాచార్యుల పుత్రుఁడు. రమారమి నూటేండ్ల క్రిందట కృష్ణామండలమున నుండినవాఁడు.

ఈతని చాటువులు కొన్ని ప్రసిద్ధములు. ఈతఁడు వడ్లమన్నాటి-వెంకప్పసోమయాజులుగారి ప్రేరణమున సంస్కృతమున, వేంకటాధ్వరి రచించిన విశ్వగుణాదర్శమును పద్యకావ్యముగా ఆంధ్రీకరించెను.

## చినతిరుమలాచార్యులు - తాళ్లపాక

నందవరీకనియోగి బ్రాహ్మణుఁడై వైష్ణవసంప్రదాయము ననుసరించిన తాళ్లపాక - అన్నమాచార్యుల కీతఁడు పౌత్రుఁడు పెదతిరుమలాచార్యుల పెద్దకొడుకు; ఈతనికి తిరువేంకటేశుఁడు, వేంకటేశ్వరదీక్షితులు - అను నామాంతరము లున్నట్లు తెలియుచున్నది. ఈతని తమ్ముఁడగు చిన్నన్న క్రీ. శ. 1491 లో జన్మించెనని చెప్పుచున్నారు. కావున నీతఁడు 1480 ప్రాంతమున జన్మించి యుండవచ్చునని 'ఆంధ్రకవి తరంగిణి'లోఁ గలదు.

ఈ కవి 'అధ్యాత్మసంకీర్తనలు, శృంగారసంకీర్తలు, అష్టభాషా దండకము, సంకీర్తనలక్షణ మను పద్యకావ్యము'లను రచించెను. అష్టభాషాదండకములో సంస్కృత, ప్రాకృత, శౌరసేనీ, మాగధీ, పైశాచీ, ప్రాచ్యతంతీ, సార్వదేశీభాషలతో రచన సాగినది. ఈతఁడు 1485-1550 నడుమ నుండవచ్చునని భావించుచు 'ఆంధ్రకవితరంగిణీ' కారు లితని కాలమును నిశ్చయించిరి.

## చిననారాయణనాయకుఁడు - సవరము

ఈతఁడు సూర్యవంశక్షత్రియుఁడు. కాశ్యపగోత్రుఁడు. నారాయణ భూపాలుని పెంపుడుకొడుకు. శఠగోపముని శిష్యుఁడు. ఈతని జనకపిత శ్రీరంగరాయలు. ఈతని సవతి పినతండ్రి యగు నారాయణరాయ లీతనిని దత్తునిగా గ్రహించెనఁట !

ఈ కవి 'కువలయాశ్వచరిత్ర' మను నైదాశ్వాసముల ప్రబంధమును రచించి, తన పెంపుడుతండ్రికే అంకితమొనర్చెను. వసుచరిత్ర కృతిపతి యగు తిరుమలరాయల నాల్గవ కుమారుఁడగు వీరవేంకటపతిరాయలు పట్టాభిషిక్తుఁడైనపుడు, కువలయాశ్వచరిత్రకృతిపతి యున్నాఁడు. ఆ కాలము క్రీ. శ. 1580. సం. కావున నాతని దత్తపుత్రుఁడును; గ్రంథకర్తయు నగు

చిననారాయణనాయకుఁడు 1600 ప్రాంతమున నుండెనని చెప్పవచ్చునని 'ఆంధ్రకవి తరంగిణి' తెలుపుచున్నది.

ఈతని కవిత్వము రసవంతమైనది.

## చిన్నయసూరి - పరవస్తు

ఈతఁడు చాత్తాదవైష్ణవుఁడు. వేంకటరంగయ్య, శ్రీనివాసమ్మలు పుత్రుఁడు. ఈతఁడు 1806 లో జన్మించెను. నివాసము చెన్నపట్టణము. ఈతఁడు పచ్చయప్పకళాశాలలోను, రాజధానీకళాశాలలోను ఆంధ్రాధ్యాపకుఁడుగాఁ బనిచేసెను.

నీతిచంద్రికలోని మిత్రలాభ, మిత్రభేదములు, శబ్దలక్షణసంగ్రహము, ఆంధ్రశబ్దానుశాసనము, పద్యాంధ్రవ్యాకరణము, బాలవ్యాకరణము, ఆంధ్రధాతుమాల, తెనుఁగునిఘంటువు, సూత్రాంధ్రవ్యాకరణము, అక్షరగుచ్ఛము, విభక్తిబోధిని, ఆంధ్రశబ్దచింతామణి వ్యాఖ్య మున్నగునవి యీతని రచనలు. ఈతని బాలవ్యాకరణ, నీతిచంద్రికలు బహుళవ్యాప్తి నొందినవి. హిందూధర్మశాస్త్రసంగ్రహమను ధర్మశాస్త్రమును కూడ నితఁడు రచించెను.

## చెన్నకృష్ణకవి

ఈతఁడు హైదరాబాదురాష్ట్రములోని వనపర్తిసంస్థానమున నుండెనఁట! ఈతఁడు 220 ఏండ్లక్రిందటివాఁడని గోలకొండకవుల సంచికలోఁ గలదు.

ఈ కవి యాదవభారతీయమను ద్వ్యర్థికావ్యమును రచించెను. ఇందు భారత, భాగవతకథలు కలవు.

ఈ కవి నందవరీక బ్రాహ్మణుఁడనియు, నీతని గ్రంథము జనంపల్లి వల్లభరాయని కంకితమనియుఁ దెలియుచున్నది. ఈ గ్రంథము వనపర్తి సంస్థానమున ముద్రితము.

## చెన్నకృష్ణమాచార్యులు - మరింగంటి

ఈతఁడు హైదరాబాదు రాజ్యములోని నల్లగొండజిల్లాలోని కనగల్లునివాసి. 100 ఏండ్ల క్రిందట నీతఁ డుండెనఁట!

ఈ కవి యాదగిరి నృసింహశతకము మున్నగు కొన్ని శతకములను రచించెను.

## చెన్నబసవయ్య

ఈతఁడు 'సాంఖ్యవిచార'మను వచనకావ్యమును రచియించెను. సాంఖ్యము షడ్దర్శనములలో నొక్కటి. దాని ననుసరించిన తత్త్వనిర్ణయ మిందుఁ గలదు. ఈతఁడును, చెన్న బసవేశ్వరుఁడును భిన్నులో, అభిన్నులో తెలియరాదు.

## చెన్నబసవేశ్వరుఁడు - కాశీ

శంకరాచార్యకృతమగు బ్రహ్మసూత్రభాష్యము ననుసరించి ముకుంద యోగి మహారాష్ట్రమున 'వివేకసింధువు'ను రచింపఁగా, ఈ చెన్న బసవేశ్వరుఁడు దానిని తెలుఁగున వచనగ్రంథముగా రచించెను. ఈ కవి 1600 ప్రాంతమున నుండెనఁట ! ఈతని రచన ప్రశస్తమైనది.

ఈ వివేకసింధువునే వేఁగినాటి కొండయ్య పద్యకావ్యముగా రచించెను.

## చెన్నమరాజు - చెన్నమరాజు

ఈతఁడు నందవరీక నియోగి బ్రాహ్మణుఁడు; ఆత్రేయగోత్రజుఁడు. శేషామాత్య, సర్వాంబలకుఁ బుత్రుఁడు. చెన్నమరాజు పౌత్రుఁడు. ఈ కవి చారుచంద్రోదయ మను నైదాశ్వాసముల శృంగారప్రబంధమును రచించి, తాడిపత్రియందుఁ దాను నెలకొల్పిన శ్రీగోపాలకృష్ణున కంకితమొనర్చెను.

ఈ కవి పెమ్మసాని - తిమ్మభూపాలునకు మంత్రియై వెంకటపతి రాయలవద్దనుండి పెక్కు బహుమతులు తెచ్చి తన యేలిక కిచ్చెనఁట ! ఈ కవి క్రీ. శ. 1600 ప్రాంతమున జన్మించి 1640 ప్రాంతమున 'చారు చంద్రోదయము'ను రచించి యుండునని 'ఆంధ్రకవితరంగిణి'లోఁ గలదు.

శ్రీకృష్ణుని కుమారుఁడగు చారుచంద్రుఁడు పుష్కరుఁడను రాక్షసుని సంహరించి, రత్నకేతన పురాధిపతియగు పద్మాకరుని కుమార్తె యగు కుముద్వతిని వివాహమాడిన కథ 'చారుచంద్రోదయము'న వర్ణితము.

ఈతని కవిత్వము మృదుమధురమైనది.

## చెన్నశౌరి - ప్రోలుగంటి

ఈతఁడార్వేల నియోగి బ్రాహ్మణుఁడు. వసిష్ఠగోత్రుఁడు. ప్రోలుగంటి నివాసి. నాగశౌరికిని, దేవమ్మకును పుత్రుఁడు. తిప్పనకు మనుమఁడు. ఈ తిప్పన ప్రౌఢదేవరాయల వద్ద దండాధికారిగా నుండెనఁట! చెన్నశౌరి పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని సమకాలికుఁడు. కావున క్రీ. శ. 15-వ శతాబ్దిలో ఉత్తరార్ధమున నుండెనని చెప్పవలెను.

ఈతని గ్రంథము లేవియు లభింపలేదు. హరిభట్టు రచించిన నృసింహపురాణమునకు, ఆతని మరణానంతరము కూర్పఁబడిన కృత్యాదిలో నీతని గ్రంథములు పేర్కొనఁబడినవి. అవి 1. అహోబలనృసింహస్వామి కంకితమైన ద్విపదనృసింహపురాణము 2. బాలభారతమను వచనకావ్యము 3. సౌభరిచరితమను యక్షగానము.

## చౌడప్పకవి

ఈతఁడు 'కవి చౌడప్పా!' అను ఆత్మసంబోధనతో రెండు వందల పద్యములను చెప్పియున్నాఁడు. ఈ చౌడప్పకవి నియోగిబ్రాహ్మణుఁడని ప్రతీతియఁట! ఈతఁడు కుందవరపు వంశీయుఁడు. ఈతని పద్యములలో 10, 12 తప్ప మిగిలినవన్నియును కందపద్యములే! కవి పుల్లూరిలోని గోపాలదేవుని నుతించుటచే నీతని నివాసము పుల్లూరయి యుండునని తోఁచుచున్నదని 'ఆంధ్రకవితరంగిణీ'కారుల యభిప్రాయము.

చౌడప్పకవి మట్ల - అనంతభూపాలుఁడు, తంజావూరు రఘునాథరాయలు మున్నగు ప్రభువులవలన మన్ననల నందుచుండెను. కావున క్రీ. శ. 1580-1640 నడుమ నీ కవి యుండెనని నిశ్చయింపవచ్చును.

ఈతని రచన మనోహరము. హాస్యరస మెక్కువ. ఇందు బూతుల పద్యములును గలవు.

## చౌడయ్య - గంగరాజు

జగ్గన కూర్చిన ప్రబంధరత్నాకరమునుబట్టి యీతఁడు సాముద్రిక శాస్త్రము, నందనచరిత్రము - అను రెండు గ్రంథములను రచించినట్లు తెలియుచున్నది. సాముద్రికశాస్త్రము కసవయామాత్యున కంకిత

మొనర్పఁబడినది. ఈతఁడు క్రీ. శ. 1560 కంటెఁ బ్రాచీనుఁడని చెప్పవచ్చును.

## ఛాయాపతి - చింతలపల్లి

ఈతఁడు మహబూబునగరుజిల్లాలోని గంగాపురమున నివసించుచుండెనఁట! మధురవాణీవిలాసమును రచించిన వీరరాఘవకవి కీతఁడు మనుమఁడఁట! ఈ కవి 120 సంవత్సరముల క్రిందట నుండెనఁట! ఈతనిది విద్వత్కవి కుటుంబము.

ఛాయాపతికవి రాఘవాభ్యుదయ మను నైదాశ్వాసముల ప్రబంధమును రచించెను.

## జక్కనకవి

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. పెద్దయామాత్యుని పౌత్రుఁడు. అన్నయామాత్యుని పుత్రుఁడు. ఇతని తాత యగు పెద్దయామాత్యుఁడు తిరుకాళవిభునిచే మన్ననల నందెనని కవియే చెప్పియున్నాఁడు. ఈ తిరుకాళవిభుఁడు నెల్లూరిపాలకుఁడును, తిక్కనచే నిర్వచనోత్తర రామాయణమును కృతిపొందినవాఁడును నగు మనుమసిద్ధికిఁ గుమారుఁడగు ఇమ్మడి (రెండవ) తిరుకాళవిభుఁడుడనియు, అందుచేఁ బెద్దయ 13-వ శతాబ్దిలో (1270 ప్రాంతమున) పుట్టి యాతని మన్ననలనందెనని చెప్పవచ్చుననియు 'ఆంధ్రకవితరంగిణి'లోఁ గలదు. జక్కయ 1345 ప్రాంతమున జన్మించెనఁట!

జక్కన, తాను రచించిన విక్రమార్కచరిత్రమును సిద్ధమంత్రి కంకితమొనర్చెను. ఈతనిని, ఈతని తండ్రియగు జన్నయమంత్రిని కవి మిక్కిలి ప్రశంసించెను. సిద్ధమంత్రి దేవరాయల మంత్రి యగు చామయామాత్యునివలన మన్ననలనందెనఁట! కావున క్రీ. శ. 1375-1404 నడుమ విక్రమార్కచరిత్ర రచింపఁబడినదని చెప్పవచ్చునని 'ఆంధ్రకవితరంగిణి'లోఁ దెల్పఁబడినది.

విక్రమార్కచరిత్రము 8 ఆశ్వాసముల పెద్ద ప్రబంధము. ఇది యుత్తమకావ్యము. ఇందు సుప్రసిద్ధుఁడగు విక్రమార్కుని కథలు కలవు.

దీనికి సంస్కృతగ్రంథము మూలము. జక్కన కవిత్వము ప్రౌఢమై, రసవంతమై యుండును.

'పెమ్మయసింగధీమణీ!' అను మకుటముతో నీతఁడొక శతకమును చెప్పినట్లు శ్రీ వేటూరి - ప్రభాకరశాస్త్రిగారు 'చాటుపద్యమణిమంజరి'లో వ్రాసి యున్నారు. ఆ శతకము లభింపలేదు. కొన్ని పద్యములు మాత్రము లభించినవి.

## జగన్నాథకవి - ఓగిరాల

ఈతఁడార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. భారద్వాజగోత్రుఁడు. వేంకటేశ్వరామాత్యుని పుత్రుఁడు. ఇతని నివాసము గోదావరిమండలము లోని నీలపల్లి గ్రామము. ఈయన కొంతకాలము కాకినాడలో 'సుధీరంజని' యను మాసపత్రికను నడిపెను. 19-వ శతాబ్ది చతుర్థపాదమువఱకు నుండెను. కావున నీతఁడు 1810 ప్రాంతమున జననమంది యుండును.

ఈతఁడు 'సుమనోమనోభిరంజన' మను వైదుల్లాసములప్రబంధ మును రచించి ప్రకటించెను. దీని రచన 1845 ప్రాంతముననే జరిగెనఁట! ఈతని కవిత్వము రసవంతమయి, నిర్దుష్టమయి యుండును.

ఈతఁడు మంత్రిప్రగడ వేంకటరామపంతులుగారి వద్ద లక్షణ గ్రంథముల నభ్యసించెనఁట!

## జగన్నాథకవి

ఈతఁడుత్తరప్రాంతమువాఁడఁట! సంస్కృతాంధ్రములందు సమర్థుఁడు. ఇతఁడు సంస్కృతమునుండి 'రాజనీతి' అను గ్రంథము నాంధ్రీకరించెఁట! ఇతనికాలము తెలియదు. గ్రంథము లభింపలేదు. శ్రీ కావలి-వేంకటరామస్వామిగారీతనినిగూర్చిన పైవిషయమును వ్రాసిరి.

## జగన్నాథకవి - (రామాప్రెగడ) పెదపాటి

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. కౌశికగోత్రుఁడు. గంగామాత్యు నకును, చానమ్మకును పుత్రుఁడు. రామమంత్రి, వీరమ్మల మనుమఁడు.

పడమటి గోదావరిజిల్లా, ఏలూరికి సమీపమునఁగల పెదపాడు ఈతని నివాసము. 'రామాప్రెగడ' యింటిపేరఁట! గ్రామనామమునుబట్టి యీతనికి 'పెదపాటి - జగ్గన' అనునది వాడుకపేరైనది.

ఈతఁడు 'ప్రబంధరత్నాకర'మను నైదాశ్వాసముల గ్రంథమును గూర్చెను. అందు వివిధకవులు రచించిన వర్ణనాంశములు కలవు. ఈ గ్రంథము శ్రీజగన్నాథస్వామి కంకితముచేయఁబడినది. అందు మూఁడా శ్వాసములు మాత్రమే లభించినవి. వానిని కృత్యాదితోఁగూడ శ్రీ వేటూరి- ప్రభాకరశాస్త్రిగారు 'ప్రబంధరత్నావళి'లోఁ బ్రకటించి యున్నారు ఇందలి పద్యములవలన పెక్కురు కవులు, వారి గ్రంథములు తెలియఁబడు నవకాశము కలిగినది.

ఈతఁ డుదాహరించిన కవులలో మాదయ్యగారి-మల్లన, తెనాలి- రామలింగఁడు నర్వాచీనులు. రామరాజభూషణుని పద్యములు గాని, పింగళి -సూరనార్యుని పద్యములు గాని యుదాహరింపఁబడలేదు. కావున జగన్నాథకవి క్రీ. శ. 1550-60 ప్రాంతమువాఁడని నిర్ణయింపవచ్చునని శ్రీ వేటూరి - ప్రభాకరశాస్త్రిగారు వ్రాసి యున్నారు.

శ్రీప్రభాకరశాస్త్రిగారు లభ్యమగు 'ప్రబంధరత్నాకరము'తో ఆంధ్రసాహిత్యపరిషత్తులోనున్న సంకలనగ్రంథమునందలి పద్యములను చేర్చియే 'ప్రబంధరత్నావళి'ని కూర్చినారు.

## జగన్నాథరావు - పానుగోటి

ఇతఁడు నిజామురాష్ట్రములోని దేవరకొండదగ్గఱ నున్న పానుగోలు నివాసి. ఈతఁడు 270 ఏండ్లక్రిందట నుండెనని గోలకొండకవుల సంచి కలోనున్నది. ఈ కవి కుముదవల్లీ విలాసమను పద్యకావ్యమును రచించెను.

## జగ్గకవి - కూచిమంచి

ఈతఁ డార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. కౌండిన్యగోత్రుఁడు. తిమ్మ యార్యుని పౌత్రుఁడు. లచ్చమాంబా, గంగనార్యుల పుత్రుఁడు. తిమ్మకవి సార్వభౌముని తమ్ముఁడు. ఈతని యన్న యగు తిమ్మకవి క్రీ. శ. 1690

ప్రాంతమున జన్మించి యుండవచ్చునని యాతని గ్రంథములంబట్టి తెలియుచున్నందున - అతని తమ్ముఁడగు జగ్గకవి 1700 ప్రాంతమునఁ బుట్టి యుండవచ్చును. ఈతఁడు తిమ్మకవికంటె నాలుగైదు సంవత్సరములు చిన్నవాఁడై యుండునని వీరేశలింగము పంతులుగారు వ్రాసి యున్నారు.

ఈతఁడు జానకీపరిణయము, సుభద్రాపరిణయము, చంద్రరేఖావిలాపము, సోమదేవరాజీయము - అను ప్రబంధములను, ద్విపద రాధాకృష్ణ చరిత్రమును, కొన్ని చాటుప్రబంధములను, శతకములను, రచించెను.

ఈతఁడు తన గ్రంథములను జగన్నాథస్వామి కంకితములుగా నిచ్చెను.చంద్రరేఖావిలాసమును మాత్రము విజయనగరప్రభువులబంధువైన చింతలపాటి-నీలాద్రిరాజును తిట్టుచుఁ జెప్పిన బూతుప్రబంధము. తొలుత నా రాజుకోరికపై అతని కంకితముగాఁ 'చంద్రరేఖావిలాస'మను కావ్యమును రచింపఁగా, కృతిపతి దానిని స్వీకరింపక పోఁగా, విలాసమును 'విలాపము'గా మార్చి యీ తిట్టు ప్రబంధమును చెప్పెను.

సోమదేవరాజీయము, కాకతీయరాజులవంశమునఁ బుట్టిన మందపాటి - నారాయణరాజు ప్రేరణమునఁ బ్రతాపరుద్రవంశము నభివర్ణించుచుఁ జెప్పిన చరిత్రప్రబంధము. ఇది మూఁడాశ్వాసములు కలది.

సుభద్రాపరిణయ మాఱాశ్వాసముల రసవత్ప్రబంధము. ఇతని రచన మనోహరముగ నుండును.

## జన్నమంత్రి-వెన్నెలకంటి

ఇతఁ డాఱువేల నియోగి. హరితసగోత్రుఁడు. సిద్ధమంత్రి కుమారుఁడు. సంగమవంశజుఁడై విజయనగరమును పాలించిన దేవరాయల యొద్ద నుద్యోగి. కావున నీతఁడు క్రీ. శ. 1360-1420 నడుమ నున్నట్లు తెలియుచున్నది.

ఈ జన్నమంత్రి 'కృష్ణా! దేవకీనందనా!' అను మకుటముతో నొక శతకమును రచించెను. అది 'దేవకీనందన శతకము'గా ప్రసిద్ధము.

ఈతఁ డీ శతకమును రచించినట్లు జక్కన విక్రమార్కచరిత్రమువలనఁ దెలియుచున్నది. విక్రమార్కచరిత్ర మీ జన్నమంత్రిపుత్రుఁడగు సిద్ధ మంత్రికే కృతి యీయఁబడినది.

దేవకీనందనశతకము కవిరాక్షసకృతమని కొందఱును, తిక్కన రచితమని కొందఱును భ్రాంతిపడిరి. ఇందు వ్యాకరణమునకు లొంగని ప్రయోగము లుండుటంబట్టియు, రచనలో ఎక్కువ భేద ముండుటం బట్టియు - ఆ రీతిగా ననుకొనుట కవకాశము లేదు.

## జన్నయకవి - అనంతరాజు

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. జన్నయమంత్రి పౌత్రుఁడు. అమ్మయామాత్యుని పుత్రుఁడు. ఈతని కాలము సరిగా తెలియదు. కాని రమారమి 200 ఏండ్ల క్రిందట నుండి యుండవచ్చునని శ్రీ వీరేశలింగము పంతులుగారి యూహ.

ఈతఁడు 'రామకథాభిరామము' అను పది యాశ్వాసముల పెద్ద కావ్యమును రచించెను. అందు రామాయణకథ వర్ణింపఁబడినది. రచన మృదుమధురమైనది.

## జయదేవకవి

ఈతని జయదేవచ్ఛంద మను ఛందోగ్రంథము కవిజనాశ్రయమున నుదాహరింపఁబడినది. మల్లియరేచన రచితమైన కవిజనాశ్రయము క్రీ. శ. 1100 ప్రాంతమున రచింపఁబడినదగుటచే జయదేవకవి యంతకుఁ బూర్వమున నుండి యుండును.

సంస్కృతవాఙ్మయమున గ్రంథకర్తలైన జయదేవకవులు చాల మంది కలరు. ఛందోగ్రంథకర్త యైన యీ జయదేవకవి వారిలో నొక్కఁ డగునో కాఁడో తెలియరాదు.

ఇతని ఛందోగ్రంథము లభింపలేదు.

## తమ్మభూపాలుఁడు - పూసపాటి

ఇతఁడు సూర్యవంశక్షత్రియకవి. ప్రౌఢదేవరాయల కాలములో నుండిన పూసపాటి-రాచిరాజు వంశములోనివాఁడు. అతని కాలుతరముల వాఁడైనందున నీతఁడు క్రీ. శ. 1640 ప్రాంతమున నుండి యుండును. శ్రీమన్మహామండలేశ్వర-మహీమండలరాయ - మన్నెసుల్తాను బిరుదములు కలవాఁడు.

ఈ కవి శ్రీకృష్ణవిజయమను నైదాశ్వాసముల ప్రబంధమును రచించెను. నరకాసురవధ, పారిజాతాపహరణమును అందలి ప్రధాన కథాంశములు. ఇది ఉత్తమమైన ప్రబంధము. ఇది బెజవాడలోని శ్రీ కనక దుర్గాదేవి కంకితము.

## తమ్మయదొర - త్రిపురాన

తెలగాకులమునఁ బుట్టిన యీతని నివాసము శ్రీకాకుళమునకుఁ జేరువనున్న సిద్ధాంతము. తండ్రి వెంకటస్వామిదొర. తల్లి చిట్టెమ్మ. ఈతఁడు 1849 లో జన్మించెనఁట! ఇతఁడు సంస్కృతాంధ్రములందు సమర్థుఁడగు విద్వత్కవి.

ఈతఁడు 'నీతిశతకము, పాండురంగాష్టోత్తరశతకము, కామినీ నిర్మోహజననతారావళి, విటీవిటనటసార్థమాల, ముఖలింగేశ్వరశతకము, నిద్రావిజయము, దేవీభాగవతము, మహాపురాణము మున్నగు గ్రంథములను రచించెను. వీనిలో చాలవఱకు ముద్రితములు. దేవీభాగవత మముద్రితమఁట! ఈతని కృతు లన్నియు భగవదర్పితములు! రచన మిక్కిలి మధురమై హృదయంగమముగా నుండును.

## తమ్మయ్య - సారంగు

గోలకొండ యీతని నివాసము. ఈతఁడు వైష్ణవమతావలంబి. గోలకొండ వ్యాపారి బ్రాహ్మణుఁడు. భారద్వాజగోత్రుఁడు. నరసింహ మంత్రిపుత్రుఁడు. తమ్మయపౌత్రుఁడు.

ఈతఁడు వైజయంతీవిలాస మను నాల్గాశ్వాసముల ప్రబంధమును క్రీ. శ. 1510 ప్రాంతమున రచించి శ్రీరామచంద్రున కంకితమిచ్చెను. ఇందు తొండరడిప్పొడియాళ్వారుల చరిత్రము వర్ణింపఁబడినది. ఈ భక్తుఁడే విప్రనారాయణుఁడు కావున వైజయంతీ విలాసమునకు విప్రనారాయణ చరిత్ర మను నామాంతరము కలదు. విప్రనారాయణుఁడు బ్రహ్మచర్యనిష్ఠకలవాఁడై యుండియు, దేవదేవి యను వేశ్యకు లొంగి, తర్వాత వేశ్యమాతచేఁ దఱుమఁబడి శిష్యరూపము దాల్చిన శ్రీరంగేశుని సాయమున వేశ్యపొత్తుఁబడసి, తుదకుజీవన్ముక్తిని పొందిన కథ యిందు వర్ణితము. ఇందలి రచన యింపైనది.

## తాతంభట్టు - వెల్లంకి

ఈతఁడు వైదిక బ్రాహ్మణుఁడు. శాలావతగోత్రుఁడు. ఇతని తండ్రి యబ్బయ్య. తల్లి యెఱ్ఱమ్మ. అన్న రామార్యుఁడు. ఈతఁడు 'కవిచింతామణి'యను లక్షణగ్రంథము నొకదానిని రచించెను. దానికి 'కావ్యానుశాసన' మనునది నామాంతరము ఈతని రచనగా ముద్రితమై ప్రచారమున నున్న 'సులక్షణసార' మీతని కృతి కాదు. అ యా లక్షణ గ్రంథములందలి పద్యము లేర్చి కూర్చి వ్రాయఁబడిన కలగలుపు గ్రంథము.

ఈతఁడు తర్క-వ్యాకరణాది శాస్త్రములందు గట్టి పండితుఁడు. ఈతని నివాసము కృష్ణాజిల్లా, నందిగామతాలూకాలోని వెల్లంకిగ్రామమై యుండునని 'ఆంధ్రకవితరంగిణీ'కారులు వ్రాయుచున్నారు.

ఈతఁడు శ్రీకృష్ణదేవరాయలకుఁ బూర్వుఁడని చెప్పుదురు. ఈతని గ్రంథమున పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి జైమినిభారతమునుండి లక్ష్యములు గ్రహింపఁబడినవి. కావున నీతఁడు 15-వ శతాబ్ది చివఱను, పదునాఱవ శతాబ్ది ప్రారంభమునను ఉండి యుండవచ్చును.

## తిక్కనసోమయాజి

ఈతఁ డార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. గౌతమగోత్రుఁడు. భాస్కరమంత్రి మనుమఁడు. కొమ్మనామాత్యునకును, అన్నమాంబకును పుత్రుఁడు. ఈతనికి 'కవిబ్రహ్మ, ఉభయకవిమిత్రుఁడు' అను బిరుదులు

కలవు. ఆంధ్రమున నద్వితీయముగఁ గవిత్వము చెప్పుటలో నితనిని మించిన వాఁడు సారస్వతమున లేఁడు. ఈతఁడు కొట్టరువు వంశీయుఁడు. ఈతఁడు నెల్లూరిని పాలించిన మనుమసిద్ధిరాజునకును మంత్రియు, నాస్థానకవియు నై యుండెను. మఱియు నీతఁడు, తన యేలిక యగు మనుమసిద్ధి అక్కన, బయ్యనలను దాయాదులవలన రాజ్యభ్రష్టుఁడు కాఁగా, కాకతీయ ప్రభువగు గణపతిదేవునికడ కేఁగి, తన పాండిత్యప్రభావమున నాతనిని మెప్పించి, యాతని సాయమున మనుమసిద్ధికిఁ దిరిగి రాజ్యలాభము కల్గించెనఁట ! ఈ కవి క్రీ. శ. 1220-1280 నడుమ నుండెను.

ఈ మహాకవి తొలుత నిర్వచనోత్తరరామాయణమును రచించి మనుమసిద్ధి కంకితమిచ్చెను. తర్వాత యాగము చేసి సోమయాజియై భారతమునందలి విరాటపర్వము మొదలు పదునైదు పర్వములను తెలిఁగించి హరిహరనాథున కంకితమిచ్చెను.

నన్నయభట్టు భారతమున నాది, సభాపర్వములను, ఆరణ్య పర్వమునఁ గొంతి భాగమును రచించి యున్నను, తిక్కన 'నన్నయభట్టు మూఁడు పర్వములను రచించె'నని చెప్పి యున్నాఁడు. అరణ్యపర్వము పూర్తి కాకపోయినను చాల భాగమును నన్నయ రచించుటచేత ఆ రీతిని తిక్కన చెప్పి యుండునని కొందఱి యభిప్రాయము.

తిక్కన భారతరచన ప్రారంభించునాఁటికే యెఱ్ఱాప్రెగ్గడ అరణ్యపర్వమును పూర్తి చేసె ననియు, ఎఱ్ఱన నన్నయ రచించినట్లుగానే యరణ్యపర్వశేషమును తెలిఁగించి, రాజరాజనరేంద్రునకే యంకితమిచ్చి యున్నందున, 'మూఁడు పర్వములను నన్నయ రచించె'నని తిక్కన చెప్పుట సరియే యనియు, అరణ్యపర్వము పూర్తికాక నిలిచిపోయియే యుండినచో, తిక్కన యా భాగమును పూర్తిచేయక విరాటపర్వము నుండియు నాంధ్రీకరింపఁబూనుట పొసఁగదనియు శ్రీనిడుదవోలు - వేంకటరావుగారి యూహయము.

పయి గ్రంథద్వయమునే గాక తిక్కన 'విజయసేనము, కవి వాగ్బంధనము, కృష్ణశతకము' అను గ్రంథములను కూడ రచించినట్లు కొందరు చెప్పుదురు. పెదపాటి-జగ్గనకవి కూర్చిన ప్రబంధరత్నాకరములో తిక్కన విజయసేనములోనివని కొన్ని పద్యము లీయఁబడినవి. విజయసేనము లభింపలేదు. ప్రబంధరత్నావళిలోని పద్యములు తిక్కనవగునో కావో చెప్పఁజాలమని శ్రీ వేటూరి - ప్రభాకరశాస్త్రిగారు తెల్పినారు.

'కవి వాగ్బంధనము'నకు 'కవిసార్వభౌమచ్ఛంద'స్సనునది నామాంతరము. ఇది చాల చిన్నగ్రంథము. తిక్కనసమకాలికుఁడును, అతనికిఁ దన గ్రంథము నంకిత మిచ్చినవాఁడును అగు కేతన తానే తెలుఁగునకుఁ దొలుత లక్షణగ్రంథమును వ్రాసినట్లు చెప్పియున్నందున, కవివాగ్బంధనము తిక్కనకృతము కాదని యనవలెను.

'కృష్ణశతకము'ను తిక్కన రచించె ననుటకుఁ దగిన ప్రమాణములు లేవు.

తిక్కన రచన తెనుఁగునుడికారములతో వెలయుచు, అర్థగాంభీర్యము, భావనా పరిపుష్టి, కలిగి అత్యంతరసవంతమయి యుండును. అల్పాక్షరములతో ననల్పార్థకల్పనము నొనర్చుటలో నీతఁడు సిద్ధహస్తుఁడు.

## తిప్పయ్య - రాయకవి

ఈ కవికి 'అయ్యలరాజు - త్రిపురాంతకుఁ'డనియుఁ బేరు కలదు. ఇతఁడు కౌండిన్యగోత్రుఁడు. ఈతఁ డొంటిమిట్ట రఘువీరశతకమును రచించినట్లు కృష్ణదేవరాయల కాలములోని వాఁడని చెప్పఁబడు అయ్యలరాజు - రామభద్రకవియు, ఈతఁడు శతకమును రచించినట్లు శెట్టిమతమును రచించిన అయ్యల, భాస్కరకవులును చెప్పియున్నారు.

ఈతఁడు కర్ణాటకమండలాధిపతి యగు రెండవ దేవరాయల యాస్థానకవియఁట! అట్లయినచో నీతఁడు క్రీ. శ. 1440 ప్రాంతమువాఁ డగును.

ఈతని శతకమున 'రఘువీరా! జానకీనాయకా!' అనునదే మకుట మనియు, కొన్ని పద్యములలో మాత్రమే 'ఒంటిమెట్ట రఘువీరా!–'అను విశేషణము కలదనియు, మకుటమునుబట్టి కాక, ఒంటిమెట్టయందుండు రామచంద్రునిఁ బట్టియే దీనికి 'ఒంటిమెట్ట రఘువీరశతక'మని పేరు వచ్చి యుండుననియు 'ఆంధ్రకవి తరంగిణి'లోఁ గలదు.

ఈకవి కవిత్వ మనర్గళమై మనోహరమై యుండును.

## తిప్పరాజు – కుడిచెర్ల

శ్రీ వేటూరి - ప్రభాకరశాస్త్రిగారు కూర్చిన 'ప్రబంధరత్నావళి' యను సంకలన గ్రంథమున నీ తిప్పరాజు 'కాంచీ మాహాత్మ్యము'లోని పద్యములు ఉదాహరింపఁబడినవి. ఆ గ్రంథము లభింపలేదు. ఈతఁడు క్రీ.శ. 1560 కంటెఁ బూర్వుఁడనుట నిశ్చయము.

## తిమ్మకవి – కూచిమంచి

ఈతఁ డార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. కౌండిన్యగోత్రుఁడు తిమ్మయకు పౌత్రుఁడు. లచ్చమాంబా, గంగనామాత్యుల పుత్రుఁడు. తిట్టుకవి యగు జగ్గకవికి అన్న. ఈతని నివాసము గోదావరిజిల్లాలోని పిఠాపురమునకు సమీపమున నున్న కందరాడ. ఈతఁడు కవియై గ్రంథ ములను రచించి పిఠాపురప్రభువగు శ్రీ రావు మాధవరాయ నృపతివలన 'కవి సార్వభౌమ' బిరుదమును సంపాదించెను.

ఈతఁ డెప్పుడు జన్మించినదియుఁ దెలియదు. కాని తన తొలిగ్రంథ ములో నది రచింపఁబడిన కాలముల నీతఁ డుదాహరించి యున్నందున నీతని కాలమును నిర్ణయించుట సులభము. ఈతని తొలిగ్రంథమగు రుక్మిణీ. పరిణయము క్రీ. శ. 1715 లోను, భల్లాణ చరిత్రమను నామాంతరముగల రాజశేఖర విలాసము దాని తర్వాతను రచితములైనవి. ఆ పిదపనే సింహా. చల మాహాత్మ్యము, సర్వలక్షణ సారసంగ్రహము, రసికజన మనోభి. రామము, అచ్చతెలుఁగు రామాయణము, నీలాసుందరీ పరిణయము

సారంగధరచరిత్రము, సాగరసంగమమాహాత్మ్యము, సర్పపురమాహాత్మ్యము, కుక్కుటేశ్వరశతకము, భర్గశతకము, శివలీలావిలాసము, దండకములు మున్నగు గ్రంథములను రచించెను.

ఈతఁడు గొప్ప శివభక్తుఁడైనందున, సర్పపురమాహాత్మ్యమును విడిచి, తక్కిన గ్రంథముల నన్నింటిని పిఠాపురమునందలి కుక్కుటేశ్వర స్వామి కంకిత మొనర్చెను. సర్పపురమాహాత్మ్యము సర్పవరమునందలి భావ నారాయణస్వామి కంకితము.

రుక్మిణీపరిణయ మైదాశ్వాసముల ప్రబంధము. ఇది తొలి కృతి యగుటచేఁ గవితాచమత్కృతి ఎక్కువగా కానరాదఁట! రాజశేఖర విలాసము మూఁడాశ్వాసముల ప్రబంధము. ఇందు భల్లాణుఁడను శివ భక్తుని చరిత్రము వర్ణింపఁబడినది. సింహాచల మాహాత్మ్యము 5 ఆశ్వాస ముల గ్రంథము. ఇది విశాఖపట్టణముచేరువఁ గల సింహాచలపు వరాహ నృసింహస్వామి దేవుని మహాత్తును తెల్పు గ్రంథము. సర్వలక్షణ సార సంగ్రహము లక్షణగ్రంథము. రసికజన మనోభిరామ మాఱాశ్వాసముల ప్రబంధము. ఇది శృంగారగ్రంథము. దీనింబట్టియే యీతఁడు సరసకవి యను పేరు పొందెనఁట!

ఆంధ్రమున అచ్చతెలుఁగులో రచింపఁబడిన గ్రంథములు చాల తక్కువ. వానిలో తిమ్మకవి వ్రాసిన అచ్చతెనుఁగు రామాయణము, నీలాసుందరీ పరిణయము పేరుపడసినవి. నీలాసుందరీ పరిణయములో నీలాదేవికి శ్రీకృష్ణునకు జరిగిన వివాహము వర్ణింపఁబడినది. శుద్ధాంధ్ర కవులలో నీతఁడు ప్రసిద్ధుఁడు.

శివలీలావిలాసము క్రీ. శ. 1756 లో రచింపఁబడినట్లు గ్రంథము లోనే చెప్పఁబడినది. ఇది రెండాశ్వాసముల ప్రబంధము. ఇందు శివుని లీలలు వర్ణింపఁబడినవి.

## తిమ్మకవి - లింగమకుంట

ఈతఁడు ప్రథమశాఖా బ్రాహ్మణుఁడు. కాశ్యపసగోత్రుఁడు. తాత సర్వకవి. తలిదండ్రులు తిమ్మాంబా,లక్ష్మణామాత్యులు. రామకవికిఁ దమ్ముఁడు. తెనాలి రామకృష్ణకవికి బంధువు. భట్టరు చిక్కాచార్యుని శిష్యుఁడు. 16-వ శతాబ్దిలో నుండినవాఁడు.

తిమ్మకవి సులక్షణసారమను లక్షణగ్రంథమును, బాలబోధ ఛందస్సును రచించినట్లు తెలియుచున్నది. సులక్షణసారము మాత్రము ముద్రితమైనది. దీని నీతఁడు చెదలువాడయందలి శ్రీరామచంద్రున కంకిత మొనర్చెనఁట !

ఈతని నివాసము నెల్లూరుజిల్లాలోని లింగమకుంటయఁట !

## తిమ్మక్క - తాళ్ళపాక

సుప్రసిద్ధ సంకీర్తనాచార్యులగు తాళ్లపాక - అన్నమాచార్యులు గారి కీమె భార్య. తిరుమలాంబ, తిమ్మాంబ అనునవి యీమెకు నామాంతరములు. ఈమెకు నరసింగన్న యను పుత్రుఁడుండెను. ఈమె మరణానంతరమున అన్నమాచార్యులు అక్కలమ్మను వివాహమాడెనని 'ఆంధ్ర కవితరంగిణి' చెప్పుచున్నది. తిమ్మక్క పదునైదవ శతాబ్ది తొలిభాగమున నుండెనని చెప్పవలెను.

ఈమె సుభద్రాకల్యాణ మను గేయకావ్యమును రచించెను. ఇది చక్కని శైలిలో మధురముగా నుండును. ఆ కావ్యమున సుభద్రపాత్ర చక్కఁగా పోషింపఁబడినదఁట !

## తిమ్మన - పుష్పగిరి

ఈ కవి ములికినాఁటి వైదిక బ్రాహ్మణుఁడు. పదునెనిమిదవ శతాబ్ది చివర నుండిన విద్వత్కవులలోఁ బ్రసిద్ధుఁడు. కంకంటి - పాపరాజు మిత్రుఁడు. ఈతఁడు సమీరకుమారవిజయ మను ఏడాశ్వాసముల ప్రబంధ

మును, భాగవతసారమను వచనకావ్యమును రచించెను. సంస్కృతమున భర్తృహరి రచించిన 'సుభాషితత్రిశతి'లోని నీతిశతకము నాంధ్రీకరించెను.

తిమ్మనకవి హనుమద్భక్తుఁడు. అందువలననే సమీర కుమార విజయమును రచించి యుండవచ్చును. అప్పనార్యుని పుత్రుఁడు; ఇతని తల్లి ఔబళాంబ.

ఈతఁడు ధరణి దేవుల రామమంత్రి పేరఁ గల దశావతారచరిత్రమును వ్రాసి యాతని పేర పెట్టెనని కొంద అందురఁట ! కంకంటి - పాపరాజ కృతిగా ప్రసిద్ధిఁ జెందిన ఉత్తరరామాయణము నీతఁడే రచించి, యాతని పేర పెట్టెనని యొక ప్రతీతి కలదు. పెక్కురు కవులగుట కీతని తోడ్పాటు ఉండినదని యభిజ్ఞుల యభిప్రాయము.

భర్తృహరిశతకత్రయము నీతఁడు తెలిఁగించెనని శ్రీ వంగూరి-సుబ్బారావుగారు 'శతకకవుల చరిత్ర'లోఁ దెల్పియున్నారు. కాని యీతని నీతిశతక మొక్కటే కానవచ్చుచున్నది.

ఈతని 'భాగవతసారము'ను చిన్నయ్యన్ అనునతఁడు తమిళ భాష లోనికి మార్చెనఁట !

## తిమ్మన-ముక్కు (నంది)

ఇతఁ డార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. కౌశికగోత్రుఁడు. సింగన్న కును, తిమ్మాంబకును పుత్రుఁడు. మలయమారుతకవి యని పేరుగాంచిన ఘంట - సింగయ్యకు మేనల్లుఁడు. శివభక్తుఁడు. అఘోరకవి శిష్యుఁడు. ఇతనికి 'ముక్కు తిమ్మన' అను పేరు ప్రసిద్ధము. ఇతని ముక్కు కొంత పెద్దదిగా నుండుటవలన, నీ వాడుకపేరు వచ్చెనని కొంద అందురు. రామరాజభూషణకవి రచించిన వసుచరిత్రములోని 'నానాసూనవితాన వాసనల -' అను పద్యమును రచించిన దీతఁడే యనియు, అద్భుతమగు నాసికావర్ణనమువలన నీతని కీ పేరు కలిగి యుండవచ్చుననియుఁ గొందఱి తలంపు.

శ్రీకృష్ణదేవరాయల యాస్థానమునందలి 'అష్టదిగ్గజము'లలో తిమ్మన యొకఁడు ఇతఁడు తన గ్రంథమగు పారిజాతాపహరణమును రాయలకే కృతి యిచ్చెను. కావున నీతఁడు 16-వ శతాబ్ది ప్రారంభమున నుండవలెను. ఈతఁడు పారిజాతాపహరణమును క్రీ. శ. 1520 నాటికే రచించెననియు, 1526 ప్రాంతమున మరణించెననియు శ్రీ వీరేశలింగము పంతులుగారు వ్రాసిరి. అట్లయినచో, ఈతఁడు 15-వ శతాబ్ది చివరిపాదమున జన్మించి యుండవలెను.

ఈతని కృతి పారిజాతాపహరణ మొక్కటే కానవచ్చుచున్నది. అది యైదాశ్వాసముల రసవత్ప్రబంధము. రచన శ్రుతికటువు కాక యర్థగాంభీర్యము కల్గి సలక్షణమై యింపుగా నుండును. ముద్దుముద్దుగా రచన సాగించుటలో నీతఁడు పేరొందినవాఁడు. హరివంశకథ నాధారముగాఁ దీసికొని, శ్రీకృష్ణుఁడు సత్యభామకోరికపై పారిజాతమును స్వర్గమునుండి భూమికిఁ దెచ్చిన వృత్తాంత మిందలి ప్రధానాంశము ఇయ్యది శ్రీకృష్ణదేవరాయల కంకిత మొనర్పఁబడినది.

ఈ గ్రంథరచన కొక కారణము లోకమున వాడుకలో నున్నది. తన దేవియగు తిరుమలదేవి యొకప్పుడు తన్నవమానించినట్లు రాయలు భ్రమించి, యామె యంతిపురికిఁ బోకుండుటచే, విషయమును గ్రహించిన తిమ్మకవి - (ఆమె కరణముగా వచ్చినవాఁడు), ఈ గ్రంథమును రచించి, ఆ సంఘటనను చమత్కారముగాఁ గూర్చి, రాయల మనస్సును మార్చెనని చెప్పుదురు. ఈ కవి తిరుమలదేవి కరణపుఁగవి కాఁడనియు, ఈ సంఘటన చిన్నాదేవికి సంబంధించినదనియుఁ గొంద అందురు. ఇవన్నియుఁ గల్పితములని కొంద అందురు.

## తిమ్మభూపాలుఁడు - బిజ్జుల

ఈతఁడు హైదరాబాదు రాష్ట్రములోని ప్రాగుటూరు సంస్థానాధిపతి. వనపర్తి సంస్థానాధిపతులును, అష్టభాషావిశారదులు నగు గోపాల

రావుగారి కీతఁడు మేనల్లుఁడు. ఈ కవి 220 ఏండ్ల క్రిందట నుండినట్లు గోలకొండ కవుల సంచికలోఁ గలదు.

ఈ కవి 'అనర్ఘ రాఘవము' అను రామాయణకథాప్రతిపాదకమగు ప్రబంధమును రచించెను.

## తిమ్మయ - ఆతుకూరి

ఈతఁడు 17-వ శతాబ్ది చివఱను, 18-వ శతాబ్ది ప్రారంభమునను ఉండినవాఁడు; నెల్లూరుమండల నివాసి. ఈతఁడు ద్విపద భారతములోని ఆదిపర్వమును, అరణ్యపర్వము మొదలు ద్రోణపర్వము చివఱివఱకును రచించెను. ఇతని రచన సరళము. గ్రంథము ముద్రితము.

## తిమ్మయమంత్రి - నైషధము

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. పాపయామాత్యుని పుత్రుఁడు. శివారాధన తత్పరుఁడు. ఈతఁ డుదయాద్రీశ్వరునిఁ బేర్కొనుటచే ఉదయగిరియందో, తత్ప్రాంతముననో నివసించి యుండవచ్చునఁట! ఉదయగిరి నెల్లూరు జిల్లాలోనిది.

ఈతఁడు 'లక్షణమంజరి'యను ఏకాశ్వాస లక్షణగ్రంథమును రచించి గరళపురీశ్వరున కంకిత మొనర్చెను. ఇందలి లక్ష్యములు కూడ కవి స్వయముగా రచించినవే! ఈతని కాలము తెలియదు. ఈ గ్రంథ మముద్రితము.

## తిమ్మయ్య - తామరపల్లి

ఈతఁ డార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. శరణయామాత్యుని పుత్రుఁడు. ఇతని కాలము సరిగాఁ దెలియదనియు, నూటయేఁబదియేండ్ల క్రిందట నుండి యుండవచ్చుననియు ఆంధ్రకవుల చరిత్రవలనఁ దెలియుచున్నది.

ఈ కవి శేషధర్మమను నైదాశ్వాసముల పద్యకావ్యమును రచించి శ్రీరాముని కంకిత మొనర్చెను. 'కొన్ని యపప్రయోగము లున్నను రచన చక్కనిది'దని శ్రీ వీరేశలింగము పంతులుగారి యాశయము.

## తిమ్మయ్యసెట్టి - ఇటుకల

ఈతఁడు కన్యకాపురాణమును రచించెను. అది యక్షగానము. ఈ యంశము శ్రీ కావలి - వేంకటరామస్వామిగారు రచించిన Biographical sketches of Deccan poets అను గ్రంథమునుబట్టి తెలియుచున్నది. ఆ గ్రంథము 1829 లో ప్రకటింపఁబడినందున తిమ్మయసెట్టి 1800 కంటెఁ బ్రాచీనుఁడయి యుండవలెను.

ఈ కవి గురవయ్యసెట్టి మనుమఁడు. తిమ్మనయ్యసెట్టి కుమారుఁడు.

## తిమ్మరాజు - సిద్ధరాజు

ఈతఁడు చంద్రవంశ క్షత్రియుఁడు. హరితసగోత్రుఁడు. ఔబళ రాజునకును, కోనమాంబకును కుమారుఁడు. ఇతనియన్న రంగరాజు. కృష్ణ దేవరాయల యల్లుఁడైన రామరాజున కీతఁడు మేనల్లుఁడు. కావున నీతఁడు 1500-1564 మధ్యభాగమున నుండెనని చెప్పవచ్చును.

ఈ కవి 'పరమయోగి విలాసము'అను నైదాశ్వాసముల పద్యకావ్యము రచించి మంగళగిరిలోని నృసింహస్వామి కంకిత మొనర్చెను. ఇందు పన్నిద్దరాళ్వార్ల యొక్కయు, శ్రీరామానుజాచార్యులవారియొక్కయు చరిత్రములు వర్ణింపఁబడినవి. ఈతని కవిత్వము మృదుమధురమై రసవంతముగ నుండును.

ఈతఁడు కొంతకాలము కొండవీటి సీమకుఁ బాలకుఁడుగా నుండెను. ఆ సమయముననే ఈ కావ్యము రచింపఁబడినట్లు కవియే చెప్పికొనెను.

## తిరుమలకవి

ఈతఁడు ద్విపద భారత సభాపర్వకర్త యగు బాలసరస్వతికి మనుమఁడు. వేంకటాధ్వరి పుత్రుఁడు. ఈతఁడు విజయరంగ చొక్కనాథుని కాలమున నుండినవాఁడు. కావున 18-వ శతాబ్ది ప్రారంభమున నుండెనని చెప్పవచ్చును.

ఈతఁడు చిత్రకూట మాహాత్మ్య మను యక్షగానమును రచించెను. ఇది ప్రశస్తమైన రచన; అముద్రితము.

## తిరుమలకొండయార్యుఁడు - రేవణూరి

ఈతఁడు నందవరీక బ్రాహ్మణుఁడు. శ్రీవత్సగోత్రుఁడు. సుప్రసిద్ధ సంకీర్తనాచార్యుఁడగు తాళ్లపాక - అన్నమాచార్యుల యల్లుఁడు. శకుంతలాపరిణయకర్తయగు రేవణూరి - వెంకటాచార్యులతండ్రి. ఈతని కుమారుని గ్రంథమందలి గద్యమునుబట్టి యీతఁడు 'రామచంద్రోపాఖ్యాన' మను గ్రంథమును రచించినట్లు తెలియుచున్నది. కాని యా గ్రంథము లభింపలేదు.

అన్నమాచార్యుఁడు క్రీ. శ. 1408 నుండి 1503 వఱకును ఉండెను. కావున అతని యల్లుఁడగు నీ కవి 15-వ శతాబ్దిలోని ఉత్తరార్ధమునసుండి యుండవలెను.

## తిరుమలనాథకవి (తిమ్మయ్య) - కుంటముక్కుల

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. పరాశరగోత్రుఁడు. కుంట ముక్కులనివాసి. అహోబలామాత్యుని కుమారుఁడు. శ్రీ దుర్గాదేవి భక్తుఁడు.

ఈ కవి శైవాచారసంగ్రహ మను మూఁడాశ్వాసముల పద్య కావ్యమును రచించి, పిల్లలమఱ్ఱి- గన్నయామాత్యున కంకితము చేసెను. ఈ కృతికర్తయు, కృతిపతియు 16-వ శతాబ్ది పూర్వార్ధమున నున్నటు తెలియుచున్నది.

ఈతని కవిత్వము సలక్షణమై సరళమై యుండును.

## తిరుమలనాథకవి - శృంగారకవి

ఈతఁడు తిమ్మనకుమారుఁడు. ఈతఁడు అనంతశెట్టి-తిమ్మాశెట్టి యను మల్లుని ప్రేరణమున నాసికేతపురాణమును ద్విపదకావ్యముగా రచించి

పెద్ద గరడియందలి శ్రీకృష్ణదేవున కంకిత మొనర్చెను. 18-వ శతాబ్ది మధ్య కాలమున నీతఁ డుండినట్లు తెలియుచున్నది.

ఈతఁడు 'పరమభాగవతచరిత్ర, పరమార్థదీపిక, పద్మినీపరిణయము' అను కావ్యములను; రచించినట్లు చెప్పియున్నాఁడు. కాని, నాసికేత పురాణము తప్ప ఇతర గ్రంథములు లభింపలేదు.

నాసికేతపురాణము మూఁడాశ్వాసములు కలది. రచన సరళము. గ్రంథ మముద్రితము.

## తిరుమలభట్టారకుఁడు

హైదరాబాదురాష్ట్రమునందలి లేమావిళ్లనివాసియఁట! ఈతఁడప్పకవి వంశీయుఁడఁట! క్రీ. శ. 1450-1500 నడుమ నుండినట్లు గోలకొండకవుల సంచికలోఁ గలదు.

ఈతఁడు కాలామృతమను జ్యోతిషగ్రంథము నాంధ్రీరించెనఁట!

## తిరుమలరాయకవి - బైరంపల్లి

ఈతఁడు గద్వాల సంస్థానమున నుండినవాఁడు. 60 ఏండ్ల క్రిందట నుండెనఁట! సంస్కృతాంధ్రములలో ఆశువుగ అనేక చాటువులను చెప్పిన సమర్థుఁడఁట!

## తిరువెంగళకవి - పచ్చకప్పురపు

ఈతఁడు బట్టుకులమునఁ బుట్టినవాఁడు. ఇతని తాత తిమ్మరాజు; తండ్రి తిప్పరాజు. ఈ కవి 'చొక్కనాథచరిత్ర'మను ద్విపదకావ్యమును రచించెను. ఇతని తాతయు, పినతాత యగు అయ్యలరాజును ప్రౌఢదేవ రాయలను మెప్పించి యాతనివలన 'పచ్చకర్పూరమురా'జను బిరుదమును పొందినట్లు కవి చెప్పికొనెను.

చొక్కనాథచరిత్రము తొమ్మిదాశ్వాసముల గ్రంథము. ఇందు దక్షిణదేశమందలి మధురలో వెలసియున్న చొక్కనాథస్వామియొక్క అఱువదినాలుగు లీలలును వర్ణింపఁబడినవి. ఇయ్యది గోళ్ల - పెదరామ భూపాలున కంకితమొనర్పఁబడినది. ఈ ప్రభువు అచ్యుతరాయలయొద్ద దండనాయకుఁడుగా నుండెను. ప్రౌఢరాయలు క్రీ. శ. 1445 వఱకును రాజ్యము చేసినందున తిమ్మరాజు 1440 ప్రాంతమున బిరుద మందెననియు, అప్పటి కాతని వయస్సు 20 ఏండ్లుండుననియుఁ దలఁచినచో-తిరువెంగళ కవి - అచ్యుతరాయల రాజ్యకాలమున క్రీ. శ. 1535 ప్రాంతమున నీ ద్విపదకావ్యమును రచించి, యాతని దండనాథునకుఁ గృతిగా నిచ్చుటలో నాక్షేపణ యుండదు.

ఈతని కవిత్వము సరళమై హృదయంగమమై యుండును.

## తిరువెంగళనాథుఁడు - తాళ్లపాక

ఇతఁడు నందవరీక నియోగి బ్రాహ్మణుఁడై, వైష్ణవము పుచ్చుకొన్న తాళ్లపాక-అన్నమాచార్యుల మనుమఁడు. పెద తిరుమలాచార్యుల పుత్రుఁడు. చిన్నన్నయని యితనికి వాడుక పేరు కలదు. భారద్వాజ గోత్రుఁడు తిరుపతినివాసి. గొప్ప విష్ణుభక్తుఁడు.

ఈతఁడు పరమయోగివిలాస మను 8 ఆశ్వాసముల ద్విపద కావ్యమును, అష్టమహిషీకల్యాణమును, ఉషాభ్యుదయమును, అన్నమాచార్య చరిత్రను ద్విపదకావ్యములుగా రచించెను. ద్విపదరచనకు 'చిన్నన్న' పేరు పొందినవాఁడు. ఈతఁడు క్రీ. శ. 1530-1550 నడుమ కావ్యరచన చేసి యుండునని 'ఆంధ్రకవితరంగిణి'లోఁ జెప్పఁబడినది.

అష్టమహిషీకల్యాణ మైదాశ్వాసముల గ్రంథము. ఇది యలమేలు మంగాదేవి కంకితముచేయఁబడినది. ఇందు శ్రీకృష్ణునిబాల్యక్రీడలు, అతఁడెనమండ్రు దేవేరులను వివాహమాడిన విషయమును కలవు.

పరమయోగి విలాసమున పండ్రెండుగు రాళ్వార్ల యొక్కయు, వైష్ణవ మత ప్రవక్తలయొక్కయు చరిత్రము వర్ణితము. ఇది శ్రీ వేంకటేశ్వరునకును, అలమేలుమంగమ్మకును కృతి యీయఁబడినది.

ఉషాపరిణయము రమారమి రెండువేల ద్విపదల కావ్యము. హరి వంశము ననుసరించి తా నీ కావ్యమును రచించినట్లు కవి చెప్పియున్నాఁడు.

ఈతని కవిత్వము నిర్దుష్టమై, మధురములగు పదములతోఁ గూడి శ్లాఘాపాత్రమై మనోహరముగ నుండును.

## తిరువేంగళప్ప - తాళ్లపాక

ఈతఁడు తాళ్లపాక - అన్నమాచార్యుల మనుమఁడగు చిన తిరుమలాచార్యుల పుత్రుఁడు. 16-వ శతాబ్ది ప్రారంభమున జన్మించి యుండును. ఈతఁడు కావ్యప్రకాశమునకును, నామలింగానుశాసనమునకును వ్యాఖ్యలను రచించెను. అమరుకము నీతఁ డాంధ్రీకరించెనని చెప్పుదురు. 'శృంగారామరుక కావ్య'మని అది యీ నడుమనే ముద్రితమైనది. ఆంధ్రీకృతామరుకములలో నిదియే మొదటిదఁట!

## తిరువేంగళము - పరాంకుశము

ఇతని నివాసము హైదరాబాదు రాష్ట్రములోని డబీరుపురము. ఈతఁడు 70 ఏండ్ల క్రిందట నుండెనని గోలకొండ కవుల సంచికలోఁ గలదు. ఈతఁడు రాశిగణిత చూడామణి యను జ్యోతిషగ్రంథమును పద్యకావ్యముగా రచించెను.

## తులజాజీ (తుక్కోజీ) మహారాజు

శరభోజీకిఁ దర్వాత 1728 నుండి 1736 వఱకును తంజావూరిని పాలించిన యీ మహారాష్ట్రరాజు విద్వత్కవి; విద్వత్కవి పోషకుఁడు. ఈతఁడు తెలుఁగున 'శివకామసుందరీపరిణయ'మను నాటకమును రచించెను. ఈతని రచన సరసమై, హృదయంగమముగా నుండును.

ఈతని యాస్థానమున గొప్ప సంస్కృత విద్వత్కవు లుండిరి.

## తెలగనార్యుఁడు - పొన్నికంటి

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. భావనామాత్యుని కుమారుఁడు. మదనగోపాలమూర్తి పదభక్తుఁడు. గోలకొండ నివాసి. ఈతఁడు తన కావ్యమును మల్కిభరామ్ కుతుబ్‌షాహివద్ద రాజకీయోద్యోగిగా నుండిన అమీనుఖానునకుఁ గృతియొసంగెను. ఒక శాసనపద్యమునుబట్టి అమీను ఖాను క్రీ. శ. 1592 వఱకును జీవించి యున్నట్లు తెలియుచున్నది. తెలగన్న గ్రంథములో క్రీ. శ. 1574 మొదలు 1586 వఱకును కర్ణాట రాజ్యము నేలిన శ్రీరంగరాయల దాయబారవృత్తాంతము వర్ణింపఁబడినది. కావున నీకవి క్రీ. శ. 16-వ శతాబ్ది ద్వితీయభాగమున నుండి యుండ వచ్చును.

తెలగన్న యయాతి చరిత్రమను అయిదాశ్వాసముల యచ్చతెనుఁగు కావ్యమును రచించెను. ఇందు భారతములోని యయాతివృత్తాంతము వర్ణింపఁబడినది. ఇయ్యది తెలుఁగులో వెలువడిన అచ్చతెనుఁగు ప్రబంధములలో మొదటిది. ఇదియే అమీనుఖానున కంకిత మీయఁబడిన గ్రంథము. ఇందలి కవిత ధారాశుద్ధి కలిగి హృదయంగమమై యుండును.

## తేరపకవి

ఈతఁడు కర్ణాట దేశీయుఁడఁట! 'ఊళక్కి' సోదరుఁడు. కామాక్షి తాయి పెంపుడుకొడుకు. ఈతఁడు 'తేరపావననరేంద్ర - రమ్యగుణ సాంద్ర! దశరథరామచంద్ర!' అను మకుటముతో నొక శతకమును రచించెను. దీనికి 'తేరపావన శతక'మని పేరు. రచన సరసము. కవి క్రీ. శ. 1750 ప్రాంతీయుఁడని 'శతకవాఙ్మయ సర్వస్వ' కారులు వ్రాయుచున్నారు.

## త్యాగరాజ మొదలి

ఇతఁడు ద్రవిడదేశీయుఁడు. ఈతఁడు క్రీ. శ. 1830 ప్రాంతమునఁ బుట్టి 1880 ప్రాంతమున మరణించెనని శ్రీ వీరేశలింగము పంతులుగారు వ్రాసియున్నారు.

ఈతఁడు సుబ్రహ్మణ్య విజయమనెడి అయిదాశ్వాసముల ప్రబంధమును రచించెను. దానికి విద్వత్కర్ణామృతమను నామాంతరము కలదు. ఈతని కవిత్వము సలక్షణమయి, హృద్యముగా నుండునఁట! ఈతఁడు 'ఛందోరత్నాకర' మను చిన్న ఛందస్సును కూడ రచించెనఁట!

## త్యాగరాజు

సుప్రసిద్ధ వాగ్గేయకారుఁడును, నాదబ్రహ్మయు, గానవిద్యా చక్రవర్తియు నగు త్యాగరాజు తంజావూరి ప్రభువగు రెండవ శరభోజీకాలమున (క్రీ. శ. 1798-1833) నుండెను. ఈతఁడు గొప్ప రామభక్తుఁడు. రామబ్రహ్మము కుమారుఁడు. తంజావూరు జిల్లాలోని తిరువారూరిలో జన్మించెను. ఎన్నియో కీర్తనలను రచించెను. ఇప్పు డాఱువందలు మాత్రము లభించెను. దక్షిణదేశమందంతటను ఇవి ప్రచారమున నున్నవి.

త్యాగరాజు పయికృతులనే గాక నౌకాచరిత్రము, ప్రహ్లాదచరిత్రము నను యక్షగానములను కూడ రచించెను. అవి ముద్రితములు.

## త్రిపురాంతకుఁడు - రావిపాటి

ఈతనికి 'తిప్పన్న'యను వాడుకపేరు ప్రసిద్ధము. ఈతఁ డోరుగలు నివాసి. ఈతని ప్రేమాభిరామ మను నాటకము ననుసరించియే క్రీడాభిరామము రచింపఁబడినట్లు ఆ గ్రంథములోఁ గలదు. క్రీడాభిరామ కర్తృత్వముతో శ్రీనాథునకు సంబంధమున్నందున నీ కవి యాతనికంటెఁ బ్రాచీనుఁడగుట స్పష్టము. ఈతఁడు క్రీ. శ. 1295 నుండి 1326 వఱకును రాజ్యమేలిన ద్వితీయప్రతాపరుద్రుని కాలమున నుండెనని విమర్శకులు నిశ్చయించుచున్నారు.

త్రిపురాంతకుఁడు మదనవిజయమను రతిశాస్త్రమును, అంబికా శతకమును, త్రిపురాంతకోదాహరణమును, చంద్రతారావళిని, ప్రేమాభిరామ మను సంస్కృతభాణమును రచించెను. వీనిలో త్రిపురాంతకోదాహరణము మాత్రము ముద్రితమైనది.

అంబికాశతకములోని పద్యములు కొన్నిమాత్రము లభించినవి. చంద్రతారావళిలోని పద్యములు నాలుగు మాత్రమే లభించినవి. మదన విజయ మెనిమిదాశ్వాసముల గ్రంథమఁట! అందు కామశాస్త్రవిషయము వివరింపబడినదఁట! అందలి పద్యములు రెండుమాత్రము లభించినవి. వానిని శ్రీ మానవల్లి - రామకృష్ణకవిగారు ప్రకటించినారు. ప్రేమాభి రామములోని రెండు శ్లోకములు సాహిత్యచింతామణిలోను, వృత్త రత్నాకరవ్యాఖ్యలోను ఉదాహరింపఁబడి యున్నవి.

## దత్తప్పకవి - బద్దెపీటి

ఈతఁడు సుగుటూరి-చిక్కరాయేంద్రుని యానతిని 'గణితదీపిక' యను గణితశాస్త్రమును పద్యకావ్యముగా రచించెను. చిక్కరాయలు క్రీ. శ. 1550-75 నడుమ నుండినందున నీ కవియు నప్పటివాఁడే యగును. ఈ గ్రంథ మముద్రితము. మదరాసులోని అడయారు గ్రంథాలయమునఁ గలదు.

## దత్తాత్రేయయోగి

ఈతఁడు రచించిన 'వేదాంతవ్యవహార సారసంగ్రహము' వ్యావహారికభాషలో నున్నది. ఈతఁడు మాహురీక్షేత్రనివాసి. మహారాష్ట్రుఁడు; కాని యీతనికి ఆంధ్రులగు శిష్యులు - పరమానందయోగి, మల్లన మున్నగువా రుండిరి. వారి సాయమున నీతఁ డీ గ్రంథమును రచించి యుండునేమో! లేదా - అతని యభిప్రాయములను గ్రహించి, అతని శిష్యులు దీనిని రచించి, యాతని పేరుపెట్టి యుందురేమో! ఈతఁడు 1550 ప్రాంతీయుఁడు.

## దత్తాత్రేయులు, వేంకటసుబ్బయ్య - సింగరాజు

వీ రిర్వురును 1840 ప్రాంతమున నుండినవారు. వీరిర్వురును కలిసి రామాయణమును వచనకావ్యముగా రచించిరి. ఇప్పు డీ గ్రంథములోని

మూఁడుకాండలు మాత్రము లభించుచున్నవి. అవి - దత్తాత్రేయులు రచించిన అరణ్య, కిష్కింధాకాండలును, వేంకటసుబ్బయ్య రచించిన యుద్ధకాండమును.

## దత్తోజీపండితుఁడు - వేముగంటి

ఈతఁడు హారితసగోత్రుఁడు. నాగమాంబకును, నాగోజీపండితునకును పుత్రుఁడు. ఈతఁడు మాధ్వమతమునకుఁ జెంది యుండును. ఈతఁడు 150 సంవత్సరముల క్రిందట నుండి యుండవచ్చునని శ్రీ వీరేశలింగము పంతులుగారి యభిప్రాయము.

ఈతఁడు కృష్ణార్జున సంవాదమను నామాంతరము గల భగవద్గీతా యోగశాస్త్ర మను పద్యకావ్యమును రచించెను. ఇది భగవద్గీత కనువాద రూపము. రచన హృద్యమై, సరళమై యుండును.

## దాస గోస్వామి

ఈతఁడు మాహురీక్షేత్రమందలి దత్తాత్రేయముని శిష్యుఁడు. దాస గోసాయి యనునది యితని వాడుక పేరు. పింగళి- సూరనార్యుఁడు, తరిగొప్పుల మల్లన, మల్లారెడ్డి మున్నగువారీతనిని ప్రశంసించి యున్నారు. ఈతఁడు 'పరమానంద బోధప్రకరణము' అను గ్రంథమును వచనముగా రచించెను. ఈతఁడు తొలుత దీనిని మహారాష్ట్రభాషలో రచించి, పిదప తెలిఁగించి, 'గోపాలభ'ట్టను శిష్యున కుపదేశించెనఁట ! ఈతఁడు క్రీ. శ. 1560 ప్రాంతమున నుండెను.

## దుగ్గన - దగ్గుబల్లి

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. శాండిల్యగోత్రుఁడు. తిప్పన, యెల్లమల కుమారుఁడు. కవి సార్వభౌముఁడగు శ్రీనాథున కీతఁడు మఱఁది. వయస్సున శ్రీనాథునికంటెఁ జాల చిన్నవాఁడు. 15-వ శతాబ్దిలోని యుత్తరార్ధ మీతని కాలము.

ఈతఁడు కాంచీపురమాహాత్మ్యము, నాసికేతోపాఖ్యానము - అను రెండు పద్యకావ్యములను రచించెను. కాంచీపురమాహాత్మ్యమును చెందులూరి-గంగయమంత్రి పుత్రుఁడగు దేవయామాత్యునకును. నాసికేతోపాఖ్యానమును చెందులూరి-అనంతామాత్యుని తనయుఁడగు గంగయామాత్యునకును అంకితమొనర్చెను. కృతిపతు లిద్దఱును అన్నదమ్ముల కుమారులు. ఇతని కాంచీపురమాహాత్మ్యము లభింపలేదు.

నాసికేతోపాఖ్యానమును కృతి నొందిన గంగయామాత్యుఁడు మాధవవర్మ సంతతిలోనివాఁడగు తమ్మభూపాలుని కుమారుఁడగు బసవ నృపాలునికి మంత్రి. కవి శ్రీనాథునికి బావమఱఁదియే కాక శిష్యుఁడునై యుండెను. శ్రీనాథుని మరణానంతరము క్రీ. శ. 1460 ప్రాంతమున నియ్యది రచింపఁబడినదని 'ఆంధ్రకవి తరంగిణి' కారులు తెల్పుచున్నారు.

నాసికేతోపాఖ్యానమున మూఁడవ యాశ్వాసములోఁ గొంత వఱకు మాత్రము ముద్రితమైనది. ఇం దుద్దాలకునియొక్కయు, చంద్రమతి యొక్కయు వృత్తాంతములు చక్కఁగా వర్ణితములు. ఇందు వేదాంతము, పరలోకవిషయములు కలవు. రచన మనోహరముగా నుండును.

## దేచిరాజు - రాపరది

ప్రబంధరత్నావళిలో నితని పద్యమొకటి ఉదాహరింపఁబడినది. అది యే గ్రంథములోనిదో తెలియరాలేదు. ఈ కవి క్రీ. శ. 1560 కంటెఁ బూర్వుఁడు.

## దేవరాజభట్టు

శ్రీ ప్రభాకర శాస్త్రిలుగారు కూర్చిన 'ప్రబంధరత్నావళి' లో' దేవరాజభట్టు రచించిన హరిశ్చంద్రచరిత్రలోని రెండు పద్యము లుదాహరింపఁబడినవి. ఆ గ్రంథము మాత్రము లభింపలేదు. ఈ కావ్యము దేని ననుసరించి వ్రాయఁబడినదో తెలియదు. ఈ కవి క్రీ. శ. 1560 సం. నకు ముం దుండెనని మాత్రము చెప్పవచ్చును.

## దోనయామాత్యుఁడు

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. శ్రీవత్సగోత్రుఁడు. మాచిరాజు, రుద్రాంబలకుఁ బుత్రుఁడు. ఈతని పేరు 'గోనయ' యని కొందఱు భ్రాంతి పడిరి. కాని 'దోనయనామధేయుఁడ విధూత కళంక పవిత్రచిత్తుఁడన్' అనుదానింబట్టి యీతని పేరు దోనయ అనియే నిశ్చయింపఁబడినది.

ఈతఁడు 'సస్యానందము, సర్వలోకాశ్రయము' అను రెండు గ్రంథములను వ్రాసెను. సస్యానందము నాలుగాశ్వాసముల చిన్న కావ్యము. ఇది శ్రీశైల మల్లికార్జునస్వామి కంకితము చేయఁబడినది. ఇందు పంటలంగూర్చియు, అతివృష్టి, అనావృష్టి మున్నగువానింగూర్చియుఁ వివరింపఁబడినది.

ఇతని 'సర్వలోకాశ్రయము' లభింపలేదు. అందలి విషయమేమో తెలియదు. ఉపేంద్రుఁడు త న్నాదరింపఁగా 'సర్వలోకాశ్రయము'ను జెప్పినట్లు కవి వ్రాసియున్నాఁడు. సస్యానందరచనాకాలము విభిన్న ప్రతులలో విభిన్న రీతుల నున్నదఁట! అది క్రీ. శ. 1356 లో రచింపఁబడిన దన్నచో, ఉపేంద్రుఁడు కొప్పరాజు పుత్రుఁడగు మూఁడవ యుపేంద్రుఁడనియు, 1360 లోఁగాని, 1366 లోఁగాని రచింపఁబడిన దను కొన్నచో, నీ యుపేంద్రుఁడు మూఁడవ యుపేంద్రుని పుత్రుఁడగు మనుమోపేంద్రుఁడనియు నిర్ణయింపవచ్చును.

దోనయామాత్యుఁడు పేర్కొనిన యుపేంద్రుఁడు మూఁడవ యుపేంద్రుఁడనియే శ్రీ నిడుదవోలు - వేంకటరావుగారు మున్నగువారి యభిప్రాయము.

## ధర్మనకవి - చరిగొండ

ఈ కవి నియోగిబ్రాహ్మణుఁడు. కాండిన్యగోత్రుఁడు. తిమ్మనామాత్యునకును, మాదమకును పుత్రుఁడు. శతలేఖినీసురత్రాణబిరుదాంకితుఁడు. ఈతఁడు 'చిత్రభారత'మను ఎనిమిదాశ్వాసముల ప్రబంధమును

రచించి ఎనుములపల్లి - పెద్దయామాత్యున కంకితము చేసెను. పెద్దయామాత్యుఁడు చిత్తాపుఖాను ప్రభుని మంత్రి. చిత్తాపుఖాను తొలుత హిందువుఁడై సీతాపతి పేరం బరఁగెనని, మతము మార్చుకొన్న పిదప పేరిని మార్చుకొనెనని కొందఱి యాశయము. ఈతఁడు 15-వ శతాబ్ది చివఱి భాగమునను, 16 శ. ప్రారంభమునను ఉండెను. ధర్మనకవియు నప్పటివాఁడే.

చిత్రభారతము విచిత్రములగు కథల కాకరము. ఇందలి కవిత్వము ప్రౌఢమై రసవంతమై యుండును.

## ధర్మనామాత్యుఁడు - సిరిప్రెగడ

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. హారితసగోత్రుఁడు. తిప్పయామాత్యుని పుత్రుఁడు. ఈతని కాలము సరిగా తెలియదు. ఈతఁడు శ్రీనాథునిఁ గొనియాడి యుండుటవలన నవీనుఁడై యుండుననియు, 250 ఏండ్ల క్రిందట నుండి యుండుననియు శ్రీ వీరేశలింగము పంతులుగారి యభిప్రాయము.

ఈతఁడు నలచరిత్రమను ఆఱాశ్వాసముల పద్యకావ్యమును రచించెను. ఇతని కవిత్వము నిరుపమమయి యింపుగా నుండును.

ఈతఁడు తన తండ్రి యిందుర్తి సీమలోని వాఁడనియు, మేనమామ పేరూరి నివాసియనియు చెప్పుటవలన నీతని నివాసము గోదావరీ, కృష్ణా ప్రాంతమై యుండునని తలంపవచ్చునఁట !

## ధూర్జటికవి

ఈతఁడు పాకనాటి నియోగి బ్రాహ్మణుఁడు. భరద్వాజగోత్రుఁడు. శివభక్తుఁడు. కాళహస్తినివాసి. ఇతని తాత జక్కయ. తండ్రి నారాయణుఁడు. తల్లి సింగమ్మ. ఈ కవి శ్రీకృష్ణదేవరాయల యాస్థానమునఁగల యష్టదిగ్గజములలో నొకఁడయి యున్నందున, క్రీ. శ. 1520-30 ప్రాంతమున నుండె నన వచ్చునని శ్రీ వీరేశలింగముపంతులుగారి యభిప్రాయము. ఈతఁడు రాయలకుఁ దన గ్రంథములను కృతి యీయనందున

రాయల యాస్థానములో నున్నట్లు నిశ్చయింప వీలులేదనియు, ఇతనికాలము నిశ్చయింప వీలుకాదనియు 'ఆంధ్రకవితరంగిణి'లోఁ గలదు.

ఈతఁడు శ్రీకాళహస్తి మాహాత్మ్య మను నాలుగాశ్వాసముల ప్రబంధమును, శ్రీకాళహస్తీశ్వరశతకమును రచించి శ్రీకాళహస్తీశ్వరునకే అంకిత మొనర్చెను. శతకకర్త శ్రీకాళహస్తి మాహాత్మ్యకర్తకంటె భిన్నుఁడని కొందఱి యాశయము. ఇయ్యది ధూర్జటికృతమను వాడుక ప్రసిద్ధమై యున్నది.

ఈతని రచన ప్రౌఢమై రసవంతమై యుండును.

## నంజరాజు - కళవె

ఈతఁడు వచనభారతకర్తయు, మైసూరుదళవాయియు నగు వీరరాజు పుత్రుఁడు. దొడ్డరాజు పౌత్రుఁడు. ఈతఁడు 18-వ శతాబ్ది రెండవ పాదమునను ఉండి యుండును.

ఈతఁడు తండ్రివలెనే వచనకవి. హాలాస్యమాహాత్మ్యము, కాశీమహిమార్థదర్పణము నను రెండు వచనకావ్యముల నీతఁడు రచించెను. హాలాస్యమాహాత్మ్యము మధురలోని మీనాక్షీసుందరేశ్వరుల లీలలను దెల్పు గ్రంథము. 72 అధ్యాయములు కలది. కాశీమహామార్థదర్పణము స్కాంద పురాణములోని కాశీఖండమునకు వచనానువాదము. నంజరాజీ గ్రంథమును తొలుత కన్నడమున రచించి, పిదప దాని నాంధ్రీకరించెను.

ఈతఁడు విద్వత్కవిపోషకుఁడు. అలూరి - నరసింహకవి సంస్కృతమున రచియించిన నంజరాజ యశోభూషణ మను అలంకారశాస్త్ర గ్రంథమున కీతఁడే నాయకుఁడు.

## నన్నయ్యభట్టు

ఆంధ్రవాఙ్మయమున నన్నయభట్టు రచించిన భారతభాగమే తొలి గ్రంథముగాఁ గానవచ్చుచున్నది. నన్నయకుఁ బూర్వము వాఙ్మయ ముండి

నను, ఉపలబ్ధము కాలేదు. కొన్ని గద్యమయశాసనములును, పద్యమయ శాసనములును కానవచ్చుచున్నవి. కావున నన్నయయే యిప్పటివఱకును మొదటికవి యని నిశ్చయింపఁబడినది.

నన్నయ, రాజరాజ నరేంద్రుని కులగురువు; ఆస్థాన విద్వత్కవి. రాజరాజు రాజమహేంద్రవరము రాజధానిగా వేంగీరాజ్యమును పాలించిన చాళుక్యప్రభువు. ఈతఁడు క్రీ. శ. 1022-63 నడుమ నుండినందున నన్నయయు నప్పటివాఁడే యగును.

నన్నయకు 'నన్నియ' అను పేరుకూడ వాడుకలో నున్నట్లు నందంపూఁడి శాసనమునుబట్టి తెలియుచున్నది. ఈతఁడు తన ప్రభువైన రాజరాజ నరేంద్రుని కోరికపై వ్యాసరచితమగు భారతము నాంధ్రీకరించుటకుఁ బూనుకొని ఆది-సభాపర్వములను, అరణ్యపర్వములోని కొంత భాగమును రచించెను. మిగిలిన యరణ్యపర్వభాగమును ఎఱ్ఱాప్రెగ్గడకవి పూరించెను. నన్నయభట్టు మూఁడు పర్వములను పూర్తిగా రచించెననియు, అరణ్యపర్వములోని చివరిభాగము ఖిలమైపోఁగా ఎఱ్ఱాప్రెగ్గడ అక్కడక్కడ సరిచేసెననియుఁ గొందఱు తలంతురు. కాని యట్లు తలంచుట సరికాదు.

నన్నయభట్టు భీమనభట్టు కుమారుఁడు. వైదికబ్రాహ్మణుఁడు. ఈతఁడు నియోగి యని కొంద అనుకొనుట పొరపాటు. ఈతనికి 'వాగనుశాసనుఁడు' లేక 'శబ్దానుశాసనుఁడు' అను బిరుదున్నదని కొందఱి యాశయము. 'శబ్దశాసనుఁ'డని కొన్నియెడలఁ గానవచ్చుచున్నది. బిరుదము పదమొక్కవిధముగ నుండును; కాని యిన్ని మార్పులు పొందదు. పరిశీలించి చూచినచో ఇది బిరుదనామమైనట్లు తోఁచదు.

నన్నయభట్టు భారతమును యథామూలముగ తెలిఁగింపక సందర్భానుసారముగా కుదించియు, విపులీకరించియు, మూలాభిప్రాయములకు మెఱుఁగుపెట్టియు, రసము పోషించియు ననువదించెను.

ఈతఁడు చౌడేశ్వరీవిలాసమను నామాంతరము గల మూఁడాశ్వాసముల 'చాముండికావిలాస' ప్రబంధమును, 'ఆంధ్రశబ్దచింతామణి' యను వ్యాకరణమును, లక్షణసారమను ఛందస్సును, ఇంద్రవిజయమను నొక ప్రబంధమును, 'రాఘవాభ్యుదయ'మను కావ్యమును రచించినట్లు కొందఱు తలంచుచున్నారు. కాని యివి యేవియును ఆతని గ్రంథములు కావని విమర్శకులు చాలమంది నిశ్చయించిరి. ఆంధ్రశబ్దచింతామణి నన్నయకృతియే యని కొందఱు విద్వాంసుల యభిప్రాయము.

## నన్నయకవి - మోచర్ల

ఈతఁ డార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. భారద్వాజగోత్రుఁడు. అన్నపార్యుని పౌత్రుఁడు. మాధవామాత్యుని పుత్రుఁడు. ఈతని తల్లి సింగమ్మ.

ఈతఁడు 'సాంబోపాఖ్యాన' మను నైదాశ్వాసముల ప్రబంధమును రచించి మోచర్ల పురమునందలి బాలగోపాలస్వామి కంకితము చేసెను. 'కాశీఖండము'ను ద్విపదగా రచించి నరాంకిత మొనర్చెనఁట! ఆ గ్రంథ మిపుడు లభింపలేదు. ఎవ్వరి కంకితముగ నిచ్చినదియును తెలియదు. ఈతని పద్యముల నప్పకవి యుదాహరించుటచే నీతఁడు క్రీ. శ. 1650 కంటెఁ బ్రాచీనుఁడగుట నిశ్చయము.

సాంబోపాఖ్యానమున శ్రీకృష్ణుని కుమారుఁడగు సాంబునకును, దుర్యోధనుని పుత్రిక యగు లక్షణకును జరిగిన పరిణయవృత్తాంతము వర్ణితము. ఇది అముద్రితము.

## నన్నెచోడదేవుఁడు

ఆంధ్రమున గ్రంథరచన సాగించిన రాజకవులలో నీతఁడు ప్రథముఁడు. ఈతఁడు సూర్యవంశక్షత్రియుఁడు; చోడవంశీయుఁడు. తండ్రి చోడబల్లి; తల్లి శ్రీసతి. కలువపొన్న, కలుకోడి చిహ్నములు గల తొరమూరి కధిపతి. ఈతనికిఁ బ్రతాపమునుబట్టి టేంకణాదిత్యుఁడనియు,

కవితాశక్తినిబట్టి కవిరాజ శిఖామణి యనియు బిరుదములు కలవు. ఈతఁడు కాశ్యప గోత్రుఁడు.

ఈతని కాలమునుగూర్చి యభిప్రాయభేదములు కలవు. కొందఱీతండు నన్నయకుఁ బూర్వుఁడనియు, క్రీ. శ. 940 ప్రాంతమున నుండెననియుఁ దలంచుచున్నారు; నన్నయ్యకు సమకాలికుఁడని కొందఱి తలంపు. క్రీ. శ. 1130-50 నడుమ నుండెనని కొందఱి యూహ. తిక్కనకుఁ దర్వాతివాఁడనియు, అందువలన నితఁడు క్రీ. శ. 1275-1350 నడుమ నుండెననియు చాలమంది తలంచుచున్నారు.

ఈ కవి కుమారసంభవమను పండ్రెండాశ్వాసముల పద్యకావ్యమును రచించి, తన గురువగు జంగమ మల్లికార్జున శివయోగికిఁ గృతియిచ్చెను. ఈ యోగి గొప్ప విద్వాంసుఁడు. కవి తన గురువును శివున కభిన్నునిగా వర్ణించెను. కుమారసంభవమున సతీదేవి జన్మవృత్తాంతము మొదలు తారకాసురసంహారాంతకథ కలదు. ఇందు కొన్నియెడలఁ గాళిదాసుని కుమారసంభవము, కొన్నిచోట్ల ఉద్భటుని కుమారసంభవము ఆధారముగ గ్రహింపఁబడి, జానుతెనుఁగునకుఁ బ్రాధాన్య మీయఁబడినది. ఇది మిక్కిలి ప్రౌఢమగు గ్రంథము.

ఈతని గ్రంథాంతరము 'కళావిలాసము'. అందలి పద్యములు నాలుగు శ్రీ వేటూరి - ప్రభాకరశాస్త్రిలుగారు కూర్చిన 'ప్రబంధరత్నావళి'లో నుదాహరింపఁబడినవి.

## నరసకవి – చెళ్లపిళ్ల

ఈతఁ డారామద్రావిడ శాఖకుఁ జెందిన వైదిక బ్రాహ్మణుఁడు. భారద్వాజ గోత్రజుఁడు. కామకవి పుత్రుఁడు. ఈ కవి గోదావరి మండలములోని పిఠాపురమును పాలించిన రావు- నీలాద్రిరాయనింగారి కాలములో వారి యాస్థానమునకుఁ జేరిన కడియు మను గ్రామములో నుండినట్లు చెప్పియున్నాఁడు. ఈ నీలాద్రిరాయనింగారు నూటయేబదియేండ్ల క్రిందట

నుండినందున, కవియు నా కాలములోనే యుండవచ్చునని శ్రీ వీరేశ లింగముపంతులుగారి యభిప్రాయము.

ఈతఁడు యామినీపూర్ణతిలకావిలాస మను నాలాశ్వాసముల శృంగార ప్రబంధమును రచించెను. ఇందు బిల్హణుఁడను సంస్కృత కవికిని, రాజపుత్రిక యగు యామినీపూర్ణ తిలకకును గల ప్రణయసంబంధము, వారి వివాహము మున్నగు విషయములు హృద్యముగా వర్ణింపఁబడి యున్నవి.

## నరసకవి - డబ్బీరు

ఈతఁడు సృష్టికరణకులమునకుఁ జెందినవాఁడు. ఈతఁడు కలువాయి గ్రామమునందలి కృష్ణుని సంబోధించుచు 'చెలువ! నీవేఁగి కలువాయి చిన్నికృష్ణుఁ, దోడుకొని వేగ రాఁగదే తోయజాక్షి! అను మకుటముతో నొక సీసపద్యశతకమును జెప్పెను. దీనికి 'కలువాయిశతక' మని పేరు. కలువాయి నెల్లూరుజిల్లాలోనిది. కవి నెల్లూరుజిల్లావాఁడగునేమో! డబ్బీరువారు శ్రీకాకుళము, విశాఖజిల్లాలలో నున్నారు. కవి కాలము తెలియలేదు. శతకము శృంగారమయము.

## నరసకవి - బడగలపాటి

ఈతఁడు 'నింబజామాహాత్మ్య'మను నామాంతరము కల 'ఏకవీరా మాహాత్మ్యము'ను ద్విపదకావ్యముగా రచించి, తొక్కుడము - మన్నారు జెట్టి ప్రోత్సాహమున ధేనువాళముగరిడిలోని రఘురాముని కంకిత మొనరించెను. కృతికర్త దేవమల్లుకులమునకుఁ జెందినవాఁడు. కృతికర్తయు, కృతిపతియును తంజావూరు మహారాష్ట్రరాజుల కాలమున నుండినవారఁట! వీరికాలము క్రీ. శ. 1740 ప్రాంతము.

ఇందలి రచన సరళము. కాని దోషములు కానవచ్చుచున్నవి.

## నరసకవి - వంగూరి

ఈతఁ డార్వేల నియోగియై యుండవలెననియు, ఇతని కాలము సరిగాఁ దెలియదనియు, అచ్చనపుత్రుఁడనియును శ్రీ వంగూరి - సుబ్బా రావుగారు వ్రాసి యున్నారు. ఈతఁడు ప్రసన్నరాఘవా!' అను మకుట ముతో - ప్రసన్నరాఘవశతకమును - ఉత్పలమాలావృత్తములలో రచించెను; ఇందు రెండు వందల పద్యములతో రామాయణకథను చెప్పెను. ఈతని రచనలో భాషాదోషము లెక్కువయఁట !

## నరసింగకవి - వెల్లాల

భర్తృహారిమహాకవి సంస్కృతమున రచించిన 'సుభాషితత్రిశతి' నీతఁ డాంధ్రీకరించెను. ఏనుఁగు - లక్ష్మణకవి మున్నగువారివలెఁ గాక యీతఁడు మకుటనియమమును పాటించి, 'వెల్లూరి - వేంకటాచలరమణా!' అను మకుటముతోఁ గందపద్యములను చెప్పెను. ఆ చిన్న కందపద్యముల లోనే మూలభావము నిమిడ్చెను. ఈతఁడు క్రీ. శ. 1830 ప్రాంతము వాఁడై యుండునని 'శతకవాఙ్మయ సర్వస్వము'లోఁ గలదు.

## నరసింగరావు - పుల్లంరాజు

ఈతఁడు నిజామురాష్ట్రములోని మహబూబునగరుజిల్లా బూరుగుల నివాసి. శ్రీబూర్గుల - రామకృష్ణరావుగారి తాత (మాతామహుఁడు); 90 ఏండ్ల క్రిందట నుండెను.

ఈతఁడు నృకేసరిశతకము, రామానుజ ప్రభాతము - అను రెండు గ్రంథములను రచించెను. ఆ రెండును అముద్రితములఁట !

## నరసింహకవి - అక్కెనపల్లి

ఈ కవి 'ఆదిలక్ష్మీవిలాస'మను పేర కామేశ్వరికథను పద్య కావ్యముగా రచించి యున్నాఁడు.

## నరసింహకవి - కానాల

ఈతఁడు నందవరీక నియోగిశాఖకుఁ జెందిన బ్రాహ్మణుఁడు. వసిష్ఠగోత్రజుఁడు. వేంకటేశయామాత్యుని పుత్రుఁడు. ఈతని నివాసము తటిగొండ. ఈతని కాలము సరిగాఁ దెలియరాలేదు. ఇతఁడు రమారమి నూట యేఁబది, రెండువందల సంవత్సరముల క్రిందట నుండి యుండ వచ్చునని శ్రీ వీరేశలింగము పంతులుగారి యభిప్రాయము.

ఈ కవి హరివంశములోని శేషధర్మముల నెనిమిదాశ్వాసముల పద్యకావ్యముగా నాంధ్రీకరించెను. ఈ గ్రంథము తటిగొండలోని నృసింహస్వామి కంకిత మొనర్పఁబడెను.

ఈతని రచనలోఁ అచ్చటచ్చటఁ గొన్ని విలక్షణములగు ప్రయోగములు కానవచ్చుచున్నను కవిత్వ మనర్గళధార కలిగి మృదుమధురమై యుండునఁట!

## నరసింహకవి - చరిగొండ

ఈతఁడు మహబూబునగరుజిల్లాలోని చరిగొండ నివాసి. క్రీ. శ. 1600 ప్రాంతములం దీతఁడుండెనని గోలకొండకవుల సంచికలోఁ గలదు.

ఈ కవి 'శశిబిందుచరిత్ర'మను ప్రబంధమును రచించెను. అది ముద్రితము. ఈ గ్రంథ మప్పకవీయములో నుదాహృతమైనది. ఈ కవి చరిగొండ-ధర్మకవికి సోదరుఁడఁట !

## నరసింహకవి - వల్లూరి

ఈతఁ డార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. కౌండిన్యగోత్రుఁడు. హనుమత్కవి పుత్రుఁడు. ఈతఁడు 150 ఏండ్ల క్రిందటివాఁడై యుండునని

శ్రీ వీరేశలింగము పంతులుగారి యభిప్రాయము. ఇతఁడు నాగ్నజిత్తీ పరిణయ మనెడి మూఁడాశ్వాసముల ప్రబంధమును రచించెను. ఇతని కవిత్వము హృదయాహ్లాదకరమై యుండును.

## నరసింహభట్టు - ఆమదూరి

ఈతని 'షోడశరాజచరిత్రము'లోని పద్యము నొకదానిని జగ్గకవి తన 'ప్రబంధరత్నాకరము'లో నుదాహరించి యున్నాఁడు. ఆ గ్రంథ మలభ్యము. కవి 1560 సం. నకు ముందువాఁడు.

## నరసింహరాయకవి - వనము

ఈతని నివాసము హైదరాబాదురాజ్యములోని కంభముమెట్టు సమీపమునఁ గల గువ్వలగూడెము. ఈ కవి 70 ఏండ్ల క్రిందటివాఁడఁట ! ఈతఁడు 'ధర్మాంగదచరిత్ర'మను ప్రబంధమును, నీలకంఠదండకమును రచించెను. దండకము లభ్యము కాలేదు.

## నరసింహశాస్త్రి - పాటూరి

ఈతఁడు పాటూరి - రామస్వామిశాస్త్రి సోదరుఁడు. కాలము 1840 ప్రాంతము. ఈతఁడు హరిశ్చంద్రకథను, రంగనాథ రామాయణము నందలి ఉత్తరకాండమును వచనకావ్యములుగా రచించెను. ఈతఁడు మద్రాసులోని కళాశాలలో తెలుఁగు మున్షీగా నుండెను.

## నరసింహాచార్యులు - మాడభూషి

ఈతఁడు శ్రీవైష్ణవబ్రాహ్మణుఁడు. కౌశికగోత్రజుఁడు. నివాసము కృష్ణాజిల్లాయందలి నూజవీడు. ఈయన 'విద్వాన్, అభినవపండితరాయ'లను బిరుదములను గడించిన వేంకటాచార్యులకు జనకులు. ఈయన తండ్రి వేదాంతాచార్యులు.

ఈయన నూజవీటిప్రభువులు శ్రీ శోభనాద్రి - అప్పారావుగారి ప్రేరణమున వల్లీవల్లవోల్లాస మనెడి మూఁడాశ్వాసముల ప్రబంధమును

రచించెను. అంతేకాక రుక్మిణీకల్యాణము, నీలాపనిందా నివారణము నను గ్రంథములనుకూడ రచించెనఁట! ఈతఁడు 19-వ శతాబ్ది ప్రారంభము నుండి 1870 ప్రాంతమువఱకు నుండెను.

## నవనప్ప

ఈతఁడు నల్లపిచ్చయ్య కుమారుఁడు. ఈతఁడు పుదుక్కోటను క్రీ. శ. 1789-1807 నడుమ పాలించిన విజయరఘునాథరాయల యాజ్ఞ ననుసరించి 'ఖడ్గలక్షణ శిరోమణి' అను ఖడ్గలక్షణ గ్రంథమును పద్యకావ్యముగా రచించెను. ఈతఁడు తన గ్రంథమున ఖడ్గపరీక్షలో నాఱితేఱిన వారింగూర్చియే చెప్పుటవలన నీతఁడు విశ్వకర్మ శాఖకుఁ జెంది యుండునని శ్రీ నిడుదవోలు - వేంకటరావుగారు వ్రాయుచున్నారు.

ఈ గ్రంథము ముద్రితము.

## నాగదేవభట్టు

నాగదేవభట్టు రచించిన అమరనిఘంటుటీక యొకటి కలదు. అందుఁ బ్రాచీనమైన తెలుఁగునుడికారము కలదఁట! ఇతని ప్రశంస క్రీడాభిరామమునఁ గలదు. క్రీ. శ. 1434 ప్రాంతమున నుండిన మల్లినాథ సూరి తన 'వైశ్యవంశ సుధార్ణవము' నందు నాగదేవభట్టారకుని యమర టీకను పేర్కొనుటచే నీతఁ డాతనికిఁ బూర్వుఁడని యందురు.

క్రీ. శ. 1149 నాఁటి దాక్షారామ శాసనములోను, 1154 నాఁటి ప్రేంపల్లి భావనారాయణస్వామి యాలయములో నున్న శాసనమునందును ఈతని ప్రశంస కలదు. కావున నీతఁడు 12-వ శతాబ్దివాఁడని యూహింప వచ్చును.

## నాగనాథకవి - పశుపతి

ఈతఁడు పశుపతి పండితుని పుత్రుఁడు. కౌశికగోత్రజుఁడు. విశ్వేశ్వర పండితుని శిష్యుఁడు. ఓరుగల్లు ప్రాంతమువాఁడు. క్రీ. శ. 1369-లో

నీతఁడు రచించిన శాసనము - అనపోతనాయకుఁ డేర్పఱచినది వరంగల్లు నకు దక్షిణమున నున్న అయినవోలులో నున్నదఁట! అనపోతనాయకుఁడు రాచకొండ ప్రభువు. అతని యాస్థానమున గురువైన విశ్వేశ్వర పండితు నితో పాటు నీతఁడును ఆస్థానవిద్వాంసుఁడఁట!

ఈ కవి సంస్కృతమున మదనవిలాసమను భాణమును రచించి అనపోతనాయకునకుఁ గృతియిచ్చెను. తెలుఁగున విష్ణుపురాణము నాంధ్రీ కరించినట్లు ప్రబంధరత్నావళిలోని పద్యమునుబట్టి తెలియుచున్నది. ఈ గ్రంథము లభింపలేదు.

ఈ కవి శ్రీనాథునకుఁ బూర్వుఁడు. 14-వ శతాబ్దిలోని యుత్త రార్ధమున నీతఁ డుండెనని నిశ్చయింపవచ్చును.

## నాగభూషణకవి - మల్లంపల్లి

ఈతఁడు శైవబ్రాహ్మణుఁడు. హారితసగోత్రుఁడు త్రిపురాంత కారాధ్యుని పుత్రుఁడు. ఇతఁడు 200 ఏండ్ల క్రిందట నుండెనని శ్రీ వీరేశ లింగము పంతులుగారి యభిప్రాయము.

ఈ కవి బసవవిజయమను మూఁడాశ్వాసముల ప్రబంధమును రచిం చెను. అందు వీరశైవ మతస్థాపకుఁడగు బసవేశ్వరుని చరిత్రము ముఖ్య ముగా వర్ణితము. అంతేకాక పాలకురికి - సోమన మున్నగువారిని గూర్చియుఁ గలదు. ఇతని కవిత్వ మంత ప్రశస్తము కాదఁట.

## నాగయ - కోటమరాజు

ఈ కవి యార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. కాశ్యప గోత్రుఁడు. భాస్కరమంత్రికిని, చాయమ్మకును పుత్రుఁడు. ఈతఁడు రమారమి నూతేండ్లక్రిందట నుండినట్లు శ్రీ వీరేశలింగము పంతులుగారు తెల్పినారు.

ఈతఁడు కాండవిభాగ మొనరించి అధ్యాత్మరామాయణమును పద్యకావ్యముగా రచించెను. ఇది కాణాదము-పెద్దన సోమయాజి రచిం

-చిన యధ్యాత్మరామాయణ మంతటి ప్రశస్తమైనది కాకున్నను మొత్తముపై హృద్యముగను, నిర్దుష్టముగను ఉండును.

## నాగరాజు - చెన్నాప్రగడ

ఈతఁడార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. గోదావరీమండలములోని వాఁడు. ఈతఁడు క్రీ. శ. 1750 ప్రాంతమున నున్నట్లు శతకకవుల చరిత్రకారులు వ్రాసి యున్నారు. ఈ కవి 'గణసౌజన్యాఖ్యాన శతకము' అను శతకమును రచించెను. దీనికి మకుటనియమము లేదు. ఇందు ప్రాచీన శివభక్తుల ప్రశంస కలదు.

## నాగశాస్త్రి - బృహత్తటాకము

ఈతఁడు దక్షిణదేశీయుఁడు. క్రీ. శ. 1740 ప్రాంతమున నీతఁడుండెనని 'శతకవాఙ్మయ సర్వస్వ' కారుల యభిప్రాయము. దక్షిణదేశమందలి ప్రాంతముల ప్రస్తావన మీతని 'శ్రీబాల సుబ్బరాయ శతశము'నఁ గలదు. ఈ శతకమునకు 'శూరసంహార! కిరిగిరి సుఖవిహార! సుకవిజనగేయ! శ్రీ బాలసుబ్బరాయ!' అనునది మకుటము. రచన సరళమై హృదయంగమముగ నుండును

## నాగేంద్రకవి - బసవరాజు

ఈతఁడార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. పాపనామాత్యుని పుత్రుఁడు. ఈతఁడు 150 ఏండ్ల క్రిందట నుండి యుండుననని శ్రీ వీరేశలింగము పంతులుగారి యభిప్రాయము.

ఈతఁడానందసుందరీ చాతుర్యవిలాస మను మూఁడాశ్వాసముల ప్రబంధమును రచించెను. అది హృద్యమై యున్నది.

## నాగేంద్రకవి

ఈతఁడు హైదరాబాదు రాష్ట్రములోని భువనగిరిప్రాంతమువాఁడు. ఈతని కాలము క్రీ. శ. 1400 ప్రాంతమని గోలకొండకవుల సంచికలోఁ గలదు. ఈతఁడు 'రమాధీశ్వరశతకము' అను నొక శతకమును రచించినాఁడు. ఇయ్యది మిగుల ప్రౌఢమైనది. ఈ కవి వైష్ణవమతాభిమానియఁట!

## నామయోగి

ఈతఁడు తిరుపతి వేంకటేశ్వరునిపై 'వేంకటేశ్వరా !' అను మకుటముతో 40 పంచచామరములను రచించెను. ఈతని కాలము తెలియదు. ఇతఁడు 16-వ శతాబ్దివాఁడై యుండునని 'ఆంధ్రకవితరంగిణీ' కారు లూహించుచున్నారు.

## నాయనప్ప - కానుకొలను

వేంకటదా సనునది యీతని నామాంతరము. 1804 ప్రాంతమున జన్మించి, తన 12-వ యేట 'తింత్రిణీగర్తపుర పట్టాభిరామశతకము'ను కందపద్యములలో రచించెను. దాని మకుటము 'చింతగుంట పాలెపు రామా ! అనునది. ఇది యచ్చతెనుఁగు శతకమఁట !

## నారపామాత్యుఁడు - కంభంపాటి

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. ఈతని గోత్రాదికములు తెలియవు. ఈతఁడు భగవద్గీతల నైదాశ్వాసముల పద్యకావ్యముగా రచించి హరిహరనాథున కంకితమొనర్చెను. ఈతఁడు 16-వ శతాబ్దిలో ఉత్తరార్ధమున నుండినట్లు 'ఆంధ్రకవితరంగిణి'లోఁ గలదు.

ఈతని గురువు రామబ్రహ్మేంద్రుఁడు. ఈ కవిరచన సరళమై, సులభగ్రాహ్యముగా నుండును.

## నారయ - వెలిగందల

ఈతఁడు కరీంనగరు జిల్లా వెలిగందల నివాసి. ఈతఁడు భాగవతమును రచించిన బమ్మెర - పోతనామాత్యుని శిష్యుఁడు. భాగవతములోని ఏకాదశ, ద్వాదశ స్కంధములను రచించెను. ఈతఁడు క్రీ. శ. 1450 ప్రాంతమున నుండినవాఁడని తెలియుచున్నది.

ఈతఁడు భాగవతము తృతీయస్కంధమునందును, దశమస్కంధమునను కూడ కొంత భాగమును రచించెనని కొందఱి యభిప్రాయము. దశమస్కంధములోని ఉత్తరభాగములోని కొంత గ్రంథ మీతని రచన యని మఱికొందఱి యాశయము.

ఈతని గ్రంథాంతర మేదియును లేదు.

## నారాయణకవి - అయ్యలరాజు

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; కౌండిన్య గోత్రజుఁడు; ఇతని తండ్రి సూరనార్యుఁడు; తల్లి కొండమాంబ. ఈతఁడు 'హంసవింశతి'యను నైదాశ్వాసముల ప్రబంధమును రచించెను. ఈతఁడు తన వంశజులు గొప్ప కవులని చెప్పికొన్నాఁడు. అందు రెట్టమతము నాంధ్రీకరించిన అయ్యలు, భాస్కరకవులును గలరు. కావున నీతఁడు క్రీ. శ. 1600 తర్వాతివాఁడు కావలెను. ఇతని కాలము 1660 ప్రాంతమని శతకకవుల చరిత్రకారులు వ్రాసిరి. ఇతఁడు నూటయేఁబది యేండ్ల క్రిందటివాఁడని శ్రీ వీరేశలింగము పంతులుగారి యాశయము.

ఈతఁడు 'దశావతారకథాసంగ్రహ'మను మూఁడాశ్వాసముల ప్రబంధమును, కందపద్యములలో 'ఆంజనేయశతకము'ను కూడ రచించెను.

## నారాయణకవి - దిట్టకవి

ఇతఁ డార్వేల నియోగి బ్రాహ్మణుఁడు. కాశ్యపగోత్రుఁడు. పాపరాజు పుత్రుఁడు. ఇతఁడు రంగారాయచరిత్రమను పద్యకావ్యమును రచించి గుంటూరు జిల్లాలోని నరసరావుపేట జమీందారులగు మల్రాజు - రామారాయనింగారి కంకితము చేసెను. ఇందు క్రీ. శ. 1757 లో జరిగిన బొబ్బిలియుద్ధ వృత్తాంతము వర్ణింపఁబడినది. ఇది క్రీ. శ. 1790 ప్రాంతమున రచియింపఁబడి యుండవచ్చునని కవులచరిత్రమునఁ జెప్పఁబడి యున్నది.

ఈతఁడు నియోగి బ్రాహ్మణుఁడు. మైత్రావరుణ గోత్రుఁడు. బ్రహ్మనామాత్యునకును, నాగమాంబకును పుత్రుఁడు. నారయ యనునది యాతని నామాంతరము. దూబగుంటకుఁ గరణమగుటచే నీతని యింటి పేరు 'దూబగుంటవా'రైరనియు, 'ప్రబంధవాచకాభరణ' మనునదే యింటి పేరు కావచ్చుననియు, లేదా 'వాచకాభరణ'మైనను కావచ్చుననియు 'ఆంధ్రకవి తరంగిణీ'కారుల యభిప్రాయము.

## నారాయణకవి - దూబగుంట

ఈ కవియు, దగ్గుబల్లి దుగ్గన, నంది మల్లయ్య, ఘంట సింగయ్యలును సమకాలికులు. ఈతఁడు 15-వ శతాబ్దిలో ఉత్తరార్ధమున నుండెనని చెప్పవచ్చును.

సంస్కృతమున విష్ణుశర్మ రచించిన పంచతంత్రము నీతఁడు పద్య కావ్యముగా రచించి తమ్మభూపాలుని పుత్రుఁడగు బసవభూపాలున కంకితము చేసెను. ఈతఁడు పూసపాటి వంశీయుఁడని చెప్పుదురు. ఈ బసవ నృపాలుని మంత్రి యగు గంగనామాత్యునికే దుగ్గన నాసికేతూపాఖ్యానము, నంది మల్లయ ఘంట సింగయల ప్రబోధచంద్రోదయము అంకితము చేయఁబడినవి.

ఈతని కవిత్వము మృదుమధురమై ధారాశుద్ధి గలిగి, మనోహరము గా నుండును.

## నారాయణకవి - వెల్లుట్ల

ఈతఁడు బమ్మెర పోతనామాత్యుని వంశములోనివాఁడఁట ! నివాసము బమ్మెరగ్రామము. ఇతఁడు 1600 ప్రాంతమువాఁడని గోలకొండ కవుల సంచికలోఁ గలదు. ఈ కవి వజ్రాభ్యుదయ మను ప్రబంధమును రచించెను. అది సమగ్రముగ లభింపలేదు. మొదటి రెండాశ్వాసములు మాత్రము కాకినాడలోని ఆంధ్రసాహిత్యపరిషత్కార్యాలయములో నున్నవఁట !

## నారాయణభట్టు

ఈతఁడు భారతాంధ్రీకరణమును ప్రారంభించిన నన్నయభట్టారకుని మిత్రుఁడు. సంస్కృతాంధ్ర ప్రాకృత కర్ణాట భాషలలో గొప్పవిద్వాంసుఁడు. ఈతఁడు నన్నయభట్టుసమకాలీనుఁడనుటకు నందంపూడి శాసనమే ప్రమాణము.

నారాయణభట్టు నన్నయ భారతరచనలోఁ దోడ్పడెనను విషయము భారతములోని 'పాయక పాకశాసనికి—' అను పద్యమునుబట్టియే తెలియుచున్నది. కాని పయి పద్యము భారతప్రతులు పెక్కింటిలో లేనందున, ఇది యెంతవఱకును విశ్వాసార్హమో తెలియకున్నదని కొందఱు విమర్శకులు తలంచుచున్నారు. సాయపడుట విషయము నటుంచి చూచినను, నారాయణభట్టు నన్నయకాలమువాఁడనుట నిశ్చయము.

ఈతఁడు క్రీ. శ. 1053 నాఁటివాఁడఁట!

## నిమ్మనాథుఁడు – పిడుపర్తి

పాలకురికి సోమనాథుని శిష్యుఁడును, ఇందులూరి – అన్నామాత్యునిచే డోకిపఱ్ఱు నగ్రహారముగా గ్రహించినవాఁడు నగు పిడుపర్తి – శివరాత్రికొప్పయ్య కీతఁడు మనుమని మనుమఁడఁట! గురు దీక్షాబోధను ద్విపదకావ్యముగా రచించిన పిడుపర్తి – బసవన కీతఁడు పెదతండ్రి కుమారుఁడు. పిడుపర్తి సోమనాథుఁ డీతనిఁగూర్చి వ్రాయుచు – నితఁడు 'అష్టభాషావిదుఁ'డనియు, 'భవులకుఁ గవిత చెప్పని ఘనుఁ'డనియు చెప్పినందున నిమ్మనాథుఁడు కవియని తెలియుచున్నది. ఇతని రచనలేవియో తెలియలేదు. ఈతని కాలము క్రీ. శ. 1390–1440 ప్రాంతము.

'నిజలింగ చిక్కయ్యకథ' యను యక్షగాన మొకటి ప్రాచ్యలిఖిత గ్రంథాలయమునఁ గలదు. అది నిమ్మనాథకృతమని యున్నదఁట! కాని పయి యక్షగానమును రచించినవాఁడు రెగళిగ – నిమ్మనాథుఁడుగాని పిడుపర్తి నిమ్మనాథుఁడుకాఁడని 'ఆంధ్రకవితరంగిణీ'కారులు వ్రాయుచున్నారు.

## నింబగిరిశాస్త్రి – గోవిందల్ల

ఈతని నివాసము హైదరాబాదురాష్ట్రిమందలి కరీంనగరుజిల్లాలోని కోరుట్ల గ్రామము. ఈతఁడు క్రీ. శ. 1750 ప్రాంతమువాఁడనియు, ఒక ప్రహసనగ్రంథమును రచించెననియు శ్రీ శేషాద్రి రమణకవులు గోలకొండ కవుల సంచికలోఁ దెల్పియున్నారు.

## నీలాద్రికవి - అడిదము

సుప్రసిద్ధుఁడగు అడిదము - సూరకవి వంశమున కీతఁడు మూల పురుషుఁడు. ఇతఁడు పూసపాటి రాచిరాజుగారివద్దగాని, ఆయన కుమారు లగు తిమ్మరాజుగారి వద్దగాని ఆస్థానకవియయి యుండును. ఇతఁడు తన ప్రభువుల విజయములం గొనియాడుచు 'రణరంగవిజయము' అను ప్రబంధ మొకటి రచించినట్లు తెలియుచున్నది. కాని యా గ్రంథము లభింపలేదు.

శాసనాధారములంబట్టి యీతఁడు క్రీ. శ. 1458 ప్రాంతమున నుండవచ్చునని తోఁచుచున్నది.

## నృసింహకవి - అంగర

ఈ కవి రామకృష్ణభట్టారకుని కుమారుఁడు. కవి, తాను రచించిన రాజరాజాభిషేక మను గ్రంథమును కొట్టాపురప్రభువగు కొప్పుల వల్ల ప్రభువున కంకిత మొనర్చెను. ఈ కొట్టాపురము విశాఖపట్టణముజిల్లాలోని కొట్టాముగ్రామయయుయి యుండునేమో! కవి, శ్రీనాథునివఱకును గల కవులను స్తుతించి, పెద్దనాదులను స్మరింపలేదు. కావున నీతఁడు మధ్య కాలపువాఁడని సందేహముకలుగంగలదు. కాని యితని కవిత్వము మధ్య కాలపువారి కవిత్వమువలెఁగాక లక్షణవిరుద్ధములగు ప్రయోగములతోఁ గూడి యుండుటవలన నీతఁడు నవీనుఁడని తలంపవలెననియు, 1650 తర్వాత నుండినవాఁడని జెప్పవచ్చుననియుఁ శ్రీ వీరేశలింగము పంతులుగారి యభిప్రాయము.

ఇతని రాజరాజాభిషేకము భారతకథను ప్రతిపాదించు అయిదా శ్వాసముల ప్రబంధము. కొన్ని దోషము లున్నను రచన రసవంతముగనే కానవచ్చును.

## నృసింహకవి - అక్కెనపల్లి

ఈతఁ డార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. కౌండిన్యగోత్రుఁడు. జోగయామాత్యుని పుత్రుఁడు. ఈతని నివాసము కృష్ణాజిల్లాలోని యెల్ల

నుండెడువాఁట! అయినను కవియచట నే నిలువక యితర ప్రాంతములకుఁబోయి గ్రంథములను రచించి శ్రీమంతుల కంకితముచేసి ధనము సంపాదించుచుండెను. ఈతఁడు తన 'ఓఘవతీపరిణయము'న దాని రచనాకాలము శాలివాహనశకము 1739 (క్రీ. శ. 1817) అని చెప్పినందున నీతఁడు 18-వ శతాబ్ది చివఱిపాదమున జన్మించి యుండవలెను.

ఈ కవి 'అదిలక్ష్మీవిలాసము, వల్లభాంబాపరిణయము, ఓఘవతీ పరిణయము' అను మూఁడు ప్రబంధములను రచించెను. వీనిలో ఆదిలక్ష్మీ విలాసము గోదావరిజిల్లాలోని యంతర్వేది క్షేత్రమున వెలసియున్న నృసింహస్వామికి అంకితముచేయఁబడినది. అది నాలుగాశ్వాసముల ప్రౌఢకావ్యము. వల్లభాంబాపరిణయము విఘ్నేశ్వరుని పెండ్లికథను తెల్పు మూఁడాశ్వాసముల ప్రబంధము. ఇది పులిపాక రామమంత్రి కంకితమయినది. ఓఘవతీపరిణయము మూఁడాశ్వాసముల ప్రబంధము. ఇది విశాఖపట్టణమున నుండిన శ్రీమంతులు శ్రీగొడే జగ్గారాయనింగారి పుత్రులు శ్రీసూర్య ప్రకాశరాయనింగారికిఁ గృతి యీయఁబడినది. ఆయన సోదరపుత్రులు శ్రీనారాయణగజపతిరాయనింగారు దీనిని ముద్రింపించిరఁట !

## నృసింహకవి - ఎల్లకర

ఈతఁడు కృష్ణయార్యుని పుత్రుఁడు. తిరుమల లక్ష్మణమునికి శిష్యుఁడు. క్రీ. శ. 1511-1568 నడుమ నుండిన సుప్రసిద్ధ వైష్ణవాచార్యుఁడు.

ఈ కవి మార్కండేయపురాణమును ద్విపదకావ్యముగా రచించెను. కవి తాను 'భారతసావిత్రి'ని వచనకావ్యముగా రచించిన ట్లుండె చెప్పియున్నాఁడు. ఇయ్యది సుప్రసిద్ధమైన వచనరచన. శ్రీకృష్ణుఁడు విదురుని యింట విందారగించుట యిందు వర్ణితము.

## నృసింహకవి

ఈతఁడు భారద్వాజగోత్రుఁడు. తల్లి గంగమాంబ. 'తండ్రి గౌరనయై యుండునేమో ?' అని శతకవాఙ్మయసర్వస్వకారులు వ్రాయుచున్నారు.

ఈతఁడు 1775 ప్రాంతమువాఁడఁట! ఈతఁడు కందపద్యములతో 'కృష్ణ శతకము'ను రచించెను. ఇందలి కవిత్వము ప్రౌఢమును, నిర్దుష్టమును కాదఁట!

## నృసింహకవి - మతుకుమల్లి

ఈతఁ డార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. కాశ్యపగోత్రుఁడు. నివాసము తెనాలి. కనకాద్రి, జానకమ్మల పుత్రుఁడు. ఈతఁడు 1816 లో జన్మించెను. ఈ కవి ఆంధ్రమేఘసందేశము, వేంకటాచలయాత్రా చరిత్రము, అజచరిత్రము, చెన్నపురీవిలాసము. శ్రీకృష్ణజలక్రీడావిలాస నాటకము, నృసింహసహస్రనామావళి, పుండ్రకళాపథ. ఆంధ్రసిద్ధాంత కౌముది, భరతశాస్త్రసర్వస్వము, సంగీతసారసంగ్రహము - అను గ్రంథములను రచించెను.

అజచరిత్ర మాఱాశ్వాసముల ప్రౌఢప్రబంధము. చెన్నపురీ విలాసమున చెన్నపట్టణవర్ణనము కలదు. ఇవి ముద్రితములు.

## నృసింహకవి - సంకుసాల

ఈతని కులగోత్రములుగాని, తండ్రిపేరుగాని తెలియవు. ఇతఁడు కడపమండలమువాఁడై యుండుననియు, వైష్ణవుఁడో, తన్మతాభిమానియో యై యుండుననియు 'ఆంధ్రకవి తరంగిణి' చెప్పుచున్నది. ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడని శ్రీ వీరేశలింగముపంతులుగా రభిప్రాయపడి యున్నారు. ఈతఁడు భట్టపరాశరుల శిష్యుఁడఁట! ఈతని పద్యములు అప్పకవీయములో నుదాహరింపఁబడి యున్నందున నితఁ డప్పకవికంటెఁ బూర్వుఁడని చెప్పవలెను.

భట్టపరాశరుని శిష్యుఁడగు మట్ల రామయ్య శాసనమొకటి క్రీ. శ. 1536 నాఁటిది కలదు. దానింబట్టి పరాశరుఁడు, నాతని శిష్యుఁడగు

సీ నరసింహాకవియును రాయలకాలములో (క్రీ.శ. 1509-1530) నున్నట్లు నిశ్చయింపవచ్చును.

ఈతఁడు కవికర్ణరసాయనమను నాఱాశ్వాసముల ప్రబంధమును రచించెను. ఇయ్యది శ్రీరంగమునందలి రంగనాథస్వామికిఁ గృతి యీయఁబడినది. ఇందు మాంధాతృచక్రవర్తి చరిత్రమును, అతఁడు విములాంగి యను కన్యను వివాహమాడిన కథయు వర్ణింపఁబడినవి.

ఈతని కవిత్వము ప్రౌఢమై రసవంతమై యుండును. ఇందు శృంగార మెక్కువగా వర్ణితము.

ఈ నరసింహాకవి క్రీ. శ. 1400 ప్రాంతమువాఁడని శ్రీ రాళ్లపల్లి - అనంతకృష్ణశర్మగారి యభిప్రాయము. ఈతఁడు తాళ్లపాక అన్నమాచార్యుల పుత్రుఁడై యుండవచ్చుననియు. సుంకేసుల నివాసమునుబట్టి - ఆ పదము మాఱి సంకుసాల-నరసింహాకవి యను పేరు వచ్చియుండుననియు శ్రీ వేటూరి - ప్రభాకరశాస్త్రిగారి యభిప్రాయము. 'సుంకేసుల సంకుసాలగా మాఱవచ్చునుగాని యీతఁడు తాళ్లపాక - అన్నమాచార్యుల పుత్రుఁడు కాఁడని 'ఆంధ్రకవితరంగిణి' కారుల యభిప్రాయము.

## పండరినాథకవి - మోదుకూరి

ఈ కవి నివాసము నిజాము రాష్ట్రములోని మడికొండ. కవి 120 ఏండ్ల క్రిందట నుండెననియు, గ్రంథరచనమును అనుమకొండలో కావించెననియు గోలకొండ కవుల సంచికలో నున్నది.

ఈతఁడు 'అధ్యాత్మరామాయణము! అను పద్యకావ్యమును రచించెను. అది యముద్రితము. ఈ కవి సంస్కృతమునందు 'రామకథా కల్పలతి' యను కావ్యమును వ్రాసెను. అది 2400 శ్లోకముల గ్రంథమఁట!

## పట్టాభిరామకవి

ఈతఁడు భట్టురాజకులమువాఁడై యుండవచ్చునఁట! 'వజ్రపంజర శతకము, మరున్నందన శతకము, గువ్వలచెన్న శతకము, మలరాజు గుండా

రాయణోపాఖ్యానము,' శమంతకోపాఖ్యానము, కవిసర్పగారుడము, కవి మూషికమార్జాలము - మున్నగు పెక్కు గ్రంథముల నీ కవి రచించెనఁట!

వజ్రపంజరశతకమునుండియు, మురుస్నందన శతకమునుండియు నప్పకవి యుదాహరణములను గైకొని యున్నాఁడు, కావున క్రీ.శ. 1656 కంటె నీ కవి ప్రాచీనుఁడు.

## పట్టాభిరామశాస్త్రి - వేదము

ఈతఁడు పుదూరుద్రావిడ శాఖకుఁ జెందిన బ్రాహ్మణుఁడు. విద్వత్కవి. క్రీ. శ. 1760-1820 నడుమ నీతఁ డుండెనఁట! మదరాసులోని ఫోర్టుసెంటుజార్జి కళాశాలలో నీ విద్వాంసుఁడు సంస్కృతాంధ్రములందు ప్రధానోపాధ్యాయుఁడుగా నుండెను.

'ధాతుమాల'యు, 'పట్టాభిరామ పండితీయ' మను పేరు గల పద్యరూపమగు నాంధ్రవ్యాకరణమును శ్రీపట్టాభిరామశాస్త్రి రచనలు. ఈ రెండును ముద్రితములు.

## పద్మకవి

ప్రబంధరత్నావళియందలి యొక సీసపద్యమునుబట్టి పద్మకవి జినేంద్రపురాణమును వ్రాసినట్లు తెలియుచున్నది. ఇతఁ డాంధ్రకవియే కాక కన్నడకవికూడ. ఈతఁడే కన్నడమున ఆదికవి యనియు, కన్నడకవి సార్వభౌముఁడనియుఁ బేరుపడి 'విక్రమార్జునవిజయ'మను పేర కన్నడ భారతమును రచించిన పంపమహాకవియఁట! ఈతఁడు క్రీ. శ. 941 నాఁటి వాఁడు.

పంపకవి యాంధ్రదేశమందలి వేంగీపురవాస్తవ్యుఁడగుటచే నాంధ్రగ్రంథమును రచించుట యసంభావ్యము కాదని 'తెనుఁగుకవుల చరిత్ర' లోఁ గలదు. ఈ కవి 'ఆదిపురాణ' మను పేర మొదటి తీర్థంకరుని చరిత్రమును కన్నడమున రచించెనఁట!

## పరమానందయతి

ఈతఁడు దత్తాత్రేయ మంత్రోపాసకుఁడు. వేదాంతమున గొప్ప యనుభవము కలవాఁడు. ఇతని పూర్వాశ్రమమునుగూర్చి గాని, కాల, నివాసములఁగూర్చి గాని తెలియుటలేదు. ఈతఁడు 'శివజ్ఞానమంజరి' యను ద్విపదకావ్యమును, 'వేదాంతవార్తిక'మను వచనకావ్యమును, ఉత్తర గీతా వ్యాఖ్యను, అనుభవదర్పణ - ముక్తికాంతాపరిణయ - బ్రహ్మవిద్యా సుధార్ణవ - వివేకచింతామణులను, దత్తాత్రేయ - సంపఁగిమన్న - శివముకుంద (పరమానంద) - గోపాల శతకములను రచించెను.

ఈతని రచన మృదువై, సుబోధమై యుండును.

ఈ కవికి 'పరమానంద తీర్థయతి' యని నామాంతరమున్నట్లు తెలియుచున్నది.

## పరశురామరెడ్డి - తూము

ఈ కవి 170 ఏండ్ల క్రిందట హైదరాబాదు రాజ్యములోని మహబూబునగరు జిల్లాకుఁ జెందిన మామిడిమడ గ్రామమున నివసించుచుండె ననియు, అలమేలుమంగాపరిణయ మనెడి ప్రబంధమును రచించెననియు గోలకొండ కవుల సంచికలోఁ గలదు.

## పర్వతన్న - ఎడవల్లి

ఈతని పద్యములను కాకునూరి - అప్పకవి తన 'అప్పకవీయము'న నుదాహరించి యున్నాఁడు. ఈ కవి కర్నూలు ప్రభువగు గోపాలప్రభుని కాలములోనివాఁడు. ఈ ప్రభువు ఆర్వీటి - రామరాజు తమ్ముఁడగు వేంకటాద్రి మనుమఁడఁట! కావున 1600 ప్రాంతమువాఁడై యుండును. ఈతనినిగూర్చి మఱేమియును తెలియలేదు.

## పళని - ముద్దు

ఆంధ్రకవయిత్రులలో నీమె పేరెన్నికఁగన్నది. తంజావూరిని పాలించిన మహారాష్ట్రరాజులలో ప్రసిద్ధుఁడగు ప్రతాపసింహుని యాశ్రయమున నీమె యుండినది. ఈమె కాలము క్రీ. శ. 1740.

ఈమె రాధికాసాంత్వన మను నాల్గాశ్వాసముల శృంగార ప్రబంధమును రచించినది. ఆండాళ్లమ్మకృతిగా ద్రావిడభాషలో ప్రసిద్ధమైన 'తిరుప్పావై' అను చిన్నకావ్యమునకు 'సప్తపదులు' అను పేరిటఁగల యాంధ్రానువాద మీామె రచించినదని వాడుక యొకటి తెలుఁగునాట వెలసినది. కాని, అది శ్రీనివాసాచార్యుల రచన కాని, పళనిరచన కాదు.

ఈ 'రాధికాసాంత్వనము'లోని పద్యములను కొన్నిటిని చేర్చి, అది యేకాశ్వాసప్రబంధమని చెప్పి, దాని కర్తృత్వము సముఖము - వేంకటకృష్ణప్పనాయకున కంటఁగట్టఁబడినది. కాని యది సరికాదు. పళని యెడ గ్రంథచౌర్యము సాపాదించుటకయి - ఆధునికు లెవ్వరో యిట్లు చేసి యుందురని విమర్శకుల యభిప్రాయము. 'రాధికాసాంత్వన' మొక్కటియే యీామెకృతి కానవచ్చుచున్నది.

## పానకాలరాయఁడు - తాడేపల్లి

ఈతఁ డార్వేల నియోగి బ్రాహ్మణుఁడు. శ్రీవత్సగోత్రుఁడు. వేంకన్న, మహాలక్ష్మమ్మల పుత్రుఁడు. వేణుగోపాల భక్తుఁడు. తాడేపల్లి గ్రామనివాసి. ఈతఁడు మానసబోధ శతకము, చిత్తబోధ శతకము, పార్థసారథి శతకము, రామశతకము, లక్ష్మీదేవి శతకము, నృసింహ శతకము, రుక్మిణీశతకము అను శతకములను, నేత్రదర్పణ మను వైద్యగ్రంథమును రచించెను.

మానసబోధ శతకమునకు 'మనసా! హరిపాదము లాశ్రయింపుమా!' అనునది మకుటము. ఇందుఁ జంపకోత్పలమాలలు కలవు. కవిత్వము మిక్కిలి మనోహరమైనది. చిత్తబోధ శతకమునను చంపకోత్పలమాల

కలవు. అందు 'శ్రీ హరిపదమ్ములు కోరి భజింపు చిత్తమా!' అనునది మకుటము. రుక్మిణీపతి శతకమున 'రుక్మిణీపతీ!' అనునది మకుటము. ఇందును వృత్తములే కలవు. 'మంగళాద్రినృసింహా!' అను మకుటముతోఁ గంద పద్యములు కల శతకము 'నృసింహశతకము'. 'శ్రీమంగళశైల నారసింహుని రాణీ!' అనునది లక్ష్మీశతకపు మకుటము. ఇది కందపద్యశతకము. 'పార్థసారథీ!' అను మకుటము గల పార్థసారథిశతకము వృత్తశతకము. వీనిలోని కవిత్వము హృదయంగమము. కవికాలము తెలియుట లేదు.

## పాపకవి - అత్తలూరి

ఈతఁ డక్కరాజు మనుమఁడు; శ్రీ గిరిమంత్రిపుత్రుఁడు. కౌశిక గోత్రజుఁడు. ఈతఁడు తన కావ్యమును కందుకూరి - అమృతలింగముగారి కంకితము చేసెను. కృతిపతి పెదతండ్రియైన సాళువపతి ఢిల్లీనాయకుని వలన బహుమతులను పొందినట్లు కవి వర్ణించెను. ఢిల్లీరాజ్యము నశించి 150 ఏండ్లకుఁబైగా నగుటచే నీ కవియు, కృతికర్తయును 150 ఏండ్ల క్రిందటివారై యుండవలెను.

కృతికర్తపూర్వులు 'దేశపాండ్యా'లయి పెక్కు గ్రంథములను స్వీకరించిరఁట! కందుకూరి - మల్లికార్జున మంత్రి కువలయాశ్వచరిత్రమును, వీరేశలింగకవి పంచాక్షరీ మాహాత్మ్యమును, బసవరాజు సత్యవతీ పరిణయమును కృతి నందిరఁట!

పాపకవి చెన్నబసవపురాణ మను అయిదాశ్వాసముల పద్యకావ్యమును రచించి అమృతలింగమున కంకితముచేసెను. గ్రంథములో చెన్నబసవన్న వృత్తాంతము చెప్పఁబడినది. ఈ చెన్నబసవన్న కల్యాణపురాధిపతి యగు బిజ్జలుని మంత్రి యగు బసవేశ్వరుని మేనల్లుఁడు.

పాపకవి కవిత్వము ప్రౌఢమై హృద్యముగా నుండును.

## పాపనామాత్యుఁడు - మాచవరపు

ఈతఁడు నందవరీక నియోగిబ్రాహ్మణుఁడు. శ్రీవత్సగోత్రుఁడు. వేంకటాచలమంత్రి పుత్రుఁడు. తల్లి కొండమాంబ. ఈతఁడు నూటయేఁబది, రెండువందల యేండ్ల క్రిందట నుండి యుండునని శ్రీ వీరేశలింగముపంతులు గారి యభిప్రాయము.

ఈ కవి నందవరీకచరిత్ర మను రెండాశ్వాసముల ప్రబంధమును రచించి, అందు తను వంశీయుల పూర్వచరిత్రను వెల్లడించెను. ఈతని కవిత్వము ప్రశస్తమైనది కాదు.

## పాపయకవి - పచ్చుమెట్ట

ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. విశాఖపట్టణమండలములోని విజయనగరమునకు సమీపమునఁ గల కోనాడగ్రామ నివాసి. మగటపల్లి కామయశ్రేష్ఠి యీతని పోషకుఁడు. ఇతఁడు క్రీ. శ. 1765-1840 నడుమ నుండినవాఁడఁట !

కామయసెట్టి క్రీ. శ. 1765 మొదలు 1834 వఱకు నుండెనఁట ! అతనిపయి నీ కవి 'కామయచంద్రా!' అను మకుటముతో నొక శతకమును చెప్పెను.

పాపయకవి మహిషాసురమర్దనీ శతకమును గూడ చెప్పెనని జనశ్రుతి కలదు. అందొక్క పద్యముమాత్రమే నేఁడు లభించుచున్నదఁట ! ఇతఁడు రామాయణమునందలి సుందరకాండమును దండకముగా రచించెను.

## పాపయశాస్త్రి - పాత

కోరంట్ల యీతని నివాసము. క్రీ. శ. 1820 ప్రాంతమున నీతఁ డుండెను. ఈతఁడు విక్రమార్కీయ మను గ్రంథమును రచించెనఁట ! ఆ గ్రంథము లభ్యము కానందున దానినిగూర్చిన విశేషములు తెలియ లేదని గోలకొండకవుల సంచికలోఁ గలదు.

## పాపయ్య - పైడిపాటి

ఈతఁడు కొండలయ్యకుమారుఁడు. ఈ కవి 'సాండ్రీసు' దొరవారి యనుజ్ఞననుసరించి రంగనాథరామాయణమును వచనకావ్యముగా రచించెను. ఇది సులభమైన వ్యావహారికభాషలో నున్నది. ఇతని కాలము క్రీ. శ. 1840 ప్రాంతము.

## పాపరాజు - కంకంటి

ఈతఁ డార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. 18-వ శతాబ్ది మధ్యభాగమున నుండిన ప్రసిద్ధాంధ్రకవి. ఇతఁడు ఉత్తరరామాయణ మను పెద్ద పద్యకావ్యమును, విష్ణు మాయావిలాస మను యక్షగానమును రచించెను. ఉత్తరరామాయణము తెలుఁగునాట ప్రశస్తిని, ప్రచారమును గడించిన గ్రంథము.

ఇతని తండ్రి అప్పయామాత్యుఁడు; తల్లి నరసమ్మ; తమ్ముఁడు నరసింహుఁడు. పాపరాజు ప్రళయకావేరి (పులికాటు) న అమీనుగా నుండెనఁట ! సుప్రసిద్ధకవి పుష్పగిరి తిమ్మన యీతని యాప్తమిత్రుఁడు.

ఉత్తరరామాయణమును పుష్పగిరి తిమ్మనయే రచించి పాపరాజు పేరు పెట్టెనని యొక ప్రవాదము కలదు. ఇందు నిజ మెంత కలదో నిశ్చయింప నవకాశము తక్కువ. ఉత్తరరామాయణములోని పద్యములకును, తిమ్మకవి రచించిన సమీర కుమారవిజయములోని పద్యములకును చాల భేదము కానవచ్చుచున్నది.

## పాపాశాస్త్రి - దీక్షితుల

ఆత్మకూరు సంస్థానములోని అమరచింత యీతని నివాసము. ఈ విద్వాంసుఁడు నూతేండ్లక్రిందట జన్మించి 40 ఏండ్లు జీవించెనఁట !

చెంచునాటకము, హనుమచ్ఛతకము నీతని రచనలు.

## పామనాయకుఁడు - బహిరీ

హైదరాబాదు రాష్ట్రములోని వాగినగిరి యీతని నివాసము. ఈతఁడు 220 ఏండ్లక్రిందట నుండెననియు, భార్గవపురాణమును రచించె ననియు గోలకొండకవుల సంచికనుబట్టి తెలియుచున్నది. ఈ గ్రంథము మహాబూబునగరు జిల్లాలోని సురపురమునందలి శ్రీ వేణుగోపాలస్వామికి కృతి యీయఁబడినదఁట !

## పార్వతీశ్వరకవి - మండపాక

ఈతఁడు వేఁగినాటి వైదిక బ్రాహ్మణుఁడు. పారాశరగోత్రుఁడు. కామకవి, భోగమాంబల పుత్రుఁడు. నేఁటి శ్రీకాకుళము జిల్లాలోని బొబ్బిలికి సమీపమున నున్న పాలతేరు గ్రామ మీతని నివాసము. ఈతఁడు క్రీ. శ. 1833 జూను 30-వ తేదిని పుట్టి 1897 జూను 30-వ తేదిని మరణించెను. 19-వ శతాబ్దిలో నుండిన గొప్ప విద్వత్కవులలో నీతఁ డెన్నఁదగినవాఁడు. ఈతని తాతయు, తండ్రియుఁ గూడ గొప్ప విద్వాంసు లయి గ్రంథములను రచించి యుండిరి.

ఈతఁడు తొలుత జనకునియొద్దను, పిదప తాతా - సూర్యనారా యణశాస్త్రికడను విద్య నభ్యసించి, స్వప్రతిభావిశేషమునను, స్వయం కృషివలనను గొప్ప పాండిత్యమును సంపాదించెను. ఈతఁడు పెక్కు సంస్థానములకేఁగి, తన పాండిత్యమును ప్రకటించి, గౌరవములను బడయు చుండెను. ఈయన 1875 లో బొబ్బిలి ప్రభువులగు శ్రీ రావు - వేంకట శ్వేతాచలపతి రంగారావుబహద్దరువారి యాస్థానకవి యయి జీవితాంతము వఱకు నచటనే యుండెను.

శ్రీ పార్వతీశ్వరశాస్త్రి పెక్కు గ్రంథములను రచించెను. వానిలోఁ గొన్ని శతకములు; కొన్ని కావ్యములు.

శతకములు - (1) బ్రహ్మేశ శతకము (2) చిత్రిశతి (3) వేంకట శైల నాయక ద్విశతి (4) విశ్వనాయక శతకము (5) విశ్వనాథస్వామి శతకము (6) కాశీవిశ్వనాథ శతకము (7) పారిపలింగ శతకము (8) పరమ శివ శతకము (9) సూర్యనారాయణ శతకము (10) బాలశశాంకమౌళి శతకము (11) చంద్రఖండ కలాప శతకము (12) కలిపురుష శతకము (13) ఈశ్వర శతకము (14) సీతారామద్వ్యర్థి శతకము (15) శ్రీ జనార్దన శతకము (16) కాశికా విశ్వనాథ శతకము (17) పరమాత్మ శతకము (18) పార్వతీశ్వర శతకము (19) కాశీవిశ్వనాథప్రభు శతకము (20) వేంకటరమణ శతకము (21) వరాహనరసింహ శతకము (22) జగద్రక్షక శతకము (23) రమానాయక శతకము (24) రామరక్షా శతకము (25) గోపాలకృష్ణ శతకము (26) బాలకృష్ణ శతకము (27) రఘుపతి శతకము (28) జగన్నాయక శతకము (29) రామలింగేశ్వర శతకము (30) సర్వకామదా శతకము (31) గణపతి శతకము (32) హరిశతకము (33) హరిహరేశ్వర శతకము.

కావ్యములు - (1) శ్రీరాధాకృష్ణ సంవాదము (2) ఉమాసంహిత (3) కాంచీమహత్త్వము (4) అమరుకము (5) అక్షరమాలికా నిఘంటువు.

ఇవి కాక యాత్రాచరిత్ర, గురుచిత్రకథ, లఘుచిత్రకథ, బొబ్బిలి మహారాజవంశావళి మున్నగు గద్యగ్రంథములు, కొన్ని మాలికలు, దండకములు నీతని కృతులు కలవు.

## పినవీరభద్రుఁడు - పిల్లలమఱ్ఱి

ఈ కవి నియోగిబ్రాహ్మణుఁడు. భారద్వాజగోత్రుఁడు. గాదెయామాత్యుని పుత్రుఁడు. సరస్వతీకటాక్షమును పొందిన మహాకవి. ఈతని నివాసము తొలుత హైదరాబాదు ప్రాంతమునందలి పిల్లలమఱ్ఱి యయినను, నెల్లూరుజిల్లా బిట్రగుంటకుఁ జేరువ నున్న సోమరాజుపల్లెలోఁ గొంతకాల మున్నట్లును, పిదప విజయనగరమునఁ గర్ణాట ప్రభువుల యాస్థానమున నున్నట్లును తెలియుచున్నది.

ఈ కవి 'అవతారదర్పణము, నారదీయము, మాఘమాహాత్మ్యము, మానసోల్లాససారము, శకుంతలాపరిణయము, జైమినిభారతము' అను గ్రంథములను రచించెను. వానిలోఁ దొలుతటి నాల్గును లభింపలేదు. శకుంతలాపరిణయము నాలుగాశ్వాసముల శృంగారప్రబంధము. ఇది సోమరాజుపల్లెనివాసి యగు చిల్లర - వెన్నయామాత్యున కంకితము చేయఁబడినది. కవి యిందు భారతకథను, కాళిదాసు కూర్చిన కథను మేళవించి గ్రంథమును క్రొత్తపద్ధతిని రచించెను.

జైమినిభారతము సంస్కృతమునందలి జైమినిభారతము ననుసరించి వ్రాయఁబడినది. ఇది యెనిమిదాశ్వాసముల ప్రబంధము. కవి దీనిని విజయనగరప్రభువును, సాళువ-గుందనృపాలుని పుత్రుఁడు నగు నరసింహరాయల కంకితము చేసెను. ఈ గ్రంథము క్రీ. శ. 1485-1490 నడుమ రచింపఁబడినదనియు, ఈ గ్రంథమే చివరిదై నందున, అప్పటి కీతని వయస్సేఁబది, యఱువది సంవత్సరము లుండుననియు, ఈతని గ్రంథరచన 15-వ శతాబ్దియందలి యుత్తరభాగముననే జరిగి యుండుననియు 'ఆంధ్రకవితరంగిణీ' కారుల యాశయము.

పినవీరభద్రుని రచన ప్రౌఢమై రసవంతమై యుండును.

## పిన్నయ్యప్రభాకరుఁడు - ఎలకూచి

ఈతఁడు జటప్రోలు ప్రాంతమువాఁడఁట! క్రీ. శ. 1650-ప్రాంతమున నుండెనఁట! ఈతఁడు సుప్రసిద్ధ విద్వత్కవి యగు ఎలకూచి-బాలసరస్వతికి తమ్ముఁడని గోలకొండ కవుల సంచికలోఁగలదు.

ఈతఁ డాదిత్యపురాణమును రచించెను. దాని ప్రతి ఆంధ్రసాహిత్య పరిషత్కార్యాలయములోఁ గలదఁట!

## పురుషోత్తమకవి - కాసుల

ఈతఁడు భట్టరాజకులసుఁడు. కాశ్యపగోత్రుఁడు. తండ్రి అప్పలరాజు; తల్లి రమణమ్మ. అద్దంకి - తిరుమలాచార్యుని శిష్యుఁడు. నివాసము కృష్ణాజిల్లా చల్లపల్లి చేరువఁగల పెదప్రోలు. ఈ కవి 1798 ప్రాంతమున నుండిన శ్రీమంతు రాజా అంకినీడు బహద్దరువారి యాస్థానమున నుండెనఁట !

ఈ కవి 'ఆంధ్రనాయక, హంసలదీవి గోపాల, మానసబోధ, భక్తకల్పద్రుమ శతకములను రచించెను. వీనిలో మానసబోధ, భక్తకల్పద్రుమశతకము లిప్పటికిని లభింపలేదఁట ! ఆంధ్రనాయకశతకము శ్రీకాకుళక్షేత్రమునందలి యాంధ్రవిష్ణుదేవునిపైఁ జెప్పినది. హంసలదీవి గోపాలశతకము కృష్ణాసాగరసంగమమునందలి హంసలదీవిపైఁ గల గోపాలదేవునిం గూర్చి చెప్పినది.

## పురుషోత్తమకవి - కొండమడుగు

ఈ కవి నియోగిబ్రాహ్మణుఁడు. భారద్వాజగోత్రుఁడు. గిరియప్పకుమారుఁడు. అయ్యలూరు మున్నగు గ్రామముల కధికారి. ఈతని కాలము తెలియదు. కాని యీతఁడు నూటయేఁబది యేండ్ల క్రిందటివాఁడై యుండునని శ్రీ వీరేశలింగము పంతులుగా రభిప్రాయపడుచున్నారు.

ఈతఁ డానందగణేశ్వరమను మూఁడాశ్వాసముల ప్రబంధమును రచించి దీబగుంట వీరేశ్వరస్వామి కంకితముచేసెను. ఈ గ్రంథమును తాను కంజేటి బుచ్చయ్యయను వైశ్యునియొక్క కోరికపయి రచించినట్లు కవియే చెప్పికొని యున్నాఁడు.

## పురుషోత్తమ దీక్షితుఁడు

తంజావూరిలోని నాయకరాజులు నిరతాన్న ప్రదాన మొనర్చుచు, అందులకై కొన్ని సత్రముల నేర్పాటుచేసిరి. వారి యన్నదానమును వర్ణించుచు నీపురుషోత్తమ దీక్షితకవి 'తంజాపురాన్నదాన మహానాటకము,

అను గ్రంథమును రచించెను. నాయక రాజు లున్నతస్థితియం దుండునపుడే యిది రచింపఁబడినదని చెప్పవలసి యున్నది. కావున 17-వ శతాబ్ది మధ్యమున దీని రచన జరిగి యుండవచ్చును.

## పెదకెంపరాయఁడు

ఈతఁడు కెంపగౌడ కుమారుఁడు. క్రీ. శ. 1513 నుండి 1569 వఱకును బెంగుళూరు ప్రాంతమును 56 ఏండ్లవిచ్ఛిన్నముగా పాలించి, బెంగుళూరు నగరమును నిర్మించెను. ఈతఁడు శ్రీకృష్ణదేవరాయల చేతను, అచ్యుతరాయలచేతను గూడ మన్ననలను పొందెను.

ఈతఁడు తెలుఁగులో గంగాగౌరీవిలాస మను యక్షగానమును రచించి, హాల్సూరిలోఁ దాను ప్రతిష్ఠించిన సోమేశ్వరస్వామి కంకిత మొనరించెను. ఇయ్యది పూర్తిగా లభింపలేదు.

## పెదతిరుమలాచార్యులు — తాళ్లపాక

ఈతఁడు నందవరీక నియోగి బ్రాహ్మణుఁడై వైష్ణవమును గ్రహించిన అన్నమాచార్యులకుఁ గుమారుఁడు. ఇతని తల్లి అక్కలమ్మ. సవతితల్లి తిమ్మక్క. ఈతని నివాసము తిరుపతి. ఈతఁడు క్రీ. శ. 1460 ప్రాంతమున జన్మించి 1546 ప్రాంతమువఱకును జీవించియున్నట్లు తెలియుచున్నది. 1546 ప్రాంతమున నీతని శాసనములు కానవచ్చుచున్నవి.

ఈతఁడు శ్రీ వేంకటేశ్వరస్వామి భక్తుఁడై, యాతని సన్నిధానమునసే కాలమును గడపుచుండెడివాఁడు. ఈ విద్వత్కవి 'శృంగారకీర్తనలు, శృంగారదండకము, శృంగారవృత్త శతకము, వైరాగ్యవచనగీతములు, చక్రవాళమంజరి, వేంకటేశ్వరోదాహరణము, సుదర్శనరగడ, రేఫఱకార నిర్ణయము, మేలుకొల్పు ద్విపద, భగవద్గీతావచనము, సంకీర్తన లక్షణము, ఆంధ్రవేదాంతము, ఆంధ్రహరివంశము' — అను గ్రంథములను రచించెను.

ఇతని రచన మనోహరమై, ధారాశుద్ధి కలిగి ద్రాక్షాపాకమున వెలయుచుండును. ఎడనెడ వ్యర్థపదములు ప్రయోగింపఁబడుటయుఁ గలదు.

## పెదరామామాత్యుఁడు - పోడూరి

ఈతఁ డారువేల నియోగిబ్రాహ్మణుఁడు. భారద్వాజ గోత్రుఁడు. శివరామమంత్రికిని, సీతమాంబకును పుత్రుఁడు. ఈతఁడు కవులను స్తుతించు సందర్భమున పింగళి - సూరనార్యునిఁ గొనియాడుటచే నతని తరువాతి వాఁడని తెలియుచున్నది. ఈతఁడు నూటయేఁబది యేండ్ల క్రిందటివాఁడయి యుండునని శ్రీ వీరేశలింగము పంతులుగారి యభిప్రాయము.

ఈతఁడు గురజాల - పేరయార్యుని ప్రేరణమున శివరామాభ్యుదయ మను ద్వ్యర్థికావ్యమును రచించెను. మఱియు నీతఁడు 'కౌసల్యా పరిణయము' మున్నగు సరసకృతులను, ఉదాహరణాదులను రచించినట్లు తెలియుచున్నది.

ఈతని వంశములోనివారు విద్వత్కవులు. వీరి పూర్వుఁడు కొండకవి భార్గవాభ్యుదయమును, రామామాత్యుని యన్న బాపన్న యుషాభ్యుదయమును, తమ్ముఁడు రామన నిరోష్ఠ్యజానకీ కల్యాణమును రచించిరఁట!

## పెద్దనకవి - ఎలుగంటి

ఈతఁడు ప్రథమశాఖాబ్రాహ్మణుఁడు. కాశ్యపగోత్రుఁడు. మల్లమ, కొండయల పుత్రుఁడు. ఈతఁడు భిన్నగణితమును, ప్రకీర్ణగణితమును పద్యరూపమున రచించెను. పావులూరి మల్లనకంటె సులభముగా రచింపఁ గోరి, వీనిని వ్రాసెనఁట! ఇతని కాలము తెలియలేదు. కాని 16-వ శతాబ్దిలో రెండవభాగమున నుండి యుండునని 'ఆంధ్రకవి తరంగిణి'లోఁ గలదు.

## పెద్దన - అల్లసాని

ఈతఁడు నందవరీక నియోగిబ్రాహ్మణుఁడు. చొక్కనామాత్యుని పుత్రుఁడు శ్రీకృష్ణదేవరాయల సభలోని యష్టదిగ్గజములలోఁ బ్రథముఁడు. 'ఆంధ్రకవితాపితామహ' బిరుదాంచితుఁడు. ఈతని నివాసము బళ్లారి ప్రాంతమునందలి దూపాడు పరగణాలోని దోరాల యని 'ఆంధ్ర కవుల చరిత్ర'లోఁ గలదు. కాని యాయూరిపేరు 'దోరణాల లేక దోర్ణాల' యని స్థలజ్ఞులు చెప్పుచుందురఁట! ఈతఁడు రాయల మరణా

నంతరమునఁగూడ (క్రీ, శ. 1535-సం. వఱకును) జీవించి యుండెను. ఈతఁడు తన కవితాప్రౌఢిమచే రాయలను మెప్పించి యనేక సన్మానము లందుచుండెను.

ఈతఁడు మార్కండేయ పురాణమునందలి స్వారోచిషమను సంభవ కథను గ్రహించి 'మనుచరిత్ర' మను నా ఱాశ్వాసముల ప్రౌఢప్రబంధమును రచించి శ్రీకృష్ణదేవరాయలకే అంకితమొనర్చెను. ఇయ్యది తర్వాతి ప్రబంధ ములకు మార్గదర్శక మైనది. ఈతఁడు 'హరికథాసార'మను మఱియొక గ్రంథమును గూడ రచించినట్లు లక్షణగ్రంథములయందలి యుదాహరణ ములనుబట్టి తెలియుచున్నది. కాని యా గ్రంథము లభింపలేదు.

ఈతని కవిత్వ మల్లిక జిగిబిగి కలిగి మృదుమధురమై యుండును.

పెద్దనామాత్యుఁడు శఠకోపయతిశిష్యుఁడు. ఇతఁడు తొలుత నియోగి యైనను, పిదప వైష్ణవమతమును స్వీకరించినట్లు తెలియుచున్నది. ఈతఁడు వసిష్ఠగోత్రజుఁడని అన్నూరు శాసనమునుబట్టి తెలియుచున్నదని 'ఆంధ్రకవి తరంగిణి'యందుఁ జెప్పఁబడి యున్నది.

## పెద్దన - చిత్రకవి

ఈతఁడు ప్రథమశాఖాబ్రాహ్మణుఁడు. భారద్వాజగోత్రుఁడు. కందాళ - అణ్ణగారి శిష్యుఁడు. ఈ కందాళయణ్ణగారు అప్పగారి పుత్రుఁడు. అతఁడు పాండురంగమాహాత్మ్య కృతిపతి యగు విరూరి - వేదాద్రిమంత్రికి గురువు. అణ్ణపండితుని శాసనములు రెండు క్రీ. శ. 1483-86 నాఁటివి తిరుపతి దేవస్థానములోఁ గలవు. కావున అతని శిష్యుఁడగు పెద్దన 1510-70 నడుమ నుండెనని చెప్పవచ్చును. ఈతఁడు క్రీ.శ.1550 ప్రాంతమున 'లక్షణసారసంగ్రహము'ను రచించి యుండునఁట! లింగమకుంట తిమ్మకవి యీతనిని నుతించి యున్నాఁడు. కావున నీతఁడు 1550 ప్రాంతమునకుఁ దర్వాతివాఁడు కాఁడనుట నిశ్చయము. ఈ విషయము 'ఆంధ్రకవితరంగిణి'లోఁ గలదు.

ఈతఁడు హనుమంతునిపై నొక శతకమును, లక్షణసారసంగ్రహమను మూఁడాశ్వాసముల లక్షణగ్రంథమును రచించెను. ఆ శతకము లభింపలేదు. లక్షణసారసంగ్రహము మూఁడాశ్వాసముల లక్షణగ్రంథము. ఇది ప్రధానముగా ఛందోవిషయములను తెలుపు గ్రంథము. ఇది హనుమంతున కంకితము.

## పెద్దనకవి - విన్నకోట

ఈ పెద్దనకవికి 'పెద్దయ' అను పేరు కూడ ప్రసిద్ధము. ఈ కవి నియోగి బ్రాహ్మణుఁడు. కౌశికగోత్రుఁడు. గోవిందామాత్యుని పుత్రుఁడు. రాజమహేంద్రవరమును వర్ణించుటంబట్టి యీతని నివాసము రాజమహేంద్రవరమై యుండునని కొందఱి తలంపు.

విశాఖపట్టణమండలములో సర్వసిద్ధికి సమీపమునఁగల 'పంచధారల' వద్దఁగల శ్రీ ధర్మలింగేశ్వరస్వామికి మండపమును కట్టించిన చాళుక్య విశ్వేశ్వరభూపతి కీతఁడు తన కృతి నంకితమొనరించుటచే ఈతఁడా కాలమున నుండెననుట స్పష్టము. విశ్వేశ్వరభూపతి మండపమును కట్టించిన కాలము క్రీ. శ. 1407 ప్రాంతము. కావున నీ కవియు నా కాలమువాఁడే యగును.

ఈతఁడు 'కావ్యాలంకారచూడామణి' అను లక్షణగ్రంథమును రచించి విశ్వేశ్వరభూపతి కంకితమొనర్చెను. ఇందు అలంకారవిషయము అధికముగను, ఛందోవ్యాకరణవిషయములు తక్కువగను వివరింపఁబడినవి.

'ప్రద్యుమ్నచరిత' మీతని యితరగ్రంథమని శ్రీమానవల్లి-రామకృష్ణకవిగారు వ్రాసి యున్నారు. కాని యది పొన్నాడ-పెద్దన రచించినదని శ్రీ వేటూరి-ప్రభాకరశాస్త్రిగారు తెల్పియున్నారు.

## పెద్దనసోమయాజి - కొణాదము

ఈతఁడు నందవరీక నియోగిబ్రాహ్మణుఁడు. గద్వాల సంస్థానాధిపతి యగు చినసోమభూపాలుని యాస్థానమున నుండిన విద్వత్కవి. ఈ చిన

షోమభూపాలుఁడు తిరుమలరాయల పుత్రుఁడు. విద్వత్కవి. స్వయముగ నీతఁడు గ్రంథములను రచించి, తన యాస్థానవిద్వాంసులచేఁ గొన్ని యుద్గ్రంథములను రచియింపఁజేసెను. ఈ ప్రభువు శాలివాహనశకము ౧౭౧౫ (క్రీ. శ. 1793) వఱకును రాజ్యమును పాలించెను.

పెద్దనసోమయాజి ముకుందవిలాసము, అధ్యాత్మరామాయణము అను ప్రబంధములను రచించెను. సంస్కృతమునఁ గల రామాయణ చంపువునకు వ్యాఖ్య రచించెను. యథాశ్లోక తాత్పర్యరామాయణము నందలి బాలకాండను రచించెను.

యథాశ్లోకతాత్పర్య రామాయణము సోమభూపాలుని యాస్థానము నందలి విద్వాంసు లందఱును కలిసి పూర్తిచేసిన మహాగ్రంథము. దానిని ప్రారంభించినవాఁడే పెద్దనసోమయాజి. కొత్తపల్లి - రామాచార్య అయోధ్యాకాండమును, గార్దేయపురపు-సుబ్బాశాస్త్రి అరణ్యకాండమును, శామసముద్రము - అప్పలాచార్యులు కిష్కింధాకాండమును, తిరుమల - కృష్ణమాచార్యులు సుందరకాండమును, బోరవెల్లి శేషకవి యుద్ధకాండ మును రచించిరి.

ఈతఁడు మత్స్యపురాణము ను, శేషశైలేశలీలలను కూడ రచించినట్లు తెలియవచ్చుచున్నది.

## పెద్దయామాత్యుఁడు

విక్రమార్కచరిత్రమును రచించిన జక్కనకవి కీతఁడు పితా మహుఁడు. నెల్లూరి తిరుకాళరాజుసభలో నీ పెద్దయామాత్యుఁడు సాహిత్యవిద్యాప్రదర్శనముల నొనరించుచుండినట్లు జక్కనకవియే చెప్పెను. ఈతఁ డాశు,మధుర, చిత్ర, విస్తరము లను చతుర్విధకవితారీతుల నెఱిఁగినవాఁడు.

తిరుకాళరాజే చోడతిక్కరాజనియు, ఆతఁడు మనుమసిద్ధి నృపాలుని తండ్రి యనియు, తిక్కరాజు క్రీ. శ. 1208 నుండి 1239

వఱకును నెల్లూరిని పాలించినందున నీ పెద్దయామాత్యుఁడు క్రీ. శ. 1240 ప్రాంతమువాఁడై యుండుననియు శ్రీనిడుదవోలు - వేంకటరావుగారు తమ 'తెనుఁగుకవుల చరిత్ర'లోఁ దెల్పి యున్నారు.

ఈతని గ్రంథము లేవియు లభింపలేదు.

## పెద్దయ్య - ఒడ్డెపూడి

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. కాశ్యపగోత్రుఁడు. వేంకట మంత్రి పుత్రుఁడు. ఒడ్డెపూడి గ్రామకరణము. ఈతఁడు వాయుపురాణము నందలి మాఘమాహాత్మ్యమును తెలిఁగించి పురుషోత్తమపురనివాసి యైన దాసరి - చిన్నగంగయ్య యను చౌదరి కంకితమొనర్చెను. కృతిపతి హరిశ్చంద్రమహీపతిచే గౌరవము లందెను. ఈ హరిశ్చంద్రుని గోలకొండ నవాబు కులీకుతుబ్‌షా పుత్రుఁడగు హైదరుఖాను జయించి పట్టుకొనెనఁట! కులీకుతుబ్‌షా క్రీ.శ. 1511-1543 నడుమ నున్నందున, ఈ కవియు నప్పటి వాఁడే యగును.

వాయుపురాణభాగము 1550-60 నడుమ రచింపఁబడి యుండుఁ వచ్చునని ఆంధ్రకవితరంగిణిలోఁ గలదు.

పెద్దయ్యకవిత్వము రసవంతమైనది.

## పెద్దిరాజు - పొన్నాడ

ఈ కవి ప్రద్యుమ్నచరిత్ర మను ప్రబంధమును రచించినట్లు జగ్గకవి కూర్చిన ప్రబంధరత్నాకరమునుబట్టి తెలియుచున్నది. అప్పకవీయమున ప్రద్యుమ్న చరిత్రమందలి యుదాహృతి లభించుచున్నది. ప్రద్యుమ్న చరిత్రము లభించుట లేదు.

ఈతఁడు క్రీ. శ. 1560 కంటె ముందువాఁడు. ఇతని కవిత్వము మృదువై రసవంతముగా నుండును.

## పెమ్మన - భావన

ఈతఁడు 'అనిరుద్ధచరిత్రము'ను రచించినట్లు జగ్గన కూర్చిన ప్రబంధరత్నాకరమునుబట్టి తెలియుచున్నది. ఆ గ్రంథ మిపుడు లభింపలేదు. ఇతఁడు 1560 కంటెఁ బూర్వుఁడు.

## పెరియణ్ణకవి - ఉప్పుగుండూరు

ఈతఁడు కామాక్షీపదభక్తుఁడు. సింగమాంబా, వేంకటకవుల పుత్రుఁడు. కాంచీపుర నివాసి యైనట్లు తోఁచుచున్నది. ఈ కవి 'మీనకేతనాభ్యుదయ' మను నొక శృంగారకావ్యమును రచించి, ఆర్వీటి- పెదవెంకటరాయల కంకితముగ నిచ్చెను. గ్రంథ మసమగ్రము. అముద్రితము.

పెద వేంకటరాయలు, అళియ - రామరాజునకు మనుమఁడు. ఈ కవియు, కృతికర్తయు 1600 ప్రాంతమున నుండి యుందురు.

## పేరయకవి - బుద్ధిరాజు

ఈతఁడు వీరశైవుఁడు; ఇవటూరి వీరారాధ్యుని శిష్యుఁడు. ఈతఁడు పిసపాటి - సర్వదేవారాధ్యుని ప్రేరణచే 'సాత్త్విక బ్రహ్మవిద్యావిలాస నిరసనము' అను శైవమతగ్రంథమును వచనకావ్యముగా రచించెను. ఇయ్యది వైష్ణవమతమును స్థాపించు 'సాత్త్విక బ్రహ్మవిద్యావిలాసము' నకు ఖండనగ్రంథము. ఇందు 11 ప్రకరణములలో శైవమతస్థాపన యొనర్పఁబడినది. ఈ కవి 1750 ప్రాంతీయుఁడు.

## పేరయకవి - బొడ్డపాటి

ఈతఁ డార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. ఆత్రేయగోత్రుఁడు. కృష్ణాజిల్లా బెజవాడకు సమీపమునఁ గల బొడ్డపాడు డీకని నివాసము. ఈ కవి 'అనంతమహత్త్వము, పద్మినీవల్లభము, మంగళగిరి విలాసము, శంకరవిజయము, సూర్యశతకము, మల్లికార్జున లింగశతకము' అను గ్రంథములను

వ్రాసినట్లు జగ్గకవి 'ప్రబంధరత్నాకరము'నుబట్టి తెలియుచున్నది. ఇతఁడు 1560 కిఁ బూర్వుఁడు; 16-వ శతాబ్ది ప్రారంభమున నుండి యుండునని 'కవితరంగిణి'లోఁ గలదు. ఆగ్రంథములు లభింపలేదు.

ఈతని కవిత్వము రసవంతమై యుండును.

## పేరయకవి - మండపాక

ఈతఁడు వేఁగినాఁటి వైదిక బ్రాహ్మణుఁడు. కామనవలస నివాసి. మండపాక కామకవి కీతఁడు తండ్రి. విద్వత్కవి. ఈతఁడు క్రీ. శ. 1800 ప్రాంతమున నుండినట్లు తెలియవచ్చుచున్నది.

పేరయకవి నిరోష్ఠ్యదాశరథి శతకము, అను శతకమును, కుముద్వతీ పరిణయము, ఇందుమతీపరిణయము అను ప్రబంధములను రచించెను. కాని అవి యేవియు నిప్పుడు లభ్యములు కాలేదు. ఈతఁడు లక్ష్మీనృసింహమూర్తి స్తుతికృతులను కూడ రచించెనఁట! 19-వ శతాబ్దిలో సుప్రసిద్ధవిద్వత్కవి యగు మండపాక-పార్వతీశ్వరశాస్త్రి కీతఁడు పితామహుఁడు.

## పేరయలింగము - అజ్జరపు

ఈ కవి శైవుఁడు; ఆర్వేల నియోగిబ్రాహ్మణుఁడు. భారద్వాజ గోత్రుఁడు. కొండన్నకును, పాపమ్మకును పుత్రుఁడు. ఈతని వంశమునకు మూలపురుషుఁడగు కొండనమంత్రి క్రీ. శ. 1480 ప్రాంతమున జన్మించినట్లూహింప వలనుపడుటచే, అతని కాఱవ పురుషుఁడగు పేరయలింగము 1620 ప్రాంతమున జన్మించి యుండునని తలంపఁబడుచున్నది. ఇతనికి ఇవటూరి - పెదరామనారాధ్యుఁడు గురువు.

ఈ కవి 'ఒడయనంబివిలాసము' అను ఆఱాశ్వాసముల ప్రబంధమును రచించెను. ఒడయనంబి యను శివభక్తుని కథ యిందు వర్ణింపఁబడినది. ఈతని కవిత్వము లలితమై హృదయంగమముగా నుండును.

## పోచన

ఈతఁడు వైదిక బ్రాహ్మణుఁడు. నృసింహ సోమయాజి పుత్రుఁడు. ఈతని కాలమునుగూర్చికాని, తక్కిన వివరములనుగూర్చి కాని తెలియుట లేదు. ఈ కవి చంద్రాభ్యుదయ మనెడి ప్రబంధమును రచించి అమ్మనమంత్రి కుమారుఁడగు చిన్నయామాత్యున కంకిత మొనర్చెను.

ఈతఁడు నూటయేఁబదియేండ్లకంటెఁ బూర్వుఁడై యుండునని శ్రీ వీరేశలింగము పంతులు గారి యభిప్రాయము.

## పోతనామాత్యుఁడు - బమ్మెర

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. కౌండిన్యగోత్రుఁడు. కేసయ, లక్కమాంబలకుఁ బుత్రుఁడు. ఎల్లన, మాచమల పౌత్రుఁడు. పరమభక్తాగ్ర గణ్యుఁడు. సహజపాండిత్య బిరుదము కలవాఁడు.

ఈతఁడు నిజామురాష్ట్రమందలి ఓరుగల్లు నివాసి. ఇతఁడు తన గ్రంథమున 'ఏకశిలా' నగరమును జెప్పెనుగాని, తెలుఁగుపేరు చెప్పలేదు. కావున నీతఁడు కడపజిల్లాలోని ఒంటిమెట్టనివాసి యని కొందఱు భ్రాంతి పడిరి. కాని 'ఏకశిలా'పదము 'ఓరుగల్లు' నకు సరిపడును; ఒంటిమెట్టకు సరిపడదు.

పోతనకు శ్రీనాథమహాకవి బావమఱది యని ప్రసిద్ధి కలదు. వీరిర్వురును సమకాలికులని చాలమంది తలంచుచున్నారు. శ్రీనాథుఁడు సర్వజ్ఞ సింగభూపాలునివలన మన్ననల నందినట్లు తెలియుచున్నది. పోతన భాగవతమును సర్వజ్ఞ సింగభూపాలుఁడు నేలలోఁ బాతిపెట్టించెనని ప్రతీతి కలదు.

శ్రీనాథుఁడు క్రీ. శ. 1380-1440 నడుమ నున్నందున పోతనామాత్యుఁడు నప్పటివాఁడే యై యుండవలెను.

శ్రీనాథుఁ డీతని బావమఱది కాఁడనియు, పోతన 15-వ శతాబ్ది యొక్క ఉత్తరార్ధమునసే యుండి యుండుననియు 'ఆంధ్రకవి తరంగిణి' కారుల యభిప్రాయము.

పోతనామాత్యుని రచనలుగా భాగవతము, వీరభద్ర విజయము, భోగినీదండకము, నారాయణశతకమును చెప్పఁబడుచున్నవి. వీనిలో నారాయణశతకము పోతన రచించినది కాదని విమర్శకులు నిశ్చయించి యున్నారు.

వీరభద్ర విజయము నాలుగాశ్వాసముల ప్రబంధము. ఇందు భాగవతపుఁబోలికలు చాల కలవు. ఇది పోతన రచించినదే యని చాలమంది నిర్ణయించి యున్నారు.

భోగినీదండకము వేశ్య నాయికగా రచింపబఁడిన దండకము. ఇది పోతన రచన యనుటకును అవకాశమున్నది. కాని పోతన దీనిని రచింప లేదని కొందఱి యభిప్రాయము.

పోతన రచనగాఁ బేరు పొంది యాతనికిఁ గీర్తిప్రతిష్ఠలు కలిగించిన గ్రంథము భాగవతము. ఇది పంద్రెండు స్కంధముల పరిమితి కలది. కాని గ్రంథమంతయును పోతనరచన కాదు. ఇందలి పంచమస్కంధమును గంగన రచించి శ్రీకృష్ణున కంకిత మొనర్చెను. షష్ఠస్కంధమును ఏర్చూరి సింగన రచించి శ్రీకృష్ణున కంకితముచేసెను. పోతన శిష్యుఁడగు వెలిగందల నారయ ఏకాదశ, ద్వాదశ స్కంధములను రచించెను; ఈతఁడు భాగవతములోని దశమస్కంధమందలి యుత్తరభాగమును పూరించి, దాని గద్యలోఁ దనపేరు చెప్పక పోతనామాత్యుని పేరే చెప్పెనని 'ఆంధ్ర కవితరంగిణి' కారుల యభిప్రాయము.

## పోతరాజు

ప్రబంధరత్నావళిలో నీ కవి రచించిన 'బేతాళపంచవింశతి'నుండి కొన్ని పద్యములు గ్రహింపఁబడినవి. ఈతఁడు క్రీ. శ. 1560 కంటెఁ బ్రాచీనుఁడనుటకంటె నింకేమియుఁ జెప్ప సాధ్యము కాకున్నది.

## పోలమరాజు

ఈతఁడు పర్వతపురాణమును రచించినట్లు జగ్గన కూర్చిన 'ప్రబంధ రత్నాకరము'నుబట్టి తెలియుచున్నది. ఈ గ్రంథము లభింపలేదు. ఇందలి విషయ మేమో తెలియదు. కవి క్రీ. శ. 1560 సం. నకుఁ బూర్వుఁడు.

## ప్రతాపరుద్రుఁడు

రుద్రదేవచక్రవర్తి యని ప్రసిద్ధి పొందిన యీ విద్వత్కవి కాకతీయ మహాసామ్రాజ్యమును క్రీ. శ. 1158 నుండి 1195 వఱకును పాలించెను. సంస్కృతాంధ్రములలో విద్వాంసుఁడైన యీతనికి విద్యాభూషణుఁడను బిరు దుండెను.

ఈతఁడు సంస్కృతమునను, ఆంధ్రమునను 'నీతిసారము' అను రాజనీతిశాస్త్రగ్రంథమును రచించెను. ఆ గ్రంథములు లభింపకున్నను, ప్రబంధరత్నావళిలో తెలుఁగు నీతిసారమునందలి పద్యములు కొన్ని కానవచ్చుచున్నవి. 'సంస్కృతంబులోఁ, బరఁగఁ బ్రతాపరుద్ర నరపాలుని చేత రచింపఁబడ్డ యీ, నరవరు నీతిసారము' అనుదానింబట్టి యీతఁడు సంస్కృత నీతిసారమును రచించెనని స్పష్టపడుచున్నది.

## ప్రకాశభారతీయోగి

ఈతఁ డనవేమారెడ్డి యాస్థానమున నుండిన కవి. పెక్కు సంస్కృతాంధ్రకావ్యములను రచించెనఁట! కాని వానియం దొక్కటియు నిప్పుడు లభ్యము కాలేదు. దాక్షారామమునందలి భీమేశ్వరాలయములోని యొక శిలాశాసనమున నీతని పద్యములు రెండు కానవచ్చుచున్నవి.

ఈతఁడు 14-వ శతాబ్దివాఁడు.

## ఫణికుండలకవి

ఈతఁడు మహేశ్వర నివాసి. సంస్కృతాంధ్రములందు సమర్థుఁడగు విద్వత్కవి. నూతేండ్లక్రిందట నీతఁ డుండెనఁట! ఈ కవి సీమంతినీ కల్యాణమను ప్రబంధమును రచించెను. అది ముద్రితము కూడ.

## ఫణిభట్టు - ఈశ్వర

ఈతఁడు వైదికబ్రాహ్మణుఁడు. గార్గ్యగోత్రుఁడు. ఈశ్వరభట్టునకును, రామమ్మకును పుత్రుఁడు. ఈతనికి ఫణిపతి యను నామాంతరము కలదఁట !

ఈతఁడు పరతత్త్వరసాయన మను నైదాశ్వాసముల ప్రబంధమును రచించి తన గురువైన సదానందయోగి కంకితమొనర్చెను. ఇందు పోతనామాత్యుని భాగవతము ననుకరించిన ఘట్టములు కానవచ్చుచున్నవి. కావున నీతఁడు పోతనకంటె నవీనుఁ డనవలెను.

అల్లసాని పెద్దనామాత్యుని మనుచరిత్రమందలి 'అంకముఁజేరి...' అను పద్యమున కనుసరణముగ వినాయకస్తుతిపద్య మీ గ్రంథమున నుండుటవలన నీ కవి పెద్దనామాత్యుని కంటెను కొంచె మర్వాచీనుఁడని— అందువలన 16-వ శతాబ్ది మధ్యమున నుండవచ్చునని 'ఆంధ్రకవితరంగిణి' కర్త మున్నగువారి యభిప్రాయము.

పరతత్త్వరసాయనమునందలి విషయము కఠినమైనను, భాష సరళమై రచన చక్కఁగా నున్నది.

## బడబానలభట్టు

ఇతఁడు కొండవీటి నివాసి యగు విద్వత్కవి యనియు, పెక్కు గ్రంథములను రచించెననియు శ్రీకావలి - వేంకటరామస్వామిగారు వ్రాయుచున్నారు.

ఇతఁ డొకనాఁడు కొలనికిఁ బోయి సంధ్యావందనాదికము నొనర్చుచుండఁగా వ్రేలియుంగరము జారి నీటిలోఁ బడి కానరాకుండ పోయినదఁట ! అప్పు డీతఁడా చెఱువులోని నీరంతయు నింకిపోవలెనని శపింపఁగా, నీరింకిపోయెననియు, తర్వాత బడబానలభట్టు తన యుంగరమును దీసికొనెననియు నొక కథ కలదఁట ! దానిని శ్రీ వేంకటరామస్వామిగారే వ్రాసినారు.

ఇతని గ్రంథము లేవియో తెలియలేదు. కాలమును ఎఱుకపడలేదు.

నీటి నింకింపఁజేయుటవలననే యీతని కీ పేరు వచ్చెనో, లేక బడబానలభట్టనునది సహజనామమో తెలియదు.

## బద్దెనకవి

భద్రభూపాలుఁడని నామాంతరము కల యీ కవి సూర్యవంశ క్షత్రియుఁడఁట ! ఇతఁడు చోళశాఖీయుఁడు.ఒక చిన్న సంస్థానమునకుఁ బ్రభువు. ఈతఁడు రాజనీతిని తెలుపు నీతిశాస్త్రముక్తావళి'ని, జనసామాన్యమునకు నీతిని దెల్పు 'సుమతిశతకము'ను రచించెనని తెలియవచ్చుచున్నది. ఈతని కాలమునుగూర్చి గ్రంథస్థప్రమాణములు లేవు. ఇతరాధారములనుబట్టి చూచిన నభిప్రాయభేదము లున్నవి. కాని యీతఁడు 13-వ శతాబ్ది మధ్యమున నున్నట్లు చెప్పవచ్చునని 'ఆంధ్రకవితరంగిణి'లోఁ గలదు.

ఈతని సుమతిశతకమును గూర్చి యభిప్రాయభేదము లున్నవి. ఇప్పుడు బహుళప్రచారమున నున్న సుమతిశతక మీతని కృతియే యని కొందఱి తలంపు. నీతిశాస్త్రముక్తావళి శైలికిని, ఇప్పటి సుమతిశతకపు శైలికిని చాల భేద మున్నది. సుమతిశతకము నొకదానిని భీమకవి చెప్పినట్లు కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసారసంగ్రహములో నిచ్చిన యుదాహృతినిబట్టి తెలియుచున్నది.

నీతిశాస్త్రముక్తావళికి నీతిసారమనియు, రాజనీతి యనియు పేర్లు కొన్ని లిఖితప్రతులలో నున్నవఁట ! కొన్ని ప్రతులలో నిది మూఁడాశ్వాసములుగా విభజింపఁబడినదఁట ! ఇందలి రచన మిక్కిలి ప్రౌఢమైనది.

## బప్పన కవి

ఈతఁడు కొండవీటి రెడ్డిరాజుల కాలమున నుండెనఁట ! వ్యాకరణమున గట్టి పండితుఁడఁట ! 'ఆంధ్రప్రయోగరత్నాకర' మను గ్రంథమును రచించి తన తండ్రికే కృతి యిచ్చెనఁట ! ఈ యంశము శ్రీ కావలి- వేంకటరామస్వామిగారి గ్రంథము'నఁ గలదు.

## బలభద్రకవి - కవిఘాటి

ఈతఁడు రామకవీంద్రుని పుత్రుఁడు. ఈతఁడు గజారణ్యక్షేత్ర మాహాత్మ్యమను జంబుకేశ్వర మాహాత్మ్యమును పద్యకావ్యముగా రచించెను. ఇది పూర్తిగా లభింపలేదు. 2-వ ఆశ్వాసము మొదలు 6-వ ఆశ్వాసము వఱకును గల పూర్వఖండము మాత్రము లభించినది. ఇది శ్రీగిరి గౌరరాజు బసవన కంకితము. గ్రంథ మముద్రితము.

## బసవకవి

ఈతఁడు కృష్ణా తీరనివాసియనియు, రామభక్తుఁడనియు, సంస్కృతమునుండి రామాయణము నాంధ్రీకరించెననియు, అది ప్రశస్తమైనదనియు శ్రీ కావలి- వేంకటరామస్వామి గారు వ్రాయుచున్నారు. ఆ రామాయణము లభింపలేదు. ఇతని కాలము తెలియదు.

## బసవన - పిడుపర్తి

ఈతఁడు వీరశైవాచారపరాయణుఁడు. వరంగల్లు ప్రాంత మీతని నివాసము. ఈతని తాత యగు పెదసోమయ్య క్రీ. శ. 1360 ప్రాంతమున జన్మించి యుండునని 'ఆంధ్రకవితరంగిణి'లోఁ గలదు. ఈతఁడు 1480 ప్రాంతమువాఁడని శ్రీ శేషాద్రి రమణకవుల యభిప్రాయము.

ఈ కవి వీరశైవ దీక్షాబోధ, పిల్లనైనారు చరిత్రము, బ్రహ్మోత్తర ఖండము నను మూఁడు గ్రంథములను ద్విపదలుగా నొనర్చెను. వీనిలో తొలిగ్రంథము కర్ణాటదేశమునుండి వీరభూపాలునితోఁగూడ వచ్చిన వీరశైవదేశికునివలనఁ దెలిసికొన్న విషయములతో వీరభూపాలుని కోరికపైఁ గూర్పఁబడినట్లు కవి చెప్పికొనెను. ఇది ముద్రితము. తక్కిన గ్రంథములు లభింపలేదు. ఇతని రచన సులభము.

## బసవన్న - కొచిరాజు

ఈతని కులగోత్రములు తెలియవు. కాచిరా జనునది తండ్రిపేరో వంశనామమో తెలియదు. చిత్రకవి-పెద్దన యీతనిని నుతించుటచే నీతఁడు క్రీ. శ. 1480-1530 నడుమ నుండి యుండు ననవచ్చును.

ఈతఁడు 'కవిసర్పగారుడ'మను ఛందోగ్రంథమును రచియించెను. పెద్దనార్యుఁడే కాక కాకునూరి - అప్పకవియు నీతనిని స్మరించెను.

ఆంధ్రసాహిత్య పరిషత్తువారి గ్రంథాలయములో నొక 'కవిసర్ప గారుడము' వ్రాఁతప్రతి యున్నదఁట! కవి నందవరీక బ్రాహ్మణుఁ డనియు, ఆత్రేయ గోత్రుఁడనియు, అది శ్రీగిరి మల్లికార్జునున కంకిత మనియుఁ దెలియుచున్నది. అందు గ్రంథాంతరములలోని పద్యములుఁ చేరుటచే అది కలగూరగంపగా నున్నదఁట!

## బసవప్ప - పిడుపర్తి

ఈతఁడు వరంగల్లునివాసి. వీరశైవాచారతత్పరుఁడు. పాలనార్యుని పుత్రుఁడు. పాలనార్యుఁడు పిడుపర్తి సోమనకుఁ దమ్ముఁడు. సోమనకవి ద్విపదలలో రచించిన ప్రభులింగలీల నీతఁ డైదాశ్వాసముల పద్య కావ్యముగా రచించెను. అల్లమప్రభుని లీల లీ గ్రంథమున విశేషముగ వర్ణింపఁబడినందున నీపేరు గ్రంథమునకు వచ్చినదఁట! ఈతఁడు బసవన కవి మనుమఁడైనందున క్రీ. శ. 1480 ప్రాంతమువాఁడై యుండవచ్చును- శ్రీశేషాద్రిరమణ కవులుఁ, బసవప్ప 1550 ప్రాంతమువాఁడని వ్రాసి యున్నారు.

## బసవయ్య - అంగద

జగ్గనకవి కూర్చిన ప్రబంధరత్నాకరమునుబట్టి యీ కవి 'ఇందుమతీ కల్యాణ'మను ప్రబంధమును రచించినట్లు తెలియుచున్నది. ఆ గ్రంథ

మిప్పూ డెచ్చటను లభింపలేదు. ఈ కవి క్రీ. శ. 1560 కంటెం బ్రాచీనుఁడు.

ఈతని కవిత్వము రసవంతమై, మనోహరమై యుండును.

## బసవయ్య - తులసి

జగ్గకవి కూర్చిన ప్రబంధరత్నాకరములో నీతని 'సావిత్రీకథ'యను ప్రబంధమునుండి కొన్ని పద్యము లుదాహరింపఁబడినవి. ఆ గ్రంథము లభింపలేదు. ఇతని రచన సరళమైనది.

ఇతఁడు క్రీ. శ. 1560 కంటెం బ్రాచీనుఁడు.

## బాపనామాత్యుఁడు - పెనుపల్లె

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. కోనయామాత్యుని పుత్రుఁడు. ఇతనికాలము తెలియలేదు. ఈ కవి సీతావిజయమను నేకాశ్వాసప్రబంధమును రచించెను.

## బాపన్న - మేకా

ఈతఁడు, తాను చతుర్థకులసంభవుఁడనని చెప్పికొన్నాఁడు. క్రీ. శ. 1850 లో గ్రంథమును రచించినట్లు వచించుటచే నీతఁడు 1825 ప్రాంతమున జన్మించి యుండవలెను. ఈతఁడు నాగయ్య, చెల్లమాంబల పెద్దకొడుకు. ఆచంట యీతని నివాసము. 'భూతలోకేశ ! ఆచంటపుర నివేశ ! భావభవనాశ ! రామేశ ! పార్వతీశ !' అను మకుటముతో నొక సీసపద్యశతకమును రచించెను. అది 'ఆచంట రామేశ్వరశతకముఁ'ట ! ఇతఁడు 'మదనగోపాలశతకము'ను కూడ రచించెనఁట ! అది లభింపలేదు.

## బాపయకవి - అల్లమరాజు

ఈతఁ డారామద్రావిడశాఖకుఁ జెందిన వైదికబ్రాహ్మణుఁడు. హారితసగోత్రుఁడు. ఈ కవి క్రీ. శ. 1735 ప్రాంతమున నుండినవాఁడు.

ఈతఁడు 'గావమీమాహాత్మ్య'మను ప్రబంధమును రచించెను. అందలి రచన ప్రశస్తమైనది కాదని శ్రీ వంగూరి - సుబ్బారావుగారు వ్రాసి యున్నారు.

## బాలకవి - కొట్ర

ఇతని పేరు వేంకటేశ్వరులు. 'బాలకవి' బిరుదనామము. క్రమముగ నదియే పేరైనది. ఇతఁడు సోమనార్యుని పుత్రుఁడు. నేఁటి శ్రీకాకుళము జిల్లాలోని రాజామునకు సమీపమునఁగల 'ఇల్లంనాయుడువలస' యీతని నివాసము. ఈ గ్రామము బొబ్బిలిప్రభువు లీనామముగా నిచ్చినదఁట !

బాలకవి 'అడిదము - సూరకవి'తో సమకాలికుఁడు. ఇతఁడు క్రీ. శ. 1730-90 నడుమ నుండిన ట్లూహింపఁబడుచున్నది. 'పర్వతాలు' అను కవి నోడించుటలో నీతనికి సూరకవి సాయపడెనఁట !

ఇతఁడు భల్లాణచరిత్రము, విమలాంగీపరిణయము అను రెండు ప్రబంధములను, కొన్ని శతకములను రచించెనఁట ! విమలాంగీ పరిణయమున మాంధాతృచరిత్రము వర్ణింపఁబడెనఁట ! ఇందు రెండా శ్వాసములే లభ్యమైనవి. ఇతని శతకము లేవో తెలియరాలేదు.

## బాలభాస్కరకవి - అడిదము

సుప్రసిద్ధకవి యగు అడిదము - సూరకవి కీతఁడు తండ్రి. చినలచ్చ మంత్రి కుమారుఁడు. విశాఖపట్టణమండలములోని విజయనగరమునకు సమీపమునఁగల భూపాలరాజు (పూసపాటి) రేగ నివాసి.

సూరకవి తన 'కవిసంశయవిచ్ఛేదము'లో నిచ్చిన యుదాహరణమునుబట్టి యీతఁడు 'శుద్ధాంధ్రరామాయణము'ను రచించినట్లు తెలియుచున్నది. ఈ కవి కూచిమంచి - తిమ్మకవికంటెఁ గొంత ప్రాచీనుఁడు. ఈతని గ్రంథము 'అచ్చతెనుఁగు రామాయణము' కంటెఁ బ్రాచీనమై యుండవలెను. భాస్కరకవి గ్రంథము లభ్యము కాలేదు.

'లక్షణసారము' ఇతని గ్రంథాంతరము. ఇందు ఛందోవిషయములు వివరింపఁబడినవి. ఇది విజయనగరమునకు సమీపముననున్న శ్రీరామతీర్థ క్షేత్రముననున్న శ్రీరామున కంకిత మొనర్పఁబడినది.

ఇతఁడు క్రీ. శ. 1690-1750 నడుమ నుండినవాఁడని తెలియుచున్నది.

## బాలభాస్కరుఁడు – అడిదము

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు: వసిష్ఠగోత్రుఁడు, సుప్రసిద్ధకవియగు అడిదము సూరకవికి మునిమనుమఁడు. ఈతని కాలము క్రీ. శ. 1808-1874: శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి సమకాలికుఁడు. వీ రిరువురును విశాఖపట్టణము జిల్లాలోని మాడుగుల సంస్థానమును పాలించిన కృష్ణభూపతి యాస్థానమున నుండినవారు.

ఈ బాలభాస్కరుఁడు శ్రీ వేంకటేశ్వరశతకము, జానకీరామ శతకము, భోగలింగ శతకము, సింహాశైల నృసింహశతకము మున్నగు శతకములను, కొన్ని చాటువులను, కృష్ణభూపతిపయి 'శ్రీకృష్ణభూపతి తారావళి'ని రచించెను.

## బాలసరస్వతి

క్రీ. శ. 1684-1712 నడుమ తంజావూరు రాజ్యమును పాలించిన శహాజీకాలమున నుండిన యీ కవి ద్విపదభారతములోని సభాపర్వమును రచించెను. ఇతని రచన సరళమై హృదయంగమముగా నుండును. ద్విపద భారతము ముద్రితము.

## బాలసరస్వతి – ఎలకూచి

ఇతఁడు వైదిక బ్రాహ్మణుఁడు: కౌండిన్యగోత్రుఁడు. భైరవార్యుని పౌత్రుఁడు. కృష్ణదేవుని కుమారుఁడు. 'మహోపాధ్యాయ' అనునది యితని బిరుదము. 'బాలసరస్వతి' అనునదియు నితని బిరుదనామమనియు, ఇతని పేరు 'వేంకటకృష్ణయ్య' అనియు 'ఆంధ్రశబ్దచింతామణి టీకాపీఠిక'లలో నున్నట్లు 'కవితరంగిణి'లోఁ గలదు. ఆంధ్రసాహిత్యపరిషత్తువారు ప్రకటించిన టీకలో ఆ నామము లేదు. ఈతని నివాసము గోదావరిమండలమని

కొందఱును, కృష్ణామండలమని కొందఱును తలంచుచున్నారు. ఇతఁడు మహబూబునగరుజిల్లావాఁడని గోలకొండ కవుల సంచికలోఁ గలదు.

ఈతఁడు రంగకౌముదీనాటకము, చంద్రికాపరిణయ మను ప్రబంధము, ఆంధ్రశబ్దచింతామణివ్యాఖ్యానము, భాషావివరణ మను లక్షణ గ్రంథము, రాఘవ యాదవ పాండవీయమను త్ర్యర్థికావ్యము, బాహటము, వామనపురాణము, భ్రమరగీతి ప్రబంధము, కార్తికేయాభ్యుదయము మున్నగు గ్రంథములను రచించినట్లు తెలియుచున్నది. 'సురభిమల్లా!' యను మకుటముతో నీతఁడు భర్తృహరి సుభాషిత త్రిశతి నాంధ్రీకరించెను. ద్విపద భారతములోని సభాపర్వమును రచించిన బాలసరస్వతి వేఱు.

ఈ కవి క్రీ. శ. 1600 ప్రాంతమువాఁడని శ్రీ వెల్లాల - సదాశివ శాస్త్రిగారి 'సురభివారి వంశచరిత్ర'నుబట్టి నిర్ణయింప సాధ్యమగుచున్నది.

రాఘవ యాదవ పాండవీయము నాల్గాశ్వాసముల ప్రబంధము. దాని నీ కవి శ్రీ వేంకటేశ్వరున కంకిత మొనర్చెను. సుభాషితత్రిశతిని శ్రీ సురభి-మల్లభూపాలున కంకిత మొనర్చెను. చంద్రికా పరిణయము పర్తియాల సంస్థానాధిపతి యగు జూపల్లి - వేంకటాద్రిప్రభువు ప్రేరణమున సరస్వతీదేవి కంకితముగ నీయఁబడెను.

## బుచ్చన్నశాస్త్రి - ములుపాక

ఈతఁడారామద్రావిడశాఖకుఁ జెందిన బ్రాహ్మణుఁడు. ఈతఁడు కోదండరాముని పుత్రుఁడు. భార్గవగోత్రుఁడు. ఈతఁడు గుండ్లూరి నివాసి యనియు, 150 ఏండ్లక్రిందట నుండెననియు శ్రీ వీరేశలింగముపంతులు గారి యభిప్రాయము.

ఈ కవి 'వేంకటేశ్వరమాహాత్మ్య'మను ప్రబంధమును రచియించెను. తాను 'కాశికావిశ్వేశ కరుణాకటాక్షాభిభాషిత బహుళప్రబంధచయుఁడ'నని కవి చెప్పికొని యున్నాఁడు. కాని యవి యేవియు లభింపలేదు.

ఈ విద్వాంసుని శ్రీ సి. పి. బ్రౌనుపండితుఁడు పోషించుచుండెను. ఆ యంశము తే 15-6-1821 ని కడపనుండి యీతఁడు బ్రౌనుపండితునకు వ్రాసిన జాబునుబట్టి తెలియుచున్నది. అప్పటికి వృద్ధుఁడైన యీతఁడు 1760 ప్రాంతమున జన్మించి యుండవలెను.

## బుచ్చిపాత్రకవి - కాకరపర్తి

ఇతఁడు వైదికబ్రాహ్మణుఁడు. కాశ్యపగోత్రజుఁడు. కాకరపర్తి కృష్ణకవిపుత్రుఁడు. ఈ కవి రమారమి నూటేండ్ల క్రిందట జీవించి యుండునని శ్రీ వీరేశలింగము పంతులుగారి యభిప్రాయము.

ఈ కవి సత్యవతీపరిణయమను నైదాశ్వాసముల ప్రబంధమును రచించెను. ఇందు సత్యవతీ, శంతనుల వివాహకథ, భీష్మప్రతిజ్ఞ మున్నగు నంశములు వివరింపఁబడినవి. కవి యీ గ్రంథమును రచించి, పిదప విశాఖపట్టణమునందలి జమీందారులగు శ్రీ గోడే నారాయణగజపతిరాయనింగారి జనకున కంకితముగ నీయ సంకల్పించెను. కాని కృత్యాదిని, ఆశ్వాసాంత పద్యములను రచింపకయే యీతఁడు మరణించెను. పిదప శ్రీ నారాయణగజపతిరాయనింగారి కోరికపయి, కవికి పరంపరగా సోదరపుత్రుఁడగు శ్రీ వేంకటశాస్త్రియు, పౌత్రుఁడు శ్రీ సీతారామశాస్త్రియు, కృత్యాదులను పూరించి, గ్రంథమును నారాయణగజపతిరాయనింగారి కంకిత మొనర్చిరి.

## బుచ్చిరాజు - పెనుమెత్స

ఈతఁడు, తాను సూర్యవంశక్షత్రియుఁడైనట్లును, ధనంజయ గోత్రజుఁడైనట్లును వ్రాసికొని యున్నాఁడు. ఇతని తండ్రి వెంకటపతిరాజు. కర్లపాలెముగ్రామ మీతని నివాసము. ఈతఁడు రమారమి నూట యేఁబది సంవత్సరముల క్రిందట నుండినట్లు శ్రీ వీరేశలింగము పంతులుగారి వ్రాఁత వల్లఁ దెలియవచ్చుచున్నది.

ఈ కవి పరతత్త్వప్రకాశిక యను నెనిమిదాశ్వాసముల వేదాంత గ్రంథమును రచించెను. దీనికి భాగవతములోని 'కపిల దేవహూతి సంవాద' మాధారమఁట !

## బుద్ధారెడ్డి - గోన

హైదరాబాదు రాష్ట్రములోని రాయచూరి కీతఁడు ప్రభువఁట! ఈతఁడు కాకతీయప్రభువుల సామంతరాజు. ఈతని తండ్రి విఠలరాజు. ఈతఁడు క్రీ. శ. 1300 ప్రాంతమున నుండెనని యూహింపబడుచున్నది.

'రంగనాథరామాయణ'మని ప్రసిద్ధిచెందిన ద్విపద రామాయణమున కీతఁడే కర్త; ఇతఁడు తన తండ్రి యగు విఠలరాజు కోరికపై ఆతని కంకితముగ నీ గ్రంథమును రచించెను.

రంగనాథుఁడను కవి యొకఁడుండెననియు, ద్విపదరామాయణ మాతని కృతియే యనియుఁ గొందఱు విమర్శకుల యాశయము. పుస్తకమునం దెచ్చటను రంగనాథుని పేరు కానరాదు.

విఠలరాజే పాండురంగఁడనియు, పాండురంగవిఠలనాథుని పేరఁ బరఁగిన రామాయణమే సంగ్రహముగ 'రంగనాథరామాయణ'మని చెప్పఁబడినదనియుఁ గొందఱి యాశయము.

## బెంజమిను షూల్జి

క్రైస్తవుఁడగు నీతఁడు మతవ్యాప్తికొఱకు క్రీ. శ. 1746-47 లలోఁ గొన్ని క్రైస్తవమతగ్రంథములను సరళమగు వ్యావహారికభాషలో రచించెను. వానిలో 'జ్ఞానోపదేశాల సంక్షేపము, మోక్షమార్గము, జ్ఞాన వచనాల చిన్నపుస్తకము, ప్రసంగము' ముఖ్యమైనవి.

## బ్రహ్మయలింగము - ముదిగొండ

ఈతఁడు హైదరాబాదురాష్ట్రములోని మెదకుమండల నివాసి. ఈ కవి క్రీ. శ. 1700 ప్రాంతమువాఁడని గోలకొండ కవుల సంచికలోఁ గలదు.

ఈతఁడు 'శివరహస్యఖండము' అను శైవమతప్రబోధకమగు వచన కావ్యమును రచించెను. ఇది ప్రౌఢమైన రచనయఁట! ఇది స్కాంద

పురాణాంతర్గతము. దీనికి తెలుఁగునఁ గవి 'తత్త్వప్రకాశిని' అని పేరు పెట్టెను. ఇది తొలిసారి 1852 లో ముద్రింపఁబడినది.

## బ్రహ్మానందయోగి - పరశురామపంతుల

ఈతఁడు వేదాంతశాస్త్రముఁ దాటితేటిన 'పరశురామపంతుల' వంశీయుఁడు. ఈతఁడు 'ముముక్షుజనచంద్రహాసము, సత్క్రియానుష్ఠానము' అను వచనకావ్యములను, ఆత్మబోధప్రకరణమునకు వ్యాఖ్యను రచించెను.

ఈతనిని గుఱించిన వివరములు తెలియలేదు.

## భగవత్కవి - సత్యవోలు

ఈతఁ డార్వేల నియోగిబ్రాహ్మణుఁడు; భారద్వాజగోత్రజుఁడు. జనార్దనామాత్యపుత్రుఁడు; గోదావరిజిల్లా నివాసి. ఈతఁడు రెండు వందల యేండ్లక్రిందట నుండెననియు, ఏనుఁగు-లక్ష్మణకవితో సమకాలికుఁడని చెప్పఁదగుననియు శ్రీ వీరేశలింగము పంతులుగారు వ్రాసి యున్నారు.

ఈతఁడు శతాధిక గ్రంథకర్త. తాను నూరు శతకములను, కొన్ని తారావళులను, దశావతార స్తుతులను, ఉదాహరణములను, దండకములను రచించినట్లు కవియే తన 'రుక్మిణీ పరిణయ' మను గ్రంథమునఁ జెప్పికొనెను.

'రుక్మిణీ పరిణయ' మీతని రచనలలో ముఖ్యమైనది. అది నాల్గాశ్వాసముల ప్రబంధము. అందు రుక్మిణీ వివాహవృత్తాంతము వర్ణితము.

## భ వ దూ రుఁ డు

ఈతని సంపూర్ణ నామము భాస్కర భవదూర మహీపతి. విజయనగర రాజ్యమును పాలించిన మొదటి బుక్కరాయల కుమారుఁడు. మొదటి బుక్కరాయలు క్రీ. శ. 1343-1379 నడుమ నున్నందున

నీతఁడు నప్పటివాఁడు కావలెను. ఈతఁడు తండ్రికాలములోను, అన్న యగు రెండవ హరిహరరాయల కాలముననను వారి యధికారమునకు లోఁబడి కడపజిల్లాలోని కొంతభాగమును పాలించెనఁట !

ఈతని గ్రంథము లేవో తెలియదు. మల్హాణచరిత్రను రచించిన యెడపాటి-యెఱ్ఱనయు, తురగా-రామకవియు, అయ్యంకి బాలసరస్వతియు భవదూరుఁడు నుత్తమకవి యని కీర్తించి యున్నారు.

## భవానీ శంకరుఁడు - ఈదురుపల్లి

ఈ కవి యాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు. భారద్వాజగోత్రుఁడు. శంకరామాత్యుని పుత్రుఁడు. ఈతఁడు కూచిమంచి తిమ్మకవికి సమ కాలికుఁడు. కావున 1700-1750 నడుమ నుండి యుండును.

ఈతఁడు శృంగారమంజరి యను కావ్యమును, ధర్మఖండమున కాంధ్రానువాదమును రచించెను. శృంగారమంజరి లభింపలేదు. ధర్మ ఖండమునఁ గొంత భాగమే లభించినదఁట ! ఉపలబ్ధభాగమునుబట్టి చూడఁగా - ఇతని రచన రసవంతమయి, నిర్దుష్టముగా నున్నట్లు తెలియు చున్నది.

## భానుకవి

ఈతఁడు పంచతంత్రమును తెలిఁగించి, శ్రీకృష్ణదేవరాయల కాలమున నుండిన లక్ష్మీనారాయణున కంకిత మొసఁగెను. కృతిపతి సభతీర్చి యుండఁగా 'చిట్టన' యనునతఁడు భానుకవివలన నొక ప్రబంధమును కృతిపొందవలెనని చెప్పెనఁట ! లక్ష్మీనారాయణ, యట్లే కృతిపొందె నఁట! రాయలకాలమున రెంటూరి - చిట్టనామాత్యుఁ డొకఁ డుండెను. ఈ చిట్టన యాతఁడే కావచ్చును.

భానుకవి నియోగిబ్రాహ్మణుఁడు. శ్రీవత్సగోత్రుఁడు. తిప్పన మంత్రి పుత్రుఁడు. విజయనగర నివాసి. ఈతఁడు రాయలకాలమున

నుండుటచే క్రీ. శ. 1510-1530 నడుమ నుండి యుండవచ్చునని 'ఆంధ్ర కవితరంగిణి'లోఁ గలదు.

భానుకవికవిత్వము మృదుమధురమై మనోహరముగా నుండును. ఇతని పంచతంత్ర మముద్రితము.

## భావన - పెమ్మన

ఈతఁడు 'అనిరుద్ధచరిత్ర' మను ప్రబంధమును రచించినట్లు జగ్గన ప్రబంధరత్నాకరమునుబట్టి తెలియుచున్నది. ఆ గ్రంథము లభింపలేదు. కవి క్రీ. శ. 1560 కంటెఁ బూర్వుఁడు.

## భావనామాత్యుఁడు - రేటూరి

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. శ్రీవత్సగోత్రుఁడు. ప్రెగడయామాత్యుని మనుమఁడు. నాంచారమ్మకును, రామనకును కుమారుఁడు. అద్దంకి సింగరాచార్యుల శిష్యుఁడు.

ఈ కవి 'కామేశ్వరీ చరిత్రము'ను ద్విపదకావ్యముగా రచించి, గుంటిచెఱువున వెలసియున్న కామేశ్వరీదేవి కంకితముచేసెను. ఆదిలక్ష్మి శ్రీరాముని మోహించి విఫలమనోరథయై, కామేశ్వరియై జన్మించి యవివాహితయై యుండి, తన్ను గొల్చువారి కోరిక లీడేర్చుచుండును. ఈ కథయే యిందు వర్ణితము.

ఈతఁడు 1600 ప్రాంతమున నుండినవాఁడు.

## భావనారాయణ - కలిదిండి

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. సాలంకాయనగోత్రుఁడు. వెంకటాద్రి, నూరమాంబల కుమారుఁడు. తాత మంత్రిరాజు. ఈతఁడు విష్ణుపురాణమునందలి నాలుగంశములను నాలుగాశ్వాసములుగా రచించి శ్రీ జగన్నాథస్వామి కంకితమొనర్చెను.

వీరి యింటిపేరు తొలుత 'అడవి వా'రఁట! కవిదిండి నివాసమును బట్టి 'కవిదిండివారు'గా నైనదఁట! ఈ గ్రామము కృష్ణాజిల్లా కైకలూరు తాలూకాలోనిదఁట!

ఈతఁడు వైష్ణవమతాభిమాని. ఈతనికి కందాళ-భావనాచార్యుల కుమారుఁడగు శ్రీ రంగాచార్యులు గురువు. తెనాలి - అన్నయ్య, రంగన మంత్రి మున్నగువారికి నీతఁడే గురువు. ఈ శ్రీరంగాచార్యుల శాసనము తిరుపతిలో నున్నది. అది 1545 నాఁటిది. కావున నీ కవియు ఆ కాలము నాఁటివాఁడే యని చెప్పవలెను. ఈతని కవిత్వమున వ్యాకరణదోషములు కానవచ్చుచుండునఁట! ఈతని విష్ణుపురాణము ముద్రితమైనది.

ఈతఁడు 'పురుషోత్తమ ఖండము'ను గూడ నాంధ్రీకరించెను. కాని యీ గ్రంథ మిపుడు లభింపలేదు.

## భాస్కరకవి - శ్రీపతి

ఈతఁడు శ్రీపతి పండితవంశీయుఁడై యుండవచ్చునఁట! 17, 18- శతాబ్దులకుఁ బూర్వుఁడై యుండవచ్చునని శతకకవుల చరిత్రకారుల యూహ. ఈతఁడు వృత్తములలో 'చిత్తమా!' అను మకుటముతో 'చిత్త శతకము'ను రచించెను. ఇందు బౌద్ధసిద్ధాంతములు ప్రశంసింపఁబడినవఁట!

## భాస్కరమంత్రి

ఈతఁడు కవిబ్రహ్మ యగు తిక్కనసోమయాజికి పితామహుఁడు. తిక్కన తన నిర్వచనోత్తర రామాయణమునం దీతనిని మిగుల ప్రశంసించి యున్నాఁడు. ఈతఁడు గుంటూరి విభుఁడఁట! ఈతఁడు క్రీ. శ. 1190-1220 ప్రాంతమున నుండినవాఁడని శ్రీ నిడుదవోలు-వేంకటరావు గారు వ్రాసి యున్నారు.

భాస్కరరామాయణమని పేరుపడిన రామాయణములోని యరణ్య కాండ మీతని రచనయఁట! తాళపత్రప్రతులనుబట్టి బాలాయోధ్యారణ్య కాండముల నీతఁడు రచించెనని తెలియుననియు, తర్వాతఁ గొన్ని

పోర్పులు జరిగినవనియు, దీనిని హుళిక్కి భాస్కరుఁడు మున్నగువారు పూరించిరనియు, ప్రారంభించిన కవిపేరును, పూరించిన కవిపేరును అభిన్నములగుటచే గ్రంథమునకు 'భాస్కరరామాయణ' మను పేరు వచ్చి యుండుననియు విమర్శకుల యాశయము.

ఈ రామాయణము మూలానుసారి కాదు. కావుననే తర్వాతికాలమున ఎఱ్ఱాప్రెగడ 'వల్మీకభవు వచోవైఖరిని' రామాయణము నాంధ్రీకరింపఁ బూనుకొనెను.

## భాస్కరాచార్యులు

ఈతఁడు భాస్కరపంతులని శ్రీ వీరేశలింగముపంతులుగారు వ్రాసియున్నారు. కాని యీతని గ్రంథమందలి యాశ్వాసాంత గద్యములవలన నీతఁడు భాస్కరాచార్యులని తెలియవచ్చుచున్నది. ఈతఁడు బొల్లనార్యుని తనూజుఁడు. గోదావరిజిల్లా పెనుగొండనివాసి.

ఈతఁడు వైశ్యపురాణమను నెనిమిదాశ్వాసముల పద్యకావ్యమును రచించెను. అది పెనుగొండయందలి వైశ్య యువకుల కంకితమొనర్పఁబడినది. దీనికి 'కన్యకాపురాణము, వాసవీ మాహాత్మ్యము' అను నామాంతరములుఁ కలవు. ఇది ముద్రితమైనది. ఈ గ్రంథమెప్పుడు రచింపఁబడినదియుఁ స్పష్టముగాఁ దెలియదు. కాని, కవి పోతనామాత్యుని నుతించుటంబట్టియు, క్రీ. శ. 1704 లో వ్రాయఁబడిన దీని ప్రతి లభించుటంబట్టియు నిది 1500-1700 నడుమ రచితమై యుండవచ్చునని 'ఆంధ్రకవితరంగిణీ' కారుల యాశయము.

ఈ గ్రంథములోని మొదటి నాలుగాశ్వాసములును వైశ్యుల జన్మవృత్తాంతము, వారు కైలాసమునుండి భూమి కవతరించుట మున్నగు పురాణ గాథలతో నిండి యున్నవి. మిగిలిన నాలుగాశ్వాసములలోను వాసవీకన్య వృత్తాంతము కలదు. భాస్కరకవి కవిత్వము మనోహరమై యింపుగా నుండును.

# భీమకవి - వేములవాడ

ఈ కవి వేములవాడ భీమకవి యని కొందఱును, లేములవాడ భీమకవి యని కొందఱును తలంచుచున్నారు. లేములవాడ హైదరాబాదు రాష్ట్రమునందలి కరీంనగరుజిల్లాలో నున్నది. ఈతఁడు 'ఉద్దండకవి'. ప్రాచీనకవులలో శ్రీనాథుఁడే యీతనిని తొలుతఁ బేర్కొనెనఁట ! బహుదేశములు తిరిగి, పెక్కుమంది ప్రభువులను దర్శించి, తన శాపానుగ్రహ సామర్థ్యమును వెల్లడించిన కవులలో నీతఁడు ముఖ్యుఁడు.

ఈతని కాలమును నిర్ణయించుట కీతని గ్రంథములు లభింపలేదు. కాని పూసపాటి రాచిరాజ విరచితమగు మాలికనుబట్టి యీతఁడు క్రీ. శ. 1100-1180 నడుమ నుండి యుండునని శ్రీ నిడుదవోలు - వేంకటరావు గారు నిర్ణయించి యున్నారు.

భీమకవి 'కవిజనాశ్రయము' అను ఛందోగ్రంథమును రచించినట్లు ప్రసిద్ధి. కవిజనాశ్రయము రేచనకృతము కాని, భీమకవికృతి కాదని కొందఱు విమర్శకుల తలంపు. ఈతఁడు రాఘవపాండవీయమను ద్వ్యర్థి కావ్యమును రచించినట్లు పింగళి-సూరనార్యుఁడు తెల్పినాఁడు. ఆ గ్రంథము నేఁటికిని లభింపలేదు. నృసింహపురాణము, శతకంఠరామాయణము నను రెండు గ్రంథములు భీమకవికృతము లైనట్లు లక్షణగ్రంథములందలి యుదాహృతులనుబట్టి తెలియుచున్నది. ఆ గ్రంథములును లభ్యములు కావు. ఈతఁడు కన్నడమున 'బసవపురాణము'ను వ్రాసెనని శ్రీ వీరేశలింగము పంతులుగారి యభిప్రాయము. కాని, అట్లు నిర్ణయించుట కింకను తగిన ప్రమాణములు కావలెను.

'రామగోపాలచరిత' మీతని ద్వ్యర్థి కావ్యమై యుండునని కొందఱనుకొనిరి. కాని, నేఁ డది వేఱొక కవి కృతిగా లభించుచున్నది.

భీమకవి చాటువులు ప్రసిద్ధములై యున్నవి.

## భైరవకవి

ఈతఁడు నియోగి బ్రాహ్మణుఁడు. గౌతమగోత్రుఁడు. గౌరనామాత్యుని పుత్రుఁడు.

ఈ కవి శ్రీరంగమాహాత్మ్యము, రత్నశాస్త్రము, కవిగజాంకుశము ననుమూఁడు గ్రంథములను రచించెను. వీనిలో మొదటి రెండు గ్రంథములును ముద్రితములు. గరుడపురాణము ననుసరించి వ్రాయఁబడిన శ్రీరంగమాహాత్మ్య మైదాశ్వాసముల ప్రబంధము. ఇందలి కవిత్వము ప్రౌఢమై భక్తిరసముతో నిండి మనోహరముగా నుండును.

శ్రీరంగమాహాత్మ్యము చాగయామాత్యుని పుత్రుఁడగు రాఘవామాత్యునకంకిత మొనర్పఁబడినది. కృతిపతియన్న యగు విట్ఠలుఁడు 'ఇమ్మడి సయ్యపఖానుని రాజ్యభారము వహించినవాఁ'డఁట! ఈ సయ్యపఖా నొక సామంతుఁడు కావచ్చును. అతనికాలము తెలియదు.

రత్నపరీక్ష 80 పద్యముల చిన్నగ్రంథము. ఇందు నవరత్నముల లక్షణములు గుణదోషములు వివరింపఁబడినవి. ఇది ముదిగొండ-వీరేశ్వరున కంకిత మొనర్పఁబడినది.

హరిశ్చంద్ర ద్విపద మున్నగు గ్రంథములను రచించిన గౌరనమంత్రి యీతని తండ్రి యని కొందఱును, ఆ యంశము సంశయాస్పదమని కొందఱును భావించుచున్నారు. ఇతఁడు గౌరనమంత్రిపుత్రుఁడనుట కాటంకము కానరాదు. ఇతని కవిగజాంకుశమును ముద్దరాజు - రామన్న, లింగమగుంట-తిమ్మకవి మున్నగు లాక్షణికు లుదాహరించిరి. గౌరనయుఁ దన లక్షణ దీపికలో దీని నుదాహరించెను. కుమారుని గ్రంథమును తండ్రి యుదాహరించుట యసంభావ్యము కాదు. గౌరనకాలము క్రీ. శ. 1380-1440 ప్రాంతము; కావున నీ కవియు 1410-1460 నడుమ నుండి యుండునని 'ఆంధ్రకవితరంగిణి'లో వ్రాయఁబడినది.

## మంచన

ఈతఁడు కేయూరబాహుచరిత్ర మనెడి నాల్గాశ్వాసముల ప్రబంధ మును రచించెను. అయ్యది సంస్కృతమున రాజశేఖరకవి రచించిన విద్ధ సాలభంజిక యను దృశ్యకావ్యము ననుసరించి వ్రాయఁబడినది. మంచన తన గ్రంథమును నండూరి - గుండయామాత్యున కంకిత మొనర్చెను. ఈ గుండయ నండూరి కేతనమంత్రికి మనుమఁడు. కేతన క్రీ. శ. 1206 వఱ కను రాజ్యముచేసిన పృథ్వీశ్వరుని మంత్రి. కావున మంచన 13-వ శతాబ్ది రెండవ భాగమున జన్మించి యుండుననియు, ఇతని కేయూరబాహు చరి త్రము క్రీ. శ. 1300 ప్రాంతమున రచింపఁబడి యుండుననియుఁ జెప్ప వచ్చును. 'ఆంధ్రకవితరంగిణి'లో నిట్లే యున్నది.

కేయూరబాహుచరిత్రము చమత్కారము గల నీతి కథలవ నిల యము. ఇందలి శైలి ప్రౌఢమై, రసవంతమై యుండును.

## మడివ్యాళయ్య - మఠం

ఈతఁడు హైదరాబాదు రాష్ట్రమందలి నిజామాబాదు జిల్లాలోని బోర్లెం గ్రామనివాసి. రమారమి 120 ఏండ్లక్రిందట నుండెనఁట! ఈతఁడు కర్ణాటాంధ్రభాషలలో సమర్థుఁడు.

ఈతఁడు శారదరామాయణమను గ్రంథమును రచించెను. అది యముద్రితము.

## మనుమంచిభట్టు

హయలక్షణవిలాస మనెడి యీతని గ్రంథమునందలి యాశ్వాసాంత గద్యలనుబట్టి యీతఁడు భైరవాచార్యుల పుత్రుఁడనియు, కవితాచాతురీ ధురీణుఁడనియు తెలియుచున్నది. హయలక్షణవిలాసము ఔబళరాజు పుత్రుఁడగు కంపభూపతి కంకిత మొనర్పఁబడినది. ఈ కంపభూపతిశాసనము క్రీ. శ. 1459 నాఁటిది తిరుపతి దేవస్థానమునఁ గలదు. ఇది తమిళ

గాసనము. కర్నూలుజిల్లా పెద్దచింతకుంట గ్రామముననున్న, ఈతని గాసనము క్రీ. శ. 1442 నాటిది కలదు. పై శాసనములనుబట్టి మనుమంచి భట్టుకాలము క్రీ. శ. 1442-1459 ప్రాంతమని నిశ్చయింపఁబడినది.

హయలక్షణసార మశ్వముల లక్షణములను దెల్పు గ్రంథము. ఇందలి కవిత్వము మృదువై యింపుగా నుండును.

## మన్నారుదేవుఁడు

ఈతఁడు తంజావూరిప్రభువగు విజయరాఘవనాయకుని కుమారుఁడు. తండ్రి తాతలవలెనే విద్వత్కవి. ఈతఁడు 'విజయరాఘవాభ్యుదయము, హేమాబ్జనాయికా స్వయంవరము' అను రెండు ప్రబంధములను రచించెను. వీనిలో విజయరాఘవాభ్యుదయ మిప్పుడు లభింపలేదు. రెండవ గ్రంథము క్రీ. శ. 1664 లో రచింపఁబడినదఁట ! కావున నీతఁడు 1630 ప్రాంతమున జన్మించి యుండవలెను. మహారాష్ట్రులతో జరిగిన యుద్ధములో నీతఁడు తండ్రితోఁబాటు క్రీ. శ. 1674 లో దివంగతుఁ డయ్యెను.

'హేమాబ్జనాయికా స్వయంవరము'న హేమాబ్జనాయిక (చెంగమ్మ)ను రాజగోపాలునకు (మన్నారుస్వామికి) వివాహ మొనర్చిన కథ వర్ణితము. రచన సొంపుగా నుండును.

## మల్లన - చెదలువాడ

ఈతఁడు వెలనాటి నియోగిబ్రాహ్మణుఁడు. శ్రీవత్సగోత్రుఁడు. లింగ నామాత్యునకును, కామాక్షమ్మకును కుమారుఁడు. ఎఱ్ఱనామాత్యునికి మనుమఁడు. కవిత్రయములో నొకఁడగు ఎఱ్ఱాప్రెగడ వంశీయుఁడు.

ఈతఁడు 'విప్రనారాయణచరిత్ర'మను నైదాశ్వాసముల పద్య కావ్యమును, రుక్మాంగదచరిత్ర యను ద్విపదకావ్యమును రచించెను. విప్రనారాయణచరిత్రము మాకరాజుకుమారుఁడైన తిరుమలరాజునకుఁ

గృతి యీయఁబడెను. రుక్మాంగద ద్విపద యిపుడు లభింపలేదు. కాని యప్పకవి యుదాహరించిన యొక ద్విపదనుబట్టి యది రాముయభాస్కరున కంకిత మొసఁగఁబడినట్లు తెలియుచున్నది.

విప్రనారాయణచరిత్ర కృతిపతి తిరుమలరాజు కార్వేటినగరాధిపతి. ఈ కృతిపతియు, కృతికర్తయు క్రీ. శ. 1580 ప్రాంతమున నుండిన వారని 'ఆంధ్రకవితరంగిణి'లో నిర్ణయింపఁబడి యున్నది.

సారంగు-తమ్మయ్యయు, ఈతఁడును ఇంచుమించుగా సమకాలికులు. అతని వైజయంతీ విలాసమునను, ఈతని విప్రనారాయణచరిత్రయందును కథ యొక్కటియే! ఒకరి కావ్యము నింకొకరు చూడక గ్రంథరచనకుఁ బూని యుండవచ్చును. మల్లనకవిత్వము రసవంతమైనది.

## మల్లన - పావులూరి

ఈతఁడు శాస్త్రగ్రంథమును రచించిన కవి. క్రీ. శ. 9-వ శతాబ్దిలో మహావీరాచార్యుఁడను జైనపండితుఁడు సంస్కృతమున రచించిన 'గణితసారసంగ్రహ'మను గణితగ్రంథము ననుసరించి మల్లన 'పావులూరి గణిత'మని ప్రసిద్ధి చెందిన గ్రంథమును రచించెను. ఇందు మూలపద్ధతులు, సూత్రములు గ్రహింపఁబడి ఉదాహరణములు మాత్రము కవిచేఁ గూర్పఁ బడినవి.

పావులూరి గణితము కరణము లందఱివద్ద నుండఁదగినది. కావున నిందు మార్పులు, చేర్పులు చాల కలిగి యుండవచ్చును.

ఈతని తాత యగు మల్లనకు రాజరాజు పీఠపురప్రాంతమందలి అఖండవాడను బహూకరించినట్లున్నది. ఈ రాజరాజు రాజరాజనరేంద్రుఁ డనియు, కాఁగా-తాతమల్లన 1050 ప్రాంతమువాఁడైనచో, మనుమఁడు 1100 ప్రాంతమువాఁడై యుండుననియు కొందఱు తలంచిరి. కాని యట్లు తలఁచుట కాధారము లేదఁట! కన్నడమున రాజాదిత్యకవి క్రీ. శ. 1120 ప్రాంతమున రచించిన 'రాజాదిత్యగణితము' యొక్క అనుకరణము

మల్లన గణితములోఁ గానవచ్చుచున్నందున మల్లన ఆ తర్వాతివాఁడనియు, ఈతని గణితము 1157-1198 నడుమ రచింపఁబడి యుండవచ్చుననియు 'తెనుఁగుకవుల చరిత్ర'లోఁ గలదు.

## మల్లనకవి - పావులూరి

గణితశాస్త్రకర్తకంటె నీతఁడు భిన్నుఁడు. పావులూరి నివాసి. వసిష్ఠగోత్రజుఁడు. రామన్న, పాపమ్మల పుత్రుఁడు. ఈతఁడు 'శ్రీమద్భద్రాద్రిరామ! శ్రీరఘురామా!' అను మకుటముతో నొక శతకమును రచించెను. దానికి 'భద్రాద్రి రామశతక'మని పేరఁట! ఈతఁడు 1750 ప్రాంతమువాఁడు కావచ్చునని శతకకవుల చరిత్రలోఁ గలదు.

## మల్లన - ప్రౌఢకవి

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. శ్రీవత్సగోత్రుఁడు. పోతయ్యకును, అమ్మలమ్మకును పుత్రుఁడు. శక్తినాథుని శిష్యుఁడు. ఈ కవి రుక్మాంగద చరిత్రమను నామాంతరము గల ఏకాదశీ మాహాత్మ్య మను ప్రబంధమును రచించెను. ఇది యైదాశ్వాసముల కావ్యము. కవి దీనిని గోదావరిజిల్లా లోని దాక్షారామమునందలి భీమేశ్వరస్వామి కంకిత మొనర్చెను.

ఈతని కాలమును నిర్ణయించుటకుఁ దగిన యాధారములు లేవు. కాని యీతఁడు 15-వ శతాబ్దిలో నుండినట్లు పలువు రూహించుచున్నారు. ఈతఁడు బమ్మెర పోతనామాత్యుని పుత్రుఁడని కొందఱి భ్రాంతి. కాని గోత్రాదికములు విభిన్నము లగుటచే, అట్లూహించుట కవకాశము లేదు.

ఈతని కవిత్వము సలక్షణమై, ప్రౌఢమై మనోహరముగా నుండును. ఈకవితాగుణమును బట్టియే యీతనికి 'ప్రౌఢకవి' అను నామము వచ్చి యుండునేమో!

## మల్లన - మాదయ్యగారి

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. శౌనకగోత్రుఁడు. అయ్యంకి నివాసి. మాదయామాత్యుని పుత్రుఁడు. అఘోరశివ శిష్యుఁడు. తండ్రి పేరినిబట్టి యీతనికి 'మాదయ్యగారి మల్లన' అని పేరు వచ్చినది. మల్లన లనేకు లుండుటయే దీనికిఁ గారణము కావచ్చును. ఇతని యింటిపే రయ్యంకి వారై యుండురని 'ఆంధ్రకవితరంగిణి'లోఁ గలదు. అయ్యంకిగ్రామము కృష్ణాజిల్లాలోనిది.

ఈ కవి 'రాజశేఖర చరిత్ర' మను మూఁడాశ్వాసముల ప్రబంధమును రచించి, తిమ్మరుసుమంత్రి యల్లుఁడగు నాదెండ్ల - అప్పామాత్యున కంకిత మొనర్చెను. ఈ యప్పామాత్యుఁడు గోపమంత్రి సోదరుఁడు. మల్లన కవి రాయల యాస్థానమునందలి యష్టదిగ్గజములలో నొక్కఁడని ప్రసిద్ధి. రాయలు మరణించినతర్వాతఁగూడ క్రీ. శ. 1540 వఱకును, ఈతఁడు జీవించి యుండునని శ్రీ వీరేశలింగము పంతులుగారి యభిప్రాయము. ఈతఁడు క్రీ. శ. 1480 ప్రాంతమున జన్మించి, రాయల రాజ్యాభిషేకమునకుఁ బూర్వము కాని, లేదా- కొండవీటిని జయింపకపూర్వము (క్రీ. శ. 1515 సం.కుఁ బూర్వము) కాని దీనిని రచించియుండవచ్చునని 'ఆంధ్రకవితరంగిణీ' కారుల యభిప్రాయము.

గ్రంథమును శ్రీ కృష్ణదేవరాయల కంకిత మొనర్పనంతమాత్రమున, ఈతఁడు రాయల యాస్థానమున లేఁడని చెప్పుట యుచితము కాదని కొందఱి యభిప్రాయము.

ఈతని కవిత్వము మృదుమధురమై రసవంతమయి యుండును

## మల్లనయోగి

ఈతఁడు వేమనతరగతికిఁ జెందిన యోగి. గంజాముజిల్లా పర్లాకిమిడి ప్రాంతనివాసియఁట! ఈతని కాలము సరిగాఁ దెలియదు. ఈతఁడు

'మల్లనయోగీ!' అను మకుటముతో నొక కందపద్య శతకమును రచించెను. దానికి 'మల్లనయోగి శతక'మని పేరు. ఇది 1901 లో ముద్రితము.

## మల్లన్న - తరిగొప్పుల

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. దత్తాత్రేయ యోగీంద్రుని శిష్యుఁడు. నరసామాత్య, తిప్పాంబలకుఁ గుమారుఁడు. మల్లామాత్య, నాగమాంబల మనుమఁడు. కర్నూలుజిల్లాలోని తరిగొప్పుల నివాసియఁట!

ఈతఁడు 'చంద్రభాను చరిత్ర' మను నైదాశ్వాసముల ప్రబంధమును రచించి తనయిష్టదైవమగు దత్తాత్రేయున కంకితమొనర్చెను. ఈ కవి తిరుమలరాయల కుమారుఁడగు వెంకటపతిరాయల కాశ్రితుఁడు. వెంకటపతిరాయలు క్రీ. శ. 1586 మొదలు 1613 వఱకు రాజ్యము పాలించెను. కావునఁ గవియు నప్పటివాఁడే యగును.

చంద్రభాను చరిత్రమున శ్రీకృష్ణుని పుత్రుఁడు చంద్రభానునకు కుముదినితో జరిగిన పరిణయము ముఖ్యముగా వర్ణితము. శైలి ప్రౌఢమై, రసవంతమై యుండును.

## మల్లన్న - ముమ్మడి

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. శాండిల్యగోత్రుఁడు. కృష్ణమంత్రి, రఘుపతమ్మల పుత్రుఁడు. గంగన్న, సర్వాంబల పౌత్రుఁడు. కృష్ణాజిల్లాలోని కొప్పురావూరితని నివాసమఁట! ఈతఁడు 'శ్రీరామ స్తవరాజ' మను మూఁడాశ్వాసముల పద్యకావ్యమును రచించి శ్రీకృష్ణున కంకితము చేసెను.

తాను 'తత్త్వచంద్రోదయ' మను వేదాంతగ్రంథమును ద్విపదకావ్యముగా రచించినట్లును, ధేనువుకొండ - తిమ్మయాచార్యునికి శిష్యుఁడైనట్లును కవియే చెప్పియున్నాఁడు. వేదాంతవిషయములను సులభముగాఁ జెప్పుటలో నీతఁడు సమర్థుఁడు. 'శ్రీరామ స్తవరాజము' 16-వ శతాబ్ది లోని యుత్తరార్ధమున రచింపఁబడినదని 'ఆంధ్రకవితరంగిణి'లోఁగలదు.

## మల్లియ - మద్దికాయల

జగ్గకవి కూర్చిన 'ప్రబంధరత్నాకరము'ను బట్టి యీతఁడు 'రేవతీ పరిణయ' మను ప్రబంధమును రచించినట్లు తెలియుచున్నది. ఈ గ్రంథము లభింపలేదు.

ఈ కవి క్రీ. శ. 1560 కంటెఁ బూర్వుఁడు.

## మల్లయకవి-నందూరి

జగ్గకవి కూర్చిన ప్రబంధరత్నాకరమును బట్టి యీతఁడు 'హరదత్తోపాఖ్యాన' మను ప్రబంధమును రచించినట్లు తెలియుచున్నది. ఆ గ్రంథము లభింపలేదు. ఇతఁడు 1560 కంటెఁ బూర్వుఁడు.

## మల్లయ్య - నంది, సింగయ్య - ఘంట

వీరిర్వురు నియోగిబ్రాహ్మణులు. జంటకవులు, మల్లయకవి కౌశిక గోత్రజుఁడు. సింగనామాత్యుని పుత్రుఁడు. దక్షిణామూర్తి శిష్యుఁడు. సింగయకవి భారద్వాజగోత్రుఁడు. నాగయామాత్యుని కుమారుఁడు. అఘోరశివశిష్యుఁడు. ఈ సింగయకు 'మలయమారుతకవి' అను నామాంతరము కలదు. మల్లయకు సింగయ్య మేనల్లుఁడు. సింగయ్యకు రాయల సభలో నుండిన ముక్కు-తిమ్మన్న మేనల్లుఁడు.

వీ రిర్వురును ప్రబోధచంద్రోదయము, వరాహపురాణము అను రెండు ప్రబంధములను రచించిరి. ప్రబోధచంద్రోదయము క్రీ. శ. 1480 ప్రాంతమున రచింపఁబడినదనియు, వరాహపురాణము 1485-90 ప్రాంతమున రచింపఁబడినదనియు 'ఆంధ్రకవితరంగిణి'లోఁ గలదు.

సంస్కృతమునఁ గృష్ణమిశ్రుఁడు వ్రాసిన 'ప్రబోధచంద్రోదయ' మను వేదాంతనాటకమునకు 'ప్రబోధ చంద్రోయము' పద్యరూపమగు ననువాదము. ఇది యైదాశ్వాసములు కలది. ఇది తిమ్మభూపాలుని

పుత్రుఁడగు బసవరాజువద్ద మంత్రిగా నుండిన గంగయామాత్యుని కంకిత మొనర్పఁబడినది.

వరాహపురాణము సంస్కృతపురాణము ననుసరించి వ్రాయఁబడిన 12 ఆశ్వాసముల ప్రబంధము. ఇది సాళువ-నరసింహరాయల యొద్ద దండ నాయకుఁడును, శ్రీకృష్ణదేవరాయల తండ్రియు నగు తుళువ నరసరాయల కంకితముగ నీయఁబడినది.

వీరి కవిత్వము ధారాశుద్ధి కలిగి హృదయంగమమై యుండును.

నంది మల్లయకవి 'మదనసేన'మను ప్రబంధమును రచించినట్లు పెదపాటి జగ్గన కూర్చిన 'ప్రబంధరత్నాకరము'ను బట్టి తెలియుచున్నది. ఆ గ్రంథము లభింపలేదు.

కస్తూరిరంగకవి తన 'రంగరాట్ఛందస్సు'లో 'నంది సింగన' వ్రాసిన వామనపురాణములోని పద్యము నుదాహరించెను. అతఁడు 'నంది మల్లయ'కు బదులు 'నంది సింగన' అనెనో, లేక వేఱే కవి యున్నాఁడో తెలియదు. ఈ జంటకవులు వామనపురాణమును రచించినట్లు కానరాదు.

## మల్లారెడ్డి - కామినేని

ఈతఁడు హైదరాబాదు రాష్ట్రమునందలి మెదకు జిల్లాలోని బిక్కనవోలు గ్రామమున నుండినవాఁడు, దోమకొండ ప్రభువుల కీతఁడు పూర్వుఁడు. ఈతఁడు గోలకొండ నవాబగు మాలిక్ ఇబ్రహీం (మల్కిభరాము) ప్రభువు కాలములో నుండినవాఁడు. ఆ ప్రభువు క్రీ. శ. 1550 నుండి 1580 వఱకును రాజ్యమును పాలించెను. ఈతని కాలమున మల్లారెడ్డి యువకుఁడై యుండెను. కావున నీ కవి క్రీ. శ. 1600 వఱకును జీవించి యుండినట్లు తలంపవచ్చును.

ఈ కవి కాచారాజు పుత్రుఁడు, బిక్కనవోలి ప్రభువు. ఈతఁడు 'షట్చక్రవర్తిచరిత్రము, పద్మపురాణము, శివధర్మోత్తరఖండము' అను మూఁడు గ్రంథములను రచియించెను. మూఁడును ముద్రితములు. వీనిలో

మచ్ఛక్రవర్తి చరిత్రము ప్రసిద్ధమైనది. అం దెనిమిదాశ్వాసములలో నాలుగురు చక్రవర్తుల చరిత్రము వర్ణింపఁబడినది.

ఈతని కవిత్వము సలక్షణమయి, రసవంతమై యుండును.

## మల్లారెడ్డి దేశాయి

ఈతఁడు పర్వతరెడ్డి మనుమఁడు. రంగారెడ్డి పుత్రుఁడు. ఈతఁడు "గంగాపురమాహాత్మ్య"మను ప్రబంధమును రచించెను. దాని వ్రాఁతప్రతి యసమగ్రముగ ఆంధ్రసాహిత్య పరిషత్తులో నున్నదఁట! ఈతని పెదతాత కుతుబ్‌షాచేత బహుమతుల నందెనఁట! అతఁడు క్రీ. శ. 16-వ శతాబ్ది ప్రథమభాగమున నుండెను. అతని తమ్ముని మనుమఁడగు నీ కవి 1600 ప్రాంతమున నుండెనని చెప్పవచ్చును.

గంగాపురము హైదరాబాదు ప్రాంతములోనిది.

## మల్లికార్జున పండితుఁడు

ఈతఁడు పండితత్రయములోఁ దృతీయుఁడు. ఆంధ్రదేశమున శైవమతమును చిరస్థాయిగా నొనర్చిన మత సంస్కర్త. లింగధారి మతసంప్రదాయమునకు మూలపురుషుఁడు. ఈతఁడు ఋగ్వేది. గౌతమ గోత్రజుఁడు. ఈతఁడు గోదావరిజిల్లాలోని దాక్షారామ భీమేశ్వరుని పూజించు భీమన పండితునకును, గౌరాంబకును పుత్రుఁడు. ఈతఁడు క్రీ. శ. 1150 ప్రాంతమున నుండినవాఁడు.

ఈతఁడు పెక్కుగ్రంథములను రచించెను. అవి-హరలీల, మహిమ్నస్తవము, మలహరణము, అనామయము, హాలాయుధము, పంచగద్యలు, సుప్రమహిమ, సంసారమాయాస్తవము, శంకరగీత, ఆనందగీతలు, బసవగీతములు, దక్షాధ్వరము, న్యాసాష్టకము, గణాడంబరము, శారదధను, తుమ్మెదపదములు, ప్రభాతపదములు, పర్వతపదములు, ఆనందపదములు, శంకరపదములు, నివాళిపదములు, వాలేశు పదములు, గొబ్బిపదములు,

వెన్నెల పదములు, పంజవర్ణన, గణవర్ణనపదములు, బాణగద్య, అక్షర గద్య, వర్ణాడంబరము, నీలకంఠ స్తవము, మయూర స్తవము, మలయరాజీయము, మానిదండకము, మహాస్తోత్రసూత్రములు, శతకము, దీపకలిక, మహానాటకము, ఉదాహరణములు, ముక్తకములు, గీతసూక్తములు, భృంగి స్తవము, రుద్రసహస్రనామములు, శివతత్త్వసారము మున్నగునవి.

పై వానిలో శివతత్త్వసారము మాత్రము లభించుచున్నది. ఇందెన్ని పద్యము లున్నవో తెలియదు గాని, ఇప్పటివఱకు 489 పద్యములు లభించినట్లు ముద్రితప్రతినిబట్టి తెలియుచున్నది. ఇయ్యది శైవమత తత్త్వప్రతిపాదకమగు కంద పద్యమయ గ్రంథము. రచన రసవంతము, ప్రౌఢము.

## మల్లికార్జున పండితుఁడు - పాల్లంపల్లి

ఈ కవి క్రీ. శ. 1800 ప్రాంతమున నుండెను. ఈతఁడు శార్దూల, మత్తేభ వృత్తములతో 'అగస్త్యేశ్వరశతకము'ను, దేవీస్తుతి పరముగా సీస పద్యములతో 'శ్యామలాంబా శతకము'ను రచించెను. ఇతని రచన ప్రౌఢమై, హృదయంగమమై యుండును.

## మల్లికార్జునభట్టు - శాకవల్లి

ఈతఁడు వైదిక బ్రాహ్మణుఁడు. హుళక్కి - భాస్కరుని కుమారుడు. ఈతని నివాసము గుంటూరు మండలములోని పలనాటిసీమయఁట ! హుళక్కి భాస్కరుఁడు 13-వ శతాబ్ది చివఱను, 14-వ శతాబ్ది ప్రారంభమునను ఉండుటచే నీ కవి క్రీ.శ. 1280-1330 నడుమ నుండి యుండవచ్చు, నని 'ఆంధ్రకవితరంగిణి' కారుల యభిప్రాయము.

భాస్కర రామాయణములోని బాల, కిష్కింధా, సుందర కాండముల నీతఁడు రచించినట్లు ప్రతీతి. కాని యీ కాండములను తొలుత మంత్రి భాస్కరుఁడే రచించెననియు, అవి మిక్కిలి క్లిష్టముగా నున్నందున నీతఁడు కొన్ని మార్పులుచేసి, కొన్ని భాగములను చేర్చెననియు,

రామాయణ రచనతో సీతనికిఁ గల సంబంధ మీ మాత్రమే యనియు పెక్కుమంది విమర్శకుల యభిప్రాయము.

ఇతని తండ్రి హుళక్కి భాస్కరుఁడు, తాను రచించిన యుద్ధ కాండమును సాహిణి మారున కంకిత మొనర్చెను; కావున లేఖకులెవ్వరో బాల, కిష్కింధా, సుందర కాండములు సైతము సాహిణి మారునకే యంకితమీయఁబడినట్లు పద్యములు కొన్ని కూర్చి యుండిరి. కాని ఆశ్వా సాంతపద్యములనుబట్టి యీతఁడు, తాను సంస్కరించిన రామాయణ భాగములను శివునకే యంకితముచేసెనని చెప్పవలసి యున్నది.

ఈతని గ్రంథాంతరము లేవో తెలియలేదు. ఈతఁడు హైదరా బాదుప్రాంతమువాఁడని గోలకొండ కవుల సంచికలోఁ గలదు.

## మల్లికార్జున సిద్ధయోగి

ఈతఁడు హైదరాబాదు రాష్ట్రమందలి కొలనుపాకనివాసి. ఈ కవి క్రీ. శ. 1700 ప్రాంతమున నుండెనని శ్రీ శేషాద్రి రమణకవులు వ్రాసి యున్నారు.

ఇతఁడు గాడపురాణమను ద్విపదకావ్యమును రచించెను. ఆది మూఁడాశ్వాసముల గ్రంథము. కొలనుపాకలో గాడమఠమును స్థాపించిన యంశ మీ గ్రంథమునఁ గలదు.

## మల్లికార్జునుఁడు - మిక్కిలి

ఈతఁడు గోదావరిజిల్లా పెద్దాడనివాసి యగు బ్రాహ్మణుఁడు. 1805 లో జన్మించి 1875 లో మరణించెనఁట! ఈతఁడు 'రామచంద్ర చరిత్రము, నాచికేతూపాఖ్యానము, బేతాళపంచవింశతి, విక్రమార్క చరిత్రము, భగవద్గీత, రాఘవశతకము' మున్నగు గ్రంథములను రచించెను. విక్రమార్కచరిత్రము నందూరి కామమంత్రికిని, నాచికేతూపాఖ్యానము వాడ్రేవు-చలమయ్యగారికిని కృతి యీయఁబడినవి. రచన సరళమైనది.

## మల్లుభట్టు - ఘటకాసి

జగ్గన కూర్చిన ప్రబంధరత్నాకరములో నీ మల్లుభట్టు రచించిన జలశాయిమాహాత్మ్యములోని మూఁడు పద్యము లుదాహరింపఁబడినవి. కాని యాతని గ్రంథము లభింపలేదు. ఈతనింగూర్చిన వివరములు తెలియలేదు. ఈతఁడు క్రీ. శ. 1550 కంటెఁ బ్రాచీనుఁడని చెప్పవలెను.

## మాచనామాత్యుఁడు

ఈతఁడు బాలుగు వేదములనుండియు, పురాణములనుండియును బ్రహ్మాండ నిర్మాణక్రమమును గ్రహించి 'బ్రహ్మాండవచనము' అను వచన గ్రంథమును రచించెను. ఈ కవి భారద్వాజగోత్రుఁడు. భైరవామాత్యుని పుత్రుఁడు. ఈ కవి క్రీ. శ. 1750 ప్రాంతమున నుండినవాఁడు.

ఈతని గ్రంథము చక్కని గ్రాంథిక శైలిలో నున్నది.

## మాడయకవి

ఈతఁడు నియోగి బ్రాహ్మణుఁడు. సర్వయామాత్యుని కుమారుఁడు, ఈతని పేరు 'మాదయ' అని కొందఱును, 'మాదయ' అని కొందఱును అనుకొనుచున్నారు. కాని 'ప్రోడ వన్నింటు సర్వయమాడసుకవి' అను పద్యభాగమునుబట్టి యీతఁడు 'మాడయ' యని యనుకొనుటయే యుచితము. 'మెప్పించినాఁడవు మెఱవడిఁ గర్ణాట నరసనాయకు, వీర నారసింహు' అను నీతని సీసపద్య పాదమునుబట్టి యితఁడు శ్రీకృష్ణ రాయల తండ్రి యగు నరసరాయల కాలమునను, అన్న యగు వీరనరసింహ రాయల కాలమునను ఉండిన ట్లూహింపవచ్చును. కావున నీతఁడు 15-వ శతాబ్దియందని, 16-వ శతాబ్ది ప్రారంభమున-రాయలకాలమునకు ముందును ఉండి యుండును.

మాడయకవి మైరావణచరిత్రమును ప్రబంధముగా రచించి అబ్బయామాత్యుని పుత్రుఁడగు గోపమంత్రి కంకిత మొనర్చెను. దేవేంద్ర విజయ మను ద్విపదకావ్యమును రచించి ఎఱ్ఱనమంత్రి కంకితముచేసెనఁట! ఆ ద్విపదకావ్య మెచ్చటను లభ్యము కాలేదు.

## మాతృభూతకవి

తంజావూరి రాజ్యమును క్రీ. శ. 1788-89 లో సంవత్సరకాలము పాలించిన అమరసింహప్రభుని యాస్థానమున నీకవి యుండెను. ఇతఁడు శాండిల్యగోత్రుఁడు. రంగయార్యుని పుత్రుఁడు. ఈ కవి యమరసింహ ప్రభుని మంత్రి యగు శివరాయని ప్రోత్సాహమున 'పారిజాతాపహరణ' నాటకమును రచించి అమరసింహున కంకిత మొనర్చెను. ఇది యైదంకములు కలది. ఈ కవి కొన్ని పదములనుకూడ రచించెను.

## మాధవ మంత్రి

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. గిరిమనమంత్రి పుత్రుఁడఁట! కిళాంబి - వేంకటాచార్యుల శిష్యుఁడు. గోదావరీమండల నివాని. ఈతని కాలముంగూర్చి సరిగా తెలియదు.

ఈ కవి భగవద్గీతలను నాలుగాశ్వాసముల ప్రబంధముగా రచించి భద్రాద్రిరామున కంకితముచేసెను. ఈతని కవిత్వమున లక్షణవిరుద్ధములైన ప్రయోగము లున్నవఁట!

## మాధవరాయలు - సురభి

ఈతఁడు సర్వజ్ఞ బిరుదాంకితుఁడగు సింగభూపాలుని వంశీయుఁడు. ఇతని తండ్రి సురభి మల్లభూపాలుఁడు. ఈ మల్లభూపాలుని పేరనే ఎలకూచి-బాలసరస్వతి మల్లభూపాలీయ మను నామమున సుభాషిత త్రిశతి నాంధ్రీకరించెను.

మాధవరాయలు విద్వత్కవి. ఈతఁడు చంద్రికాపరిణయ మను ప్రౌఢప్రబంధమును రచించి తన యిష్టదైవమగు మదనగోపాలస్వామి కంకిత మొనర్చెను. ఇయ్యది యాఱాశ్వాసముల శృంగార ప్రబంధము. వసుచరిత్రముతో సరిపోలుచున్నది.

ఈ కవికి కుమారుఁడైన నరసింగరావునకు గోల్కొండ నవాబిచ్చిన సన్నదునుబట్టి యీతఁడు క్రీ. శ. 16-వ శతాబ్ది చివఱను, 17-వ శతాబ్ది ప్రారంభమునను ఉండిన ట్లూహింపఁబడుచున్నది.

'చంద్రికా పరిణయము'ను ఎలకూచి-బాలసరస్వతియు రచించెను. అని యన్నివిధముల దీనికంటె వేఱైనది.

## మాధవుఁడు - ఘటికవుని

ఈతఁడు కవియని 'ప్రద్యుమ్నవిజయ'మను ప్రబంధమునుబట్టి తెలియుచున్నది. ఆ గ్రంథము లభింపలేదు. ఈతఁడు క్రీ. శ. 1560 కంటెఁ బూర్వుఁడు.

## మాయనకవి - కైప

ఈతఁడు వైదికబ్రాహ్మణుఁడు. తండ్రి మహాదేవశాస్త్రి. తల్లి కామాక్షి. నూటయేఁబది యేండ్ల క్రిందట నీతఁ డుండి యుండునని శ్రీ వీరేశలింగము పంతులుగారి యాశయము.

ఈతఁడు ఉషాకల్యాణ మను అయిదాశ్వాసముల ప్రబంధమును రచించెను. ఇయ్యది రసవంతమైన ప్రబంధము.

## మారనకవి

ఓరుగల్లు ప్రాంత మీతని నివాసము. ఈతఁడు తిక్కనమంత్రి కుమారుఁడు. ఉభయకవి మిత్రుఁడగు తిక్కనసోమయాజి యనుగ్రహమునఁ గవితాశక్తిని సంపాదించినవాఁడు. ఈతఁడు, తాను రచించిన మార్కండేయపురాణమును ప్రతాపరుద్రుని సేనాధిపతి యగు గన్నయ కంకిత మొనర్చెను. ప్రతాపరుద్రచక్రవర్తి క్రీ. శ. 1295 నుండి 1326

వఱకును రాజ్యమును పాలించుటవలన కృతికర్తయు, కృతిపతియు నా కాలమువారే యని నిశ్చయింపవచ్చును.

తాను తిక్కనమంత్రి పుత్రుఁడ నని చెప్పుటచే నీ కవి తిక్కన సోమయాజి పుత్రుఁడనియు, నీతని కృతి గన్నయసేనాని కంకితమగుటచే, గన్నయమంత్రి కంకితమనియుఁ గొందఱు భ్రాంతిపడిరి. అది పొరపాటు.

మార్కండేయపురాణము సంస్కృతమున కనువాదము. ఎనిమిదాశ్వాసముల పెద్ద ప్రబంధము. తర్వాత వెలువడిన హరిశ్చంద్రోపాఖ్యానములకును, పెద్దన మనుచరిత్రమునకు నిది యాధారము. ఇందలి కవిత్వము ప్రౌఢమై, సలక్షణమై, హృదయంగమమై, పెక్కుకథల కాకరమై యుండును.

తిక్కన సోమయాజి మరణించిన పిదపనే మారన దీనిని రచించి యుండునని 'ఆంధ్రకవితరంగిణి' కారుల యభిప్రాయము.

## ముకుందయోగి

ఈ కవి 'శ్రీరంగమాహాత్మ్యము'ను ద్విపదకావ్యముగా రచించి శ్రీరంగేశ్వరున కంకితమొనర్చెను. ఈతఁడు కందాళ - అప్పలాచార్యుల శిష్యుఁడు. ఇది ముద్రితము కాదు. ఇతనింగూర్చి వేఱేమియును తెలియదు.

వివేకసింధువును రచించిన 'ముకుందయోగి' యొకఁ డున్నాఁడు. అతఁడు మహారాష్ట్రుఁడు.

## ముత్తరాజు - నెల్లూరి

జగ్గనకవి తన ప్రబంధరత్నాకరములో నీతని 'పద్మావతీకల్యాణము' లోని యొక పద్యము నుదాహరించి యున్నాఁడు. ఆ గ్రంథము లభింపలేదు. ఈతఁడు క్రీ. శ. 1560 కిఁ బూర్వుఁడు.

## ముద్దయకవి

ఈతని నివాసము నిజామురాష్ట్రములోని మంథెన. ఈతఁడు 120 ఏండ్ల క్రిందట నుండెనని గోలకొండ కవుల సంచికలో నున్నది. ఈ కవి

'మంథనరామాయణ'మను యక్షగానమును రచించెను. అది యముద్రితమే యైనను జనసామాన్యమున బహుళప్రచారములో నున్నదఁట!

## ముద్దురంగ చొక్కనాథుఁడు

ఇతఁడు మధురాపాలకుఁడగు విజయరంగ చొక్కనాథుని పుత్రుఁడు. 18-వ శతాబ్దిలో నుండినవాఁడు. శ్రీరంగనాథుని భక్తుఁడు. శ్రీరంగ మాహాత్మ్యమును గూర్చి యొక గ్రంథమును రచించెనఁట! ఈ విషయమును శ్రీ కావలి - వేంకటరామస్వామిగారు వ్రాసి యున్నారు.

## ముద్దమరాజు - రెడ్డిపల్లె

ఈతని 'అష్టమహిషీకల్యాణము' లోని వని రెండు పద్యములు ప్రబంధరత్నావళిలో నీయఁబడినవి. ఈ కవి క్రీ. శ. 1560 కంటెఁ బూర్వుఁడు. రెడ్డిపల్లెలు చాల కలవు. ఈతఁ డే ప్రాంతమువాఁడై నదియుఁ దెలియదు.

## మునినాథకవి - పరవస్తు

ఈతఁడు హైదరాబాదు రాష్ట్రమునందలి కేశవపట్టణ నివాసి. ఈతఁడు 60 ఏండ్ల క్రిందట నుండెనని గోలకొండ కవుల సంచికలోఁ గలదు. ఈ కవి లలితాశతకము, లక్ష్మీశతకము అను రెండు శతకములను రచించెను. ఈ రెండును ముద్రితములు. ఈతని కవిత్వము మిక్కిలి ప్రౌఢమైనది; రసవంతమైనది.

## ముమ్మడి తిమ్మభూపతి - సుగుటూరి

మైసూరు సామంతరాజులలో సుగుటూరివారు కలరు. ఆ వంశములోని యీతఁడు క్రీ. శ. 1614-1630 ప్రాంతమున నుండెను. ఇతఁడు మూఁడుభాషలలో విద్వత్కవి. ఈతఁడు సంస్కృతమున 'శివదర్పణము, రసికమనోరంజనము, కౌముదీవ్యాఖ్య' అను గ్రంథములను, కన్నడమున

'శంకరసంహిత, యక్షగానము' లను, తెలుఁగున 'రాజేంద్రచోళ చరిత్ర, కుమారార్జునీయము, సౌందరేశ చరిత్ర' అను గ్రంథములను రచించెను. ఈతని యాంధ్రగ్రంథము లేవియును లభింపలేదు.

## ముమ్మయ - జైతరాజు

ఈ కవి 'విష్ణుకథానిధాన' మను ప్రబంధమును రచించినట్లు జగ్గన కూర్చిన 'ప్రబంధరత్నాకరము'ను బట్టి తెలియుచున్నది. ఈ గ్రంథ మిప్పుడు లభింపలేదు. ఈ కవి క్రీ. శ. 1560 కంటెఁ బూర్వుఁడు. ఉదాహృతపద్యములనుఁబట్టి యీతని రచన నాతికఠినమై, ప్రౌఢమై, హృదయంగమమై యుండునట్లు తోఁచుచున్నది.

## మూర్తికవి - కాకమాని

ఈతఁడు కౌండిన్యగోత్రజుఁడైన బ్రాహ్మణుఁడు. రామలింగభట్టు పుత్రుఁడు. ఈతఁడు తన గ్రంథములను నరాంకితములుగా రచింపనందున నీతని కాలమును దెలిసికొనుట కాధారములు లభింపకున్నవి.

ఈ కవి 'శివరాయల వరా'లను పేర్కొనినందున - సదాశివరాయల కాలములో - అనఁగా క్రీ. శ. 1568 లో నీతఁ డుండి యుండునని శ్రీ నందిరాజు - చలపతిరావుగారి యభిప్రాయము. ఈతఁడు 1560 ప్రాంతమున నుండి యుండునని 'ఆంధ్ర కవితరంగిణి' కారుల యాశయము. ఈతని నాధునిక కవులలోఁ జేర్చిన శ్రీ వీరేశలింగము పంతులుగా రీతఁడు క్రీ. శ. 1670 ప్రాంతమున నుండి యుండునని తెల్పియున్నారు.

మూర్తికవి రైదేసి యాశ్వాసములు గల రెండు ప్రబంధములను రచించెను. అం దొకటి రాజవాహన విజయము. ఇయ్యది శ్రీ వేంకటేశ్వర స్వామి కంకితముచేయఁబడినది. రెండవదగు పాంచాలీ పరిణయము శ్రీరంగ పతికి సమర్పింపఁబడినది. ఈతఁడు బహుళాశ్వ చరిత్ర మను ప్రబంధమును

రచించినట్లు సర్వలక్షణసారసంగ్రహము, రంగరాట్ఛందము మున్నగు లక్షణగ్రంథములంబట్టి తెలియుచున్నది. కాని యీ గ్రంథ మిప్పుడు లభింపలేదు.

## మృత్యుంజయకవి - కొత్తలంక

ఇతఁడు శైవబ్రాహ్మణుఁడు. భారద్వాజగోత్రుఁడు. విశ్వనాథుని పుత్రుఁడు. ఈతని నివాసము గోదావరిజిల్లాలోఁ గౌశికీనదీతీరమున నున్న కొమరగిరిగ్రామము. ఈతని మునిమనుమ లేఁబదియేండ్ల క్రిందట నుండిరి. సంభున-ఈ కవి 150 ఏండ్ల క్రిందట నుండి యుండునని శ్రీ వీరేశలింగము పంతులుగారు వ్రాసియున్నారు.

మృత్యుంజయకవి బృహన్నారదీయము, ధరాత్మజాపరిణయము, నిరోష్ఠ్యనలచరిత్రము అను ప్రబంధములను రచించెనఁట! బృహన్నారదీయ మాఱాశ్వాసముల పురాణగ్రంథము. ధరాత్మజాపరిణయము నాల్గాశ్వాసముల ద్వ్యర్థికావ్యము. ఇందు సీతా, పార్వతుల వివాహకథలు కలవు. కవి తన కాశ్రయుఁడైన అల్లూరి - అప్పలరా జను క్షత్త్రియుఁడు దీనిని రచించినట్లు గ్రంథావతారికలోఁ జెప్పి యున్నను, ఆశ్వాసాంత గద్యలలో కవిపేరే కానవచ్చుచున్నది.

నిరోష్ఠ్య నలచరిత్ర మైదాశ్వాసముల చిత్రకావ్యము. ఇయ్యది అంతర్వేదిక్షేత్రములోని నరసింహస్వామి కంకితము. కొన్ని వ్రాఁత ప్రతుల గద్యలలో నియ్యది రుద్రరాజు-తిరుమలరాజు రచించిన ట్లున్నది. కవి యీ గ్రంథమును రచించి యాతని పేరు పెట్టి యుండవచ్చునని యూహింపఁబడుచున్నది.

## మొల్ల - ఆతుకూరి

ఈ కవయిత్రి కులాలవంశ సంజాతయఁట! ఆతుకూరి - కేసనసెట్టి కూఁతురు. ఈమె తన గ్రంథములోఁ దమ వంశమునుగూర్చి యెచ్చటను చెప్పికొనలేదు. ఈమె నివాసము నెల్లూరుజిల్లాలోని గోపవరము. ఈమె

పేరు 'మల్లి' కాని 'మొల్ల'కాదని శ్రీమతి కనుపర్తి - వరలక్ష్మమ్మగారు వ్రాసిరి. ఈమె రాయల కాలమునందలి కవులను స్తుతించినందున,- ఆ కాలములో నుండవచ్చునని శ్రీ వీరేశలింగము పంతులుగారి యభిప్రాయము.

ఈమె రామాయణమును చిన్న పద్యకావ్యముగా రచించెను. అది 'మొల్ల రామాయణము'గా ప్రసిద్ధము. అది మిగుల వ్యాప్తిలో నున్న గ్రంథము; చాల మనోజ్ఞమై, సులభగ్రాహ్యమయి యుండును.

## మోహనాంగి

ఈమె శ్రీకృష్ణదేవరాయల పుత్రికయనియు, రామరాయల భార్య యనియు, సంస్కృతాంధ్రములను నేర్చిన విదుషి యనియు, కవయిత్రి యనియు, ఈమె 'మరీచీపరిణయ'మను నైదాశ్వాసముల ప్రబంధమును రచించెననియు వాడుక కలదు. రాయలకు మోహనాంగి యను పుత్రిక యున్నట్లు కానరాదు.

రామరాజు భార్యకు మోహనాంగి యనునది నామాంతరమేమో ! అట్లయినచో నీమె 16-వ శతాబ్దినడుమ నుండవలెను. మరీచీపరిణ యము లభింపలేదు.

## యాదవామాత్యకవి

ఈ కవి నియోగిబ్రాహ్మణుఁడు. భారద్వాజగోత్రుఁడు. వెంకట రాజు పౌత్రుఁడు. బాపనార్యుని పుత్రుఁడు. ఈతఁడు తన గ్రంథములను భద్రాద్రియందలి శ్రీరామున కంకితమొనర్చెను. 'ఇక్షుపురీంద్రుఁడైన, యా త్రివిక్రమదేవు నా యాత్మ నిలిపి' అని యీతఁడు చెప్పుటచే నీతని నివాసము చెఱకూరో, చెఱకుమల్లియో, చెఱకువాడయో, లేక 'చెఱకు' శబ్దము ముందు వచ్చునేయూరో యయి యుండునని 'ఆంధ్రకవితరంగిణి'లోఁ గలదు. ఈతని పద్యములను లింగమగుంట - తిమ్మకవి తన 'సులక్షణ

సారము'న నుదాహరించి యున్నాఁడు. కావున నీతఁడు క్రీ. శ. 1550 ప్రాంతమునకుఁ బూర్వమున నుండినవాఁడని చెప్పవలెను.

ఈతఁడు చంద్రహాసవిలాసమును, విక్రమార్కచరిత్రమును, యాదవామాత్యచ్ఛందస్సను నామాంతరము గల 'లక్షణశిరోమణి'యను ఛందోగ్రంథమును రచించెను.

'చంద్రహాసవిలాసము'న జైమినిభారతములోని చంద్రహాసకథ వర్ణితము. విక్రమార్కచరిత్రము వచనకావ్యము. ఈతని కవిత్వము మృదుమధురమై తేనె లొలుకుచుండునని విమర్శకుల యాశయము. ఈతని గ్రంథములు ముద్రితములు కాలేదు.

యాదవామాత్యచ్ఛందస్సున ఆత్మసంబోధన ముండుటవలన, ఈతఁడు దానికి కృతిపతి యని కొందఱభిప్రాయపడి యున్నారఁట! 'కవిజనాశ్రయము' నున్న పవానిలో ఆత్మసంబోధనము కానవచ్చుచున్నది. కావున యాదవామాత్యుఁడే దానిని రచించెనని చెప్పవచ్చును.

## యోగానందావధూత

ఈతఁడు 'అద్వైతైక్యబోధము, గురుశిష్యసంవాదము' అను వేదాంతవిషయప్రతిపాదకములగు రెండు ద్విపదగ్రంథములను రచించెను. ఆ రెండు గ్రంథములు నముద్రితములు.

ఈతనిఁగూర్చిన విశేషములు తెలియలేదు. ఈతని గురువు చింతలలింగావధానులఁట! ఆ లింగగురుఁడు ధేనువుకొండ తిమ్మయామాత్యుని శిష్యుఁడఁట! ఈ యవధూత 16-వ శతాబ్దియందుత్తరార్ధమున నుండెనని 'ఆంధ్రకవి తరంగిణి'లోఁ గలదు.

ఈతని రచనలో దోషము లెక్కువ. విషయమే ముఖ్యముగా గ్రహింపఁబడినదఁట!

## యోగానందుఁడు - ఉన్నవ

ఈతఁడు గుంటూరు జిల్లాలోని ఉన్నవగ్రామనివాసి. ఆఱువేల నియోగిబ్రాహ్మణుఁడు. గార్గ్యగోత్రజుఁడు. ఈ కవి క్రీ. శ. 1750 ప్రాంతమువాఁడఁట !

ఈతఁడు రుక్మిణీ పరిణయమను కావ్యమును, 'రాజగోపాల ! రాధా మనోజఖేల !' అను మకుటముతో నొక సీసపద్య (రాజగోపాల) శతకమును రచించెను. రచన సరళమై, హృదయంగమముగా నుండును.

## రంగధామకవి - అల్లమరాజు

ఈతఁ డారామద్రావిడశాఖకుఁ జెందిన వైదిక బ్రాహ్మణుఁడు. హరితసగోత్రుఁడు. బాపయకవికి మనుమఁడు. సుబ్రహ్మణ్యకవికిఁ దండ్రి. క్రీ. శ. 1800 ప్రాంతమువాఁడు. ఈతని తండ్రి యెల్లన్న. ఈ రంగధామునకు 'రంగశాయి' అను నామాంతరము కలదఁట !

ఈతఁడు 'నారాయణాచల మాహాత్మ్య' మను మూఁడాశ్వాసముల ప్రబంధమును రచించి, చిన బాపభూపున కంకితమొనర్చెను. విజయనగర సంస్థానప్రభువగు నారాయణగజపతిరాజుగారిపై ఎనిమిదర్థములు గల చాటుపద్యములను వ్రాసెనఁట !

## రంగనాథకవి - ఓగిరాల

ఈతఁ డార్వేల నియోగి బ్రాహ్మణుఁడు. భారద్వాజగోత్రుఁడు. గోదావరిజిల్లాలోని నీలపల్లి గ్రామమున నుండినవాఁడు. ఈతనింగూర్చి యీతని పినతండ్రికుమారుఁడును, సుమనోమనోభిరంజన కృతికర్తయు నగు జగన్నాథకవి తెలిపెను. ఆ గ్రంథావతారికలో నీతని ప్రశంస కలదు. కావున నీతఁడు మిక్కిలి సమర్థుఁడగు విద్వాంసుఁడని తెలియుచున్నది. ఈతఁడును జగన్నాథకవివలెనే క్రీ. శ. 1810 ప్రాంతమున జన్మించి యుండవలెను.

జగన్నాథకవి వచనమునుబట్టి యీతఁడు నవీనకల్యాణ కల్పవల్లి క మున్నగు రసవత్ప్రబంధములను రచించినట్లు తెలియవచ్చుచున్నది. ఈతని 'ద్విరేఫవర్ణ దర్పణ' మను వ్యాకరణగ్రంథము నెల్లూరిలోని 'అముద్రిత గ్రంథచింతామణి' యందు ప్రకటింపఁబడినది.

## రంగనాథుఁడు - చక్రపాణి

రంగనాథరామాయణమని ప్రసిద్ధిఁజెందిన ద్విపదరామాయణమున కీతఁడు కర్త యని కొందఱి యభిప్రాయము. దాని కీతఁడు కర్తయైనట్లు గాని, ద్విపదరామాయణమునకు రంగనాథరామాయణమని పేరున్నట్లు గాని గ్రంథస్థప్రమాణము కానరాదు. ద్విపదరామాయణమును గోన-బుద్ధారెడ్డి రచించినట్లు గ్రంథమునఁ గలదు.

ఈతని యింటిపేరు చక్రపాణివారనియు, ఈతఁడు తొలుత వైష్ణవుఁడయి, పాలకురికి- సోమనాథునిచే వాదమున నోడింపఁబడి, యాతని శిష్యుఁడై శైవమత దీక్షను వహించెననియుఁ జెప్పుదురు. ఇది యథార్థమే యైనచో నీతఁడు సోమనాథుని కాలమువాఁడు కావలెను. అగుచో శ్రీ నిడుదవోలు-వేంకటరావుగారి మతము ననుసరించి యీతఁడు క్రీ. శ. 1190-1260 నడుమ నుండవలెను. శ్రీ మల్లంపల్లి - సోమశేఖర శర్మగారు మున్నగువారి మతమునుబట్టి యీతఁడు 13-వ శతాబ్ది చివఱను, 14-వ శతాబ్ది ప్రారంభమునను నుండవలెను.

ఈతఁడు పెక్కు సంస్కృతాంధ్ర గ్రంథములను రచించెనని గోలకొండ కవుల సంచికలోఁ గలదు. ఈతఁడు వరంగల్లు ప్రాంతనివాసి యని యందే చెప్పఁబడినది.

## రంగపరాజు - రామరాజు

ఈతఁడు చంద్రవంశ క్షత్రియుఁడు. ఆత్రేయగోత్రుఁడు. అర్వీటి-బుక్కరాజు మనుమని మనుమఁడు. బుక్కరాయల పుత్రుఁడగు రామ

రాయల వంశములోనివాఁ డగుటచే నీతనికి రామరాజు-రంగపరాజని పేరు వచ్చినది.

ఈ కవి సాంబోపాఖ్యానమను నైదాశ్వాసముల ప్రౌఢ ప్రబంధ మును రచించి శ్రీరంగేశ్వరున కంకితమొనర్చెను. ఈ కవికిఁ గోనేటి తిమ్మరా జన్న యగును. అతని పుత్రుఁడగు రామరాజునకు మంత్రియైన పులిజాల - సోమయామాత్యునకే తెనాలి - అన్నయకవి సుదక్షిణా పరిణయమును కృతియిచ్చెను. ఈ రంగపరాజు పినకొండ్రాజునకు నాల్గవ కుమారుఁడని తెలియుచున్నది. సాంబోపాఖ్యానము రచింపఁబడిన నాఁటికి అళియ రామరాయలు జీవించియే యున్నాఁడు. కావున నిది క్రీ. శ. 1550 ప్రాంతమున రచింపఁబడి యుండును.

ఈ 'సాంబోపాఖ్యానము'న, శ్రీకృష్ణునకు జాంబవతియందుఁ గలిగిన సాంబునకు దుర్యోధనుని పుత్రికయగు లక్షణతోడి వివాహము వర్ణితము. తొలుత శ్రీకృష్ణ జాంబవతుల వివాహము మున్నగు కథాంశ ములును వర్ణింపఁబడినవి. ఇందలి కవిత్వము ప్రౌఢమై అద్భుతములగు కల్పనలతోఁ గూడి హృదయంగమమై యుండును.

## రంగయ్య - కరాలపాటి

ఈతఁడు వైష్ణవసంప్రదాయమునకుఁ జెందిన వైశ్యుఁడు. ఈతఁడు క్రీ. శ. 1814-వ సంవత్సరమున జన్మించి 1863-వ సంవత్సరమున మరణించెనఁట! ఇతఁడు కొంతకాలము చెన్నపురిలోని పచ్చయప్ప పాఠశాలలోను, రాజధానీ శాస్త్రపాఠశాల (ప్రెసిడెన్సీకాలేజీ) లోను అధ్యాపకుఁడుగా నుండెను. ఈతఁడు తొలుత భారత, భాగవత, రామాయణములను లేఖనప్రమాదరహితముగా ముద్రించి యాంధ్రవాఙ్మయ మునకు మహోపకార మొనర్చెను.

ఈతఁడు భూతపురీమాహాత్మ్యము, కవిజనమనోహరము అను రెండు పద్యకావ్యములను రచించెను.

ఈతఁడు భూతపురీమాహాత్మ్యములో మూఁడాశ్వాసములను మాత్రమే రచించెను. ఇంతలో మరణించుటచేఁ గాఁబోలు గ్రంథము పూర్తి కాలేదు.

ఈతని కవిత్వము నిర్దుష్టమయి, మృదుమధురపదభూయిష్ఠమై రస వంతమై యుండును.

## రంగప్ప - బంగారు

హైదరాబాదురాష్ట్రములోని పిల్లలమఱ్ఱి యీతని నివాసము. ఈతఁడు క్రీ. శ. 1770 ప్రాంతమున నుండెనని గోలకొండ కవుల సంచికలో నున్నది. ఈతఁడు బేతాళచరిత్రమను ద్విపదకావ్యమును రచించెను. ఇందులో రేచర్లగోత్రజుఁడగు బేతాళనాయకుని చరిత్రము వర్ణింపఁబడినది. ఇయ్యది అన్నసముద్రము- చినవీరయ్య యనునతఁడు సంస్కృతమున రచించిన గ్రంథము ననుసరించి కూర్పఁబడినది.

## రంగయ్య - అనమగుర్తి

ఈ కవి నందవరీక నియోగిబ్రాహ్మణుఁడు. తిమ్మయామాత్యుని కుమారుఁడు. కాలము సరిగాఁ దెలియదు. ఇతఁడు 150 ఏండ్ల క్రిందటి వాఁడైయుండునని శ్రీ వీరేశలింగము పంతులుగారి యభిప్రాయము.

ఈతఁడు రచించిన యాదవగిరి మాహాత్మ్యమను అయిదాశ్వాసముల ప్రబంధము రాపూరి - వేంగామాత్యున కంకితము చేయఁబడినది.

## రంగరాజు - రేటూరి

ఈతఁ డార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. శ్రీవత్సగోత్రుఁడు. చినరంగనామాత్యుని పుత్రుఁడు. ఈతఁడు 'భానుమతీపరిణయము' అను నాలుగాశ్వాసముల ప్రబంధమును రచించి, వేంకటగిరి సంస్థానాధీశుల పూర్వ పురుషుఁడగు వెలుగోటి-రాయశౌరి కంకిత మొసఁగ్చెను. కవి కందాళ

శ్రీరంగాచార్యుల శిష్యుఁడు. ఈ కవి 17-వ శతాబ్ది ప్రథమపాదమునఁ దన గ్రంథమును రచించి యుండునని శ్రీ వీరేశలింగము పంతులుగారును, 'ఆంధ్రకవితరంగిణీ' కర్తలును తలఁచుచున్నారు.

భానుమతీపరిణయమున, శ్రీకృష్ణుని పినతండ్రి సమార్తె భానుమతికిని, పాండవులలోఁ గడపటివాఁడగు సహదేవునకును జరిగిన వివాహము వర్ణితము. రచన సరసమై, హృదయంగమమై యుండును.

కవి యింటిపేరు రెంటూరివారని ఆంధ్రకవుల చరిత్రలోఁ గలదు.

## రంగాజమ్మ - పసుపులేటి

ఈమె వేశ్య. విద్వత్కవయిత్రి. తంజావూరిని పాలించిన విజయరాఘవనాయకుని యాస్థానమున నుండినది. ఈమెతండ్రి వేంకటాద్రి. తల్లి మంగమ్మ. ఈమె మన్నారుదాసు విలాసము ప్రబంధమును, ఆ నామముననే ఒక నాటకమును, ఉషాపరిణయ ప్రబంధమును రచించెను. భారత, భాగవత, రామాయణసంగ్రహములను రచించెను. మఱియు పెక్కు పదములను రచించెను. వీనిలో మన్నారుదాసవిలాసనాటక మొక్కటియే ముద్రితమైనది.

ఈమె విజయరాఘవనాయకునిచేఁ గనకాభిషేకము చేయించుకొనినది! దీనింబట్టి యీమె వైదుష్యము తెల్లమగును.

మన్నారుదాసవిలాసమున విజయరాఘవునకుఁ గాంతిమతితో జరిగిన వివాహము వర్ణితము. ఉషాపరిణయమున ఉషానిరుద్ధుల వివాహము వర్ణింపఁబడినది.

ఈమె క్రీ. శ. 1633-73 నడుమ నుండినది.

## రంగాశాస్త్రి - పాటూరి

ఈతఁడు పాటూరి - రామస్వామిశాస్త్రిల సోదరుఁడు. కాలము 1841 ప్రాంతము. ఈతఁడు చేమకూర - వేంకటకవి రచించిన 'విజయవిలాసము'ను వచనకావ్యముగా రచించెను.

## రఘునాథనాయకుఁడు

దక్షిణభారతదేశమునందలి తంజావూరు రాజ్యమును పాలించిన నాయకరాజులలో రఘునాథనాయకుఁడు పేరెన్నికఁగన్నవాఁడు. ఇతఁడు చెవ్వప్పనాయకుని మనుమఁడు. అచ్యుతనాయకుని పుత్రుఁడు. ఈతఁడు క్రీ. శ. 1600 నుండి 1631 వఱకును రాజ్యమును పాలించెను. ఇతఁడు గొప్ప వీరుఁడు. సంస్కృతాంధ్రములందును, సంగీతమునందును గొప్ప విద్వాంసుఁడు. విద్వత్పోషకుఁడు.

ఈతఁడు పెక్కు గ్రంథములను రచించెను. అవి—1. ప్రబంధములు - పారిజాతాపహరణము, రఘునాథరామాయణము, వాల్మీకిచరిత్ర. వీనిలో రామాయణము సమగ్రముగా లేదు. 'శృంగారసావిత్రి' యను పద్యకావ్య మొకటి యీతని రచనగాఁ బ్రకటితమైనది. కాని యది యీతని రచన కాదని నిర్ణయింపఁబడినది.

2. యక్షగానములు - గజేంద్రమోక్షము, రుక్మిణీకృష్ణ వివాహము, జానకీపరిణయము.

3. ద్విపదకావ్యములు - నలచరిత్రము (అసమగ్రము), అచ్యుతాభ్యుదయము. 'అచ్యుతాభ్యుదయము'న రఘునాథుని తండ్రి యగు అచ్యుతరాయల వృత్తాంతము వివరింపఁబడినది.

వాల్మీకిచరిత్ర మూఁడాశ్వాసముల ప్రబంధము. ఇందు మునుల తపశ్శక్తి, వివిధ క్షేత్రమహిమ, ఆదికవియొక్క ఐహికాముష్మిక జ్ఞాన పరిశీలనము మున్నగు విషయములు కలవు.

ఈతఁడు 'పారిజాతాపహరణము'ను రెండు జాములలో నాశువుగాఁ జెప్పి తండ్రి యగు అచ్యుతరాయలవలనఁ గనకాభిషేకమును పొందెనఁట !

## రమణకవి - దివి

ఈ కవి గుంటూరుజిల్లాలోని యమరావతికిఁ బ్రభువైన వాసిరెడ్డి రామలింగప్రభుని ప్రేరణమున 'శృంగారధామ'మను రెండాశ్వాసముల ప్రబంధమును రచించి, మంగళగిరిలోని నృసింహస్వామి కంకిత మొనరించెను.

ఈతని కవిత్వము సలక్షణము కాకున్నను రసవంతముగా నుండును. ఈతఁడు 17-వ శతాబ్ది మధ్యభాగమున నుండి యుండునని శ్రీ వీరేశలింగము పంతులుగారి యభిప్రాయము.

## రమణప్పకవి - పత్రి

ఈతఁడు మాధ్వమతమునకుఁ జెందిన బ్రాహ్మణుఁడు. కౌండిన్య గోత్రుఁడు. శ్రీనివాసరావు పుత్రుఁడు. 180 ఏండ్ల క్రిందటివాఁడు. ఇతఁడు 'వేంకటరమణా!' అను మకుటముతో కందపద్యశతకమును, 'విష్ణు సర్వోత్తమా!' అను మకుటముతో నొక వృత్తమయశతకమును రచించెను. రెండును ముద్రితములు.

## రాఘవరెడ్డి - చేడ

ఈతఁడు హైదరాబాదు రాజ్యములోని దమ్మారావుపేటలో నివసించుచుండెను. ఈతఁడు 170 ఏండ్లక్రిందట నుండెనఁట!

ఈ కవి రామాయణమును ద్విపదకావ్యముగా రచించెను. ఇది యముద్రితము.

## రాచమల్లు కవులు

బమ్మెర పోతనామాత్యుఁడు రచించిన భాగవత షష్ఠస్కంధము శిథిలము కాఁగా పెక్కురు దానిని మరల రచించిరి. అట్టివారిలో రాచమల్లు కవు లున్నారు. వీ రొక్కరో, యిద్దరో తెలియరాదు. వీరు శృంగార

పష్ఠము, కవులషష్ఠము - అని పేరుపొందిన షష్ఠస్కంధమును రచించినట్లు అప్పకవి, కూచిమంచి తిమ్మకవి మున్నగు లాక్షణికుల గ్రంథములవలనఁ దెలియవచ్చుచున్నది. రాచమల్లు కవులు వ్రాయుటచే 'కవుల షష్ఠ'మనియు, అజామిళోపాఖ్యానమునఁ గల శృంగారవర్ణనమునుబట్టి దీనికి 'శృంగార షష్ఠ' మనియు పేరు గల్గి యుండును.

రాచమల్లు కవుల గ్రంథము చిక తిమ్మాధీశుని కుమారుఁడైన తిమ్మ ప్రభున కంకితముచేయఁబడినది.

ఈతని శాసన మొకటి మంగళగిరి నృసింహస్వామి యాలయమునఁ గలదు. అది క్రీ. శ. 1520 నాఁటిది. కావున నీ కవులు నప్పటివారే కావలయును. వీరి కవిత్వము సలక్షణమై, రసవంతమై, మనోహరముగా నుండును.

## రాచిరాజు - పూసపాటి

ఈతఁడు సూర్యవంశ క్షత్రియుఁడు. వసిష్ఠగోత్రుఁడు. తమ్మిరాజునకును, అన్నమాంబికకును పుత్రుఁడు. ఈతఁడు వసిష్ఠగోత్ర క్షత్రియుల వృత్తాంతమును దెల్పు 56 చరణముల సీసమాలికను రచించెను. సీసమాలిక చివరఁగల గీతపద్యమునుబట్టి రాచిరాజుకాలము శా. శ. 1406 (క్రీ. శ. 1484) అగుచున్నది. కావున నీతఁడు పదునైదవ శతాబ్ది చివరను, 16-వ శతాబ్ది ప్రారంభమునను నుండెనని చెప్పవచ్చును.

ఈతఁడు నవభారత మను గ్రంథమును రచించెనని కొందరును, దానిని కృతిగా గ్రహించెనని కొందరును చెప్పుదురు.

## రాచవేటి కవి

ఈతఁడు క్రీ. శ. 1800 కంటెఁ బూర్వుఁడై యుండునఁట! ఇతఁడు 'గణికాగుణప్రవర్తన తారావళి' అను తారావళిని రచించెను. తారావళిలో 27 పద్యములు మాత్ర ముండును.

## రాజకవి-తురగా, బాలసరస్వతి - అయ్యంకి

వీరిర్వురును జంటకవులు, వీరిర్వురును కలసి స్కాందపురాణాంతర్గతమగు నాగరఖండమును తెనిగించి, విశ్వకర్మ కులజుఁడగు ధవళేశ్వరపు - మార్కండేయునకుఁ గృతి యిచ్చిరి. వీరు దుర్గా, దక్షిణామూర్తి భక్తులు.

కృతిపతియైన మార్కండేయుఁడు గోలకొండనవాబగు మహమ్మద్ కుతుబ్‌షాకుఁ గుడిభుజముగా నుండెనఁట! ఈ నవాబు క్రీ. శ. 1580 మొదలు 1611 వఱకును రాజ్యమును పాలించినందున, కృతిపతి, కృతికర్త లా కాలమున నుండినట్లు నిశ్చయింపవచ్చును.

నాగరఖండ మైదాశ్వాసముల ప్రబంధము. ఇందు విశ్వకర్మ ప్రభావము వర్ణింపఁబడినది. ఇందలి కవిత్వము ధారాశుద్ధి కలిగి, యింపుగా నుండును.

తిట్టుకవిత్వమునఁ బేరుగాంచిన తురగా - రామకవి యీ రాజకవి కంటె భిన్నుఁడు.

## రాజలింగ కవి

ఈతఁడు వసిష్ఠగోత్రజుఁడు. వీరశైవమతావలంబి. మిత్రుఁడగు చెఱకు-లక్ష్మణామాత్యుని ప్రేరణమున కూర్మపురాణము నాఱాశ్వాసముల ప్రబంధముగా రచించి శ్రీశైల మల్లికార్జునదేవున కంకితమొనర్చెను. ఈతని నివాసము కొఱుపుట్ల యఁట !

అప్పకవి యిందలి లక్ష్యమును గ్రహించుటచే నీ కవి 17-వ శతాబ్ది పూర్వభాగమున నుండెనని చెప్పవచ్చును.

ఇతని కవిత్వము సరళమై ధారాశుద్ధి కల్గి యింపుగా నుండును.

## రామకవి - అడిదము

ఇతఁడు సుప్రసిద్ధుఁడగు అడిదము - సూరకవి వంశీయుఁడు. 18-వ శతాబ్దిచివఱ నుండినవాఁడు. 'కదలు మిట మాని దివిజ గంగాభవాని'

అను మకుటముతో 'చెఱువుమీఁది పద్యములు' చెప్పి గంగాదేవి యనుగ్రహమును సంపాదించెను. ఇతనిగ్రంథములు లభింపలేదు. శ్రీరామ తీర్థ క్షేత్రమందలి శ్రీరామునిపయి నీతఁడు చెప్పిన 'సరోజనేత్ర రామ తీర్థ జానకీమనోహరా!' అను మకుటము గల 'పంచచామరములు'మాత్రము కానవచ్చుచున్నవి.

## రామకవి - చీదెళ్ల

ఈతఁడు కందపద్యములలో 'కృష్ణా!' అను మకుటముతో కృష్ణ శతకమును రచించెను. ఇది వేదాంతవిషయమును తెల్పునది. ఈతఁడు క్రీ. శ. 1850 కిఁ బూర్వుఁడై యుండునని శతక కవుల చరిత్రకారుల యభిప్రాయము.

## రామకవి - తురగా

ఈతఁడు తిట్టుకవిత్వమునఁ బేరుపొందినవాఁడు. 'నాగరఖండ ము'ను రచించిన యాతఁ డీతఁడే యని శ్రీ వీరేశలింగముపంతులుగారు వ్రాసి యున్నారు. కాని యతఁడు వేఱు. ఈతఁడు 18-వ శతాబ్ది ప్రారంభ మున నుండినట్లు పలువు రనుచున్నారు.

## రామకవి - ధర్మవరము

ఈతఁడు గద్వాలనివాసి. గద్వాల ప్రభువగు సోమభూపాలుని యానతిని ముకుందవిలాసమును రచించెను. ఈతఁడు 18-వ శతాబ్ది కడపట నుండి యుండును. ఈతని గ్రంథము లభింపలేదఁట! ఒక పద్యము మాత్రము లభించినదని గోలకొండ కవుల సంచికలోఁ గలదు.

## రామకవి - లింగమకుంట

ఈతఁడు ప్రథమశాఖా బ్రాహ్మణుఁడు. కాశ్యపగోత్రుఁడు. సర్వ కవి సార్వభౌముని పౌత్రుఁడు. తిమ్మకవి కీతఁడు అన్న. తెనాలి రామ

కృష్ణకవి యల్లుఁడు, లింగమకుంట గ్రామనివాసి. ఈతని తాత కవిసార్వభౌ ముఁడఁట! కాని, యాతని గ్రంథము లేవియును లభింపలేదు. రామకవి గురువు చిక్కాచార్యులు. ఈతఁడు రామకృష్ణకవి యల్లుఁడగుటవలన 16-వ శతాబ్ది మధ్యభాగమున నుండెనని చెప్పవచ్చును.

ఈతఁడు చతుర్వాటికా మాహాత్మ్యము, ఆనందకానన మాహా త్మ్యము, వేంకటమాహాత్మ్యము, మత్స్యపురాణము, వామన పురాణము- అను గ్రంథములను రచించెను.

చతుర్వాటికా మాహాత్మ్య మైదాశ్వాసముల ప్రబంధము. ఇందు 'చెదలువాడ' యొక్క మహత్త్వ వర్ణింపఁబడినది. ఇయ్యది అనంతాచా ర్యుని ప్రేరణచే శ్రీరామచంద్రునకంకితముగఁ గూర్పఁబడినది. ఆనంద కానన మాహాత్మ్యమున కాశీక్షేత్రమహత్త్వము వర్ణింపఁబడినది. ఇది కోనమంత్రి ప్రేరణమున శ్రీవేంకటేశ్వరునకుఁ గృతి యీయఁబడినది.

మిగిలిన మూఁడు గ్రంథములును లభింపలేదు.

ఈతని కవిత్వము సరసమై, సలక్షణమై, మనోహరముగా నుండును.

## రామకృష్ణకవి - అల్లమురాజు

ఈతఁ డారామద్రావిడ బ్రాహ్మణుఁడు. హరిత సగోత్రుఁడు; రంగధామార్యుని పుత్రుఁడు. ఎల్లనార్యుని మనుమఁడు. గోదావరిజిల్లాలోని పిఠాపురమునకుఁ జేరువ నున్న చేబ్రో లీతని నివాసము. ఈతఁడు తన కవి చకోర చంద్రోదయమున, అయ్యది క్రీ. శ. 1835 లో రచింపఁబడినట్లు చెప్పుటయే కాక యప్పటికి రచింపఁబడిన గ్రంథముల నేడింటి నందుఁ బేర్కొనుటచే నీ కవి 18-వ శతాబ్ది చివరఁగాని, 19-వ శతాబ్ది ప్రారంభ మునఁగాని యుద్భవించి యుండవలెను.

ఈతఁడు వైనతేయవిజయము, సత్యభామావిలాసము, గౌతమీ మాహాత్మ్యము, ద్రౌపదీపరిణయము, సుశోభా వివాహము, హనుమదా ఖ్యానము, కవిజన మనోరంజనము, కవిచకోర చంద్రోదయము, మదా

లసా పరిణయము, శంతను విలాసము, అధ్యాత్మ రామాయణము, అచ్చ తెలుఁగు భాగవతము అను కావ్యములను, రామకృష్ణీయ మను పేరఁబరఁగు ఆంధ్రశబ్ద చింతామణి వ్యాఖ్యానమును రచించెను.

ఈ కవి దాక్షారామ భీమేశ్వరుని భక్తుఁడు. కవిచకోర చంద్రోదయము నా దేవునికే యంకిత మొనర్చెను.

## రామకృష్ణకవి - తెనాలి

ఈతఁడు ప్రథమశాఖఁ జెందిన బ్రాహ్మణుఁడు. కౌండిన్యగోత్రుఁడు. ఇతనితండ్రి రామయ్య, తల్లి లక్ష్మమ్మ. నివాసము తెనాలి. ఈతఁడు శైవ, వైష్ణవపురాణముల తత్త్వము నెఱిఁగినవాఁడు. సంస్కృతాంధ్రములందు గొప్ప విద్వత్కవి. ఈ కవి తొలుత శైవుఁడై యుండి, పిదప వైష్ణవమతమును స్వీకరించెను. శైవుఁడుగా నుండినప్పటి పేరు రామలింగఁడు; వైష్ణవుఁడుగా మాఱిన పిదప గ్రహించినపేరు రామకృష్ణుఁడు. రామలింగఁడు, రామకృష్ణుఁడును వేర్వేఱు వ్యక్తు లనుకొనుట పొరపాటు.

'పాండురంగవిభుని పదగుంభనంబును' అను ప్రసిద్ధినిబట్టి యీతని పదముల కూర్పు మిక్కిలి యద్భుతమైనదని తెలియుచున్నది. ఈతఁడు సరస్వతీ స్వరూపుఁడనియుఁ బ్రసిద్ధి. ఈ కవి ఉద్భటారాధ్య చరిత్రము, ఘటికాచల మాహాత్మ్యము, పాండురంగమాహాత్మ్యము నను మూఁడు గ్రంథములను రచించెను. అవి ముద్రితములైనవి. రామకృష్ణుఁ డీ గ్రంథములనే గాక కందర్పకేతువిలాసము, హరిలీలావిలాసము - అను రెండు గ్రంథములను కూడ వ్రాసెనఁట! అవి యింతవఱకును లభ్యములుకాలేదు. 'పాండురంగవిజయ' మనునది పాండురంగమాహాత్మ్యమునకు వాడుకపేరు కావలెను. ఈతఁడు 'లింగపురాణము'ను రచించెనని కొందఱు తలఁతురు. అట్లు తలఁచుట కాధారములు లేవు.

ఈ కవి శైవుఁడుగా నున్నప్పుడు 'ఉద్భటారాధ్యచరిత్ర' మను మూఁడాశ్వాసముల ప్రబంధమును రచించి కొండవీటి దుర్గాధ్యక్షుఁడగు నాదెండ్ల-గోపమంత్రియొద్ద ఉద్యోగిగా నుండిన యూరి - దేచమంత్రి కంకిత మొనర్చెను. గోపమంత్రి తిమ్మరుసుమంత్రి మేనల్లుఁడు. శ్రీకృష్ణదేవ రాయలు క్రీ. శ. 1515 లో కొండవీటిని జయించిన పిదపనే తిమ్మరుసు మంత్రి దానికి గోపమంత్రిని పాలకునిగా నియమించెను. గోపమంత్రి దేచమంత్రికి క్రీ. శ. 1517 లో నొక యగ్రహారమును దానమిచ్చెను. ఆ పిదపనే యాతఁ డీ గ్రంథమును కృతినొంది యుండవచ్చును. ఈగ్రంథమున శైవమతాచార్యుఁడగు ఉద్భటుని చరిత్రము వర్ణింపఁబడినది.

పాండురంగమాహాత్మ్యము 5 ఆశ్వాసముల ప్రౌఢప్రబంధము. ఇది 'ఆంధ్రపంచకావ్యము'లలో నొకటి. ఇందు పండరిపురమునందు వెలసిన పాండురంగవిఠలదేవుని యొక్కయు, నృసింహదేవునియొక్కయు మహాత్మ్యము వర్ణింపఁబడినది. ఇది మంగయగురవరాజు పుత్రుఁడగు పెదసంగభూపాలునియొద్ద నుద్యోగి యగు విరూరి - వేదాద్రిమంత్రి కంకిత మొనర్పఁబడినది. ఈ వేదాద్రిమంత్రి కందాళై - అప్పలాచార్యుల శిష్యుఁడు. ఈ యప్పలాచార్యులకు క్రీ. శ. 1542 లో గంటికోట ప్రభువు భూదానము చేసినట్లొక శాసనమునఁ గలదు. రామకృష్ణునికి భట్టరు చిక్కాచార్యులు గురువు. బైచరాజు వేంకటకవిచేత కామందకమును కృతిఁగొన్నవాఁడును, పెదసంగభూపాలుని మేనల్లుఁడును అగు వేంకటాద్రియును చిక్కాచార్యుని శిష్యుఁడే! ఇతఁడు కామందకమును క్రీ. శ. 1584 లోఁ గృతి నొందెను. పాండురంగమాహాత్మ్య మంతకుఁ బూర్వమే రచింపఁబడినదని చెప్పవలెను. పయి విషయములనుబట్టి రామకృష్ణకవి క్రీ. శ. 1505 ప్రాంతమున జన్మించి, 1575-80 ప్రాంతము వఱకును జీవించి యుండెనని చెప్పవచ్చును. కావున నీతఁడు రాయల కాలమునం దుండిన 'అష్టదిగ్గజము'లలో నొక్కఁడగుటయు అసంభావ్యము కాదు.

మూఁడాశ్వాసముల ఘటికాచలమహాత్మ్యమున చోళసింహపురము (ఉత్తర-ఆర్కాటు జిల్లాలోని షోలింగరు)దగ్గఱ నున్న నృసింహ క్షేత్రపు మాహాత్మ్యము వర్ణింపఁబడినది. ఆ క్షేత్రమునకే ఘటికాచలమని పేరు. ఇందు కృత్యాదికము లేదు. రామకృష్ణుని యనంతరము, ఆతని మనుమఁడు కృత్యాదికమును కూర్చి ఖండోజీవిచిత్రరాయనికి దీని నంకితమొనర్చెను. గ్రంథరచనాక్రమమునుబట్టి ఉద్భటారాధ్యచరిత్రము మొదటిది. ఘటికాచల మాహాత్మ్యము రెండవది. పాండురంగ మాహాత్మ్యము కడపటిది. 'ఆంధ్రకవితరంగిణీ'కారులు మాత్రము పాండురంగమాహాత్మ్యము రచింపఁబడిన పిదపనే ఘటికాచల మాహాత్మ్యము రచింపఁబడినదని తలంచుచున్నారు.

## రామకృష్ణమూర్తికవి

ఈతఁడు 'రామకృష్ణమూర్తి! రమ్యకీర్తి!' అను మకుటముతో నొక శతకమును రచించెను. అది అద్వైతతత్త్వమును బోధించునది. శతకము పూర్తి గాలేదు. 76 పద్యములు (ఆఁటవెలఁదులు) మాత్రము ముద్రింపఁబడినవి. ఈతఁడు క్రీ. శ. 1780 ప్రాంతమున నుండి యుండునని శతకవాఙ్మయ సర్వస్వమునఁ గలదు.

## రామచంద్రశాస్త్రి - కోరాడ

ఈయన వేఁగినాటి వైదికబ్రాహ్మణుఁడు. కౌండిన్యగోత్రుఁడు. లక్ష్మణశాస్త్రిపుత్రుఁడు. నివాసము మచిలీపట్టణము. ఈయన క్రీ శ. 1816 లో జన్మించి 1900 లో దివంగతుఁ డాయెను. గతశతాబ్దిలో పేరుపడిన విద్వాంసులలో ముఖ్యుఁడు.

ఈయన పెక్కు సంస్కృతాంధ్రగ్రంథములను రచించెను.—

1. సంస్కృతగ్రంథములు - కుమారోదయచంపువు, ఘనవృత్తము, దేవీవిజయచంపువు, శృంగారసుధార్ణవము, ఉపమావళి, మృత్యుంజయ

విజయకావ్యము, ప్రమర్గశేవధికావ్యము, కమనానందభాణము, రామచంద్రవిజయ వ్యాయోగము, త్రిపురాసురవిజయడిమము, ఉత్తరరామాయణము, ధీసౌధము (వ్యాకరణము), మంజరీసౌరభము మున్నగునవి.

2. ఆంధ్రగ్రంథములు - మంజరీమధుకరీయనాటిక, నయప్రదీపము, ఉన్మత్తరాఘవము, రథాంగదూతము, శాకుంతల, వేణీసంహార, ముద్రారాక్షస, ఉత్తరరామచరిత్ర నాటకములు, పరశురామచరిత్రము (గద్యము), ఘనవృత్తము. వీనిలోఁ గొన్ని ముద్రితములు.

ఈయన శ్రీ శిష్టు కృష్ణమూర్తిశాస్త్రివర్యుల శిష్యుఁడు !

ఈతని రచన ప్రౌఢమై, శబ్దాలంకారశోభితమై, రసవంతమయి యుండును.

## రామచంద్రశాస్త్రి - అల్లాడి

ఈతఁ డాత్రేయగోత్రజుఁడగు బ్రాహ్మణుఁడు. సుబ్బాజీపండితుని పుత్త్రుఁడు. భూభ్రమణాది విషయములనుగూర్చి తెల్పు సిద్ధాంత శిరోమణి యను గ్రంథమును వ్యావహారికవచనమున రచించెను. సంస్కృతమునను గ్రంథముచివరఁ గొంతభాగ మున్నది. ఇది క్రీ. శ. 1837 ప్రాంతమున రచింపఁబడినది.

భూభ్రమణమును గూర్చి కాశిలో రత్నేశ్వరపండితునకును, రామచంద్రశాస్త్రిగారికిని జరిగిన వాద మిందుఁ గలదని శ్రీ నిడుదవోలు-వేంకటరావుగారు వ్రాయుచున్నారు.

## రామచంద్రశాస్త్రి - గడిశాస్త్రుల

వరంగల్లు సమీపమునఁ గల రాయపర్తి యీతని నివాసము. ఈతఁడు రమారమి 60 ఏండ్ల క్రిందట నుండెనట ! ఈతఁడు సగరపురాణము ను పద్యకావ్యమును రచించెనఁట ! అది ముద్రితముకాదు.

## రామన - నడకుదుటి

ఈతఁడు వెలనాటి నియోగిబ్రాహ్మణుఁడు. కౌశికగోత్రజుఁడు. ఇతని తండ్రి బుచ్చనామాత్యుఁడను నామాంతరము గల లక్ష్మీనృసింహుఁడు. ఈతఁడు నేఁటి తూర్పుగోదావరి జిల్లాలోని రామచంద్రపురము తాలూకాలోని శివాపురమునకుఁ గరణముగా నుండి, తర్వాత అత్తవారి యూరగు తిరుపతిగ్రామము (పెద్దాపురముదగ్గఱ నున్నది) నకుఁ బోయి, అచటనే నివసింపసాగెను. ఈతఁడు క్రీ. శ. 1821-న జనన మంది 1887 లో కీర్తిశేషుఁడయ్యెను.

రామకవి ప్రభులింగలీల యను నైదాశ్వాసముల ప్రబంధమును, వివేకచూడామణి యను నైదాశ్వాసముల పద్యకావ్యమును, హరిమీడే స్తవమును రచించెను.

ప్రభులింగలీలకు పాలకురికి సోమనాథుని ద్విపద ప్రభులింగలీల యాధారము. తక్కిన రెండును భగవచ్ఛంకరాచార్యులవారి సంస్కృత మూలముల కనువాదములు.

## రామనామాత్యుఁడు

ఈతఁడు నియోగి బ్రాహ్మణుఁడు. తిమ్మనమంత్రి పుత్రుఁడు. ఈ కవి కాలము సరిగాఁ దెలియదు; కాని నూటయేఁబదియేండ్లక్రిందట నుండి యుండవచ్చునని శ్రీ వీరేశలింగముపంతులుగారి యభిప్రాయము.

ఈ కవి కృష్ణార్జున సంవాద మను నామాంతరము గల గయోపాఖ్యానమును రెండాశ్వాసముల ప్రబంధముగా రచించెను. అయ్యది అహోబల నృసింహస్వామి కంకితము. గయునింగూర్చి శ్రీ కృష్ణార్జునులకుఁ గలిగిన వివాద మిందలి విషయము.

## రామన్న - చెన్నూరు

ఈతఁడు హుజూరునగరు తాలూకాయందలి యాదవాకిళ్ల నివాసి. ఈతఁడు 120 ఏండ్ల క్రిందట నుండెనని గోలకొండ కవుల సంచికలోఁ

గలదు. ఈతఁడు రామాయణము సాంగ్రీకరించి హుజూరునగరు తాలూకాయందలి చిలుకూరిలోని శ్రీరామస్వామి కంకిత మొనరించెను.

ఈతని కవిత్వము మిక్కిలి రసవంతమైనది.

## రామన్న - సాహెబురాణా

ఈతఁడు వీరన్న, రాజమ్మల పుత్రుఁడు. మాధ్వమతస్థుఁడై యుండు నేమో! యని శతక కవుల చరిత్రలోఁ గలదు. ఈతఁడు 1850 ప్రాంతీయుఁ డేఁట! ఈతఁడు 'సీతాపతీ!' అను మకుటముతో నొక వృత్తశతకమును రచించెను. దానికి 'సీతాపతిశతక' మని పేరు. ఇందలి కవిత్వము మృదు మధురమైనది.

## రామభట్టు - జయంతి

ఈతనింగూర్చి శ్రీ గురుజాడ - శ్రీ రామమూర్తిగారు వ్రాసిన కవి జీవితములలో క్రింది యంశ మున్నది.

ఈతని నివాసము భద్రాద్రి సమీపము. ఈతఁడు వైదిక బ్రాహ్మణుఁడు. గార్గేయగోత్రుఁడు. కృష్ణభట్టారక, సుభద్రాంబల కుమారుఁడు. తిక్కనసోమయాజి రచింపఁగా మిగిలిన ఉత్తరరామాయణమునందలి తుది యాశ్వాసము నీతఁడు రచించెను. ఇందు కుశలవుల విద్యాభ్యాసము, పౌండరీక - వాజపేయాది యాగముల నొనర్చుట, రాముఁడు నారాయణాఖ్యతో తిరిగి వైకుంఠమును ప్రవేశించుట మున్నగు విషయములు కలవు.

ఇతని కాలము తెలియదు. కవిత్వము తిక్కనకవిత్వమున కన్ని విధములఁ దీసికట్టు.

## రామభద్రకవి - అయ్యలరాజు

ఈ కవి యార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. తిప్పయకవి మునిమనుమఁడు, పర్వతమంత్రి మనుమఁడు. అక్కయామాత్యుని పుత్రుఁడు. పర

వస్తు - ముమ్మడి వరదాచార్యుని శిష్యుఁడు. ఒంటిమిట్ట నివాసి. అయ్యల రాజు - నారాయణామాత్యుఁడును, అయ్యల భాస్కరకవులును చెప్పిన దానింబట్టి యీతఁడు కౌండిన్యగోత్రుఁడని తెలియుచున్నది.

ఈతఁడు కృష్ణదేవరాయల చివఱికాలమున నుండి, ఆతఁడు రచించిన 'సకల కథాసార సంగ్రహము'ను తెలిఁగించెను. కాని యాయాంధ్రీకరణము పూర్తి కాకమునుపే రాయలు మరణించెనఁట! కాని, సకల కథా సారసంగ్రహకర్త అయ్యలరాజు - రామభద్రకవి కాక, వేఱొకఁడనియు, రామభద్రుఁడు రాయల కాలములోనివాఁడు కాఁడనియు 'ఆంధ్ర కవితరంగిణీ' కర్తయభిప్రాయము. సకల కథాసారసంగ్రహము నాంధ్రీకరించినయాతఁడు 'పుత్తేటి రామభద్రుఁ' డనియుఁ గొందఱి తలంపు. ఈతఁ డష్టదిగ్గజములలోనివాఁడును కాఁడఁట! సకల కథాసారసంగ్రహమునఁ దొమ్మిదవ యాశ్వాసములోఁ గొంతవఱకు మాత్రము లభించినది. అది యముద్రితము.

రామభద్రకవి రామాభ్యుదయ మను నెనిమిదాశ్వాసముల ప్రౌఢ ప్రబంధమును రచించి, అళియ రామరాయల మేనల్లుఁడగు గొబ్బూరి - నరసరాజున కంకితమొనర్చెను. ఇందు శ్రీరాముని పట్టాభిషేకమువఱకును గల రామాయణకథ మనోహరముగాఁ గూర్పఁబడినది. ఇం దుత్తరకాండ కథ లేదు. రామాభ్యుదయము క్రీ. శ. 1550 ప్రాంతమున రచింపఁబడినదని 'ఆంధ్రకవి తరంగిణి'లోఁ గలదు.

రామాభ్యుదయమునందలి రచన ప్రౌఢమై, రసవంతమై, హృదయంగమమై యుండును.

## రామభద్రకవి - తెనాలి

ఈతఁడు ప్రథమశాఖా బ్రాహ్మణుఁడు. తెనాలి శ్రీగిరికవికి మనుమఁడు. అభినవరామ కృష్ణకవికిఁ గుమారుఁడు. ఇతని తల్లి తిమ్మమాంబ.

ఈతఁడు 'ఇందుమతీ పరిణయము' అను ప్రబంధమును రచించి పాలచూరి-కృష్ణభూపాలున కంకిత మొనర్చెను. ఈ కృతిపతికి గురువు తిరుమల శ్రీనివాసాచార్యులు. కవి క్రీ. శ. 1575 ప్రాంతమున నీ ప్రబంధమును రచించి యుండుననని 'ఆంధ్రకవి తరంగిణి'లోఁ గలదు. 'ఇందుమతీ పరిణయము'న ఇక్ష్వాకువంశజుఁడగు అజమహారాజునకును, ఇందుమతీదేవికిని జరిగిన వివాహము వర్ణితము.

ఈతని కవిత్వము మనోహరమైనది.

## రామభద్రకవి - దేవగుప్తాపు

ఈతఁ డార్వేల నియోగి బ్రాహ్మణుఁడు. లింగకవి పౌత్రుఁడు. భాస్కరకవి పుత్రుఁడు. ఈతఁడు 1790 ప్రాంతమున నుండెనని, కవి బంధువులు చెప్పినట్లు శ్రీ వంగూరి-సుబ్బారావుగారు వ్రాసినారు.

ఈతఁడు 'మహాదేవా! భవానీధవా!' అను మకుటముతో నొక శతకమును రచించెను. దానికి మహాదేవ శతకమనియు, భవానీధవ శతకమనియుఁ గూడ పేర్లు ప్రసిద్ధములు. ఈతని రచనము సరళమై, హృదయంగమముగా నుండును.

## రామభద్ర కవి

'జానకీపతీ!' అను మకుటము కల యొక వృత్తశతకమునందు 'రామభద్ర! నీ పేరిటివాఁడనయ్య' అని యుండుటవలన, ఏతత్కర్త రామభద్రకవి కావలెననియు, లేదా రామచంద్రకవియైన నగుననియును శతక కవుల చరిత్రలోఁ గలదు. ఈ కవి క్రీ. శ. 1800 లకుఁ బూర్వమున నుండి యుండునఁట! రచన హృదయంగమము.

## రామభద్రకవి - శ్రీపతి

దక్షిణదేశమందలి మధురను పాలించిన విజయరంగ చొక్కనాథుని కాలముననే యీతఁడు 'హాలాస్యమాహాత్మ్య' మను వచన కావ్య

మును రచించెను. కళువె - నంజరాజు రచించిన గ్రంథముకంటె నిది ప్రాచీనము.

ఈ కవి కాశ్యపగోత్రుఁడు. గిరియమ్మయు, సూరయ్యయు నీతని తల్లిదండ్రులు; మీనాక్షీ సుందరేశ్వరుల భక్తుఁడీతఁడు. ఈతని రచన యమకములతోఁ గూడి మనోహరముగా నుండును.

## రామభద్రుఁడు - ముద్దరాజు

ఈతఁడు నందవరీక నియోగిబ్రాహ్మణుఁడు. గణపయామాత్యుని పుత్రుఁడు. పెదరామన, చినరామనలకుఁ దమ్ముఁడు. 'రామన్న' యనునది యితని వాడుక పేరు.

ఈతఁడు 'కవిసంజీవని' యను లక్షణగ్రంథమును, పింగళి సూరనార్యుని రాఘవపాండవీయమునకు వ్యాఖ్యానమును రచించెను. ఆ రెండును ముద్రితములు.

కవిసంజీవనిలో ఛందో వ్యాకరణవిషయములు నాలుగు తరంగములలో వివరింపఁబడి ప్రాచీనుల గ్రంథములనుండి ఉదాహృతులు గ్రహింపఁబడినవి. వానింబట్టి యీతఁడు క్రీ. శ. 1580-1650 నడుమ నుండినట్లు నిశ్చయింపవచ్చును.

## రామమంత్రి - ధరణిదేవుల

ఈతఁడు తిమ్మయామాత్యుని పౌత్రుఁడు. నాగయామాత్యునకును, ఫణియమ్మకును పుత్రుఁడు. ఈతడు దశావతార చరిత్రమను పది యాశ్వాసముల ప్రబంధమును రచించి మగదల-కృష్ణమంత్రి కంకితమొనర్చెను. ఈ కృష్ణమంత్రి 18-వ శతాబ్ది చివఱ నెల్లూరుజిల్లాలోని ప్రళయకావేరిలో డచ్చివారి ద్విభాషిగా నుండెనఁట! కావున నీకవి యప్పటివాఁడే కావలెను. పుష్పగిరి-తిమ్మన్న, కంకంటి-పాపరాజు నీతని సమకాలికులు.

ఈతని దశావతార చరిత్రమును తిమ్మనయే రచించిన ట్లొక వాడుక కలదు. కాని యది నమ్మఁదగినది కాదు. ఈతని రచన మృదుమధురమై, రసవంతముగ నుండును.

## రామమూర్తి - పరశురామపంతుల

ఈతఁ డార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. రామమంత్రి పౌత్రుఁడు. లింగమూర్తి పుత్రుఁడు. తల్లి లింగాంబ. తండ్రియే యీతనికి గురువు. ఈతఁడు నూట య్యేబదియేండ్ల క్రిందట నుండియుండునని శ్రీ వీరేశలింగము పంతులుగారి యభిప్రాయము.

ఈ కవి శుకచరిత్ర మనెడి యైదాశ్వాసముల వేదాంతగ్రంథమును రచించెను. రచన మృదుమధురమైనది.

ఈతఁ డీ గ్రంథమునే గాక 'ఈదులవాయి పురాధినాయకా!' యను మకుటముతో నొక యుత్పలమాలా శతకమును, 'పటుగుణాభిరామ! పరశురామ!' అను మకుటముతో రెండు శతకములను, మనోహరశతకమును, వివేకసారమును, అధ్యాత్మరామాయణమును, సీతారామాంజనేయ యక్షగానమును కూడ రచించెనఁట !

## రామయకవి - కటికినేని

ఈ కవి పద్మనాయక (వెలమ) వంశీయుఁడు. చెఱకునూళ్ల గోత్రజుఁడు. నూరన, బుచ్చెమ్మల పుత్రుఁడు. ఇతని నివాసము, కాలము సరిగాఁ దెలియుట లేదు. ఈతఁడు వేంకటగిరి ప్రభువుల బంధుకోటిలోనివాఁడు కావచ్చును. ఈతఁడు నూటయేఁబది, రెండువందల యేండ్ల క్రిందట నుండియుండునని శ్రీ వీరేశలింగముపంతులుగా రభిప్రాయపడినారు.

అప్పయదీక్షితులు సంస్కృతమున రచించిన కువలయానందమును 'కువలయానంద ప్రకాశ' మను పేర నీతఁ డాంధ్రీకరించెను. ఈ యాంధ్రీ

కరణమున విద్వద్వతంసుఁడగు రంగాచార్యు లీతనికిఁ దోడుపడినట్లు కవియే తెల్పి యున్నాఁడు. రామయకవి శ్రీకృష్ణవిలాసమను మఱియొక గ్రంథమునుగూడ రచించినట్లు తెలియుచున్నది.

## రామయ్య - ఆంధ్రకవి

ఈతని 'విష్ణుకాంచీమాహాత్మ్యము'లోని పద్యములు పండ్రెండు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచే 'ప్రబంధరత్నావళి'లో నుదాహరింపఁబడినవి. ఈతనింగూర్చిన వివరములు తెలియరాలేదు.

నాచన సోము నీతఁడు నుతించెను. 16-వ శతాబ్ది మధ్యమున నున్న యీ దాహరణగ్రంథ సంధాత యీతని పద్యముల నుదాహరించెను. కావున నీతఁడు 15-వ శతాబ్దియం దుండవచ్చును. ఈ విషయము 'ఆంధ్రకవి తరంగిణి'లోఁ జెప్పఁబడినది.

ఈతని కవిత్వము సరసమై మనోహరమై యుండును.

## రామయ్య - వాసిరాజు

ఈ కవి బృహన్నారదీయము నాంధ్రీకరించినట్లు జగ్గనకవి కూర్చిన ప్రబంధరత్నాకరమునుబట్టి తెలియుచున్నది. విష్ణుకాంచీ మాహాత్మ్యమును వ్రాసిన ఆంధ్రకవి రామయ్యయు, నీతఁడు నభిన్నులేమో యని శ్రీ వీరేశలింగముపంతులుగారును, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారును సంశయము తెల్పియున్నారు. ఈతఁడు క్రీ. శ. 1560 సం. కుఁ బూర్వుఁడై యుండును.

## రామరాజభూషణుఁడు

'రామరాజభూషణుఁ' డనునది యీతని బిరుదనామము. శ్రీ కృష్ణదేవరాయల యల్లుఁడగు రామరాయల సభకు భూషణమువంటివాఁ డగుటచే నీ బిరుదము లభించినది. ఈతని పేరు మూర్తికవి. ఈతఁడు ప్రబంధాంకము—

తూరపరాజు పుత్రుఁడు. కులమునుబట్టి యాతనికి భట్టుమూర్తి యను పేరు ప్రసిద్ధమైనది. ఈతనికి 'రామరాజభూషణుఁ' డను బిరుద మున్నట్లే యాతని తండ్రికి 'వేంకటరాయభూషణుఁ' డను బిరుద ముండినది.

కృష్ణదేవరాయల సభలోని అష్టదిగ్గజములలో నీతఁ డుండెనని కొందఱును, లేఁడని కొందఱును తలంచుచున్నారు. ఈతఁడు క్రీ. శ. 1580 తర్వాత కూడ జీవించినట్లు తెలియుచున్నది.

మూర్తికవి రచించిన గ్రంథములు మూఁడు మాత్రము లభ్యము లగుచున్నవి. అవి : (1) నరసభూపాలీయము అను నామాంతరము గల కావ్యాలంకార సంగ్రహము (2) వసుచరిత్రము (3) హరిశ్చంద్ర నలోపాఖ్యానము. ఇందు నరసభూపాలీయము రామరాయల మేనల్లుఁడగు గొబ్బూరి-నరసరాజున కంకిత మొనర్పఁబడిన అలంకార శాస్త్రగ్రంథము. సంస్కృతమున విద్యానాథపండితుఁడు రచించిన ప్రతాపరుద్ర యశో భూషణము ననుసరించి రచింపఁబడినది.

వసుచరిత్ర మత్యుత్తమమగు ప్రౌఢ ప్రబంధము. రామరాయల మరణానంతర మాతని తమ్ముఁడగు తిరుమలరాయల కంకిత మొనర్పఁబడినది. హరిశ్చంద్ర నలోపాఖ్యానము ద్వ్యర్థి కావ్యము. ఇందు హరిశ్చంద్రుని యొక్కయు, నలునియొక్కయు కథలు వచ్చునట్లు ప్రతిపద్యమున రెండర్థములు కూర్పఁబడినవి.

మూర్తికవి 'శ్రీరామకృష్ణ తిషున్ ...బహుసంస్కృతాంధ్రకృతులన్ మెప్పించె' నని యున్నది. ఆ సంస్కృతాంధ్రకృతు లేవియు లభ్యములు కాలేదు. మూర్తికవి సంగీతమునందును గొప్ప విద్వాంసుఁ డగుటచేఁ గళాప్రియుఁడగు రామరాయల కోరికపై సంస్కృతాంధ్రములందు పెక్కు కీర్తనలను రచించి యుండవచ్చుననియు, అవియే కృతులుగా పేర్కొనఁబడి యుండవచ్చు ననియు విద్వాంసుల యభిప్రాయము.

## రామన - నడకుదుటి

ఈతఁడు వెలనాటి నియోగిబ్రాహ్మణుఁడు. కౌశికగోత్రజుఁడు. ఇతని తండ్రి బుచ్చెనామాత్యుఁడను నామాంతరము గల లక్ష్మీనృసింహుఁడు. ఈతఁడు నేఁటి తూర్పుగోదావరి జిల్లాలోని రామచంద్రపురము తాలూకాలోని శివాపురమునకుఁ గరణముగా నుండి, తర్వాత అత్తవారి యూరగు తిరుపతిగ్రామము (పెద్దాపురముదగ్గఱ నున్నది) నకుఁ బోయి, అచటనే నివసింపసాగెను. ఈతఁడు క్రీ. శ. 1821-న జనన మంది 1887 లో కీర్తిశేషుఁడయ్యెను.

రామకవి ప్రభులింగలీల యను నైదాశ్వాసముల ప్రబంధమును, వివేకచూడామణి యను నైదాశ్వాసముల పద్యకావ్యమును, హరిమీడే స్తవమును రచించెను.

ప్రభులింగలీలకు పాలకురికి సోమనాథుని ద్విపద ప్రభులింగలీల యాధారము. తక్కిన రెండును భగవచ్ఛంకరాచార్యులవారి సంస్కృత మూలముల కనువాదములు.

## రామనామాత్యుఁడు

ఈతఁడు నియోగి బ్రాహ్మణుఁడు. తిమ్మనమంత్రి పుత్రుఁడు. ఈ కవి కాలము సరిగాఁ దెలియదు; కాని నూటయేఁబదియేండ్లక్రిందట నుండి యుండవచ్చునని శ్రీ వీరేశలింగముపంతులుగారి యభిప్రాయము.

ఈ కవి కృష్ణార్జున సంవాద మను నామాంతరము గల గయోపాఖ్యానమును రెండాశ్వాసముల ప్రబంధముగా రచించెను. అయ్యది అహోబల నృసింహస్వామి కంకితము. గయునింగూర్చి శ్రీ కృష్ణార్జునులకుఁ గలిగిన వివాద మిందలి విషయము.

## రామన్న - చెన్నూరు

ఈతఁడు హుజూరునగరు తాలూకాయందలి యాదవాకిళ్ల నివాసి. ఈతఁడు 120 ఏండ్ల క్రిందట నుండెనని గోలకొండ కవుల సంచికలోఁ

గలదు. ఈతఁడు రామాయణము స్వీకరించి హుజూరునగరు తాలూకాయందలి చిలుకూరిలోని శ్రీరామస్వామి కంకిత మొనరించెను.

ఈతని కవిత్వము మిక్కిలి రసవంతమైనది.

## రామన్న - సాహెబురాణా

ఈతఁడు వీరన్న, రాజమ్మల పుత్రుఁడు. మాధ్వమతస్థుఁడై యుండు నేమో! యని శతక కవుల చరిత్రలోఁ గలదు. ఈతఁడు 1850 ప్రాంతీయుఁ డేఁట! ఈతఁడు 'సీతాపతీ!' అను మకుటముతో నొక వృత్తశతకమును రచించెను. దానికి 'సీతాపతిశతక' మని పేరు. ఇందలి కవిత్వము మృదు మధురమైనది.

## రామభట్టు - జయంతి

ఈతనింగూర్చి శ్రీ గురుజాడ - శ్రీ రామమూర్తిగారు వ్రాసిన కవి జీవితములలో క్రింది యంశ మున్నది.

ఈతని నివాసము భద్రాద్రి సమీపము. ఈతఁడు వైదిక బ్రాహ్మణుఁడు. గార్గేయగోత్రుఁడు. కృష్ణభట్టారక, సుభద్రాంబల కుమారుఁడు. తిక్కనసోమయాజి రచింపఁగా మిగిలిన ఉత్తరరామా యణమునందలి తుది యాశ్వాసము నీతఁడు రచించెను. ఇందు కుశలవుల విద్యాభ్యాసము, పౌండరీక - వాజపేయాది యాగముల నొనర్చుట, రాముఁడు నారాయణాఖ్యతో తిరిగి వైకుంఠమును ప్రవేశించుట మున్నగు విషయములు కలవు.

ఇతని కాలము తెలియదు. కవిత్వము తిక్కనకవిత్వమున కన్ని విధములఁ దీసికట్టు.

## రామభద్రకవి - అయ్యలరాజు

ఈ కవి యార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. తిప్పయయ మునిమను మఁడు, పర్వతమంత్రి మనుమఁడు. అక్కయామాత్యుని పుత్రుఁడు. పర

వస్తు - ముమ్మడి వరదాచార్యుని శిష్యుఁడు. ఒంటిమిట్ట నివాసి. అయ్యల రాజు - నారాయణామాత్యుఁడును, అయ్యల భాస్కరకవులును చెప్పిన దానింబట్టి యీతఁడు కౌండిన్యగోత్రుఁడని తెలియుచున్నది.

ఈతఁడు కృష్ణదేవరాయల చివరికాలమున నుండి, ఆతఁడు రచించిన 'సకల కథాసార సంగ్రహము'ను తెలిఁగించెను. కాని యా యాంధ్రీకరణము పూర్తి కాకమునుపే రాయలు మరణించెనఁట! కాని, సకల కథా సారసంగ్రహకర్త అయ్యలరాజు - రామభద్రకవి కాక, వేఱొకఁడనియు, రామభద్రుఁడు రాయల కాలములోనివాఁడు కాఁడనియు 'ఆంధ్ర కవితరంగిణీ' కర్తయభిప్రాయము. సకల కథాసారసంగ్రహము నాంధ్రీకరించినయాతఁడు 'పుత్తేటి రామభద్రుఁ' డనియుఁ గొందఱి తలంపు. ఈతఁ డష్టదిగ్గజములలోనివాఁడును కాఁడఁట! సకల కథాసారసంగ్రహమునఁ దొమ్మిదవ యాశ్వాసములోఁ గొంతవఱకు మాత్రము లభించినది. అది యముద్రితము.

రామభద్రకవి రామాభ్యుదయము మను నెనిమిదాశ్వాసముల ప్రౌఢ ప్రబంధమును రచించి, అళియ రామరాయల మేనల్లుఁడగు గొబ్బూరి - నరసరాజున కంకితమొనర్చెను. ఇందు శ్రీరాముని పట్టాభిషేకమువఱకును గల రామాయణకథ మనోహరముగాఁ గూర్పఁబడినది. ఇందుత్తరకాండ కథ లేదు. రామాభ్యుదయము క్రీ. శ. 1550 ప్రాంతమున రచింపఁబడినదని 'ఆంధ్రకవి తరంగిణి'లోఁ గలదు.

రామాభ్యుదయమునందలి రచన ప్రౌఢమై, రసవంతమై, హృదయంగమమై యుండును.

## రామభద్రకవి - తెనాలి

ఈతఁడు ప్రథమశాఖా బ్రాహ్మణుఁడు. తెనాలి శ్రీగిరికవికి మనుమఁడు. అభినవరామ కృష్ణకవికిఁ గుమారుఁడు. ఇతని తల్లి తిమ్మమాంబ.

ఈతఁడు 'ఇందుమతీ పరిణయము' అను ప్రబంధమును రచించి పాలచూరి-కృష్ణభూపాలున కంకిత మొనర్చెను. ఈ కృతిపతికి గురువు తిరుమల శ్రీనివాసాచార్యులు. కవి క్రీ. శ. 1575 ప్రాంతమున నీ ప్రబంధమును రచించి యుండునని 'ఆంధ్రకవి తరంగిణి'లోఁ గలదు. 'ఇందుమతీ పరిణయము'న ఇక్ష్వాకువంశజుఁడగు అజమహారాజునకును, ఇందుమతీదేవికిని జరిగిన వివాహము వర్ణితము.

ఈతని కవిత్వము మనోహరమైనది.

## రామభద్రకవి - దేవగుప్తాపు

ఈతఁ డార్వేల నియోగి బ్రాహ్మణుఁడు. లింగకవి పౌత్రుఁడు. భాస్కరకవి పుత్రుఁడు. ఈతఁడు 1790 ప్రాంతమున నుండెనని, కవి బంధువులు చెప్పినట్లు శ్రీ వంగూరి-సుబ్బారావుగారు వ్రాసినారు.

ఈతఁడు 'మహాదేవా! భవానీధవా!' అను మకుటముతో నొక శతకమును రచించెను. దానికి మహాదేవ శతకమనియు, భవానీధవ శతకమనియుఁ గూడ పేర్లు ప్రసిద్ధములు. ఈతని రచనము సరళమై, హృదయంగమముగా నుండును.

## రామభద్ర కవి

'జానకీపతీ!' అను మకుటము కల యొక వృత్తశతకమునందు 'రామభద్ర! నీ పేరిటివాఁడనయ్య' అని యుండుటవలన, ఏతత్కర్త రామభద్రకవి కావలెననియు, లేదా రామచంద్రకవియైన నగుననియును శతక కవుల చరిత్రలోఁ గలదు. ఈ కవి క్రీ. శ. 1800 లకుఁ బూర్వమున నుండి యుండునఁట! రచన హృదయంగమము.

## రామభద్రకవి - శ్రీపతి

దక్షిణదేశమందలి మధురను పాలించిన విజయరంగ చొక్కనాథుని కాలముననే యీతఁడు 'హాలాస్యమాహాత్మ్య' మను వచన కావ్య

మును రచించెను. కళువె - నంజరాజు రచించిన గ్రంథముకంటె నిది ప్రాచీనము.

ఈ కవి కాశ్యపగోత్రుఁడు. గిరియమ్మయు, నూరయ్యయు నీతని తల్లిదండ్రులు; మీనాక్షీ సుందరేశ్వరుల భక్తుఁడీతఁడు. ఈతని రచన యమకములతోఁ గూడి మనోహరముగా నుండును.

## రామభద్రుఁడు - ముద్దరాజు

ఈతఁడు నందవరీక నియోగిబ్రాహ్మణుఁడు. గణపయామాత్యుని పుత్రుఁడు. పెదరామన, చినరామనలకుఁ దమ్ముఁడు. 'రామన్న' యనునది యితని వాడుకపేరు.

ఈతఁడు 'కవిసంజీవని' యను లక్షణగ్రంథమును, పింగళి సూరనార్యుని రాఘవపాండవీయమునకు వ్యాఖ్యానమును రచించెను. ఆ రెండును ముద్రితములు.

కవిసంజీవనిలో ఛందో వ్యాకరణవిషయములు నాలుగు తరంగములలో వివరింపఁబడి ప్రాచీనుల గ్రంథములనుండి ఉదాహృతులు గ్రహింపఁబడినవి. వానింబట్టి యీతఁడు క్రీ. శ. 1580-1650 నడుమ నుండినట్లు నిశ్చయింపవచ్చును.

## రామమంత్రి - ధరణిదేవుల

ఈతఁడు తిమ్మయామాత్యుని పౌత్రుఁడు. నాగయామాత్యునకును, పణియమ్మకును పుత్రుఁడు. ఈతడు దశావతార చరిత్రమను పది యాశ్వాసముల ప్రబంధమును రచించి మగదల-కృష్ణమంత్రి కంకితమొనర్చెను. ఈ కృష్ణమంత్రి 18-వ శతాబ్ది చివఱ నెల్లూరుజిల్లాలోని ప్రళయకావేరిలో దొరవారి ద్విభాషిగా నుండెనఁట! కావున నీ కవి యప్పటివాఁడే కావలెను. పుష్పగిరి-తిమ్మన్న, కంకంటి-పాపరాజు నీతని సమకాలికులు.

ఈతని దశావతార చరిత్రమును తిమ్మనయే రచించిన ట్లొక వాదుక కలదు. కాని యది నమ్మఁదగినది కాదు. ఈతని రచన మృదుమధురమై, రసవంతముగ నుండును.

## రామమూర్తి - పరశురామపంతుల

ఈతఁడార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. రామమంత్రి పౌత్రుఁడు. లింగమూర్తి పుత్రుఁడు. తల్లి లింగాంబ. తండ్రియే యీతనికి గురువు. ఈతఁడు నూట యేఁబదియేండ్ల క్రిందట నుండియుండునని శ్రీ వీరేశలింగము పంతులుగారి యభిప్రాయము.

ఈ కవి శుకచరిత్ర మనెడి యైదాశ్వాసముల వేదాంతగ్రంథమును రచించెను. రచన మృదుమధురమైనది.

ఈతఁ డీ గ్రంథమునే గాక 'ఈదులవాయి పురాధినాయకా!' యను మకుటముతో నొక యుత్పలమాలా శతకమును, 'పటుగుణాభిరామ! పరశురామ!' అను మకుటముతో రెండు శతకములను, మనోహరశతకమును, వివేకసారమును, అధ్యాత్మరామాయణమును, సీతారామాంజనేయ యక్షగానమును కూడ రచించెనఁట!

## రామయకవి - కటికినేని

ఈ కవి పద్మనాయక (వెలమ) వంశీయుఁడు. చెఱుకునూళ్ల గోత్రజుఁడు. నూరన, బుచ్చెమ్మల పుత్రుఁడు. ఇతని నివాసము, కాలము సరిగాఁ దెలియుట లేదు. ఈతఁడు వేంకటగిరి ప్రభువుల బంధుకోటిలోనివాఁడు కావచ్చును. ఈతఁడు నూటయేఁబది, రెండువందల యేండ్ల క్రిందట నుండి యుండునని శ్రీ వీరేశలింగముపంతులుగా రభిప్రాయపడినారు.

అప్పయదీక్షితుఁలు సంస్కృతమున రచించిన కువలయానందమును 'కువలయానంద ప్రకాశ' మనుపేర నీతఁ డాంధ్రీకరించెను. ఈ యాంధ్రీ

కరణమున విద్వద్వతంసుఁడగు రంగాచార్యు లీతనికిఁ దోడుపడినట్లు కవిరే తెల్పి యున్నాఁడు. రామయకవి శ్రీకృష్ణవిలాసమను మఱియొక గ్రంథమునుగూడ రచించినట్లు తెలియుచున్నది.

## రామయ్య - ఆంధ్రకవి

ఈతని 'విష్ణుకాంచీమాహాత్మ్యము'లోని పద్యములు పండ్రెండు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచే 'ప్రబంధరత్నావళి'లో నుదాహరింపఁ బడినవి. ఈతనింగూర్చిన వివరములు తెలియరాలేదు.

నాచన సోము నీతఁడు నుతించెను. 16-వ శతాబ్ది మధ్యమున నున్న ఉదాహరణగ్రంథ సంధాత యీతని పద్యముల నుదాహరించెను. కావున నీతఁడు 15-వ శతాబ్దియం దుండవచ్చును. ఈ విషయము 'ఆంధ్రకవి తరంగిణి'లోఁ జెప్పఁబడినది.

ఈతని కవిత్వము సరసమై మనోహరమై యుండును.

## రామయ్య - వాసిరాజు

ఈ కవి బృహన్నారదీయము నాంధ్రీకరించినట్లు జగ్గనకవి కూర్చిన ప్రబంధరత్నాకరమునుబట్టి తెలియుచున్నది. విష్ణుకాంచీ మాహాత్మ్యమును వ్రాసిన ఆంధ్రకవి రామయ్యయు, నీతఁడు నభిన్నులేమో యని శ్రీ వీరేశలింగముపంతులుగారును, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారును సంశయము తెల్పియున్నారు. ఈతఁడు క్రీ. శ. 1560 సం. కుఁ బూర్వుఁడై యుండును.

## రామరాజభూషణుఁడు

'రామరాజభూషణుఁ' డనునది యీతని బిరుదనామము. శ్రీ కృష్ణదేవరాయల యల్లుఁడగు రామరాయల సభకు భూషణమువంటివాఁ డగుటచే నీ బిరుదము లభించినది. ఈతనిపేరు మూర్తికవి. ఈతఁడు ప్రబంధాంకము—

సూరపరాజు పుత్రుఁడు. కులమునుబట్టి యీతనికి భట్టుమూర్తి యను పేరు ప్రసిద్ధమైనది. ఈతనికి 'రామరాజభూషణుఁ' డను బిరుద మున్నట్లే యీతని తండ్రికి 'వేంకటరాయభూషణుఁ' డను బిరుద ముండినది.

కృష్ణదేవరాయల సభలోని అష్టదిగ్గజములలో నీతఁ డుండెనని కొందఱును, లేఁడని కొందఱును తలంచుచున్నారు. ఈతఁడు క్రీ. శ. 1580 తర్వాత కూడ జీవించినట్లు తెలియుచున్నది.

మూర్తికవి రచించిన గ్రంథములు మూఁడు మాత్రము లభ్యము లగుచున్నవి. అవి : (1) నరసభూపాలీయము అను నామాంతరము గల కావ్యాలంకార సంగ్రహము (2) వసుచరిత్రము (3) హరిశ్చంద్ర నలోపాఖ్యానము. ఇందు నరసభూపాలీయము రామరాయల మేనల్లుఁడగు గొబ్బూరి-నరసరాజున కంకిత మొనర్పఁబడిన అలంకార శాస్త్రగ్రంథము. సంస్కృతమున విద్యానాథపండితుఁడు రచించిన ప్రతాపరుద్ర యశోభూషణము ననుసరించి రచింపఁబడినది.

వసుచరిత్ర మత్యుత్తమమగు ప్రౌఢ ప్రబంధము. రామరాయల మరణానంతర మాతని తమ్ముఁడగు తిరుమలరాయల కంకిత మొనర్పఁబడినది. హరిశ్చంద్ర నలోపాఖ్యానము ద్వ్యర్థి కావ్యము. ఇందు హరిశ్చంద్రుని యొక్కయు, నలునియొక్కయు కథలు వచ్చునట్లు ప్రతిపద్యమున రెండర్థములు కూర్పఁబడినవి.

మూర్తికవి 'శ్రీరామక్షితిపుఁన్ ...బహుసంస్కృతాంధ్రకృతులన్ మెప్పించె' నని యున్నది. ఆ సంస్కృతాంధ్రకృతు లేవియు లభ్యములు కాలేదు. మూర్తికవి సంగీతమునందును గొప్ప విద్వాంసుఁ డగుటచేఁ గళాప్రియుఁడగు రామరాయల కోరికపై సంస్కృతాంధ్రములందు పెక్కు కీర్తనలను రచించి యుండవచ్చుననియు, అవియే కృతులుగా పేర్కొనఁబడి యుండవచ్చు ననియు విద్వాంసుల యభిప్రాయము.

## రామరాజు - ఎలుకుర్తి

ఈతఁడు 'రాజహంసరథాంగ ! శ్రీరామలింగ !' అను మకుటముతో నొక సీసపద్యశతకమును రచించెను. అందలి యొక పద్యము జగ్గకవి 'ప్రబంధరత్నాకరము'న ఎలుకుర్తి రామరాజు 'రామలింగ శతకము'లోనిదిగాఁ గానవచ్చుచున్నది. ఈ కవి క్రీ. శ. 1560 కంటెఁ బ్రాచీనుఁడు.

## రామరాజు - పెద్దిరాజు

ఈతని చాటుపద్యములను రెంటిని కాకునూరి - అప్పకవి యుదాహరించి యున్నాఁడు. ఈతనిఁ గూర్చిన విశేషములు తెలియవు. ఈతఁడు క్రీ. శ. 16-వ శతాబ్దిలోనివాఁడు.

## రామలింగకవి - గద్దె

ఈతఁడు పడమటి గోదావరిజిల్లా భీమవరము తాలూకాలోని బొండాడ గ్రామ నివాసియఁట ! ఇతని తండ్రి నాగయ్య. తల్లి పంచాక్షరీదేవి. ఈతఁడు పరవాదిగజాంకుశ మను నామాంతరము గల 'చోడలింగ శతకము'ను రచించెను. ఇందు సమస్తదేవతలును, దశావతారములును శివునిఁ బూజించినట్లు వర్ణింపఁబడినది.

ఈతని కాలము సరిగా తెలియలేదు.

## రామలింగకవి - తెనాలి

ఈతఁడు ఉద్భటారాధ్య చరిత్రము మున్నగు గ్రంథములను రచించిన కవికంటె భిన్నుఁడు. గోలకొండప్రాంత మీతని నివాసము. ఈతఁడు విశ్వబ్రాహ్మణ కులజుఁడు. ఈతఁడు 270 ఏండ్లక్రిందట నుండి యుండునని గోలకొండ కవుల సంచికలో శ్రీ శేషాద్రి రమణ కవులు తెల్పియున్నారు.

ఈ కవి ధీరజన మనోవిరాజిత మను గ్రంథమును రచించెను. ఇందు, అమరసింహుఁడు విశ్వబ్రాహ్మణులను నిందించుట, దానివలనఁ గలిగిన నష్టములు మున్నగు విషయములు కలవు.

ఈతఁడు అక్కన్న, మాదన్నల కాలమున నుండెనఁట !

## రామస్వామిశాస్త్రి - పాటూరి

ఈతఁడు గతశతాబ్దిలో సోర్టు సెంటుజార్జి కళాశాలలో తెలుఁగు మున్షీగా పనిచేసెను. 1843 లో శుకసప్తతిని వచనకావ్యముగా రచించెను.

## రామస్వామిశాస్త్రి - మండపాక

ఈతఁడు వేఁగినాఁటి వైదిక బ్రాహ్మణుఁడు. కామకవి పుత్రుఁడు. 19-వ శతాబ్దిలోని విద్వత్కవులలో నగ్రశ్రేణికిఁ జెందిన మండపాక - పార్వతీశ్వరశాస్త్రి కగ్రజుఁడు. ఈతఁడు 19-వ శతాబ్ది తొలిపాదమున జనించి యుండును.

ఈ విద్వత్కవి వేదాంతకృతికదంబము, గంగాలహరి, గంగా స్తవము అను గ్రంథమును రచించెను.

## రామస్వామిశాస్త్రులు - వావిళ్ల

ఈయన పుదూరు - ద్రావిడశాఖకుఁ జెందిన వైదికబ్రాహ్మణుఁడు. నెల్లూరుజిల్లాలోని అల్లూరు నివాసి. సంస్కృతాంధ్రములలో మంచి పండితుఁడు; గొప్ప వక్త. ఈయన మదరాసులో వావిళ్ల సంస్థను నెలకొల్పి పెక్కు సంస్కృతాంధ్రగ్రంథములను ప్రకటింపఁ బూనుకొనెను. భాషోద్ధారక కళాప్రపూర్ణ శ్రీ వావిళ్ల - వేంకటేశ్వరశాస్త్రి గారి కీయన జనకులు.

ఈయన మనుచరిత్రము, ఆముక్తమాల్యద మున్నగు గ్రంథములకు వ్యాఖ్యానములను రచించి ప్రకటించెను. గతశతాబ్దిలో నీయన చేసిన భాషా సేవ ఎన్నఁదగినది.

## రామాచార్యులు - క్రొత్తపల్లి

ఈతఁడు గద్వాల సంస్థానమున నుండిన శ్రీ వైష్ణవబ్రాహ్మణుఁడు. 170 ఏండ్లక్రిందట నుండెను.

ఈతఁడు యథాశ్లోక తాత్పర్యరామాయణమునందలి అయోధ్యా కాండమును అయిదాశ్వాసములుగా రచించెను. ఈ గ్రంథము ముద్రితము.

## రామాజెట్టి – తొక్కుడము

ఈతఁడు నింబజామాహాత్మ్యకృతిపతి యగు మన్నారుజెట్టి సోదరుఁడు. దేవమల్లుకులమునకుఁ జెందినవాఁడు. ఈతని కాలము క్రీ. శ. 1740 ప్రాంతము. ఈతఁడు 'కాలచక్ర వేమ! భవ్యనామ!' అను మకుటముతో వేమననుగూర్చి యొక శతకమును చెప్పెను. ఈ శతకమున అన్నియు నాటవెలఁదులే కలవు. శైలి సరళము. ఇది అడయారు గ్రంథాలయములో నున్నది. అముద్రితము.

## రామానుజరావు - పండరి

ఈతఁడు హైదరాబాదు రాష్ట్రములోని పిద్దిపేట తాలూకా రామాయమ్మపేట నివాసి. ఈతఁడు 1830 లో జన్మించెనఁట!

ఈతఁడు గాంగేయచరిత్ర మను యక్షగానమును, అహల్యా సంక్రందనవిలాసమును, మానుమదవతారమండలిని రచించెను. ఇవి యన్నియు నముద్రితములు.

## రామానుజాచార్యులు - అచ్చి

హైదరాబాదురాష్ట్రమందలి వరదన్నపేట యీతని నివాసము. ఈతఁడు క్రీ. శ. 1700 ప్రాంతమువాఁడని గోలకొండకవుల సంచికలో గలదు.

ఈతఁడు తత్త్వార్థదర్పణమను ద్విపదకావ్యమును, మోక్షసారము' ముముక్షుజనకల్పము అను గ్రంథములను రచించెను. వీనిలో మొదటి రెండును అముద్రితములు. చివటి గ్రంథముమాత్రము ముద్రితమఁట !

## రామానుజాచార్యులు - కాంద్రవేటి

హైదరాబాదురాష్ట్రమునందలి కాంద్రవే డీతని నివాసము. ఈతఁడు క్రీ. శ. 1600 ప్రాంతమున నుండెనఁట ! ఈతనికి 'శృంగార కవిరాయఁడు' అను బిరుదుండెనఁట !

ఈతఁడు తిరువాయిమొళ్ళిని ద్విపదకావ్యముగా రచించెను. ఇయ్యది వైష్ణవసంప్రదాయ గ్రంథము.

## రామానుజాచార్యులు - సముద్రాల

ఈతఁడు హైదరాబాదురాష్ట్రమునందలి కరీంనగరుజిల్లాకుఁ జెందిన కోరుట్ల నివాసి. ఈతఁడు వైష్ణవ బ్రాహ్మణుఁడు. ఈ కవి 170 ఏండ్ల క్రిందట నుండెనఁట !

ఈతఁడు సుశీలోపాఖ్యానమను గ్రంథమును రచించెను. అది యముద్రితము.

## రాయరఘునాథ (తొండమాన్) రాజు

ఈతఁడు క్రీ. శ. 1769-1789 నడుమ పుదుకోట్టరాజ్యమును పాలించిన ప్రభువు. సంస్కృతాంధ్రభాషలలో విద్వాంసుఁడు. దక్షిణ భారతదేశమునందలి ప్రశస్తరాజకవులలో నొకఁడు. ఈ రాజకవి పార్వతీ పరిణయమను నాశ్వాసముల ప్రబంధమును, కవిజనోజ్జీవని యను ఆంధ్ర సమస్యాపూరణగ్రంథమును రచించెను.

పార్వతీపరిణయమున పార్వతీపరమేశ్వరుల వివాహకథ, కుమారో త్పత్తి, తారకాసురవధ, కుమారస్వామి వివాహము వర్ణింపఁబడినవి. కవిజనోజ్జీవనిలో నూఱు దుష్కరసమస్యలను పూరించిన పద్యములు కలవు. ఇతని గ్రంథము లముద్రితములు.

## రుద్రకవి - కందుకూరు

ఈతఁడు విశ్వబ్రాహ్మణకులజుఁడు. కాళికాదేవి భక్తుఁడు. తండ్రి పెదలింగన. గురువరాచార్యుఁ డీతని గురువు. నెల్లూరుజిల్లాయందలి కందుకూ రీతని నివాసము.

ఈతఁడు 'నిరంకుశోపాఖ్యాన'మను నాల్గాశ్వాసముల ప్రబంధమును రచించి కందుకూరిలోని సోమేశ్వరస్వామి కంకితమొనర్చెను. సుగ్రీవవిజయ మను యక్షగానమును రచించి కందుకూరిలోని జనార్దనస్వామి కంకిత మొనర్చెను. ఆ జనార్దనస్వామిపేర నొక యష్టకమును కూడ రచించెను.

ఈతఁడు 'బలవదరీదరీకుహర భాస్వదరీ యదరీదరీహరీ!' అను మకుటముతో నొక శతకమును రచించినట్లు శతకవుల చరిత్రకారులుఁ వ్రాయుచున్నారు. ఆ శతక మిపు డెచ్చటను లభింపలేదు.

ఈతఁడు కృష్ణదేవరాయల సభలోని అష్టదిగ్గజములలో నొకఁడని కొందఱందురు. అట్లగుచో నీతఁడు 16-వ శతాబ్ది ప్రారంభమున నుండి యుండవలెను. ఈతఁడు గుంటుపల్లి - భాస్కరామాత్యుని కాలమున నున్న ట్లప్పకవీయమునఁ గలదు. భాస్కరమంత్రి 1620 ప్రాంతమువాఁడు. రుద్రకవి యీతని కాలమున నున్నచో, రాయలకాలముననుండుట కుదురదు.

'సుగ్రీవవిజయ' పీఠికలో శ్రీ వేటూరి - ప్రభాకరశాస్త్రిగా రీతఁడు క్రీ. శ. 1568 లోఁ గాని, కొంత తర్వాతఁగాని యుండవచ్చునని వ్రాసియున్నారు.

నిరంకుశోపాఖ్యానమున నిరంకుశుఁడను వేశ్యాలోలుని వృత్తాంతము వర్ణితము. సుగ్రీవవిజయమున 'వాలివధ' అతిమనోహరముగఁ గూర్పఁ బడినది. రుద్రకవి కవిత్వము మృదుమధురమైనది.

## రేచన - మల్లియ

ఆంధ్రఛ్ఛందోగ్రంథములలోఁ బ్రాచీనమగు 'కవిజనాశ్రయము'నకీతఁడు కర్త యని విమర్శకుల పరిశోధనలవలన నిర్ణయింపఁబడినది. ఈ గ్రంథము వేములవాడ - భీమకవికృతమనియు ప్రసిద్ధి పొందినది.

కవిజనాశ్రయమున 'రేచన' సంబోధనలు, రేచన కృతి యని తెల్పు సాధారములును కలవు. కవిజనాశ్రయములోని పద్యపుటనుకరణము నన్నెచోడుని కుమారసంభవమునఁ గలదఁట! ద్రావిడభాషలోఁగల 'యాప్పిరుంగలమ్ కారిక్కై' అను ప్రాచీనచ్ఛందోగ్రంథములో రేచన ఛంద ముదాహరింపఁబడినది. దీనింబట్టి కవిజనాశ్రయము 12-వ శతాబ్దికిఁ బూర్వపుదని తేలుచున్నది. కన్నడభాషలో క్రీ. శ. 990 ప్రాంతమున రచితమైన 'ఛందోంబుధి' అను గ్రంథము ననుకరించి కవిజనాశ్రయము రచింపఁబడినట్లు స్పష్టముగాఁ దెలియవచ్చుచున్నది.

పయి యంశములనుబట్టి కవిజనాశ్రయము క్రీ. శ. 1100 ప్రాంతమున రచింపఁబడినదని నిశ్చయించుటకు వీలగుచున్నది. ఈ విషయము 'తెనుఁగుకవుల చరిత్ర'లో వివరింపఁబడినది.

## లక్ష్మణకవి - ఏనుఁగు

ఈ కవి యార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. వాధూలగోత్రుఁడు. తిమ్మకవి పుత్రుఁడు. లక్ష్మణకవికి మనుమఁడు. ఇతని తల్లి పేరమాంబ. ఈ వంశమువారి యింటిపేరు తొలుత పైఁడిపాటివారనియు, పూర్వపురుషులలో నొకఁడగు జలపాలామాత్యుఁడు పెద్దాపుర సంస్థానాధీశుల వలన ఏనుఁగును బహుమానముగా పొందినందున వీ రేనుఁగువారైరనియుఁ జెప్పుదురు. లక్ష్మణకవి పూర్వులు పెద్దాపురసంస్థానమున నుద్యోగులు. ఈతఁడును పెద్దాపురసంస్థానమునఁ గవియై యచ్చటి ప్రభువులకుఁ బెక్కు గ్రంథముల నంకితము చేసెను. ఈతఁడు కూచిమంచి తిమ్మకవికి

సమకాలికుఁడు. తిమ్మకవి మరణించిన తర్వాతఁగూడ నీతఁడు 20 ఏండ్లు జీవించి యుండవచ్చుననియు, ఈతఁడు 1770-80 వఱకు జీవించియున్నట్లు కనఁబడుచున్న దనియు శ్రీవీరేశలింగము పంతులుగారు వ్రాసిరి.

ఈ కవి రామేశ్వరమహాత్మ్యము, గంగామాహాత్మ్యము, సుభాషిత రత్నావళి, విశ్వేశ్వరోదాహరణము, నృసింహదండకము, స్తోత్రములు, విశ్వామిత్రచరిత్రము - అను గ్రంథములను, సంస్కృతమున సూర్య శతకమును రచించినట్లు ఇతని 'రామవిలాసము'ను బట్టి తెలియుచున్నది.

ఈతని గ్రంథములలో గంగామాహాత్మ్యము, రామేశ్వర మాహాత్మ్యము, రామవిలాసము, సుభాషితరత్నావళి అను గ్రంథములు మాత్రమే లభించినవఁట ! రామవిలాసము రామాయణకథను తెల్పు అయిదాశ్వాసముల ప్రబంధము. ఇయ్యది పెద్దాపురసంస్థానమునం దుండిన శ్రీ వత్సవాయ-గోపరాజున కంకిత మొనర్పఁబడినది.

సుభాషితరత్నావళి, భర్తృహరి యను కవిచే సంస్కృతమున రచింపఁబడిన 'సుభాషితత్రిశతి'కి ఆంధ్రానువాదము. ఈ యనువాదము విరసముగా నుండక, మూలము ననుసరించుచు, నిర్దుష్టమయి, రసవంతమై, హృదయంగమముగా నుండును. ఈతని జన్మస్థలమగు పెద్దాడగ్రామములోని సోమశంకరస్వామి తన మనస్సునఁ దోఁచి దానిని తెలిఁగింపవలెనని తన్ను కోరినట్లు కవియే చెప్పియున్నాఁడు.

ఇతని 'రామవిలాసము'కూడ హృదయంగమమై యుండునఁట !

## లక్ష్మణకవి - ఏనుఁగు

ఈతఁడు నియోగిబ్రాహ్మణుడు. సుప్రసిద్ధుఁడగు ఏనుఁగు లక్ష్మణకవికి పితామహుఁడు. ఈతఁడు పెద్దాపురసంస్థానమున నుండి పెక్కు గ్రంథ ములను వ్రాసి ప్రభువుల కంకితము చేయుచుండెను. ఈతఁడు 'ద్రౌపదీ పరిణయము'ను రచించి శ్రీ వత్సవాయ - తిమ్మగజపతిరాజుగారి కంకిత

[library stamp]

మొనర్చెను. కావున నీతఁడు 17 వ శతాబ్ది రెండవ భాగమున నుండెనని చెప్పవచ్చును.

మఱియు నీతఁడు 'ధ్రువచరిత్రము'ను వ్రాసి జగ్గరాజునకును, 'తులామాహాత్మ్యము'ను రచించి జగన్నాథరాజునకును అంకితము చేసెను. వీ రిర్వురును వత్సవాయువంశజులగు రాజబంధులు.

ఇతని గ్రంథములు లభింపలేదు.

పయిగ్రంథములనుగూర్చియు, కర్తనుగూర్చియు లక్ష్మణకవి గ్రంథములవలననే తెలియవచ్చుచున్నది.

ఈతఁడు రాజశేఖరచరిత్ర, భీమసేనవిజయము, భల్లాణరాయ చరిత్ర, మున్నగు గ్రంథములను వ్రాసెనని శ్రీ నిడుదవోలు - వేంకటరావుగారు వ్రాసి యున్నారు.

## లక్ష్మణకవి - పిండిప్రోలు

ఈతఁ డారువేల నియోగిబ్రాహ్మణుఁడు. భారద్వాజగోత్రుఁడు. గోపాలామాత్యుని పుత్రుఁడు. ఈతఁడు గోదావరి జిల్లాలోని రామచంద్రపురమునకుఁ జేరువ నున్న కుయ్యేరుగ్రామమున నివసించుచుండెడివాఁడు. ఈతఁడు తిట్టుకవిత్వమునందును, ఇతరుల నాక్షేపించుటయందును పేరు పడినవాఁడు. ఈతఁడు తన గ్రంథమును క్రీ. శ. 1797 ప్రాంతమున రచింపఁ బూనుకొనెను. కావున, అప్పటి కీతఁ డిర్వదియైదేండ్ల ప్రాయము కలవాఁడని తలఁచినయెడల 1770 ప్రాంతమున జన్మించి యుండవలెను. ఈ కవి 1840 ప్రాంతమువఱకును జీవించి యుండెనఁట.

లక్ష్మణకవి రావణదమ్మీయ మను నామాంతరము గల లంకావిజయ మను రెండాశ్వాసముల ద్వ్యర్థి కావ్యమును రచించెను. తమ గ్రామమును గుత్తచేసిన రావు-ధర్మారాయుఁడను పద్మనాయక కులజుఁ డీ లక్ష్మణకవి లంకభూమి నపహరింపఁగా, నీతఁ డాతనిం దిట్టుచు రామాయణార్థము వచ్చునట్లు నీ కావ్యమును జెప్పెను.

ఈతఁడు శిష్టు-కృష్ణమూర్తిశాస్త్రి సమకాలీనుఁడు. ఆ కవి తన 'సగ్వకామదా పరిణయము'ను శ్రీ కాకర్లపూడి - రామచంద్రరాజుగారి సోదరుఁడగు జగన్నాథరాజుగారి కంకితమొసర్ప నేర్పఱచిన సభలో లక్ష్మణకవి కృష్ణమూర్తిశాస్త్రిని పరాభవించి కృతి సమర్పణమునకు విఘ్నము కలిగించినట్లు చెప్పుదురు.

## లక్ష్మణకవి - పైఁడిపాటి

ఈతఁ డార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. కౌండిన్యగోత్రజుఁడు. ఏకామ్ర మంత్రి పుత్రుఁడు. ఈతని కాలమునుగూర్చి తెలిసికొనుట కాధార ములను గ్రంథమునుండి తెలిసికొనుట కవకాశము లేదు. కాని అడిదము - సూరకవి 'ఆంధ్రనామశేష' మను పేరిట నీతని గ్రంథమునకు శేష గ్రంథమును వ్రాయుటచే నీతఁ డాతనికంటెఁ బూర్వుఁడని తేలుచున్నది. సూరకవి క్రీ. శ. 1720 ప్రాంతమునుండి 1785 వఱకు నుండినందున నీతఁడు 17-వ శతాబ్ది చివఱకంటెఁ బూర్వుఁడని చెప్పవలసి యున్నది.

లక్ష్మణకవి 'ఆంధ్రనామ సంగ్రహ' మను పేర అయిదు వర్గములలో దేవతలు, మానవులు, స్థావరములు, తిర్యక్కులు. అను వీనిని తెల్పు అచ్చతెలుగు పదములను, నానార్థకములగు నచ్చతెలుఁగు పదములను తెలిపి యున్నాఁడు. ఆంధ్రభాషాభిజ్ఞుల కిది యెంతయు నుపయోగకరము. ఈతఁడు 'సుభాషిత రత్నాకరము'ను కూడ రచించెనని శ్రీ కావలి-వేంకట రామస్వామిగారు వ్రాయుచున్నారు.

## లక్ష్మణాచార్యులు - అచ్చి

ఈతఁడు వరంగల్లుప్రాంత నివాసి. 170 ఏండ్ల క్రిందట నుండెనఁట! ఈ కవి 'ముముక్షుజనకల్పము' అను విశిష్టాద్వైత మతప్రశస్తిని తెలుపు గ్రంథమును రచించెను. ఇది కవియొక్క ఆత్మసంబోధనలతోఁ గూడిన సీసపద్య గ్రంథము.

## లక్ష్మణకవి - గార్లపాటి

ఈ కవి వీరభద్రచరిత్రమును రచించిన ట్లీతని శిష్యుఁడగు పోశెట్టి-లింగకవి వ్రాసి యున్నాఁడు. ఈతని గ్రంథము లభింపలేదు. ఈతఁడు 16-వ శతాబ్దిలో నుండి యుండునఁట !

## లక్ష్మణరాయకవి - తిమ్మరాజు

ఈతఁడు గతశతాబ్దిలో నుండిన కవులలో ముఖ్యుఁడు. పురాణ కథల నీతఁడు సులభమైన వచనములో రచింపసాగెను. ఈతఁడు మార్కండేయపురాణ సారసంగ్రహమును, కూర్మపురాణసారసంగ్రహ మును రచించెను. పువ్వాడ - వేంకటరావుగారితోఁ గలిసి మత్స్యపురాణ సారసంగ్రహమును రచించెను.

## లక్ష్మణసింగు

హైదరాబాదుప్రాంతమందలి నేలకొండపల్లి యీతని నివాసము. ఈతఁడు 70 ఏండ్ల క్రిందట నుండినట్లు గోలకొండ కవుల సంచికలోఁ గలదు. ఈతఁడు 'కేశవశతకము'ను రచించెను. అది యముద్రితము.

## లక్ష్మణార్యుఁడు - నిమ్మల

ఈతఁడు వీరశైవమతమునకుఁ జెందినవాఁడు. 'కంచి యేకామ్ర లింగ!' అను మకుటముతో నొక సీసపద్యశతకమును రచించెను. వేమన వంటివను గల కవులను కొనియాడినందున నీతఁడు 15-వ శతాబ్ది కీవలివాఁ డగును. ఇతనింగూర్చిన వివరములు తెలియలేదు. రచన సరళము.

## లక్ష్మీనరసకవి - చట్రాతి

ఈతఁ. డార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. విశాఖపట్టణమండలనివాసి. క్రీ. శ. 1750 ప్రాంతమున నుండినవాఁడు. ఆ కాలములో విజయనగర సంస్థానపు దివానగు పూసపాటి - సీతారామరాజుగారి దౌష్ట్యమును

ప్రజలకుఁ గలిగించుచున్న కష్టములను వివరించుచు 'భండనారాతిభీమ! కోదండరామ!' అను మకుటముతో నీతఁ డొక శతకమును (సీసపద్య, శతకమును) రచించెను. దీనికి 'భండనారాతిభీమ' శతకమని పేరు. రచన మృదుమధురమై, హృదయంగమమై యుండును.

## లక్ష్మీనరసింహకవి

నరసింగయ్య యనునది యీతని నామాంతరము. ఈతఁడు క్రీ. శ. 1650 ప్రాంతమున గద్వాలలో నుండెనఁట! ఈతఁడు 'నృసింహవిలాస'మను గ్రంథమును రచించెను. అది యముద్రితము.

తెనాలి - రామకృష్ణకవి 'ప్రగడరాణ్ణరసా! విరసా! తుసా! బుసా!' అని నిందించిన నరసకవి యీతఁడేమో యని శ్రీ శేషాద్రిరమణ కవు లభిప్రాయపడుచున్నారు. ఈతని గ్రంథము లభ్యము కాలేదు.

## లక్ష్మీనారాయణ - దామరాజు

ఈతఁ డార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. శ్రీవత్సగోత్రజుఁడు. శివ రామామాత్యుని పుత్రుఁడు. ఇతఁడు తన 'బృందావనవిహార'మను మూఁడా శ్వాసముల ప్రబంధమును మల్కాపురములోని శ్రీసీతారామస్వామి కంకిత మొనర్చి యుండుటవలన ఆ ప్రాంతమువాఁడని యూహింప వలనుపడు చున్నది. ఈతఁడు తర్వాత ఏలూరికి వచ్చి, యచ్చట నివాసమేర్పఱచు కొన్నట్లు తెలియుచున్నది. ఈతఁడు నూఱేండ్లక్రిందట నుండి యుండునని ఆంధ్రకవిచరిత్రకారుల యభిప్రాయము.

బృందావనవిహారమున శ్రీకృష్ణుని బాల్యక్రీడలు వివరింపఁబడినవి.

## లక్ష్మీపతి - ధూర్జటి

ఈతఁడు క్రీ. శ. 1842 లో నుండెను. అయ్యలరాజు-నారాయణ కవి రచించిన 'హంసవింశతి' పద్యకావ్యమును వచనకావ్యముగా నీతఁడు కూర్చెను. ఇది చక్కని గ్రాంథికమున నున్నది.

## లక్ష్మీపతి - రాపాక

హైదరాబాదుప్రాంతమందలి పరకాల యీతని నివాసము. క్రీ. శ. 1700 ప్రాంతమున నీతఁ డుండెనఁట !

ఈతఁడు భద్రాద్రియురభ్యుదయము, శ్రీకృష్ణవిలాసము, శంకర విజయము, శ్రీమదుపాఖ్యానము, నీలావివాహము అను కావ్యములను రచించెను. వీనిలో మొదటి రెండును దోమకొండ ప్రభువులచే ముద్రింపఁ బడినవి. మూఁడవ గ్రంథ మసమగ్రముగ మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక శాలలో నున్నది.

## లక్ష్మీపతి - వీణెము

ఈతఁడు సృష్టికరణ వంశమువాఁడఁట ! తండ్రి కృష్ణరాజు; తల్లి రంగమ్మ. ఈతని నివాసము గాని, కాలము గాని తెలియరాలేదు. ఇతఁడు నూటయేఁబదియేండ్ల క్రిందట నుండి యుండునని శ్రీ వీరేశలింగముపంతులు గారి యాశయము.

లక్ష్మీపతికవి అభిమన్యు పరిణయ మను నైదాశ్వాసముల ప్రబంధ మును రచించెను. ఇయ్యది ప్రశస్తమైన గ్రంథము కాదని శ్రీ వీరేశ లింగముపంతులుగారి యభిప్రాయము.

## లచ్చనకవి - క్రొత్తపల్లి

ఈతఁడు దుష్కరప్రాసము గల కందపద్యములతో 'సూర్యా!' అను మకుటముతో నొక (సూర్య) శతకమును రచించెను. ఇతనింగూర్చిన విశేషములు తెలియలేదు. ఇతఁడు క్రీ. శ. 1825-75 నడుమ నుండినట్లు 'శతకవాఙ్మయసర్వస్వ' కారులు తలంచుచున్నారు.

## లింగకవి - పోశెట్టి

ఈ లింగకవి వీరశైవుఁ డగుటవలనఁ దన కులగోత్రాదులను చెప్ప లేదు. ఈతఁడు నవచోళచరిత్రము, మలహణచరిత్రము, శంకరదాసమయ్య

చరిత్రము, వీరసంగయ్యదేవ చరిత్రము, శివజ్ఞానప్రబోధము నను ద్విపద కావ్యములను రచించెను. ఈతని గ్రంథములలో 'నవచోళ చరిత్ర' యొక్కటియే లభించినది. అది ముద్రితమైనది.

కవి యీ గ్రంథమును బగిరామపల్లెయందలి మృత్యుంజయేశ్వరున కంకిత మొనర్చెను. ఈతఁడు మానవుఁడే కాని, దేవుఁడు కాఁడని 'ఆంధ్ర కవితరంగిణి' చెప్పుచున్నది. కృతిభర్త దేవుఁడని-దానిని పరిష్కరించి, పీఠికను వ్రాసిన శ్రీ పంచాగ్నుల - ఆదినారాయణశాస్త్రిగారు వ్రాసి యున్నారు.

నవచోళ చరిత్రమున 'కరికాలచోళుఁడు, విక్రమచోళుఁడు మున్నగు తొమ్మండ్రు చోళుల చరిత్రము వివరింపఁబడినది. ఈ తొమ్మండుగురును శివభక్తులు.

గార్లపాటి - లక్ష్మణకవి యీ లింగకవికి గురువు. లింగకవియు, కృతిభర్తయుఁ గూడ కమ్మరికులమునఁ బుట్టినవారని శ్రీ ఆదినారాయణ శాస్త్రిగారి యభిప్రాయము. కవి 15-వ శతాబ్ది నివాఁ నుండెనని శ్రీ శాస్త్రిగారే నిర్ణయించి యున్నారు.

లింగకవి కవిత్వము సరసమై మనోహరముగా నుండును.

## లింగకవి - భద్రకవి

ఈ కవి జంగమకులమునఁ బుట్టినవాఁడు. ఇతని తండ్రి రామయ్య; తల్లి అమలాంబ. ఈతని గురువు కాళహస్తియందలి సంగమేశ్వరుఁడు.

ఈతఁడు సానందచరిత్రమును, దేవాంగపురాణమును ద్విపద కావ్యములుగా రచించెను. సానందచరిత్రము మూఁడాశ్వాసముల గ్రంథము. సానందుఁడను ఋషి శివపంచాక్షరీప్రభావమున యమలోకవాసులకు నరకబాధను తప్పించిన విషయ మిందు వర్ణితము. ఇయ్యది అరుణాచలమునకు ఉత్తరమున నున్న అరుణాద్రిమంగళపురవాస్తవ్యుఁడును, సంగయదేవర కుమారుఁడు నగు వీరభద్రయ్య యను జంగమదేవర కంకిత మొనర్పఁబడినది.

దేవాంగపురాణ మేడాశ్వాసముల గ్రంథము. మనుమహార్షి యీశ్వరునకు దేవాంగఋషిగా జన్మించి పెక్కువతారముల నెత్తిన కథ యిందు వర్ణితము. ఇది ముదునూరిలోని రామేశ్వరస్వామి కంకిత మొనర్పఁబడినది. ఈ గ్రంథములు రెండును అముద్రితములు. వీనిలోని కవిత్వము సరసమై, హృదయంగమముగా నుండును.

ఈ కవి తన దేవాంగపురాణమును రచించునప్పుడు పడవీడునకు శ్రీకాళహస్తీశ్వరుఁ డనునతఁడు ప్రభువుగా నున్నట్లు చెప్పియున్నాఁడు. ఈతఁడు విజయనగరప్రభువగు అచ్యుత దేవరాయల కాలములోనివాఁడు. కావున నీ కవియును క్రీ. శ. 1530-1542 ప్రాంతమువాఁడై యుండును.

## లింగకవి, గంగకవి

జంటకవులగు వీ రిర్వురును కలసి సీతావిజయ మను నామాంతరము గల శతముఖరామాయణమును రచించిరి. వీ రిర్వురును వేదాద్రిపుర నివాసులు. లింగన నీలకంఠోపాసకుఁడు. అతఁడు మొదటి మూఁడాశ్వాసములను రచించి చిన్నారెడ్డి పుత్రుఁడగు సోమప్రభువున కంకిత మొనర్చెను.

గంగకవి నృసింహోపాసకుఁడు. ఇతఁడు తాను రచించిన నాల్గవ యాశ్వాసమును భోగనృపాలున కంకిత మొనర్చెను. వీ రిర్వురును రమారమి 250 ఏండ్లక్రిందట నుండి యుందురని శ్రీ వీరేశలింగముపంతులుగారి యాశయము.

వీరి కవిత్వము నిర్దుష్టమై, రసవంతమై యుండును.

## లింగన్న — తక్కెళ్ళపాటి

ఈ కవి నియోగిబ్రాహ్మణుఁడు. హారితసగోత్రుఁడు. చిట్టయ్య పౌత్రుఁడు. ఇతని తండ్రిపేరు వేంకటపతి. తల్లి సూరమ్మ. ఇతనికాలము

తెలియరాలేదు. కాని 150 లేక 200 ఏండ్ల క్రిందట నీతఁడుండి యుండ వచ్చునని శ్రీ వీరేశలింగముపంతులుగారి యాశయము.

ఈతఁడు మదనమోహినీ విలాసము, సూర్యతనయా పరిణయము, ఉత్తర హరిశ్చంద్రకథ యను మూఁడు పద్యకావ్యములను, విద్యుత్ప్రభా విలాస మను యక్షగానమును రచించినట్లు తెలియుచున్నది. కవిత్వము ప్రౌఢముగను, రసవంతముగను లేదు.

## లింగమూర్తి - పరశురామపంతుల

ఈతఁ డార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. రామమంత్రికిని, తిమ్మాంబ కును పుత్రుఁడు. మహాదేవయోగి శిష్యుఁడు. శుకచరిత్రకర్త యగు రామ మూర్తికి జనకుఁడు. ఈతఁడు నూటయేఁబది యేండ్ల క్రిందట నుండి యుండునని శ్రీవీరేశలింగము పంతులుగా రభిప్రాయపడి యున్నారు. వరంగల్లు ప్రాంతమందలి మట్టెవాడ యీతని నివాసము.

ఈతఁడు సీతారామాంజనేయసంవాద మను మూఁడాశ్వాసముల వేదాంతగ్రంథమును రచించెను. అందు మొదటి యాశ్వాసమున తారక యోగము, రెండవ యాశ్వాసమున సాంఖ్యయోగము, తృతీయాశ్వాసమున రాజయోగము వివరింపఁబడినవి. ఈతని కవిత్వము హృద్యమై, నిర్దుష్టమై యుండును.

'మనసా!' అను మకుటముతోఁ గల శతక మీతని రచనయై యుండునా? అని కొందఱు తలంచుచున్నారు. తగిన యాధారములు లభించువఱకు నీ విషయమును నిశ్చయింప వలనుకాదు. ఈతఁడు 'రతిమన్మథ విలాసము, సీతపాట, సాంఖ్యయోగము' అను గ్రంథములఁగూడ రచించె నఁట!

## లింగయ్య - రంగరాజు

అప్పకవి యీతని పద్యము నొకదాని నుదాహరించి యున్నాడు. ఈతఁడు క్రీ. శ. 1650 కంటెఁ బూర్వుఁడు. ఈ కవి యే గ్రంథములను రచించినదియును తెలియదు.

## లింగయ్య

ఈతఁడు సంస్కృతాంధ్రములందు గట్టి పండితుఁడనియు, సాముద్రిక శాస్త్రమును పద్యకావ్యముగా రచించెననియు శ్రీ కావలి - వేంకట రామస్వామిగారు వ్రాయుచున్నారు.

## లింగరాజు-ధూర్జటి

ఈతఁ డార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. భారద్వాజగోత్రుఁడు. కుమారధూర్జటి బిరుదు గల వేంకటపతికిఁ బుత్రుఁడు. ఈతఁడు క్రీ. శ. 1780 ప్రాంతమున నుండెనని చెప్పవచ్చును.

ఈతఁడు శ్రీ కాళహస్తిమాహాత్మ్యమును - కాళహస్తిరాజుల ప్రేరణమున 12 ఆశ్వాసముల బృహత్ప్రబంధముగా రచించెను. రత్నావళీ పరిణయ కృతికర్త యగు వేంకటరాయకవి యీతని పుత్రుఁడు.

శ్రీ కాళహస్తిమాహాత్మ్యము అక్కప్పనాయని పుత్రుఁడగు వేంకటపతిరాయల కంకితము చేయఁబడినది.

## లింగరాజు

ఈతఁడు వ్యాకరణవిద్వాంసుఁడు, కవియు నయి, మలయాద్రి నృసింహస్వామిభక్తుఁడై యుండెనఁట! ఈతఁడు 'మలయాద్రి నారసింహచ్ఛందస్సు' అను ఛందోగ్రంథమును రచించెనఁట ! అది శ్రీ మలయాద్రి నృసింహస్వామికే అంకితము. అది యలభ్యము. ఇతనింగూర్చి శ్రీ కావలి-వేంకటరామస్వామిగారే తెల్పియున్నారు.

## లీలావతి

ఈమె విజయరాఘవనాయకుని కాలమున (క్రీ. శ. 1633-73) తంజాపురమునందలి నాటకశాలలో నున్న నట్టువకత్తె; 'కమ్మ వక్కాణ' అను చిన్నగ్రంథమును వ్రాసినది. ఇందు విజయరాఘవ

నాయకుఁడు లీలావతితోఁగూడ చంద్రికావిహారవినోదములు సల్పుట వర్ణితము.

## లోకబాంధవుఁడు

ఈతఁడు హరిశ్చంద్ర చరిత్రమును రచించెనని శ్రీ కావలి-వేంకట రామస్వామిగారు వ్రాయుచున్నారు. ఇతని కాలము తెలియదు.

## వటమూలకవి

ఈతఁడు 'వటమూలమందిరా!' అను మకుటముతో నొక శతకమును రచించెను. వటమూలుఁ డనునది బిరుదో, పేరో? ఈతనిని క్రీ. శ. 1580 ప్రాంతమున నున్న తురగా - రామకవి, అయ్యంకి-బాలసరస్వతి కొనియాడి యున్నారు. కావున నితఁడు వారికంటెఁ బూర్వుఁడు.

## వడ్డికవి - వెణుతుర్ల

ఇతఁడు కౌండిన్యగోత్రుఁడు; వెంగనార్యుని పౌత్రుఁడు; మంగళగిరి పుత్రుఁడు; శుక్లయజుర్వేది; శ్రీరామభక్తుఁడు; దేశికాచార్యుల శిష్యుఁడు.

ఈ కవి శృంగారరసాలవాల మనెడి శృంగారలక్షణగ్రంథమును, బాలగోపాలవిలాస మను ప్రబంధమును రచించినట్లు తెలియుచున్నది. ప్రబంధమున శ్రీకృష్ణుని విలాసములు వర్ణింపఁబడినవి.

ఇతనికాలము, నివాసము తెలియరాలేదు.

## వరదరాజు - కట్టా

ఈతఁడు సూర్యవంశ క్షత్రియుఁడు. ఇతని తండ్రి రామరాజు. తాత హరిదాసురాజు. ఈ కవి యతిరాజయోగి శిష్యుఁడు. ఈతఁడు క్రీ. శ. 1650 ప్రాంతమున నుండినవాఁడు.

ఈ కవి పరమభాగవతచరిత్రమను ఎనిమిదాశ్వాసముల పద్యకావ్యమును, శ్రీరంగమాహాత్మ్యమను పద్యకావ్యమును, రామాయణ ద్విపదకావ్యమును రచించెను. రామాయణము, శ్రీరంగమాహాత్మ్యమును ముద్రితములైనవి.

ఈతని కవిత్వము రసవంతమై యుండును.

## వల్లభరాయకవి - కోవూరు

హైదరాబాదు ప్రాంతమందలి మహబూబునగరు జిల్లాలోని పసుపుల్కి గ్రామమున నీతఁడు 60, 70 ఏండ్ల క్రిందట నుండెనఁట! ఈతఁడు 'ఉత్సవమాహాత్మ్యము' అను పద్యకావ్యమును రచించెను. అది యముద్రితమఁట!

## వల్లభరాయలు - వినుకొండ

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. కామకాయనసవిశ్వామిత్రగోత్రుఁడు. త్రిపురాంతకునకును, చందమాంబకును పుత్రుఁడు. శ్రీనాథమహాకవి రచించినట్లు ప్రసిద్ధముగా నున్న 'క్రీడాభిరామము'న కీతఁడు కర్త యని ప్రచారమున్నది. ఈతఁడు శ్రీనాథునికి మిత్రుఁడు. వినుగొండ నివాసి.

క్రీడాభిరామము ప్రేమాభిరామము ననుసరించి వ్రాయఁబడినది. దానిని రావిపాటి త్రిపురాంతకుఁడు సంస్కృతమున రచించెను. లక్షణకర్తలలోఁ గొందఱిది వల్లభరాయకృతమనియుఁ గొందఱు శ్రీనాథకృతమనియుఁ జెప్పియున్నారు. ఈ గ్రంథమునఁ బూర్తిగా శ్రీనాథుని రచనాపద్ధతియే కానవచ్చుచున్నది. ఇయ్యది వల్లభరాయకృతము కాదనియు, శ్రీనాథుఁడే రచించి, వల్లభరాయనిపేర వెలయించెననియు శ్రీ వేటూరి - ప్రభాకరశాస్త్రిగారు పెక్కు ప్రమాణములతో నిరూపించియున్నారు. ఇది వల్లభరాయ రచితమే యని తలఁచుచున్నవారిలోఁ

గొందఱు వల్లభరాయనికి గ్రంథరచనలో శ్రీనాథుఁడు తోడ్పడి యుండ వచ్చునని యనుచున్నారు.

ఈతఁడు క్రీ. శ. 1380-1430 ప్రాంతమువాఁడఁట !

క్రీడాభిరామము ప్రౌఢమై ధారాశుద్ధి కలిగి మనోహరముగా నున్నది.

## వల్లభసూరి - కోడూరి

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. రామపండితుని పుత్రుఁడు. ఎఱ్ఱయామాత్యుని పౌత్రుఁడు. హరితసగోత్రుఁడు. ప్రబోధానందస్వామి శిష్యుఁడు. కవిదేవేంద్రుఁడని యీతనికి బిరుదు కలదఁట !

ఈ కవి భాస్కరాచార్యుఁడు రచించిన లీలావతినుండి 'పాటిగణితము'ను బొమ్మలాట-కాళయప్రేరణమున రచించెను. ఇది యసమగ్రమఁట ! అముద్రితము. ఈ కాళయ కర్ణాటరాజ్యాధీశ్వరులగు శ్రీకృష్ణదేవరాయలను, అచ్యుతరాయలను కొలిచి, వారి మన్ననల నందినట్లును, కుమారతాతాచార్యుల శిష్యుఁడైనట్లును వల్లభసూరి చెప్పి యుండుటచే, కృతిపతి, కృతికర్త లిర్వురును 16-వ శతాబ్దిలో మొదటి భాగమున నున్నట్లు చెప్పవచ్చును.

## వాదీంద్రచూడామణి

ఈతఁడు జైనాచార్యుఁడు. రేచనకు గురువు. ఈతఁడు 'వాదీంద్రచూడామణి', యను గ్రంథము(ఛందస్సు)ను రచించిన ట్లప్పకవీయము వలనఁ దెలియవచ్చుచున్నది. ఈతఁడు వాగీంద్ర (వాగేంద్ర)చూడామణిగాఁ గొందఱిచేఁ జేర్కొనఁబడెను. ఇతఁ 'డాదిపురాణము'ను గూడ వ్రాసెనఁట ! ఈతఁడు క్రీ. శ. 1100 సం. కుఁ బూర్వపువాఁడు. కస్తూరి

రంగకవి పేర్కొనిన 'వాదాంగచూడామణి' వాదీంద్రచూడామణి కంటె విభిన్నమఁట !

ఈతని గ్రంథములు లభింపలేదు.

## వాలేశ్వరుఁడు - మల్లవరపు

ఈతఁడు పాకనాటి నియోగిశాఖకుఁ జెందిన శైవబ్రాహ్మణుఁడు. గౌతమసగోత్రుఁడు. పోలయామాత్యుని పుత్రుఁడు. ఈతని నివాసము విన్నకోట సీమలోని మల్లవరమైన ట్లీతని పద్యమునుబట్టియే తెలియుచున్నది. ఈతఁడు 250 ఏండ్ల క్రిందటివాఁడైనట్లు శ్రీవీరేశలింగము పంతులుగారి యూహ.

ఈ కవి భల్లాణచరిత్రమను నైదాశ్వాసముల ప్రబంధమును రచించెను. అందు సింధుకటకరాజయిన భల్లాణుఁడను శివభక్తుని చరిత్రము వర్ణితము. ఈ ప్రబంధము మల్లవరములోని నాగేశ్వరస్వామికే అంకితము చేయఁబడినది.

ఇవటూరి – రామనారాధ్యుఁడు తన గురువని యీతఁడు చెప్పియున్నందునను, అజ్జరపు – పేరయలింగము తన గురు విప్వటూరి – పెదరామనారాధ్యుఁడని చెప్పి యున్నందునను, వీ రిర్వురు నించుమించుగ సమకాలికులు కావచ్చును. కావున నీతని కాలము. క్రీ. శ. 1580-1630 నడుమదై యుండవచ్చును.

## వాసుదేవయోగి

. ఈతని కాల మేదియో తెలియదు. నూటయేఁబది యేండ్ల క్రిందట నుండి యుండునని శ్రీవీరేశలింగముపంతులుగారి యాశయము.

ఈ యోగివర్యుఁడు జీవప్రబోధ మను నాలుగాశ్వాసముల వేదాంతగ్రంథమును రచించెను. కవిత్వము సలక్షణము; హృద్యము.

## వాసుదేవశాస్త్రి - వావిలాల

ఈతఁడు తెలగాణ్యశాఖకుఁ జెందిన వైదికబ్రాహ్మణుఁడు. హారితసగోత్రుఁడు. తండ్రి అప్పయ్య. తెనాలితాలూకా కారుమూరిలో 1851 లో జనించెను. రాజమహేంద్రవరమునందలి ప్రభుత్వకళాశాలలో నధ్యాపకుఁడుగా నుండెను.

ఈతఁడు 'ఆరోగ్యసర్వస్వము, గరుడాచలము, నందకరాజ్యము, మృచ్ఛకటికము, ఉత్తరరామచరిత్రము, మాతృస్వరూపస్మృతి, ఆంధ్ర రఘువంశము, జూలియస్ సీజరు, ముముక్షుతారకము మున్నగు గ్రంథములను రచించెను. వీనిలోఁ గొన్ని సంస్కృతానువాదములు; కొన్ని స్వతంత్రములు. 'జూలియస్ సీజరు' ఆంగ్లానువాదము.

ఇతని కవిత్వము మనోహరముగా నుండును.

## విజయరంగ చొక్కనాథుఁడు

ఇతఁడు దక్షిణ దేశమునందలి నాయకరాజులలో ముఖ్యుఁడు. క్రీ. శ. 1704 నుండి 1731 వఱకును మధురరాజ్యమును పాలించిన విద్వత్ప్రభువు. ఇతఁడు తన యాస్థానమున విద్వత్కవులను పోషించుటయే కాక స్వయముగ గ్రంథరచనకుఁ బూనుకొని శ్రీరంగమాహాత్మ్య మను పది యధ్యాయముల వచనకావ్యమును, మాఘమాహాత్మ్యమను పదునైదధ్యాయముల వచనకావ్యమును వ్రాసెను.

సుప్రసిద్ధుఁడగు సముఖము - వేంకటకృష్ణప్పనాయకుఁ డీతని యాస్థానముననే యుండెను.

## విజయరాఘవకవి - తోఁట

19-వ శతాబ్దిలో మద్రాసులో నుండిన పండితకవులలో నీతఁ డొకఁడు; కోదమూరి - కృష్ణమాచార్యుల శిష్యుఁడు. ఈతఁడు మదరాసు తిరువల్లిక్కేణి హిందూ బాలికాంధ్ర ద్రావిడ పాఠశాలలో నుపా

ధ్యాయుఁడై యుండెను. క్రీ. శ. 1849 లోఁ దన గ్రంథములను ముద్రింపించినందున నీతఁడు 19-వ శతాబ్ది తొలిపాదమున జన్మించి యుండ వచ్చును.

ఈతఁడు 'పార్థసారథిశతకము' (ఏకప్రాస కందపద్యశతకము)ను, నాయకీనాయకశతకమును రచించెను. పార్థసారథిశతకము భక్తి భరితము. నాయకీ నాయక శతకమున మకుటనియమము లేదు. ఇది శృంగార రసప్రధానము. రచన రసవంతము. ఈ శతకములు రెండును ముద్రితములు.

## విజయరాఘవనాయకుఁడు

ఈతఁడు తంజావూరిని పాలించిన రఘునాథనాయకుని పుత్రుఁడు. తండ్రికిఁ బిదప 1633 నుండి 1673 వఱకును రాజ్యమును పాలించిన విద్వత్కవి. తండ్రివలెనే పెక్కురు కవిపండితులను పోషించెను. కృష్ణమాంబ, రంగాజమ్మ, కాళకవి మున్నగువారీతని యాస్థానమున నుండిరి. ఈతఁడు సాహిత్యపెండారమును ధరించెడివాఁడు. తన వాఙ్మయాభిమానమునకు గుఱుతుగ శారదాధ్వజమును నిలిపిన ప్రభువు!

ఈతఁడు పెక్కుగ్రంథములను రచించెను. అవి యేవన :—

యక్షగానములు :- (నాటకములు)—

రాజగోపాలవిలాసము, చెంగమలవల్లీపరిణయము, గోవర్ధనోద్ధరణము, రతిమన్మథవిలాసము, రాసక్రీడా నవనీతచోరము, పారిజాతాపహరణము, రుక్మిణీకల్యాణము, రాధామాధవము, సత్యభామావివాహము, ఉషాపరిణయము, దక్షిణద్వారకాస్థల వర్ణనము, కాళియమర్దనము, రఘునాథాభ్యుదయము, ప్రహ్లాదచరిత్రము, పూతనాహరణము, విప్రనారాయణ చరిత్రము, సముద్ర మథన నాటకము, కృష్ణవిలాసము, మోహినీవిలాసము, జానకీకల్యాణము, ప్రణయకలహము, కంసవిజయము

ద్విపదలు - పాదుకా సహస్రము, మోహినీవిలాసము, రఘునాథ నాయకాభ్యుదయము, మంజరీ ద్విపద.

ఇవియే కాక ఫాల్గుణోత్సవరగడ - గోపికాగీత, భ్రమరగీత, రాజగోపాలదండకము, వీరశృంగారసాంగత్యము, మన్నారుసాంగత్యము, వేడికోలులు, విన్నపములు, దరువులు, ఏలలు, విడిపదములు మున్నగు వానిని పెక్కింటి నీతఁడు రచించెను.

ఈతఁడు మన్నారుస్వామి భక్తుఁడు. ఇతని యాస్థానమున నుండిన కాళకవియు, రంగాజమ్మయు రచించిన గ్రంథము లీ యంశమును వ్యక్తముచేయుచున్నవి.

తన తండ్రి యగు రఘునాథనాయకుఁడు తండ్రిచరిత్రమును 'అచ్యుత రామాభ్యుదయమును రచించిన ట్లీ కవి తనతండ్రి చరిత్రమును 'రఘు నాథాభ్యుదయము,' 'రఘునాథనాయకాభ్యుదయము' అను రెండు కావ్యములుగా వ్రాసెను.

## విజయరామరాజు - పూసపాటి

విజయనగర రాజకుటుంబమునకుఁ జెందిన యీ కవి నివాసము విజయనగరప్రాంతమందలి రేగులవలస. 17-వ శతాబ్దిచివర నుండిన వాఁడు.

ఈతఁడు విద్వత్కవి. విష్ణు భక్తి సుధాకరమను ఐదాశ్వాసముల ప్రబంధము, హోరాలక్షణమను జ్యోతిషగ్రంథము నీతని రచనలు కాన వచ్చుచున్నవి. హోరాలక్షణము ముద్రితము. విష్ణుభక్తి సుధాకరమున విష్ణుభక్తుఁడగు కులశేఖరాళ్వారు చరిత్రము చక్కఁగా వర్ణింపఁబడి యున్నది.

## విరూపాక్షుఁడు - శ్రీగిరి

ఈతఁడు శ్రీగిరి పాపరాజు కుమారుఁడు; కాళహస్తి లింగశతకమను నొక సీసపద్యశతకమును 250 ఏండ్ల క్రిందటనే రచించెనఁట! ప్రౌను

దొరగారి కాలమున నది ముద్రింపఁబడినదని శతకకవుల చరిత్రకారులు వ్రాసినారు. కవి 1700 సం. కుఁ బూర్వుఁడఁట! ఈతని కవిత్వము సరళమైనది.

## విశ్వనాథకవి - వెణుతురుపల్లి

ఈతఁ డార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. వేంకటామాత్యుని కుమారుఁడు. ఈతఁడు పెద్దాపురప్రభువగు వత్సవాయ - తిమ్మజగపతి రాజున కంకితముగా 'శేషధర్మము'లను పద్యకావ్యమును రచించెను. ఈ తిమ్మరాజుగారు క్రీ. శ. 1555 నుండి 1607 వఱకును రాజ్యపాలనము చేసినందున, విశ్వనాథకవి 1600 ప్రాంతమువాఁడై యుండవచ్చును. ఈ విషయ మాంధ్రకవుల చరిత్రములోఁ గలదు.

ఈతని కవిత్వము సలక్షణమై యింపుగా నుండును. ఈతనిని ఏనుఁగు లక్ష్మణకవి ప్రశంసించెను.

## విశ్వేశ్వరకవి

ఈతఁ డొక ఛందస్సును రచించినట్లు కస్తూరిరంగకవి రచితమైన 'ఆనందరంగరాట్ఛందస్సు'నుబట్టి తెలియుచున్నది. ఆ'విశ్వేశ్వరచ్ఛందము లభింపలేదు. 'విశ్వేశ్వర' నామముతో పెక్కురున్నారు. అట్టివారిలో నితఁడొకఁడు కావచ్చును.

## విశ్వేశ్వరకవి

ఈ విద్వత్కవి 'కృష్ణవిలాస'మను శృంగారప్రబంధమును రచించి, తలమల రామచంద్రారెడ్డికి కృతియిచ్చెను. తలమల యనునది తిరుచినాపల్లి జిల్లాలోని నామకల్లు తాలూకాలోని యొక కొండక్రింది ప్రదేశము. ఆ ప్రాంతమున కీ రామచంద్రారెడ్డి పాలకుఁడు. రామచంద్రారెడ్డి

క్రీ. శ. 1652 లో జన్మించి 1718 లో మరణించెనఁట! కావున నీ కవియు నప్పటివాఁడే కావలెను.

ఈ కవి కృష్ణవిలాసము నే గాక పెక్కు సంస్కృతాంధ్ర కృతులను రచించినట్లు తెలియుచున్నది. కాని యవి యేవియును లభింపలేదు. కృష్ణవిలాస మముద్రితము.

## విశ్వేశ్వర శివదేశికులు

ఈతఁ డోరుగంటి నివాసి. క్రీ. శ. 1200 ప్రాంతమువాఁడని శ్రీశేషాద్రిరమణకవుల యభిప్రాయము. ఈతఁడు కాకతీయప్రభువులగు గణపతిదేవునకును, ప్రతాపరుద్రునకును దీక్షాగురువు. ఈ విద్వత్కవి శివతత్త్వరసాయన మను గ్రంథమును రచించెను. అది లభింపలేదు.

## వీరన్న - పోచిరాజు

ఈతఁ డార్వేల నియోగి. తండ్రి వీరభద్రుఁడు; తల్లి మూర్తమాంబ; కౌండిన్యగోత్రజుఁడు. నివాసము కృష్ణాజిల్లాలోని కొలకలూరు. ఇతఁడు కృష్ణార్జున సంవాదము, పంచకావ్యములు, విభూతిమాహాత్మ్యము, మార్కండేయచరితము, మనువంశపురాణము, ముక్తదేవుకథ, ఆనందలహరి, సౌందర్యలహరి, భర్తృహరిసుభాషితములు అను గ్రంథములను రచించెనఁట! చివరి మూఁడును శతకములఁట! ఈ యంశ మీతని 'భల్లాణచరిత్ర' వలనఁ దెలియుచున్నది. ఈతని భల్లాణచరిత్రము బందరులోని చిత్రకారకులస్థుఁడగు దాము మొగ్గన్నకుఁ గృతి యీయఁబడినది. మనువంశపురాణము బెజవాడలోని మల్లేశ్వరస్వామి కంకితము. ఈ రెండు గ్రంథములు మాత్రమే లభించినవఁట! ఇతఁడు 150 ఏండ్ల క్రిందటి వాఁడని శ్రీ వీరేశలింగము పంతులుగారి యభిప్రాయము.

ప్రబంధమును రచించి, శ్రీశైల మల్లికార్జునస్వామికిఁ గృతి యిచ్చెను. కవి యివటూరి పర్వతారాధ్యుని శిష్యుఁడు, ఈతఁడు తన గ్రంథమును గౌరన రచించిన ద్విపదకావ్యము ననుసరించి రచించెను.

ఈతఁడు క్రీ. శ. 16-వ శతాబ్ది చివరిభాగమునను, 17-వ శతాబ్ది ప్రారంభముననను ఉండెనని చెప్పవచ్చునఁట !

హరిశ్చంద్రోపాఖ్యానమును శంకరకవియును పద్యకావ్యముగా రచించెను. వీరశరభకవిగ్రంథము శంకరకవి గ్రంథ మంత ప్రశస్తము కాదఁట !

## వీరశరభేంద్రుఁడు - బాణాల

ఈతఁడు విశ్వకర్మకులజుఁడు. కాలము తెలియదు. ధూర్జటి కాళహస్తిశతకపు టభిప్రాయములఁ గైకొని 'సాంబశివా ! మహాప్రభూ !' అను మకుటముతో నైదు పాదముల యుత్పలమాలికా వృత్తములతో నొక (మహాప్రభు) శతకమును రచించి యున్నాఁడు. రచన ప్రశస్తము కాదఁట!

## వీరారాధ్యుఁడు - కాశీనాథుని

ఈతఁడు శ్రీపతిపండితుని వంశములోనివాఁడు; ఆరాధ్య బ్రాహ్మణుఁడు. ధర్మగుప్తాభ్యుదయము, భద్రాయుశ్చరిచత్రము అను పద్యకావ్యముల నీతఁడు రచించెను.

## వీరాస్వామయ్య - ఏనుఁగుల

ఈతఁడు క్రీ. శ. 1780 ప్రాంతమున జన్మించి, 1836 లో మరణించెను. ఈతఁడు కాశీయాత్రకుఁ బోయి, తన దినచర్యను యాత్రాచరిత్రముగ సులభమగు వ్యవహారభాషలోఁ గూర్చెను. దీనికి 'కాశీయాత్రాచరిత్ర' అని పేరు. ఇది మిక్కిలి వ్యాప్తిలో నున్నది.

## వెంకనార్యుఁడు - చల్లపల్లి

ఈతఁడు రంగన్న పుత్రుఁడు; 'శ్రీకృష్ణవిలాస'మను నాల్గాశ్వాసముల ప్రబంధమును రచించి శ్రీవేంకటేశ్వరున కంకిత మొనర్చెను. ఈతఁడు పోలూరి - గోవిందకవికి మిత్రుఁడు.

## వెంకనార్యుఁడు - నుదురుపాటి

ఈతఁడు వెలనాఁటి వైదికబ్రాహ్మణుఁడు. సీతారామార్య పుత్రుఁడు, తండ్రికిని, పుత్రునకును గూడ 'ఉద్దండకవి' అను బిరుదము కలదు. ఈతఁడు పుదుకోట్టై సంస్థానప్రభువుల యాశ్రితుఁడు. సంస్కృతాంధ్రములలో గొప్ప విద్వత్కవి. ఈతఁడు క్రీ. శ. 1769-89 నడుమ రాజ్యము పాలించిన రఘునాథ తొండమాన్ భూపాలుని కాలమున నుండెను.

ఈ కవి పెక్కు గ్రంథములను రచించెను. వానిలో ఆంధ్రామరకోశమను నామాంతరము గల 'ఆంధ్రభాషార్ణవ'మను నిఘంటువు, 'రఘునాథీయ'మను అలంకారగ్రంథము, 'పార్వతీకల్యాణ'మను యక్షగానము, తొండమాన్ రాజుల వృత్తాంతము దెల్పు 'తొండమాన్ వంశావళి,' రాయ రఘునాథుని గూర్చి తెలిపెడి 'బృహన్నాయికాదండకము,' దేవమల్లుని వృత్తాంతమును దెల్పు 'మల్లుపురాణము' ముఖ్యమైనవి. ఇవి కాక చాటువులును కొన్ని కలవు.

ఆంధ్రభాషార్ణవము మాతృభూతేశ్వరస్వామికిని, రఘునాథీయమును, తొండమాన్ వంశావళియును రాయరఘునాథభూపాలునకును, పార్వతీకల్యాణము మీనాక్షీసుందరేశ్వరులకును, బృహన్నాయికా దండకము బృహన్నాయికాంబకును, మల్లుపురాణము బిరుదు కప్పాలు మల్లునకును అంకిత మీయఁబడినవి.

ఈతని యాంధ్రభాషార్ణవము ముద్రితము. తక్కినవముద్రితములు.

## వెంకన్న - తక్కసీల

ఈతఁడు రాయచూరు జిల్లాలోని అలంపురము తాలూకాయందలి తక్కసీల నివాసి. క్రీ. శ. 1760 ప్రాంతమున నుండెనఁట !

ఈతఁడు పార్వతీదండకము, సీతారామ శతకము నను రెండు గ్రంథములను రచించెను. అవి యముద్రితములు.

## వెంకమ్మ - తరిగొండ

ఈమె నందవరీక నియోగిశాఖకుఁ జెందిన బ్రాహ్మణస్త్రీ. 'తరిగొండ' కడపజిల్లాలోని వాయల్పాడునకుఁ జేరువ నున్న గ్రామము. ఆ యూరింబట్టియే యీమె యింటిపేరేర్పడి యుండవలెను. ఈమె రమారమ నూరేండ్ల క్రిందట నుండిన విద్వత్కవయిత్రి. భక్తురాలు. ఈమె తన గ్రంథములను తరిగొండలోని నృసింహస్వామి కంకితము చేసినట్లు శ్రీవీరేశలింగము పంతులుగా రాంధ్ర కవుల చరిత్రలో వ్రాసి యున్నారు.

ఈమె రాజయోగసార మను ద్విపదకావ్యమును, వేంకటాచల మాహాత్మ్య మను ప్రబంధమును, ద్వాదశస్కంధముల భాగవతము (పూర్తిగా) ద్విపదకావ్యమును రచించినది. వీనిలో మొదటి రెండు గ్రంథములు నింతవఱకు ముద్రితములై యున్నవి. ఈమె భాగవత రచనానంతరమే వేంకటాచల మాహాత్మ్యమును రచించి శ్రీనివాసున కర్పించిన ట్లా ప్రబంధమునుబట్టి తెలియుచున్నది.

రాజయోగసార మొక వేదాంతగ్రంథము. ఈమె కవనము సరళమై మధురమై సర్వజనగ్రాహ్యమయి యుండును.

వేంకమాంబ 'శివవిలాసము'ను, కృష్ణపదాంకితముగా నొక ద్విపద శతకమును గూడ రచించెను. 'కృష్ణ !' అని ద్విపదశతక మకుటము. ఇందు 137 ద్విపదలు కలవఁట !

## వెంకయ్య - అందుగుల

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. సూరనామాత్యుని పుత్రుఁడు. ఈ కవి రామరాజీయమను నామాంతరము గల 'నరపతివిజయ' మను 4 ఆశ్వాసముల ప్రబంధమును రచించి కోదండరామరాజున కంకిత మొనర్చెను. కృతిపతి అళియరామరాజు మనుమని మనుమఁడు. రామరాజీయము 1630 ప్రాంతమున రచింపఁబడినదని 'ఆంధ్ర కవితరంగిణి'లోఁ గలదు. రచన రసవంతమైనది.

## వెంకయ్య - మారవ

ఈతఁడు 'భాస్కరశతకము'ను రచించెను. ఇందలి పద్యము నప్పకవి యుదాహరించుటచే నితఁ డప్పకవికంటెఁ బూర్వుఁడని చెప్పవలెను. ఈ కవి సూర్యనారాయణస్వామి భక్తుఁడు.

భాస్కరశతకము సరళమై రసవంతమై యుండును. ఇది మిక్కిలి వ్యాప్తిలో నున్న శతకము.

## వెంకయ్య - వాడ్రేవు

విక్రమార్కచరిత్రె మని పేరుపొందిన సింహాసనద్వాత్రింశిక యను సంస్కృతగ్రంథము నీతఁడు క్రీ. శ. 1847 ప్రాంతమున సరళమైన వ్యావహారిక భాషలో రచించెను. దీనికి 'బత్తీసుపుత్రి కథ'లను (ముప్పది రెండు బొమ్మల కథలు) నామము ప్రసిద్ధము.

## వెంగయామాత్యుఁడు - వెలగపూఁడి

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. లోహిత గోత్రుఁడు. పెద్దనామాత్యుని పుత్రుఁడు. ఈ కవి సంస్కృతమున లీలాశుకుఁడను మహాకవి రచించిన శ్రీ కృష్ణకర్ణామృతమును మూఁడాశ్వాసముల ప్రబంధముగా రచించెను. ఆశ్వాసాంతపద్యములనుబట్టి యీతఁడు కృష్ణాశ్రయయోగికి శిష్యుఁడైనట్లు తెలియుచున్నది.

ఈతని కృష్ణకర్ణామృతమునందలి పద్యమొకటి లింగమగుంట తిమ్మ కవి రచించిన సులక్షణసారమున నుదాహరింపఁబడినదని ఆంధ్ర కవుల చరిత్రకారులే వ్రాసి యున్నారు. క్రీ. శ. 1700-1740 ప్రాంతమున నుండిన వెలగపూఁడి కృష్ణకవి తన పూర్వులు వ్రాసిన గ్రంథములలోఁ కృష్ణకర్ణామృతమును చేర్చి యున్నాఁడు.

తిమ్మకవి 16-వ శతాబ్దిమధ్యమున నుండినవాఁడు. కావున వెంగయామాత్యుఁ డతనికంటెఁ బూర్వుఁడని చెప్పవలసి యున్నది.

ఈతని పద్యములు అమృతపు గుళికలవలె నుండుననియు, అనుదిన పాఠయోగ్యములనియు 'ఆంధ్రకవితరంగిణి' కారులు ప్రశంసించి యున్నారు.

## వెంగళభూపాలుఁడు-దామెరల

ఈతఁడు పద్మనాయక కులజుఁడు. ఇనగాలగోత్రుఁడు. వేంకటాద్రి కిని, గురవమ్మకును పుత్రుఁడు. వెంగళాధిపతికిని, అక్కమ్మకును మనుమఁడు. ఈతఁడు బహుళాశ్వచరిత్రమను అయిదాశ్వాసముల ప్రబంధ మును రచించి తన తండ్రి యగు వేంకటాద్రికే అంకితమొనర్చెను. కృతిపతి (వేంకటాద్రి) కులీ కుతుబ్షావలన గౌరవముల నందినట్లుండుటచే కృతిపతి, కృతికర్త లిర్వురును క్రీ. శ. 1550-60 నడుమ నున్నట్లు స్పష్టము.

ఇతని రచన ప్రౌఢమై, చక్కని భావములతోఁ గూడి యింపుగా నుండును.

## వేంకటకవి - ఆకొండి

ఈ కవి ఆరామద్రావిడశాఖకుఁ జెందిన బ్రాహ్మణుఁడు. ఈతఁడు జగన్నాథశాస్త్రికుమారుఁడు. ఇతని తల్లి అచ్చమ్మ. నేఁటి శ్రీకాకుళము జిల్లాలోని బొబ్బిలికి సమీపమునఁ గల గజరాయని వలస యీతని నివాసము. ఈతఁడు 1820 ప్రాంతమున జన్మించెనఁట !

ఈతఁడు 'తత్త్వసంగ్రహ రామాయణము' అను పద్యకావ్యమును, కొన్ని శతకములను రచించెను. తత్త్వసంగ్రహ రామాయణమునందలి కొన్ని భాగములు ముద్రితములు.

ఈతని శతకములలో 'రామా !, నారాయణ ! భక్తపోషణా ! శ్రీరమణా !, రామప్రభూ !' అను మకుటములు గల మూఁడు శతకములు కానవచ్చుచున్నవి.

ఇతని రచన ప్రౌఢమై, సరసమై యుండును.

సత్త్వసంగ్రహ రామాయణము శ్రీకృష్ణున కంకితముచేయఁబడినది.

## వేంకటకవి - ఇంద్రకంటి

ఈతఁడు శా. శ. 1784 లో నుండెను. (అనఁగా 1862 లో నుండెను.) అప్పుడు విశాఖపట్టణముజిల్లాలోని ఉపమాకయందున్న వేంకటేశ్వరునిఁగూర్చి 'వేంకటాచల రమణా!' అను మకుటముతో కంద పద్యములలో నొక శతకమును రచించెను. దానికి 'వేంకటాచల రమణ శతక' మని పేరు. ఈ కవి 1840 ప్రాంతమున జన్మించి యుండవలెను.

## వేంకటకవి - గణపవరపు

ఈతఁడు నందవరీక నియోగిబ్రాహ్మణుఁడు. వసిష్ఠగోత్రజుఁడు. అప్పయామాత్యపుత్రుఁడు. ఇంటిపేరింబట్టి యీతని నివాసము పలనాటి సీమలోని గణపవరమని తోఁచుచున్నది. కాని, క్రీ. శ. 1674 లో తంజావూరిని పాలించిన ముద్దళగిరిప్రభువు నాశ్రయించి విద్యావతీ దండకమును చెప్పినందున నీతఁడు దక్షిణదేశమున నుండినట్లు తెలియు చున్నది. ఈతఁడు 17-వ శతాబ్ది మధ్యభాగమున నుండినవాఁడు.

వేంకటకవి గొప్ప లాక్షణికుఁడు. చిత్రకవిత్వమున మిక్కిలి సమర్థుఁడు. బహుగ్రంథకర్త. ఈతఁడు ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసము, తారావళులు, యమకశతకము, రసమంజరి, కృష్ణమల్లకథ,

బాలరామాయణద్విపద, చాటుపద్యములు, లింగనిర్ణయము, ఆంధ్రప్రతాప రుద్రీయము, ఆంధ్ర నిఘంటువు, ఆంధ్రకౌముది, గణయతిప్రాసలక్షణ సీసమాలిక, ఆంధ్రప్రయోగరత్నాకరము, రేఫఱకారనిర్ణయము, షట్ప్రత్యయప్రస్తారసరణి, ఇరువదాఱు ఛందముల వచనము, అలంకార సారము, పరమభాగవతచరిత్ర, ఆంధ్రద్విరూపకోశము, కల్పిత కల్పలత, ఆంధ్ర వసంతతిలక భాణము, కఠినప్రాససీసము, ఆంధ్రప్రక్రియాకౌముది, జాంబవతీవిలాసము, విద్యావతీదండకము, చక్రవాళ తారావళి, పురాణ సారము-అను గ్రంథములను రచించినట్లు తెలియుచున్నవి. ఇందుఁ గొన్ని మాత్రమే లభ్యములైనవి.

గణపవరపు వేంకటకవి రచించిన 'యతిరాజశేఖర వచనములు'ను కలవు. వానిని రచించిన కవి యీతఁడే కావలెను.

## వేంకటకవి - గోపీనాథము

ఇతఁడు వైదికబ్రాహ్మణుఁడు. నెల్లూరుజిల్లాలోని కావలికి సమీపమునఁ గల లక్ష్మీపుర మీతని నివాసము. ఈతఁడు క్రీ. శ 1820 ప్రాంతమున జన్మించి సంస్కృతాంధ్రములందు గొప్ప విద్వాంసుండయి యా శతాబ్దిలోని గొప్పకవులలోఁ బరిగణింపఁబడెను.

ఈ కవి వేంకటగిరిసంస్థాన ప్రభువులగు శ్రీ సర్వజ్ఞకుమారయాచమ నాయనివారి యాస్థాన విద్వాంసుఁడై యుండెను. ఆయన పుత్రులగు శ్రీ గోపాలకృష్ణయాచేంద్రులు నీ కవిని మిక్కిలి గౌరవించిరి.

వేంకటకవి సంస్కృతమునందలి వాల్మీకిరామాయణమును యథా మాతృకముగా పద్యకావ్యముగా నాంధ్రీకరించెను. ఇటీవల వెలువడిన రామాయణములలో నిదియే యుత్కృష్టమైనదని ప్రశంసఁ గన్నది. మఱియు నీతఁడు బ్రహ్మకైవర్తపురాణమునందలి కృష్ణజన్మఖండము నెనిమిది యాశ్వాసముల ప్రబంధముగా రచించెను; మాఘకవి రచించిన

శిశుపాలవధమును నాల్గాశ్వాసముల పద్యకావ్యముగాఁ గూర్చెను. భగవద్గీతాశాస్త్రమును, బ్రహ్మానందశతకమును, రాధికాపరిణయమును రచించెను.

## వేంకటకవి - జక్కరాజు

ఈతనికి వేంకటరామకృష్ణ కవి యనియు పేరు ప్రసిద్ధము. ఈతఁడు భారద్వాజగోత్రుఁడు. ఎఱ్ఱయామాత్యుని పుత్రుఁడు. 'ఆంధ్ర కామందకము' అను ఎనిమిదాశ్వాసముల పద్యకావ్యమును రచించెను. ఇందు రాజనీతి వర్ణితము.

గ్రంథము చివతిపద్యములో 'శ్రీవేంకటరామకృష్ణులు' అని యుండుటవలన కామందకమును రచించినవా రిర్వురని కొందఱు భ్రాంతి పడవచ్చును. అది సరికాదు.

ఆంధ్ర కామందకము, ఆర్వీటివంశస్థుఁడును, కొండ్రాజు తిమ్మరాజు పుత్రుఁడు నగు వేంకటాద్రి కంకితము చేయఁబడినది. ఈ వేంకటాద్రి పాండురంగమాహాత్మ్య కృతిపతి యగు విరూరి - వేదాద్రిమంత్రి కాశ్రయుఁడగు పెదసంగ భూపాలునికి మేనల్లుఁడు. ఈతఁడు రెట్టమతమును కూడఁ గృతిపొందెను; అహోబలస్వామికి భక్తుఁడు. కామందకము క్రీ. శ. 1548 లో రచింపఁబడినట్లు చెప్పు పద్యము గ్రంథము చివరఁ గలదు. కావునఁ గవియు, వేంకటాద్రియును 16-వ శతాబ్దిలోని ఉత్తరార్థమున నున్నట్లు స్పష్టము. ఆంధ్రకామందకము ముద్రితము.

ఈతని రచన సరళమై యుండును.

## వేంకటకవి – ఢిల్లి

ఈతఁడు వసిష్ఠగోత్రుఁడగు బ్రాహ్మణుఁడు. గోవిందయ్యా నరసమ్మల పౌత్రుఁడు. ఈతఁడు ధేనుకొండ - తిమ్మనార్యుని శిష్య పరంపరలోనివాఁడఁట ! ముమ్మిడి - మల్లనకు శిష్యుఁడు.

ఈ కవి జ్ఞానసూర్యోదయమను వేదాంతగ్రంథమును ద్విపద కావ్యముగా రచించెను. దానిని తన గురువగు మల్లనయోగి కంకితమొనర్చెను. ఈతఁడు మల్లనయోగిశిష్యుఁ డగుటచే క్రీ. శ. 1550-1600 నడుమ నుండినట్లు నిశ్చయింపవచ్చును.

## వేంకటకవి - తిరువాయిపాటి

ఈతని నివాసము కొలనుపాక. 70 ఏండ్ల క్రిందట నీతఁ డుండెనఁట ! యాదగిరీంద్రశతకము, యాదగిరి నృసింహశతకము - అనునవి యీతని కృతులు. ఇవి ముద్రితములు. కవి చాత్తాదవైష్ణవుఁడు.

## వేంకటకవి - మచ్చ

19-వ శతాబ్దిలో నుండిన సుప్రసిద్ధ విద్వత్కవులలో నీతఁ డొకఁడు. ఇతనిది తెలగాకులము. తండ్రి గంగయ్య. ఈతఁడు శ్రీకాకుళము జిల్లా లోని జలుమూరు వాస్తవ్యుఁడు. ఈ కవి 1856 లో జన్మించెనఁట! పర్లాకిమిడి రాజావారి కళాశాలలోఁ గొంతకాల మాంధ్రపండితుఁడుగా నుండెను.

ఈతఁడు 'శుద్ధాంధ్ర నిర్వచన నిరోష్ఠ్య కుశచరిత్ర, వైదర్భీ పరిణయము'-అను ప్రబంధములను, రామాయణసంగ్రహశతకము, ఛాయా పుత్రశతకము - అను శతకములను, రుక్మిణీనాటకమును, ద్రౌపదీవస్త్రా పహరణ, మయూరధ్వజోపాఖ్యాన, అంబరీషోపాఖ్యానము లను గేయ కావ్యములను, మఱికొన్ని కీర్తనలను రచించెను.

ఈతని కవిత మిక్కిలి ప్రశస్తమైనది.

## వేంకటకవి - వంకాయలపాటి

గోదావరిజిల్లాలోని కోలంక యీతని నివాసము. ఈతఁ డార్వేల నియోగిబ్రాహ్మణుఁడు; గౌతమగోత్రుఁడు. వెంకయ్య, కామమ్మల పుత్రుఁడు. గుండు - వేంకటరాముని శిష్యుఁడు. 1800 ప్రాంతమువాఁ

డేఁట ! 'మదనగోపాల ! రాధికాహృదయలోల !' అను మకుటము తోడి సీసపద్యశతక మీతనిది కానవచ్చుచున్నది. దాని పేరు 'మదన గోపాలశతకము'. ఇతఁ డనేక కృతులు వ్రాసెనఁట ! అవేవియు లభింపలేదు.

## వేంకటకృష్ణకవి - కొటికెలపూడి

ఈతఁడు వెలనాఁటి వైదికబ్రాహ్మణుఁడు. హారితసగోత్రుఁడు. శివ రామపౌత్రుఁడు. వేంకటరామ పుత్రుఁడు. ఈతఁడు నేఁటి శ్రీకాకుళము జిల్లాకుఁ జెందిన బొబ్బిలినివాసి. బొబ్బిలి సంస్థానమునందలి యాస్థాన విద్వాంసుఁడు. ఈతని పోషకుఁలును, బొబ్బిలి ప్రభువులు నగు శ్రీ రాయ ణప్ప రంగారాయనింగారు బొబ్బిలి చినరంగారాయని దత్తపుత్రులట ! రంగారాయనింగారు క్రీ. శ. 1801 నుండి 30 సంవత్సరములు రాజ్య పాలనము చేసినందున, ఈ కవియు నప్పటివాఁడే యని చెప్పవలెను.

ఈతఁడు 'శ్వేతాచల మాహాత్మ్యము (కూర్మమాహాత్మ్యము)' అను మూఁడాశ్వాసముల ప్రబంధమును రచించి తన ప్రభువులగు రాయ ణప్ప రంగారాయనింగారికిఁ గృతినిచ్చెను. ఆ గ్రంథమునుబట్టి యీతఁడు 'మేఘసందేశము, దిలీపచరిత్రము' అను గ్రంథములను రచించినట్లును, దిలీప చరిత్రమును శ్రీరామున కంకిత మొనర్చినట్లును తెలియుచున్నది.

## వేంకటకృష్ణకవి – గునుగుటూరి

ఈతఁ డార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. శ్లేషకవితా పితామహుఁ డని ప్రసిద్ధికెక్కినవాఁడు. కోడూరి – వేంకటాచలకవి మేనమామ. ఈతఁడు నల యాదవరాఘవపాండవీయ మను చతురర్థి కావ్యము మున్నగు వానిని రచించెను. ఈతఁడు క్రీ. శ. 1650 ప్రాంతమువాఁడు. ఈతనిని గూర్చిన యీ విషయము వేంకటాచలకవి గ్రంథమువలననే తెలియవచ్చు చున్నది.

## వేంకట కృష్ణప్పనాయకుఁడు - సముఖము

క్రీ. శ. 1704-31 నడుమ మధురను పాలించిన విజయరంగ చొక్కనాథునియొద్ద నితఁడు సైన్యాధిపతిగా నుండెను. ఇతని తండ్రి మీనాక్షీ నాయకుఁడు.

వేంకటకృష్ణప్పనాయకుఁడు గొప్ప వీరుఁడే కాక విద్వత్కవి. ఇతఁడు 'అహల్యా సంక్రందనము' అను మూఁడాశ్వాసముల పద్య కావ్యమును, జైమినిభారతము, సారంగధర చరిత్ర అను రెండు వచన కావ్యములను రచించెను. జైమినిభారతము పిల్లలమర్రి - పినవీరభద్రుని పద్యకావ్యము ననుసరించి వ్రాయఁబడినది. సారంగధర చరిత్రమునకు చేమకూర - వేంకటరాజు పద్యకావ్యము మూలము.

వేంకటకృష్ణప్పనాయకుఁడు 'రాధికాసాంత్వన' మను నేకాశ్వాస ప్రబంధమును వ్రాసినట్లు చెప్పుదురు. కాని యందలి పద్యము లించు మించుగ నన్నియును ముద్దు - పళని రచించిన 'రాధికా సాంత్వనము' లోనివే! కావున నియ్యది యీతని కృతి యనుట విశ్వాసార్హము కాదు. ఎవ్వరో యాధునికు లందలి పద్యములను గొన్నిటి నొకచోఁ జేర్చి - దాని కీతని కర్తృత్వమును కల్పించి యుందురు.

## వేంకటకృష్ణమాచార్యుఁడు - ముడుంబై

ఈతఁడు శ్రీవైష్ణవబ్రాహ్మణుఁడు. శ్రీవత్సగోత్రుఁడు. వేంకటరమణ కవికిని, వేంకటాంబకును పుత్రుఁడు. చిత్తూరుజిల్లా తిరుత్తని తాలూకా లోని అగరముగ్రామ నివాసి. కార్వేటినగర ప్రభువుల కాశ్రితుఁడు. ఈ కవి 1800 ప్రాంతమున జన్మించి యుండునఁట !

ఈతఁడు 'కృష్ణా ! దీనరక్షామణీ !' అను మకుటముతో నొక శతకమును, ద్విపదోత్తరరామాయణము, అధ్యాత్మరామాయణము, శ్రీరామ స్తవచూర్ణిక, పోలేరమ్మదండకము మున్నగు గ్రంథములను

రచించెను. ఈతని రచన సరళమై, రసవంతమై, హృదయంగమముగా నుండును.

## వేంకటకృష్ణరావు - తడకమళ్ల

ఈతఁడు గోలకొండవ్యాపారి బ్రాహ్మణుఁడు. హరితసగోత్రుఁడు. కనకమ్మ కుమారుఁడు. తోలుత హుజూరునగరప్రాంత (నిజామురాజ్యము) మీతని నివాసము. తర్వాత మద్రాసు, తిరువల్లిక్కేణిలో నివసించుచుండెను. క్రీ. శ. 1860-90 నడుమ సుప్రసిద్ధులగు రచయితలలో పేరు పొందినవాఁడు; బహుముఖపాండిత్యము కలవాఁడు. పెక్కుభాషల నెఱిఁగిన దిట్ట. భూగోళ, ఖగోళ, గణితశాస్త్రములందు ప్రవీణుఁడు.

ఈతఁడు లీలావతీగణితము నాంధ్రీకరించెను. కామరూపకథ, కంబుకంధరచరిత్రము, తెలుఁగు వెలుగు ముగుదకత, రామావతారకాల నిర్ణయము, చిత్రకథా వివరణము, కామందకము మున్నగు గ్రంథము లీతని యితర రచనలు. అవి వచనరచనలు.

## వెంకటకృష్ణాజెట్టి - కనకాజెట్టి

ఈతఁడు శివాజీమహారాజు (క్రీ. శ. 1833-55) నాస్థానమున నుండిన యొక జెట్టి. రాజానుగ్రహపాత్రుఁడగు నీతఁడు 'శివపారిజాత'మను నాటకమును రచించెను. ఇతని రచన ప్రశస్తము కాదు. దోషములును కలవు. జెట్టి వ్రాసిన గ్రంథమగుటచే ప్రభుని యాదరమును పొంది యుండవచ్చును.

## వేంకటగిరి

ఈతనికి 'కవిగిరి' అను పేరును కలదు. గిరిరాజుకవి తమ్ములలో నీతఁడు ప్రసిద్ధుఁడు. లోహితగోత్రజుఁడు. ఓబళన్న, జానకమ్మల పుత్రుఁడు. శహరాజుకాలమున నుండినవాఁడు. సంగీత, సాహిత్యములలో విద్వాంసుఁడు.

ఇతఁడు శహాజీమహారాజు బంధువులలో నొకఁడును, విచిత్రరాయని కుమారుఁడును అగు ఖండోజీరాయని యాస్థానకవి. ఖండోజీ యాదేశము ననుసరించియే యీతఁడు కృతులను రచించెనఁట! 'విచిత్రరాయావతంసుఁ' డని యీతని బిరుదనామము. ఈతఁడు 16-వ శతాబ్దిచివఱ నుండి యుండును.

వేంకటగిరికవి రుక్మాంగదచరిత్ర మను మూఁడాశ్వాసముల ద్విపద కావ్యమును రచించి శ్రీవిష్ణువున కంకితమొనర్చెను. ఇం దేకాదశీ మాహాత్మ్య కథ వర్ణింపఁబడినది. నందికేశ్వరుఁడు సంస్కృతమునందు రచించిన 'అభినయదర్పణము' నీతఁడు పద్యకావ్యముగా రచించి ఖండోజీ రాయనికి గృతి యిచ్చెను. ఇందు నాట్యశాస్త్రమునకు సంబంధించిన అభినయవిషయము కలదు.

ఈతఁడు తెనాలి రామకృష్ణుని 'ఘటికాచల మాహాత్మ్యము'నకు అతని మనుమని కోరికపయి కృత్యాదిని కూర్చి ఖండోజీరాయని కంకిత మొనర్చెను.

## వేంకటదాసు - కాండూరి

ఈతఁడు శ్రీవైష్ణవబ్రాహ్మణుఁడు. భారద్వాజగోత్రుఁడు. రామానుజమ్మ, లక్ష్మణార్యుల పుత్రుఁడు. ఇప్పటికి 150 ఏండ్ల క్రిందటి వాఁడని కవివంశీయులు చెప్పినట్లు శతకకవుల చరిత్రలోఁ గలదు. ఈతఁడు భార్గవపురాణమును, 'కృష్ణా! దీనచింతామణీ!' అను మకుట ముతో 'దీనచింతామణి' శతకమును మత్తేభవృత్తములలోను రచించెను.

## వేంకటదాసు - గుడారు

ఇతనిది బలిజకులము; పైడిపాల గోత్రము. ఇతని తండ్రి గురవేం కుఁడు; తల్లి రంగమ్మ. ఈతఁడు బలరామచరిత్ర మని సామాన్యముగాఁ

చెప్పఁబడు ప్రబంధరాజ శిరోభూషణ ప్రకృష్ట బలరామచరిత్ర మనూ నాఱాశ్వాసముల ప్రబంధమును రచించెను.

ఈతని కాలము సరిగాఁ దెలియుట లేదు. కాని యితఁడు గణపవరపు - వేంకటకవి రచించిన ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసమును జూచి, అంతకంటె నుత్కృష్టముగాఁ దన ప్రబంధమును రచింపఁబూనిన ట్లున్నందున, ఆతనికంటె నవీనుఁడని మాత్రము చెప్పవచ్చును.

## వేంకటదాసు - రాకమచర్ల

ఈఁతడు మహబూబునగరు జిల్లాలోని పెద్ద ఉమ్మెత్తాల నివాసి. 90 ఏండ్ల క్రిందట నుండి వేలకొలఁది కీర్తనలు వ్రాసెను. అవి రాకమచర్ల కీర్తనలుగా ప్రసిద్ధములు. 500 వఱకును ముద్రితములు. కవి భక్తాగ్రగణ్యుఁడు.

## వేంకటదాసకవి - రాపాక

ఈతఁడు లక్ష్మీపతికవి సోదరుఁడు. పరకాల నివాసి. క్రీ. శ. 1700 ప్రాంతమున నుండినవాఁడు.

ఈతఁడు 'శివరహస్యఖండము' అను గ్రంథమును- శివునూరి అచ్చన మంత్రి ప్రోత్సాహమున రచించి వేములవాడలోని రాజేశ్వరున కంకిత మిచ్చెను. చందాపుర విశ్వేశ్వరుఁ డిందు వర్ణింపఁపడెను. ఈ గ్రంథ మముద్రితము.

## వేంకట నరసయ్య - పక్కి

ఈ కవి సృష్టికరణ కులజుఁడు. భారద్వాజగోత్రుఁడు. నారాయణ మంత్రి పుత్రుఁడు. ఈతఁడు విశాఖపట్టణమునందలి మిషన్ హైస్కూలులో ఆంధ్రోపాధ్యాయుఁడుగా నుండెను. ఈతని రచనలలో

ముఖ్యమైన శకుంతలా పరిణయము క్రీ. శ. 1836 లో ముగింపఁబడినదఁట!
కావున నీతఁడు 1800 ప్రాంతమున జన్మించి యుండవచ్చును.

ఈతఁడు శకుంతలాపరిణయ మను మూఁడాశ్వాసముల ప్రబంధమును, ఆనందకల్పద్రుమకావ్యమును, నారాయణ స్తవమును, నారాయణ శతకమును, కుమారీశతకమును, మదనసాయకాపరిణయమును, కవిదర్పణచ్ఛందమును రచించెను. ఇతని కుమారీశతకము మిగుల ప్రసిద్ధమైనది. ఇతని కవిత్వము సలక్షణమయి, మనోహరమై యుండును.

ఈతనిని వేంకట నరసింహకవి యనియు నందురఁట !

## వేంకట నరసింహాచార్యులు - ఆసూరి మరింగంటి

ఈతఁడు వైష్ణవబ్రాహ్మణుఁడు. దేవరకొండ సీమ నివాసి. 120 ఏండ్లక్రిందట నుండెనఁట ! ఈతఁడు 'రతిమన్మథాభ్యుదయము' అను కావ్యమును వ్రాసెను. అది ముద్రితము కాలేదు.

## వేంకట నరసింహాచార్యులు - మరింగంటి

ఈతఁడు శ్రీ వైష్ణవబ్రాహ్మణుఁడు. నల్లగొండజిల్లా కనగల్లు నివాసి. రమారమి 120 ఏండ్లక్రిందట నుండెనఁట ! మరింగంటి సింగరాచార్యుల కీతఁ డాఱవ పురుషుఁడఁట !

ఈతఁడు 'చిలువ పడిగ రేని పేరణము' అను శుద్ధాంధ్ర గ్రంథమును, 'పద్మినీకన్యాభ్యుదయము, రతి మన్మథాభ్యుదయము, రామాభ్యుదయము, శ్రీకృష్ణశతానందీయము' అను ప్రబంధములను, శ్రీకృష్ణతులాభార ద్విపదను రచించెనఁట !

## వేంకట నరసింహాచార్యులు - మరింగంటి

ఈతఁడు వైష్ణవబ్రాహ్మణుఁడు. నల్లగొండజిల్లా కనగల్లు నివాసి. క్రీ. శ. 1842 లో నుండెనఁట ! ఈతఁడు తారాశశాంకనందినీ పరిణయమును, ఇందిరాలభాగవత మను యక్షగానమును రచించెను. ఇవి అముద్రితములు.

## వేంకటనాథకవి - బైచరాజు

ఈ కవి క్షత్రియుఁడు. పర్వతరాజునకును, అన్నమాంబకును పుత్రుఁడు. లింగరాజునకును, లింగాంబకును పౌత్రుఁడు. బైచరాజీతని తాతకుఁ దాత. అందువలననే వీరి వంశమునకు బైచరాజువారని పేరు వచ్చినది.

ఈ కవి పంచతంత్రమును 5 ఆశ్వాసముల పద్యకావ్యముగా రచించి హరిహరనాథున కంకితమొనర్చెను. ఈతఁడు తిరుమల శ్రీయతిపతికి శిష్యుఁడు. రాజులకుఁ గృతుల నంకితము చేయుటకంటె భగవంతున కర్పించుటయే మేలని యీతఁడు చెప్పి యున్నాఁడు.

ఈతఁడు తన గ్రంథమున శ్రీనాథుని స్తుతించెను. కావున నీతఁడు 15-వ శతాబ్దికి ముందువాఁడు కాఁడు. ఈతఁడు క్రీ. శ. 1500 ప్రాంతమువాఁడని బ్రౌను పండితుఁడు వ్రాసెనఁట! శాసనాధారములనుబట్టి యీతఁడు 1550-1560 నడుమ పంచతంత్రమును రచించినట్లు నిర్ణయింపఁబడినది. కావున నీతఁడు 1500-1570 నడుమ నుండెనని చెప్పవచ్చును.

ఈ కవి కవిత్వము నాతికఠినమై, హృదయంగమమయి యుండును.

## వేంకట నృసింహకవి - పైఁడిపాటి

ఈ కవి యాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు. శఠమర్షణగోత్రుఁడు. తండ్రి లక్ష్మీపతి; తల్లి వేంకమాంబ. నెల్లూరిజిల్లాలోని పైఁడిపాడు నివాసమగుటచే నీ యింటిపేరు వచ్చి యుండును. ఈతఁ డా ప్రాంతపు గ్రామ చతుష్టయమునకు కరణమై సంపదలలోఁ దులతూఁగుచు సుఖముగ నుండినట్లు కవియే నృసింహవిలాసమునఁ జెప్పి యున్నాఁడు. ఇతని కాలము తెలియరాలేదు. ఆధునికుఁడై యుండునని శ్రీ వీరేశలింగము పంతులుగారు వ్రాసి యున్నారు. 1660 ప్రాంతమువాఁడు కావచ్చునని శతకకవుల చరిత్రకారులు వ్రాయుచున్నారు.

ఇతఁడు నృసింహావిలాసమను మూఁడాశ్వాసముల పద్యకావ్యమును రచించెను. వేఁటకుఁ బోయిన నరహరి చెంచెతను వివాహమాడిన విషయ మిందు వర్ణింపఁబడినది. ఈతఁ డీ గ్రంథమునేగాక 'రామచంద్రశతకము, మన్నారుకృష్ణశతకము' నను రెండు శతకములను గూడ రచించెను. ఇతని రచన సరళమైనది.

## వేంకట నృసింహాచార్యులు - మరింగంటి

ఈయన నల్లగొండజిల్లా కవగల్లు నివాసి. 70 ఏండ్ల క్రిందట నుండెనఁట ! అనిరుద్ధవిలాస మను యక్షగాన మీతని కృతి.

## వేంకటపతి – పైఁడిమఱ్ఱి

ఈతఁడు పర్వతరాజుపుత్రుఁడు. పైఁడిమఱ్ఱి పద్మనాభాధ్వరి శిష్యుఁడు. ఈతఁడు 'చంద్రాంగద చరిత్ర' మనెడి యాఱాశ్వాసముల ప్రబంధమును రచించి శ్రీరామచంద్రున కంకితముచేసెను.

గ్రంథమునందలి యాశ్వాసాంత గద్యలో 'కృష్ణరాయభూషణ పర్వతరాజతనయ...' అని యుండుటచే 'కృష్ణరాయభూషణ' పద మింటిపేరిని సూచించునని కొందఱి యాశయము ; బిరుదమును సూచించు నని కొందఱి తలంపు.

వేంకటపతి కవిత్వము ప్రౌఢమైనది. ఆముక్తమాల్యద, వసుచరిత్రముల యనుకరణము లిందు కానవచ్చుచున్నవి. కావున చంద్రాంగద చరిత్రము వానికంటె నవీనము కావలెను. 'కృష్ణరాయభూషణ' అనునది బిరుదమే యని తలఁచినను, అది శ్రీ కృష్ణదేవరాయలనుబట్టి వచ్చిన దనుకొన్నను—ఆ బిరుదు సంపాదించిన రామరాజునకు మనుమని పుత్రుఁడైన వేంకటపతి క్రీ. శ. 1650 ప్రాంతమున నుండెనని చెప్పవచ్చును. ఈ యంశము 'ఆంధ్ర కవితరంగిణి'లోఁ జెప్పఁబడినది.

చంద్రాంగద చరిత్రలో సీమంతినీ, చంద్రాంగదుల పరిణయ కథ రసవంతముగా వర్ణింపఁబడినది.

## వెంకటపతి - రాయసము

ఈతఁడార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. వసిష్ఠగోత్రుఁడు; అక్కయామాత్యుని పుత్రుఁడు; విఠలార్యమంత్రి పౌత్రుఁడు.

ఈతఁడు 'లక్ష్మీవిలాసము' అను నైదాశ్వాసముల ప్రబంధమును రచించి, శ్రీవేంకటేశ్వరస్వామికిఁ గృతియిచ్చెను. ఈతఁడు తిరుమలరాయల పుత్రుఁడగు శ్రీరంగరాయలయొక్కయు, ఇబ్రహీం కుతుబ్ షా యొక్కయు కాలమున నున్నవాఁడు. కావున నీ కవి 16-వ శతాబ్ది చివరిపాదమున నుండి యుండును. 'లక్ష్మీవిలాసము' 1575-1581 నడుమ రచింపఁబడి యుండునని 'ఆంధ్రకవితరంగిణి' చెప్పుచున్నది.

ఈతని రచన ప్రౌఢమై, నిర్దుష్టమై, చక్కని వర్ణనలతోఁ గూడి యుండును. ఇందలి కథ లక్ష్మీనారాయణుల వివాహము.

కవి, సంగీతమునందును విద్వాంసుఁడఁట !

## వేంకటపతి - రోసనూరి

ఈ కవి నియోగిబ్రాహ్మణుఁడు. లింగనామాత్యుని పౌత్రుఁడు; గంగనమంత్రి పుత్రుఁడు. కాశ్యపగోత్రుఁడు. ఈతఁడు విష్ణుమాయావిలాసమను మూఁడాశ్వాసముల ప్రబంధమును రచించి వేంకటగిరి సంస్థాన ప్రభువైన శ్రీ వెలుగోటి బంగరు యాచమనాయని కంకితము చేసెను. కృతిపతికి తండ్రియైన కుమారయాచ భూపాలుఁడు తనకు 'తిక్కయజ్వ' అని బిరుదము నిచ్చినట్లు కవియే వ్రాసికొన్నాఁడు. కృతిపతి యైన బంగరు యాచమనాయకుఁడు ఔరంగజేబు కాలమున క్రీ. శ. 1695 లో నెల్లూరిపాలకుఁడగు జుల్ ఫగారుచేఁ జంపఁబడెనఁట ! కావున విష్ణుమాయావిలాసము క్రీ. శ. 1690 ప్రాంతమున రచియింపఁబడి యుండునని శ్రీ వీరేశలింగము పంతులుగారు వ్రాసి యున్నారు.

ఈతని కవిత్వము సరళమైనది; రసవంతమైనది.

## వేంకటపతి - వెలిదండ్ల

ఈతఁడు తిరువేంగళార్యుని పుత్రుఁడు. 150 ఏండ్ల క్రిందట నుండినవాఁడని శ్రీ వీరేశలింగము పంతులుగారి యాశయము. ఈ కవి రాధామాధవుల శృంగారమును వివరించు రాధామాధవ సంవాదమను మూఁడాశ్వాసముల శృంగారప్రబంధమును రచించి, ప్రళయకావేరీ నివాసి యగు మగదల - రామదాసామాత్యున కంకితము చేసెను.

ఈతని కవిత్వము హృదయంగమమై యుండును.

## వేంకటపతి - శేషము

ఈతఁడు కృష్ణయార్యుని కుమారుఁడు. కందాళ - రామానుజాచార్యుల శిష్యుఁడు. ఈ కవి తారాశశాంక మను నామాంతరము గల శశాంకవిజయమను నైదాశ్వాసముల శృంగారప్రబంధమును రచించి మధురాధినాథుఁడగు విజయరంగచొక్కనాథుని యాశ్రితుఁడగు వంగల - శీనయార్యున కంకితముచేసెను. కావున నీతఁడు విజయరంగచొక్కనాథుని కాలమున (క్రీ. శ. 1704-31) నుండె ననుట స్పష్టము.

ఈతని కవిత్వము చాల మధురమైనది; శృంగార భూయిష్ఠము.

## వేంకటపతిమహీపాలుఁడు - పూసపాటి

ఇతఁడు సూర్యవంశక్షత్రియుఁడు. అన్నమరాజు పౌత్రుఁడు. కృష్ణమరాజు పుత్రుఁడు. బొబ్బిలి యుద్ధములో మరణించిన విజయరామ గజపతిరాజునకు పెదతండ్రి. ఇతని తమ్ముఁడైన ఆనందరాజు బాలుఁడై యున్నప్పు డీతఁడే రాజ్యము పాలించెను. ఋషివలె జీవితము గడపి రాజర్షి యని పేరుపొందెను. వేంకటపతిరాజపురము (కొత్తాము)ను అగ్రహారముగాఁ జేసి విప్రుల కొసఁగిన గొప్పదాత. ఇతఁడు క్రీ. శ. 1660-1720 నడుమ నుండెను.

ఈతఁడు 'ఉషాభ్యుదయ'మను ప్రబంధమును రచించి శ్రీరామ తీర్థక్షేత్రమందలి శ్రీరామున కంకితమొనర్చెను. ఇయ్యది 5 ఆశ్వాసముల ప్రబంధము. ఇందు ఉషానిరుద్ధుల వివాహకథ భాగవతము ననుసరించి కలదు.

## వేంకటపతిసోమయాజి - కామరసు

ఈతఁడు, తంజావూరిని పాలించిన విజయరాఘవనాయకుని కాలమున, ఆతని యాస్థానమున నుండిన కవి. కావున 17-వ శతాబ్ది రెండవ భాగమున నుండెనని చెప్పవచ్చును.

ఈతఁడు 'విజయరాఘవ చంద్రికా విలాసము' అను గ్రంథమును యక్షగానపద్ధతిని రచించెను. ఇందు విజయరాఘవనాయకుని చంద్రికా విహారము, తంజాపురము మున్నగునవి వర్ణింపఁబడినవి.

## వేంకటప్పయ్య - మాటూరి

హైదరాబాదు ప్రాంతమందలి మధిర చేరువఁ గల మాటూరీతని నివాసము. ఇతఁడు 100 ఏండ్ల క్రిందటివాఁడు.

ఈతఁడు భూరిగుణజాలశతకము అను శతకమును రచించెను. అది ముద్రితము. ఇతఁడు మఱికొన్ని పాటలను, పదములనుకూడ రచించెనఁట!

## వేంకట బొఱ్ఱయ్య - కావలి

ఈతఁడు 19-వ శతాబ్దిలో నుండిన సుప్రసిద్ధ విద్వాంసుఁడు. చరిత్రరచనకు సామగ్రిని కూర్చిన కర్నల్ కాలిన్ మెకెంజీ దొరకు గురుతుల్యుఁడు. గతశతాబ్ది ప్రారంభములోనే యీతఁడు 'కాంచీపుర మాహాత్మ్య'మను వచనకావ్యమును రచించెను.

## వేంకటయోగి - మారేపల్లి

ఈతఁడు వైదికబ్రాహ్మణుఁడు. 'తత్త్వదీపికాప్రబోధము' అను ద్విపదకావ్యమును రచించి శ్రీఅలమేలుమంగాదేవీ సహిత శ్రీ వేంకటే

శ్వరున కంకిత మొసర్చెను. ఈ కవి ముమ్మడి - మల్లనయోగి శిష్యుఁడఁట! ఈతఁడు క్రీ. శ. 1550-1560 ప్రాంతమున నుండెనని నిర్ణయింప వచ్చునని 'ఆంధ్రకవితరంగిణి'లోఁ జెప్పఁబడినది.

ఈతని తండ్రి వెంకటభట్టు. తల్లి నరసమ్మ. తాత కామయ్య. ఈతని నివాసము తెలియదు.

## వేంకటయ్య - చెంగల్వ

ఈతఁ డార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. శ్రీవత్సగోత్రుఁడు. కాళయమంత్రి పుత్రుఁడు. క్రీ. శ. 1633-73 నడుమ తంజావూరిని పాలించిన విజయరాఘవనాయకుని యాస్థానవిద్వాంసుఁడగు కాళకవికిఁ దండ్రి. కావున నీతఁడు 17-వ శతాబ్ది ప్రారంభమున నుండెనని చెప్ప వచ్చును.

ఈతఁడు 'రణరంగగంధవారణ' బిరుదాంకుఁడగు శ్రీకంఠునకు మంత్రియఁట! ఇతఁడు కాళహస్తీశ్వరుని భక్తుఁడు. ఈ కవి 'పార్వతీ పరిణయ' మను ప్రబంధమును రచించినట్లు కాళకవి చెప్పి యున్నాఁడు. ఆ గ్రంథము లభింపలేదు.

## వేంకటరంగాచార్యులు - పరవస్తు

మహామహోపాధ్యాయ బిరుదాంకితుఁడును, బహుశాస్త్ర నిష్ణాతయు నగు నీతని నివాసము విశాఖపట్టణము. ఈతఁడు శ్రీవైష్ణవ బ్రాహ్మణుఁడు. శ్రీనివాసాచార్యుల పుత్రుఁడు.

ఈయన సంస్కృతాంధ్రములందు గ్రంథములను రచించెను. విశాఖపట్టణమున క్రైస్తవమతబోధకుల ప్రచారమున హిందువులు మతాంతరమును స్వీకరించుచుండఁగా, ఈయన ఉపనిషత్తుల నాంధ్రీకరించి హైందవమతప్రచార మొనర్చెను. సంస్కృతమున లఘువ్యాకరణమును, కుంభకర్ణవిజయకావ్యములను రచించెను. ఆంగ్లాధిరాజ్యస్వాగతము, కమలినీకలహంసమున కనువాదము, ప్రపత్తివాదము, శబ్దార్థసర్వస్వ

నిఘంటువు, ఈశ-కేన-కఠ - ప్రశ్న - ముండక - మాండూక్యాది దశోపని షత్తుల పద్యానువాదములు, మంజులనైషధము, శాకుంతలమున కనువాదము మున్నగునవి యీతని యాంధ్రీకృతులు.

ఈతని రచన సరళమై, రసవంతమై యుండును.

ఈతఁడు క్రీ. శ. 1822 లో జన్మించి 1900 లో మరణించెను.

## వేంకటరమణ - కృష్ణగిరి

ఈతఁడు ధర్మపురనివాసి. క్రీ. శ. 1870 ప్రాంతమున నుండెనఁట! ఈ కవి 'వాసిష్ఠరామాయణమును, అధ్యాత్మరామాయణమును రచించెను. వాసష్ఠరామాయణమునకు వ్యాఖ్యను రచించెనఁట ! ఈతఁడు కన్నడము నను కవి. గయోపాఖ్యాన మీతని కన్నడకృతియఁట !

## వేంకటరమణకవి - గూళికల్లు

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. వేంకటమంత్రికిని, రంగమాంబ కును పుత్రుఁడు. ఈతఁడు తన గ్రంథమునఁ బదునాఱవ శతాబ్దివఱకు నున్న కవులను స్తుతించి యుండుటచే నీతఁడు 17-వ శతాబ్ది పూర్వార్ధమున నుండి యుండునని 'ఆంధ్రకవితరంగిణి' లోఁ గలదు.

ఈతఁడు కనకరంజితశిఖామణీ పరిణయమను శృంగారకావ్యమును రచించి శ్రీవేంకటేశ్వరున కంకిత మొనర్చెను. ఇయ్యది సమగ్రముగా లభింప లేదు. ఐదాశ్వాసములు, ఆఱవ యాశ్వాసములోఁ గొంత భాగమును లభించి నవి. కృత్యాదినిబట్టి యీతఁడు 'హరివంశము'ను పూర్తిగా నాంధ్రీకరించి నట్లు తెలియుచున్నది. అయ్యది యలభ్యము.

విక్రమార్కుని సోదరుఁడైన భట్టికిని, కనకరంజితశిఖామణి యను కన్యకను జరిగిన పరిణయగాథ 'కనకరంజితశిఖామణీ పరిణయము'నందుఁ గలదు. విక్రమార్కుని చరిత్రము కూడఁ గొంత యిందు వర్ణింపఁబడినది.

## వేంకటరమణకవి - ముడియము

ఈతఁడు నందవరీక నియోగిబ్రాహ్మణుఁడు. శ్రీవత్సగోత్రుఁడు. వెంకటపతికిని, ఓబమ్మకును కుమారుఁడు. కసువమంత్రికి మనుమఁడు. ఈతనికి పెమ్మసాని తిమ్మానాయుఁడు పోషకుఁడు.

ఈతఁడు సంస్కృతమున 'రాధామాధవ' మను నాటకమును, తెలుఁగులో 'కళాధరోపాఖ్యానము' అను పద్యకావ్యమును రచించెను. ఈ పద్యకావ్యము దత్తాత్రేయస్వామి కంకితముచేయఁబడినది. ఈతని కవిత్వము ప్రౌఢమై, మనోహరమయి యుండును.

ఈ కవి 16-వ శతాబ్ది చివఱను, 17-వ శతాబ్ది ప్రారంభమునను ఉండెనని చెప్పవచ్చునని 'ఆంధ్రకవితరంగిణి' లోఁ గలదు.

## వేంకటరమణశాస్త్రి - వేదము

ఈతఁడు పుమూరు ద్రావిడశాఖకుఁ జెందిన వైదికబ్రాహ్మణుఁడు. గతశతాబ్దిలో నుండిన సుప్రసిద్ధవిద్వాంసులలో నొకఁడు. సంస్కృతాంధ్రములందు గొప్ప విద్వాంసుఁడు. ఈతఁడు మదరాసు, నరసాపురము, కాకినాడ, పోడూరు, రాజమహేంద్రవరము మున్నగు పట్టణములలోని విద్యాశాలలలో అధ్యాపకుఁడుగా పనిచేసెను. నరసాపురములో నున్నప్పుడు క్రింది తరగతుల విద్యార్థుల యుపయోగార్థము ఈతఁడు 'లఘువ్యాకరణము' అను వ్యాకరణమును వ్రాసెను. అది 'నరసాపుర వ్యాకరణ'మను పేరఁ బ్రసిద్ధమైనదఁట! అది చిన్నయసూరి 'బాల వ్యాకరణము' కంటెఁ బ్రాచీనమైనది.

ఆ వ్యాకరణ మీ నడుమనే ముద్రింపఁబడినది.

## వేంకట రాఘవాచార్యులు - మరింగంటి

ఇతఁడు వైష్ణవబ్రాహ్మణుఁడు. నల్లగొండజిల్లా కవగల్లు నివాసి. 80 ఏండ్ల క్రిందట నుండెనఁట! ఈతఁడు కేశవస్వామి శతకము, క్షమావింశతి - అను రెండు గ్రంథములను రచించెను.

కేశవస్వామి శతకము ముద్రితము; అంత్య నియమములతోఁ గూడి భక్తి ప్రధానమై యుండును.

## వేంకటరాజు - చేమకూర

తంజావూరిని పాలించిన రఘునాథనాయకుని యాస్థానమున నీ కవి యుండెను. ఈతఁడు నియోగి యని కొందఱును, శూద్రుఁడని కొందఱును తలంచుచున్నారు. రఘునాథనాయకుఁడు నేపాళ, చోళగులను జయించినపిదప 1616 ప్రాంతమున నీతఁడు 'విజయవిలాస' మను మూఁడాశ్వాసముల శృంగారప్రబంధమును వ్రాసి, తనప్రభువున కంకిత మొనర్చెను. ఇందు అర్జునుఁడు, ఉలూపీ, చిత్రాంగదా, సుభద్రలను వివాహమాడుట రసవంతముగ వర్ణితము.

ఈతఁ డీ ప్రబంధము నే గాక 'సారంగధర చరిత్ర' యను మూఁడాశ్వాసముల శృంగారప్రబంధమును కూడ రచించెను.

ఈ గ్రంథద్వయము సుప్రసిద్ధమైనది. రచన మిక్కిలి రసవంతమైనది.

## వేంకటరామకవి - శ్రీనాథుని

ఈతఁ డశ్వారావుపేట ప్రాంత నివాసి. క్రీ. శ. 1700 ప్రాంతమున నుండినవాఁడు. ఈతఁడు శ్రీరామపట్టాభిషేకము లేక అశ్వారాయచరిత్రము-అను గ్రంథమును రచించెను. ఇందు వెలమవీరులకు ధంసాలో జరిగిన యుద్ధము వర్ణితము. ఇది చరిత్రాంశములతోఁ గూడినది. ముద్రితము కాలేదు.

## వేంకటరామశాస్త్రి - మెరత్తూరు

ఈతఁడు పల్లవి - రాజగోపాలయ్య వంశీయుఁడు. వెలనాటి వైదికబ్రాహ్మణుఁడు. మెరత్తూరుగ్రామమున నివసించుటచే నీతని యింటి పేరు మెరత్తూరువారని యైనదఁట! ఈతఁడు క్రీ. శ. 1807-60 నడుమ నుండెనఁట! సంగీతమునందు నీతనికి గొప్ప ప్రవేశ ముండెనఁట!

ఈతఁడు 12 యక్షగాన నాటకములను రచించెను. వానిలోఁ బదునొకండు మాత్రము లభ్యములైనవి. అవియు నముద్రితములు. అవి- ప్రహ్లాదచరిత్ర, మార్కండేయ చరిత్ర, ఉషాపరిణయము, హరిశ్చంద్ర నాటకము, రుక్మిణీకల్యాణము, శివరాత్రినాటకము, సత్సంగరాజ నాటకము, అసత్సంగరాజ నాటకము, సీతాకల్యాణము, జగన్మోహనవిలాస నాటకము-అనునవి.

## వేంకటరాయకవి - ధూర్జటి

ఈ కవి పాకనాఁటి నియోగిబ్రాహ్మణుఁడు. భారద్వాజగోత్రుఁడు. ధూర్జటి మహాకవి వంశీయుఁడు. కృష్ణరాయ విజయకర్త యగు కుమార ధూర్జటికి మనుమఁడు. ఇతని తండ్రి లింగరాజు. అతఁడు శ్రీ కాళహస్తి మాహాత్మ్యమును 12 ఆశ్వాసముల పెద్ద ప్రబంధముగా రచించెను. లింగ రాజు క్రీ. శ. 1780 ప్రాంతమున - కాళహస్తి ప్రభువగు వేంకటపతి రాయనికిఁ దన గ్రంథము నంకిత మొనర్చి యున్నందున నీతఁడు 1750 ప్రాంతమున నుండి యుండవచ్చును.

ఈతఁడు రత్నావళీ పరిణయ మను నాలుగాశ్వాసముల ప్రబంధమును రచించి చేకూరి - రామస్వామిమంత్రి కంకిత మిచ్చెను. ఈతని కవిత్వము ప్రౌఢమయి హృద్యముగా నుండును.

## వేంకటరాయకవి - పోలిపెద్ది

ఈతఁడు వైదికబ్రాహ్మణుఁడు. కార్వేటినగర ప్రభువైన శ్రీ వేంకట పెరుమాళ్లరాజు సంస్థానమున నుండిన విద్వత్కవి. ఈతఁడు

క్రీ. శ. 1800-1875 నడుమ నుండినవాఁడు. ఈతఁడు శ్రీ వేణుగోపాల స్వామి భక్తుఁడు. ఈతఁడు 'వేణుగోపాలశతకము, లావణ్యశతకము' అను రెండు సీసపద్యశతకములను, తిట్ల దండకమును రచించెను.

ఈతని కవిత్వము రసవంతమై, హృదయంగమముగా నుండును.

## వేంకట రాయకవి - రేమెల

ఈతఁడు పద్మనాయక వంశజుఁడు. గోదావరిజిల్లా దగ్గుదుఱ్ఱు నివాసి. అరవెల్లగోత్రజుఁడు. తండ్రి భావయ్య. 1820 ప్రాంతమున జన్మించెను. పిఠాపురప్రభువుల మన్ననఁ బాత్రుఁడు. ధారాశుద్ధి కల కవి. ఈతఁడు 'ఉత్తరాపరిణయ' మను ప్రబంధమును రచించెను.

## వేంకట సుబ్బకవి - ఝుంఝామారుతము

మయూరుఁడు సంస్కృతమున సూర్యశతకమును జెప్పి యారోగ్యమును పొందిన ట్లీతఁడును 'శ్రీసూర్యనారాయణా!' అను మకుటముతో నొక శార్దూల వృత్తశతకముఁ జెప్పి యారోగ్యము పొందెనఁట! ఈతఁడు 1850 ప్రాంతమువాఁడై యుండునని శతక కవులచరిత్రలోఁ గలదు.

## వేంకటసుబ్బకవి - దేవకి

మధురను పాలించిన నాయకరాజుల కాలములో నీతఁ డుండెను. ఈ కవి భారద్వాజగోత్రుఁడు. అళగరయ్య కుమారుఁడు. మధురానగర నివాసి. ఈతఁడు రామాయణమును యథామూలముగ వచనకావ్యముగా నాంధ్రీకరించెను. ఆ గ్రంథములోని అరణ్య, కిష్కింధా-సుందర-యుద్ధకాండములు మాత్రమే యిప్పుడు లభించుచున్నవి. ఇయ్యది అముద్రితము.

## వేంకటస్వామి - శ్రీధరమల్లె

యీతఁడు బడగలనాటి కన్నడ వంశజుఁడఁట! భారద్వాజ గోత్రుఁడు. అయ్యనార్యుని కుమారుఁడు.

ఈ కవి బ్రహ్మోత్తరఖండ మను నయిదాశ్వాసముల గ్రంథమును రచియించి సిద్ధవటమునకు సమీపమున నున్న అంబాపురమందలి పార్థివేశ్వరస్వామి కంకితముచేసెను. దాని రచనకు జ్యోతి రామనాదు లితనిని ప్రోత్సహించిరఁట! బ్రహ్మోత్తరఖండము క్రీ. శ. 1815-వ సంవత్సరమున రచింపఁబడినదఁట! కావున నీతఁడు 18-వ శతాబ్ది చివఱి పాదమున జన్మించి యుండును.

## వేంకటాచలకవి - కుందుర్తి

ఈతఁ డార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. శాండిల్యగోత్రుఁడు. గోవిందామాత్యుని పౌత్రుఁడు. రామయామంత్రి పుత్రుఁడు. ఈతని తాత యైన గోవిందామాత్యుఁడు 1680 ప్రాంతమున రాజ్యముచేసిన వీర వేంకటపతిరాయలవద్ద నుండి భారతీపరిణయ మను గ్రంథమును రచించి, యాతనిని మెప్పించెనఁట! రామయమంత్రి పాండ్యదేశాధీశ్వరుని మంత్రి యైనాఁడు. విజయరంగచొక్కనాథుఁడు (క్రీ. శ. 1704-32 నడుమ మధుర నేలిన ప్రభువు) తన్ను బహూకరించినట్లు కవియే చెప్పియున్నందున నితఁడు 18-వ శతాబ్ది ప్రారంభమున నుండెననుట నిశ్చయము.

ఈతఁడు సంస్కృతాంధ్రములలో విద్వత్కవి; పెక్కు చాటు కృతులను, నాటకములను, ప్రబంధములను రచించెను. భారత, భాగవత, రామాయణములను వచనకావ్యములుగా నీతఁడు రచించెనఁట! ఇతని గ్రంథములలో రెండు ప్రబంధములు తప్ప తక్కిన వేవియు లభింపలేదు. లభించినవి 1. మిత్రవిందాపరిణయము 2. కార్తికమాహాత్మ్యమును.

మిత్రవిందా పరిణయ మా జాశ్వాసముల ప్రబంధము. ఇందు మిత్రవిందా, కృష్ణుల వివాహము వర్ణింపఁబడినది.

కార్తికమాహాత్మ్యము కూడ ఆఱాశ్వాసముల ప్రబంధమే! ఇతని కవిత్వము కవి చెప్పికొన్నంత ప్రౌఢము కాదు; నిర్దుష్టమును కాదు.

## వేంకటాచలకవి - కోడూరు

ఈ కవి యార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. కాశ్యపగోత్రుఁడు. బాల సరస్వతి యను బిరుదు కలవాఁడు. ఈతని తాత ఎల్లనామాత్యుఁడు, తండ్రి శంకరామాత్యుఁడు, తల్లి లక్ష్మమ్మ. ఎడవల్లి వేంకటకవి యీతని విద్యాగురువు. ఈతఁడు తన కృతిని ముళువాగళు ప్రభువున కంకిత మొనర్చెను. ఈ ప్రభుని మేనల్లుఁడగు ఇమ్మడి - చిక్కరాయని శాసనము క్రీ. శ. 1690 లోఁ గానవచ్చుచున్నందున ముళువాగళు ప్రభువును, వేంకటాచలకవియును 1650-1700 నడుమ నుండి యుందురని చెప్ప వచ్చును.

ఈ కవి స్కాందపురాణమునందలి శివరహస్యఖండము నాంధ్రీక రించెను. ఇది యేడు కాండల బృహద్గ్రంథము. మొత్తము 28 ఆశ్వాస ములు. కాని యింతవఱకును 15 ఆశ్వాసముల గ్రంథము మాత్రమే లభించి నది. ఇందలి కవిత్వము ప్రౌఢమై ధారాశుద్ధి కలిగి యుండును.

## వేంకటాచలకవి - భాస్కర

ఈతఁడు నందవరీక నియోగిబ్రాహ్మణుఁడు. వసిష్ఠగోత్రుఁడు. తాత వెంగనార్యుఁడు. తలిదండ్రులు సూరయ, వెంగాంబలు. ఈతఁడు సేతు మాహాత్మ్యమను నాలుగాశ్వాసముల పద్యకావ్యమును రచించెను. ఇందు శ్రీరాముని కథ, సేతువృత్తాంతము, రామేశ్వరక్షేత్రమాహాత్మ్యమును కలవు. శైలి సులభము. రచన ప్రశస్తము కాదు.

ఈతఁడు నాంచారుపరిణయమను యక్షగానమును కూడ రచించె నఁట! అది లభింపలేదు. సేతుమాహాత్మ్య మముద్రితము. ఈతఁడు క్రీ. శ. 1731-1767 ప్రాంతమువాఁడఁట!

## వేంకటాచలకవి - వెన్నెలుకంటి

ఈతఁడార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. హరితసగోత్రుఁడు. జగ్గనా మాత్యుని పుత్రుఁడు. ములుగు-గురులింగమూర్తికి శిష్యుఁడు. ఈతని తండ్రి

యగు జగ్గనామాత్యుఁడు క్రీ. శ. 1600 ప్రాంతమున నుండెననియు, అతని పుత్రుఁడగు నీ కవి 1600-1650 నడుమ నుండి యుండవచ్చుననియు శ్రీగురుజాడ - శ్రీరామమూర్తి పంతులుగారు తమ 'కవిజీవితము'లలో వ్రాసి యున్నారు.

ఈతఁడు కృష్ణవిలాసమను ప్రబంధమును రచించెను. అది సరళమై హృదయంగమముగ నుండును. ఈ విషయము 'కవిజీవితము'ల ననుసరించి వ్రాయఁబడినది.

## వేంకటాచలపతికవి - ఋగ్వేదకవి

ఈతఁడు తిరువేంగళార్యుని పుత్రుఁడు; కవితా గురువును తిరువేంగళార్యుఁడేయఁట ! వీ రిర్వురును విభిన్నవ్యక్తులని శ్రీ జయంతి - రామయ్య పంతులుగా రభిప్రాయపడి యున్నారు. ఈ కవి చంపూరామాయణము నాంధ్రీకరించి కార్వేటినగరాధీశ్వరుఁడగు వెల్లంటి - కనవరాజున కంకిత మొనర్చెను. ఇతని కాలము 1714 ప్రాంతము.

చంపూరామాయణము 8 ఆశ్వాసముల ప్రబంధము. ఇది ముద్రితము. కవిత్వము రసవంతమైనది. దోషము లెడనెడఁ గానవచ్చుచుండునఁట !

## వేంకటాచార్యులు – తిరుమల బుక్కపట్టణము

ఇతఁడు హైదరాబాదు ప్రాంతమందలి సురపురసంస్థానమున నుండిన విద్వత్కవి. కిరీటి వేంకటాచార్యు లను పే రీతనికిఁ బ్రసిద్ధము. క్రీ. శ. 1730 ప్రాంతమున నుండెను. ఈతఁడు శ్రీనివాసతాతాచార్యుల పుత్రుఁడు. పినతండ్రియొద్ద విద్య నభ్యసించెను. ఈతఁడు సురపుర ప్రభువుల యాస్థాన విద్వాంసుఁడై కాశీ మున్నగు స్థలముల కేఁగి పరమతవాదుల నోడించి, స్వమతస్థాపన-పరమత ఖండనములను చామరములను, విశిష్టాద్వైతమను కిరీటమును ధరించెను. 32 సంవత్సరములు మాత్రము జీవించెనఁట ! సంస్కృతాంధ్రములలో నీతఁడు మహావిద్వాంసుఁడై 'తర్కాలంకార వాగీశ్వర' బిరుదు వహించెను.

ఈతఁడు సంస్కృతమున 'అలంకారకౌస్తుభము, గదాధరీయ ఖండనము (ఝుంఝూమారుతము), శృంగార రసతరంగిణి, రసికమానసో ల్లాసభాణము, శుకాభిపతనము, ఉషాపరిణయ నాటకము, యతిరాజ దండకము, హయగ్రీవ దండకము, దశావతారస్తోత్రము, భావశతకము మున్నగు గ్రంథములను, తెలుఁగున అచలాత్మజాపరిణయ మను మూఁ డాశ్వాసముల ద్వ్యర్థి కావ్యమును రచించెను. గజనూత్రవాదము, శృంగార లహరి యనునవి కూడ నీతని గ్రంథములు కలవు.

## వేంకటాచార్యులు - తిరునగరి

ఇతఁ డనుమకొండ నివాసి. 270 ఏండ్లక్రిందట నీతఁ డుండెనఁట !! ఈతఁడు 'యతిరాజ శతకము' ను రచించెను. అది విశిష్టాద్వైత మత ప్రవర్తకము. రసవత్తరము; ముద్రితముకూడ.

## వేంకటాచార్యులు - మాడభూషి

ఈయన శ్రీవైష్ణవబ్రాహ్మణుఁడు. కాశ్యపగోత్రజుఁడు. వేదాంతా చార్యుల పౌత్రుఁడు. నరసింహాచార్యులకును, అలమేలమ్మకును పుత్రుఁడు. నివాసము కృష్ణాజిల్లాయందలి నూజవీడు. గొప్ప విద్వత్కవి. గంటకు వందలకొలఁది పద్యములను జెప్పఁగల దిట్ట. శతావధానమున నద్వి తీయుఁడు. ఈయనకు 'విద్యా నభినవ పండితరాయ' అను బిరుదములు కలవు. ఈతఁడు క్రీ. శ. 1835 లో జననమంది 1895 లో మరణిం చెనఁట ! ఈయన నూజవీటఁ గాఁపురమున్నను, పెక్కు సంస్థానముల కేఁగి సమ్మానములు పొందుచుండెను.

ఈయన భరతాభ్యుదయమను ప్రబంధమును, వామన నాటకమును, మదనమోహన చరిత్రమను వచనకావ్యమును, రామావధూటీ తారావళిని, హంస సందేశమును, పుష్పబాణ విలాసాంధ్రీకరణమును, ఆనందగజపతి

ప్రభునిపై కొన్ని సీసములను రచించెను. బృహద్వైద్యరత్నాకర మను వైద్యశాస్త్రగ్రంథమును రచించెను.

భరతాభ్యుదయము నాలుగాశ్వాసముల ప్రబంధము. ఇందు శకుంతలా దుష్యంతుల వివాహము, భరతుని జననము మున్నగునవి వర్ణితములు.

## వేంకటాచార్యులు – ముడుంబి

ఈతఁడు శ్రీ వైష్ణవబ్రాహ్మణుఁడు. శ్రీవత్స గోత్రుఁడు. వేదాంతాచార్యుల పుత్రుఁడు. ఈ కవి రమారమి నూటయేబది యేండ్లక్రిందట గోదావరిజిల్లాలో నుండెనని శ్రీ వీరేశలింగముపంతులుగారు వ్రాసియున్నారు.

ఈతఁడు 'రసప్రదీపిక' అను మూఁడాశ్వాసముల వైద్యగ్రంథమును రచించెను. 'దేవహూతి విలాస' మను నీతని గ్రంథాంతర మముద్రితము.

ఈతఁడు వరంగల్లుప్రాంత నివాసి యనియు, 1700 ప్రాంతమున నుండెననియు శ్రీ శేషాద్రిరమణకవులు గోలకొండ కవుల సంచికలో వ్రాసి యున్నారు.

## వేంకటాచార్యులు

ఇతఁడు వైష్ణవబ్రాహ్మణుఁడు. ఆత్రేయగోత్రుఁడు. శ్రీనివాసాచార్యుని పుత్రుఁడు. ఇతఁ డిప్పటికి 200 ఏండ్ల క్రిందట నుండెనని చెప్పుచున్నారని శ్రీ వీరేశలింగముపంతులుగారు వ్రాసియున్నారు.

ఈతఁడు 'భద్రరాజపుత్ర చరిత్రము' అను అయిదాశ్వాసముల ప్రబంధమును రచించెను. అది కళాపూర్ణోదయమువంటి కల్పితవృత్తాంతము కలదఁట! కవిత్వము ప్రశస్తమైనది కాదఁట!

## వేంకటాచార్యులు – సింహాద్రి

ఈతఁడు శ్రీవైష్ణవబ్రాహ్మణుఁడు. గౌతమగోత్రుఁడు. తిరుమలాచార్యుని పౌత్రుఁడు. చెన్నకేశవార్యుని పుత్రుఁడు. వేంకటదేశికుని

శిష్యుఁడు. ఈ కవి లక్షణాపరిణయమను నామాంతరము గల చమత్కార మంజరి యను మూఁడాశ్వాసముల ప్రబంధమును రచించి విశిష్టాద్వైతమత స్థాపకుఁడగు రామానుజాచార్యులకుఁ గృతియిచ్చెను.

ఈతని కాలము సరిగాఁ దెలియదు. కాని యీతని పద్యముల నప్పకవి యుదాహరించుటచే, అతనికంటెఁ బూర్వుఁడని చెప్పవలెను. ఈతని రచన ప్రౌఢమై రసవంతమై యుండును.

లక్షణాపరిణయము శృంగారప్రబంధము. ఇందు శ్రీకృష్ణునికి లక్షణతోడి వివాహము వర్ణింపఁబడినది.

## వేంకటాచార్యులు

ఈతఁడు శ్రీవైష్ణవబ్రాహ్మణుఁడు. యతిరాజకుల - పెరుమాళ్ళాచార్యుల కుమారుఁడు. ఇతఁడు 250 ఏండ్ల క్రిందటివాఁడని శ్రీ వీరేశలింగము పంతులుగారి యాశయము.

ఈ కవి రాజమహేంద్రవర ప్రభువగు కోన తిమ్మరాజు ప్రేరణమున 'ముక్తిచింతామణి' అను పేర జగన్నాథక్షేత్రమాహాత్మ్యమును నాలుగాశ్వాసముల ప్రబంధముగా రచియించెను. ఇతనిది రసవంతమైన కవిత్వము.

## వేంకటాద్రి - పెనుమెత్స

ఇతఁడు క్షత్రియుఁడు. ధనంజయగోత్రుఁడు. ఇతని తండ్రి పద్మరాజు. తల్లి గన్నమాంబ. బమ్మెర - కేసన, మల్లనకవులు వ్రాసిన 'విష్ణుభజనానందము'ను బట్టి యీతఁడు క్రీ. శ. 1500 ప్రాంతమువాఁడై యుండవచ్చునని 'ఆంధ్రకవితరంగిణి' లోఁ గలదు.

ఇతఁడు 'ఇందుమతీకల్యాణము' అను ప్రబంధమును రచించెను. కాని యా గ్రంథ మిపు డెచ్చటను లభించుట లేదు.

## వేంకటార్యుఁడు - రేవణూరి

ఇతఁడు నందవరీక నియోగిబ్రాహ్మణుఁడు. శ్రీ వత్సగోత్రుఁడు. ఇతని తండ్రి తిరుమల కొండయార్యుఁడు; తల్లి తిరుమలాంబ. ఇతఁడు తాళ్లపాక - అన్నమాచార్యునికి దౌహిత్రుఁడు.

ఈ కవి తాళ్లపాక - అన్నమాచార్యుని మనుమఁడై యున్నందున క్రీ. శ. 16-వ శతాబ్ది ప్రారంభమున నుండి యుండును. ఇతఁడు శకుంతలా పరిణయ మను మూఁడాశ్వాసముల శృంగారప్రబంధమును రచించి, యొక రాజున కంకితము చేయఁదలఁపఁగా నొక కరణము దానికి విఘ్న మొనర్చెనఁట! అందువలన నీతఁ డా ప్రబంధమును శ్రీ వేంకటేశ్వర స్వామి కంకిత మొనర్చెను. ఈ యంశమును కృతికర్తయే చెప్పికొనెను. ఇతని యితరగ్రంథము శ్రీ పాదరేణుమాహాత్మ్యము.

ఈ కవి రామచంద్రోపాఖ్యాన మను ప్రబంధమును రచించినట్లు శ్రీ వీరేశలింగముపంతులుగా రభిప్రాయపడుచున్నారు. ఆ ప్రబంధమును రచించినయాతఁ డీతని తండ్రి యగు తిరుమలకొండయార్యుఁడై యుండునని "ఆంధ్రకవితరంగిణీ" కారుల యాశయము.

## వేంకటేశకవి - నిమిషకవి

ఈతఁడు 1850 ప్రాంతమున నుండినవాఁడు. జగన్నాథయోగి శతక మను సీసపద్యశతకమును రచించెను. గోడే - జగన్నాథ రావుగారు యోగియైన పిదప నాతనిని సంబోధించుచు 'జ్ఞానభోగి! గోడే జగన్నాథ యోగి!' అను మకుటముతో దీనిని చెప్పెను. రచన సరళము.

## వేంకటేశకవి - మాటూరి

ఈతఁడు మధిర సమీపమునఁ గల మాటూరి నివాసి. 120 ఏండ్ల క్రిందట నుండెనఁట!

ఈతఁడు 'బుధమనోల్లాసశతక' మను నొక శతకమును రచించెను. అది భక్తిరసభరితమే! కాని రచన ప్రౌఢము కాదు.

## వేంకటేశ్వరకవి – వారణాసి

ఈతఁడు వెలనాఁటి వైదికబ్రాహ్మణుఁడు. విశ్వామిత్రగోత్రజుఁడు. ఇతని తండ్రి కామయ్య; తల్లి అచ్చమాంబ. పిఠాపురప్రాంతమందలి క్రొత్తయిసుకపల్లె యీతని నివాసము.

ఈ కవి 'రామచంద్రోపాఖ్యాన'మను ఆఱాశ్వాసముల కావ్యమును రచించెను. ఇది ముద్రితము. కవిత్వము ప్రౌఢము, రచన హృదయంగమము.

## వేంకటేశ్వరకవి – వేల్పూరి

ఈతఁడార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. మౌద్గల్యగోత్రుఁడు. బ్రహ్మనామాత్యపుత్రుఁడు. ఈతని నివాసము నేఁటి శ్రీకాకుళము జిల్లాలోని చీపురుపల్లికి సమీపమునఁ గల రావివలసగ్రామము. ఈ కవి క్రీ. శ. 1851-వ సంవత్సరమున మరణించినందున ఇంచుమించుగ నూటేండ్లక్రిందట నుండి యుండవచ్చునని యూహింపనగును.

ఈ కవి గోవ్యాఘ్రసంవాదము, విచిత్రరామాయణము అను రెండు పద్యకావ్యములను, జానకీరామశతకమును రచించెను. వ్యాకరణవిరుద్ధములగు ప్రయోగము లెడనెడఁ గానవచ్చుచున్నను కవనము మృదువుగా సాగి శ్రావ్యమై యున్నదని శ్రీ వీరేశలింగము పంతులుగారు వ్రాసియున్నారు.

ఈతని విచిత్రరామాయణము 1760 ప్రాంతమున నుండిన గోపీనాథకవి రచించిన వచనకావ్యము ననుసరించి రచింపఁబడినదఁట! ఈతనికి 'వేంకటకవి' అనునది వాడుకపేరు.

## వేమన యోగి

ఇతఁడు రెడ్డిరాజుల వంశములోనివాఁడు. ఈతఁడు తొలుత మూగచింతపల్లెలో నివసించె ననియు, తర్వాతి నివాసము కొండవీడనియు

నీతని పద్యమువలననే తెలియుచున్నది. ఇతఁడు 17-వ శతాబ్దివాఁడని బ్రౌను పండితుని యభిప్రాయము. శతకవాఙ్మయ సర్వస్వము నట్లే చెప్పుచున్నది. ఇతఁడు 16-వ శతాబ్దివాఁడని క్యాంబెలు తలఁచెను. శ్రీ వంగూరి సుబ్బారావుగారు, శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, శ్రీ చాగంటి శేషయ్యగారును వేమన 15-వ శతాబ్దివాఁడని యనుచున్నారు.

ఇతఁడు తొలుత స్వేచ్ఛాప్రవృత్తి కలవఁడై, పిదప విరాగి యయ్యెననియు, అభిరాముఁడను నాతనిని మోసగించి, అతనికి లభింపవలసిన ఆత్మవిద్యను, అతని గురువువలనఁ దానే పొందెననియు - ఇట్టి కథల నెన్నిటినో యీతనింగూర్చి చెప్పెదరు. అవి విశ్వాసార్హము లయినట్లు కానరాదు.

వేమన లెక్కలేని నీతులను, తాత్త్వికవిషయములను సులభపద్ధతిలో వేలకొలఁది పద్యములఁ జెప్పెను. సాధారణముగ నన్నియు నాటవెలఁదులే! ఇంతకలవను కొన్నిమాత్రమే లభించినవి. వాని నెఱుఁగని యాంధ్రు లుండరు.

## వైద్యనాథసిద్ధాంతి

ఈతఁడు కాంచీపుర నివాసి. వేంకటాచార్యుల కుమారుఁడు. ఈతఁడు క్రీ. శ. 1843 లో భూఖగోళదీపిక యను శాస్త్రగ్రంథమును రచించి ముద్రింపించెనఁట! ఇందు జ్యోతిషశాస్త్రీయ విషయములు కలవఁట !

## శంకరకవి

ఈ కవి నియోగిబ్రాహ్మణుఁడు. కౌండిన్యగోత్రుఁడు. దేచనామాత్యుని పుత్రుఁడు. ఈతఁడు హరిశ్చంద్రోపాఖ్యానమును అయిదాశ్వాసముల ప్రబంధముగా రచించి ఈడూరి - ఎల్లయామాత్యున కంకిత

మొనర్చెను. కృతిపతి యీడూరి కరణము. కారుకోలను గ్రామనివాసి. కేదారగురుని శిష్యుఁడు.

కృతిపతి కుతుబనమల్కుని యనుగ్రహమున జలసీమారక్షణార్థమై నియోగింపఁబడెనఁట! ఈ కుతుబనమల్కు కులీకుతుబ్ షా యనియు, అతఁడు క్రీ. శ. 1511-1543 నడుమ రాజ్యము చేసెననియు, కృతిపతియు, శంకర కవియు నప్పటివారే యై యుందురనియు 'ఆంధ్రకవితరంగిణి' లోఁ గలదు. శంకరకవివలెనే అద్దంకి గంగాధరకవియు కేదారగురుశిష్యుఁడగునఁట! శంకరకవి తండ్రి యగు దేచమంత్రి, రామకృష్ణకవిచే ఉద్భటారాధ్య చరిత్రమును కృతి నందిన యీూరి-దేచమంత్రియే యయి ఉండునా? యని 'ఆంధ్రకవితరంగిణీ'కారులు సందేహించుచున్నారు.

శంకరకవికవిత్వము మృదుమధురమై రసవంతమై యుండును. 'భవానీ మనోహరవచనము' అను నామాంతరము కల 'శంకరవచనము' అను రచించిన యాతఁడీ శంకరకవియే! అవి మిక్కిలి వ్యాప్తిలో నుండి, శైవ వాఙ్మయమున విశిష్టస్థానము నాక్రమించినవి.

## శంకరకవి - శంకర

ఈతఁడు ఆర్వేల నియోగిబ్రాహ్మణుఁడు. గోదావరిజిల్లాయందలి దొడ్డంపేట ప్రాంత మీతని నివాసమఁట! ఈతఁడు 'శాచబిడ్డఁ డెపుడుఁ బ్రోచు మమ్ము' అను మకుటముతో ఆటవెలఁదులతో నొక శతకమును రచించెను. ఇందు రామాయణ కథ, రామనామప్రభావము ముఖ్యాంశ ములు. రచన సరళము. ఇతని కాలము సరిగాఁ దెలియదు.

## శరణమంత్రి - తామరపల్లి

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. భార్గవగోత్రుఁడు. చంద్రమంత్రి పుత్రుఁడు. శేమధర్మములు రచించిన తిమ్మయ యీతని పుత్రుఁడు. ఈ కవి 'సభాభిరామము' అను వచనకావ్యమును రచించినట్లీతని పుత్రుఁడు తిమ్మయ చెప్పి యున్నాఁడు. ఆ గ్రంథము లభింపలేదు.

ఈతఁడు 16-వ శతాబ్దియందలి ఉత్తరార్ధమున నుండినట్లు తెలియుచున్నది.

## శరభాంకకవి

ఈతఁడు వీరశైవమతావలంబి యగు ఆరాధ్యబ్రాహ్మణుఁడనియు, కాశికగోత్రుఁడనియు, ప్రతాపరుద్రుని మంత్రి యనియు నీతని 'లింగధారణ చంద్రిక'వలనఁ దెలియుచున్నది. ఈతఁడు వరంగల్లు నివాసి. రెండవ ప్రతాపరుద్రుని మహమ్మదీయులు చెఱగొని పోయిన సందర్భము నీతఁడు ప్రస్తావించి ఢిల్లీని దిట్టిన పద్యము శరభాంకలింగశతకములో నున్నది. ద్వితీయప్రతాపరుద్రుఁడు క్రీ. శ. 1295 మొదలు 1326 వఱకు నున్నందున నీతఁడు నప్పటివాఁడే కావలెను.

శరభాంకలింగశతకము ముద్రితమైనది. అందలి తొలిభాగమున నున్న పద్యములకంటె మలిభాగములో నున్న పద్యములే ప్రౌఢముగను, రసవంతముగను ఉన్నవనియు, అన్ని ప్రతులలో నిట్లే యున్నదనియు, దీనికిఁ గారణము తెలియలేదనియు దాని పీఠికలో వ్రాయఁబడినదఁట !

ఈతఁడును, శివదేవయ్యయు, విశ్వేశ్వరదేశికులును సోదరులని కొందఱి తలంపు. కాని వీరు విభిన్నగోత్రులు.

## శహాజీ మహారాజు

ఈతఁడు తంజావూరిలో మహారాష్ట్రరాజ్యమును స్థాపించిన ఏకోజీ మహారాజు కుమారుఁడు. శివాజీ చక్రవర్తి మనుమఁడు. ఈతఁడు క్రీ. శ. 1684 మొదలు 1712 వఱకును రాజ్యమును పాలించి, తన యాస్థానమున పెక్కుమంది విద్వత్కవులను నియమించి పోషించుచుండెను. స్వయముగా నీతఁడు సంస్కృతాంధ్రములలో విద్వత్కవి. ఈతఁ డాంధ్రమున ఇరువదిగ్రంథములను రచించెను.

1. కిరాతవిలాసము— ఇది నాటకము. కిరాతార్జునుల యుద్ధము, పాశుపతాస్త్రదానము నిందలి విషయము. ఇది శివున కంకితముచేయఁబడినది.

2. కృష్ణలీలావిలాసము—నాటకము. శ్రీకృష్ణజననము, అతని బాల్యక్రీడలు, సత్యభామను వివాహమగుటయు నిందు వర్ణితములు. ఇది శ్రీకృష్ణున కంకితము.

3. గంగా, పార్వతీ సంవాదము—నాటకము. ఇది శివాంకితము.

4. జలక్రీడలు—నాటకము. గోపికావస్త్రాపహరణకథ యిందుఁ గలదు. ఇది కృష్ణాంకితము.

5. త్యాగరాజవినోదచరిత్ర ప్రబంధము—నాటకము. ఇందు సంస్కృతాంధ్ర మహారాష్ట్రభాషలలో చిత్రముగను, వినోదముగను రచన సాగినది.

6. ద్రౌపదీకల్యాణము—నాటకము. ఇది శివాంకితము.

7. పంచరత్నప్రబంధనాటకము — శివునియెదుట నట్టువకత్తెలు కౌశలము చూపుట యిందు వర్ణితము. ఇది శివాంకితము.

8. పార్వతీకల్యాణము—ఇది పరమేశ్వరాంకితము.

9. రతీకల్యాణము—నాటకము. గౌరీదేవి కంకితము.

10. రామపట్టాభిషేకము—శ్రీరామాంకితము.

11. రుక్మిణీ సత్యభామాసంవాదము—శ్రీకృష్ణాంకితము.

12. వల్లీకల్యాణము—కుమారస్వామి వల్లియను కన్యను వివాహమాడిన కథ. శివాంకితము.

13. విఘ్నేశ్వరకల్యాణము—నాటకము. శివాంకితము.

14. శంకరపల్లకీసేవాప్రబంధము—నాటకము. పార్వతీ పరమేశ్వరుల కంకితము.

15. శచీపురందరము—శచీదేవేంద్రుల వివాహము. శివాంకితము.

16. శాంతాకల్యాణము—నాటకము. శాంతా, ఋష్యశృంగుల వివాహకథ. శివాంకితము.

17. సతీపతిదానవిలాసము—నాటకము. కృష్ణాంకితము.

18. విష్ణుపల్లకి సేవాప్రబంధము—నాటకము. కృష్ణాంకితము.

19. సీతాకల్యాణము—నాటకము. శ్రీరామాంకితము.

20. సతీదానశూరము—నాటకము. శివాంకితము.

ఈతఁడు పై గ్రంథములనే కాక 'సరస్వతీకల్యాణము'ను కూడ రచించినట్లు చెప్పుచున్నారు. కాని, అది యీతని యాస్థానకవి యగు ఆంధ్రపాణిని శేషాచలకవి రచించినది.

## శాంతానందయోగి

ఈతఁడు బ్రహ్మానందస్వామి శిష్యుఁడఁట! ఈతఁడు నీతిబోధకమగు 'రామశతకము'ను కందపద్యములలో రచించెను. అందు వ్యాకరణదోషము లెక్కువ. రచన సరళము.

ఈతఁడు 19-వ శతాబ్దిలో నున్నట్లు శతకకవుల చరిత్రకారులును, 1600 ప్రాంతమువాఁడై యుండునని 'ఆంధ్రకవితరంగిణీ'కారులును ఊహించుచున్నారు.

## శివదేవపండితుఁడు

ఈతఁడు వరంగల్లు నివాసి. కాకతీయప్రభువగు గణపతిదేవునియొద్దను రుద్రమదేవియొద్దను, ప్రతాపరుద్రునియొద్దను ఈయన మంత్రిగా నుండెను. విశ్వేశ్వర శివదేశికునికంటె నీతఁడు భిన్నుఁడు. ఈతఁడు క్రీ. శ. 1270-1320 నడుమ నుండెనని శ్రీ శేషాద్రిరమణకవుల యభిప్రాయము.

ఈతఁడు పెక్కుగ్రంథములను రచించెనఁట! కాని వానిలో రెండుమాత్ర మెఱుకపడుచున్నవి. అవి - పురుషార్థసారము, శివదేవధీమణీ శతకమును. మొదటిది శైవమతప్రతిపాదకమగు గ్రంథము. రెండవది కవి తన్ను సంబోధించుకొన్నట్లు కూర్పఁబడిన శతకము.

ఈతనికి 'ఆంధ్రకవితా పితామహ' బిరుద ముండెను.

## శివరామకవి - నెల్లూరి

క్రీ. శ. 1740 లో తంజావూరురాజ్యమును పాలించిన మహారాష్ట్ర ప్రభువగు జయసింహుని యాస్థానమున విద్వాంసుఁడుగా నీతఁ డుండెను. ఈతఁడు యాదవ రాఘవ పాండవీయ మను త్ర్యర్థి కావ్యమును రచించిన నెల్లూరి-వీరరాఘవకవికిఁ గుమారుఁడు. ఆంధ్రపాణిని యని పేరొందిన శేషాచలకవికి శిష్యుఁడు.

శివరామకవి 'కామకళానిధి' యను కామశాస్త్రగ్రంథమును నాలుగాశ్వాసముల పద్యకావ్యముగా రచించి, తన ప్రభువగు జయసింహునకే అంకిత మొనర్చెను. మఱియు 'రామగీత' లను తెలిఁగించి మత్తి - కృష్ణభూపాలుని కోరిక ననుసరించి రామకృష్ణపురమున నున్న శ్రీరామున కంకితముచేసెను.

ఈతని గ్రంథములు రెండును ముద్రితములు.

## శివరామయ్య - కోట

ఈతఁడు కౌశికగోత్రుఁడు. కోట బాపనయ్యపుత్రుఁడు; శూద్రుఁడఁట ! ఈతఁడు తాను ధూర్జటికవి శిష్యుఁడ నని చెప్పికొనెను. ఆ ధూర్జటి రాయల కాలమున నుండిన ధూర్జటియో, కుమారధూర్జటియో తెలియరాదు. ఈతఁడు కాళహస్తిపుర నివాసి. కుమారధూర్జటికాలమున నుండినచో, ఇతఁడు 16-వ శతాబ్ది చివఱ నుండి యుండవచ్చును.

ఈతఁడు సానందోపాఖ్యానమను నాల్గాశ్వాసముల పద్యకావ్యమును రచించెను. ఇతని రచనలో లక్షణవిరుద్ధములైన ప్రయోగము లున్నను, కవిత్వము మృదువుగా నుండును.

## శివాజీమహారాజు

ఈతఁడు క్రీ. శ. 1833-55 నడుమ తంజావూరు రాజ్యమును పాలించెను ; ఈతఁడు రెండవ శరభోజీకుమారుఁడు ; తంజావూరిని

పాలించిన మహారాష్ట్రరాజులలోఁ గడపటివాఁడు. ఈతఁ డాంధ్రమున 'అన్నపూర్ణాపతిణయ' మను నాటకమును రచించెను. తంజావూరిలోని కొంకణేశ్వరదేవుఁడు అన్నపూర్ణమ్మను వివాహమాడిన కథ యిందు వర్ణితము.

## శేషనాథార్యుఁడు – నాగలూటి

ఈతఁడు శైవుఁడగుటవలనఁ దన కులగోత్రాదులను వివరింపలేదు. ఈతఁడు 'శ్రీ పర్వతపురాణ' మనెడు ఆఱాశ్వాసముల ప్రబంధమును రచించి, శ్రీశైల మల్లికార్జునదేవున కంకితమొనర్చెను. ఈ గ్రంథమునకు శ్రీశైలమాహాత్మ్య మని నామాంతరమని శ్రీ వీరేశలింగముపంతులుగారు తెల్పియున్నారు. మఱియు నీతఁడు నాగులూరి - శేషనారాధ్యుఁడని యాయన తెల్పినారు.

జగ్గన తన ప్రబంధరత్నాకరమున నీతని పద్యము నుదాహరించుటచే, ఈ కవి క్రీ. శ. 1560 సం.కుఁ బూర్వుఁడని తెలియుచున్నది. భద్రకవి - లింగకవి యీతనిని పూర్వకవిగా స్తుతించెను. అతఁ డచ్యుతదేవరాయల కాలములోనివాఁడు. కావున శేషనాథార్యుఁడు క్రీ. శ. 1500 ప్రాంతమువాఁ డయి యుండునని చెప్పవచ్చునని శ్రీ చాంగటి - శేషయ్యగారు వ్రాయుచున్నారు.

## శేషప్పకవి

ఇతఁడు కరీంనగరుజిల్లా ధర్మపురి నివాసి. 170 ఏండ్లక్రిందటనుండెనఁట! ఈతఁడు ధర్మపురి రామాయణ మను యక్షగానమును, నరసింహశతకమును రచించెను.

ఈ కవి చాత్తాదివైష్ణవుఁడు. ధర్మపురి గోదావరితీరమున నున్నది.

## శేషయకవి

ఈతఁడు పుదుకోట్టప్రభువగు విజయరఘునాథరాయలపై (1789-1807) కొన్ని చాటువులను, 'విజయరఘునాథ! తొండమాన్

విభువజీర!' అను మకుటముతో నొక శతకమును రచించెను. శతక మముద్రితము. రచన చక్కనిది.

## శేషాచలకవి - కోలా

ఈతఁడు చెన్నపురి నివాసి. క్రీ. శ. 1846-47 లలో తాను నీల గిరికిఁ బోయి, యచటఁ గడపిన విధమును 'నీలగిరియాత్ర' అనుపేర ప్రౌఢ మగు వచనకావ్యముగా రచించెను. అప్పు డీతఁడు సైనికశాఖా కార్యాలయమున గుమాస్తాగా నుండెను.

ఈ గ్రంథము విశాఖపట్టణములోని గోడే-వెంకట జగ్గనృపాలున కంకితముచేయఁబడినది. ఇది ముద్రితము.

## శేషాచలకవి - నివృత్తి

ఈతఁడు భారద్వాజగోత్రుఁడు. తల్లి యక్కమ్మ; తండ్రి వేంకట పతి. ఈ కవి శహాజీ మహారాజుకాలమున నాతని యాస్థాన విద్వత్కవిగా నుండి కనకాభిషేకగౌరవమును బొందెను. కావున 17-వ శతాబ్ది చివర నీతఁ డుండెనని చెప్పవచ్చును. ఈతనికి 'ఆంధ్రపాణిని' అను బిరుద ముండెను.

ఈతఁడు శాహరాజవిలాసము, సరస్వతీకల్యాణము, ఆంధ్ర వ్యాకరణము' అను మూఁడు గ్రంథములను రచించెను. వీనిలో మొదటి రెండును తెలుఁగు గ్రంథములు. మూఁడవది సంస్కృతగ్రంథము. ఈ వ్యాకరణ రచనను బట్టియే యీతనికి 'ఆంధ్రపాణిని' అని బిరుదు వచ్చి యుండవచ్చును.

శాహరాజవిలాసమున శహాజీవృత్తాంతము వర్ణితము. సరస్వతీ కల్యాణ మీతని కృతియే యని, యా గ్రంథమునందలి యీతని వృత్తాం తమునుబట్టియే తెలియుచున్నది. ఈతఁడే దీనిని రచించి శహాజీకృతముగాఁ జెప్పి యుండును.

## శేషాచలపతి - యాముజాల

ఈతఁడు మధిరతాలూకా నాగవరపాడు గ్రామ నివాసి. 140 ఏండ్ల క్రిందట నుండినవాఁడఁట! ఈతఁడు వసిష్ఠజనకసంవాదమను వేదాంత గ్రంథమును, రామాయణ యక్షగానమును రచించెను. వీనిలో మొదటిది అముద్రితము.

## శేషాచార్యులు - నల్లాన్ చక్రవర్తి

ఈతఁడు యాజ్ఞవల్క్యుల కుపయోగించు 'యాజ్ఞవల్క్య ప్రభావ మణిమంజూషా సంగ్రహము' అను గ్రంథమును వచనకావ్యముగా రచించెను. ఇది 1874 లో ముద్రితము.

## శేషాచార్యులు – బోరవెల్లి

ఈతని నివాసము గద్వాలసంస్థానము. 170 ఏండ్లక్రిందట నీతఁడుండినట్లు తెలియుచున్నది. ఈతఁడు రాఘవాచార్యుల పుత్త్రుఁడు.

ఈతఁడు యథాశ్లోకతాత్పర్యరామాయణమునందలి యుద్ధకాండము పూర్వభాగము 4 ఆశ్వాసములు రచించెను. ఇది ముద్రితము. ఈ కృతి గద్వాలలోని కేశవస్వామి కంకితము చేయఁబడినది.

## శేషాచార్యులు – వాడాల

ఈతని నివాసము గద్వాల సంస్థానము. ఈతఁడు గద్వాలప్రభువుల ఆస్థానకవిగా నుండెను. 120 లేక 140 ఏండ్ల క్రిందట నీతఁ డుండి యుండవచ్చునని శ్రీ శేషాద్రిరమణకవులు వ్రాయుచున్నారు.

ఈతఁడు మైథిలీపరిణయ మను పద్యకావ్యమును రచించెను. అది యముద్రితము.

## శోభనాద్రి - చెన్నూరి

ఈతఁ డార్వేల నియోగి బ్రాహ్మణుఁడు. రామచంద్రుని కుమారుఁడు. ఈ కవి శృంగారసుధాసముద్ర పూర్ణ చంద్రోదయ మను

నాలు గాశ్వాసముల ప్రబంధమును రచించి గుమ్మడపు పాపరాజున కంకిత మొనర్చెను. ఈ పాపరాజు పద్మనాయక వంశజుఁడు. గుళ్లపాటి పురాధీశ్వరుఁడగు జగ్గనప్రభుని కుమారుఁడు. కృతికర్తనుగూర్చి కాని, కృతిపతినిగూర్చి కాని విశేష మేమియుఁ దెలియలేదు.

శోభనాద్రి వ్రాసిన యీ ప్రబంధమున యామినీ పూర్ణతిలకా బిల్హణుల శృంగారకథ వర్ణింపఁబడినది. ఇందలి కవిత్వము గాల ప్రౌఢమైనది.

## శ్యామరాయకవి

ఈతఁడు ముల్కినాటి శాఖకుఁ జెందిన వైదికబ్రాహ్మణుఁడు వసిష్ఠగోత్రుఁడు. కృష్ణయామాత్యుని పుత్రుఁడు. 'అసహాయకవి' అను బిరుదు కలవాఁడు. ఈతఁడు రామాయణమును వచనకావ్యముగా రచించి మధురానగర నివాసి యగు తుమ్మలపాటి-సుబ్బరాయసెట్టి యను వైశ్యున కంకితముచేసెను. ఈతఁడు శ్రీ విజయరంగ చొక్కనాథుని కాలపువాఁడు. కావున 18-వ శతాబ్ది ప్రారంభమున నుండి యుండునని తెలియుచున్నది.

ఇతని రామాయణమునందలి బాల-అయోధ్యా-అరణ్య కాండములు మాత్రము లభించుచున్నవి.

## శ్రీ కామేశ్వరకవి - లింగనమఖి

ఈతఁ డార్వేల నియోగి; నాగనామాత్యుని పుత్రుఁడు; తల్లి కామాత్మమ్మ. ఈ కవి క్రీ. శ. 1674 లో తంజావూరిని జయించి పాలించిన మధురరాజు ముద్దళగిరియొద్ద ఆస్థానకవిగా నుండినందున నీతఁడు 17-వ శతాబ్ది రెండవభాగమున నుండెనని నిశ్చయింపవచ్చును.

ఈతఁడు రుక్మిణీపరిణయము, సత్యభామా సాంత్వనము నను రెండు పద్యకావ్యములను రచించి ముద్దళగిరి ప్రభువునకే యంకితముచేసెను. ఇతని మొదటి కృతి యగు రుక్మిణీపరిణయము లభ్యము కాలేదు. సత్యభామా

సాంత్వనము నాల్గాశ్వాసముల శృంగారప్రబంధము. రుక్మిణీపరిణయము నట్టిదే యయి యుండవచ్చును.

ఈ కవి ధేనుమాహాత్మ్యమను వచనకావ్యమును కూడ రచియించెను. ఇది వచనవాఙ్మయములో మొదటి గ్రంథమఁట! ఇయ్యది ముద్దళగిరి సవతియన్న యగు చొక్కనాథ నాయకున కంకితము. దీని ప్రతి తంజావూరి గ్రంథాలయమునఁ గలదు. ఇతఁడు పెక్కు గేయములను కూడ రచించెను. ఇంతవఱకు నీతని సత్యభామాసాంత్వన మొక్కటియే ముద్రితమైనది.

సత్యభామాసాంత్వనమునందలి యాశ్వాసాంత గద్యలనుబట్టి చూడఁగా నితఁడు తొలుత శ్రీ కాళహస్తినివాసి యనియుఁ, దర్వాత మధురనాయక రాజులవలన సమ్మానము పొంది మధురలో స్థిరనివాస మొనర్చుకొనెననియు నూహింప వీలగుచున్నది.

## శ్రీ కృష్ణదేవరాయలు

దక్షిణ భారతదేశము నేకచ్ఛత్రాధిపత్యమునఁ బరిపాలించి సంస్కృతాంధ్రములం దసమాన పాండిత్యము గడించి మహాకవి యైన శ్రీ కృష్ణదేవరాయలు తుళువ వంశమున నరసరాయలకు నాగాంబికయందు జనించిన పుత్రరత్నము. నరసరాయలు తొలుత సాళువ - నరసరాయల యొద్ద సేనాధిపతిగా నుండి, పిదప రాజ్యమున కధిపతి యయ్యెను. అతని యనంతర మతని జ్యేష్ఠపుత్రుఁడు వీర నరసింహరాయలు రాజ్యమునకు వచ్చెను. అతని యనంతరము తిమ్మరుసుమంత్రి సాహాయ్యమున కృష్ణదేవరాయలు విజయనగరరాజ్యమున కధిపతి యయ్యెను.

తుళువ-నరసరాయల కంకితముచేయఁబడిన వరాహపురాణములోఁ గర్తలగు నంది మల్లయ, ఘంట సింగయలు నరసరాయల పెద్దకుమారుఁడగు వీర నరసింహరాయలనుగూర్చియే ప్రస్తావించిరి. కృష్ణరాయలఁ

గూర్చి చెప్పలేదు. కావున నప్పటికిఁ గృష్ణరాయలు పుట్టి యుండకపోవచ్చును. పుట్టి యున్నను బాలుఁడై యుండవచ్చును. కాఁగా కృష్ణరాయలు క్రీ. శ. 1487 ప్రాంతమున జన్మించి యుండవచ్చును. ఈ యంశము 'ఆంధ్రకవితరంగిణి' లోఁ గలదు.

శ్రీ కృష్ణరాయల జన్మమునుగూర్చి కొన్నికథలు ప్రచారమున నున్నవి. అవి ప్రమాణదూరములు.

రాయలు సహజముగ గొప్ప విద్వాంసుఁడే కాక విద్వత్కవిపోషకుఁడై యుండెను. ఈతని 'భువనవిజయ' సభాభవనమున 'అష్టదిగ్గజములు' అని పేరొందిన ఎనమండ్రు విద్వత్కవు లుండిరి. వీరి పేర్లు- అల్లసాని పెద్దన, ముక్కు(నంది)తిమ్మన, మాదయ్యగారి మల్లన, ధూర్జటి, తెనాలి రామకృష్ణుఁడు, అయ్యలరాజు- రామభద్రుఁడు, రామరాజభూషణుఁడు, పింగళి సూరన్న. వీరిలోఁ దొలుతటి నల్గురే రాయల సభలో నుండిరనియు, రామకృష్ణకవికూడ ఉండిన నుండవచ్చుననియు, చివటి ముగ్గురును రాయలకాలములోనివారు కారనియు, పయి యైదుగురితోఁబాటు ముగ్గురు సంస్కృత కర్ణాట కవులు చేరి 'అష్టదిగ్గజము'లై యుండిరని చెప్పవలెననియుఁ గొందఱు విద్వాంసుల యాశయము. 'ఆంధ్రకవితరంగిణి' యు నీ యభిప్రాయమునే తెల్పుచున్నది. కృష్ణరాయలు 1530 జనవరి ప్రాంతమువఱకును జీవించి యుండెనఁట!

కృష్ణదేవరాయలు విష్ణుచిత్తీయమను నామాంతరముగల 'ఆముక్తమాల్యద' యను నాఱాశ్వాసముల ప్రౌఢప్రబంధమును రచించెను. ఇయ్యది ఉత్తమమైనది. వర్ణన లత్యద్భుతములు. రసవంతములు. ఇందు విష్ణుచిత్తుఁడను భక్తునియొక్కయు, ఆతని పుత్రిక యగు గోదాదేవియొక్కయు చరిత్రములు, విష్ణుదేవుని ప్రశస్తి, విశిష్టాద్వైత మతప్రాశస్త్యము మున్నగు విషయములు కలవు. దీనిని కృష్ణరాయలు రచింపలేదనియు, అల్లసాని పెద్దనయే రచించి, రాయలపేరు పెట్టెననియు నొక పత్తితి కలదు. కాని యది నమ్మఁదగినది కాదని విమర్శకులు చెప్పుదురు.

రాయల కాంధ్రభోజుఁడను బిరుదు కలదు. సంస్కృతమును భోజ మహారాజు పోషించిన ట్లితఁ డాంధ్రమును పోషించినందున నీ బిరుదు వచ్చినది. ఈతఁడు సంస్కృతమున 'మదాలస చరిత్ర, సత్యావధూ ప్రీణనము, సకల కథాసారసంగ్రహము, జ్ఞానచింతామణి, రసమంజరి మున్నగు కావ్యములను రచించినట్లు 'ఆముక్తమాల్యద' ను బట్టి తెలియు వచ్చుచున్నది. కాని, యా గ్రంథము లేవియు నిప్పుడు లభింపలేదు.

## శ్రీగిరికవి

ఈతఁడు 'శ్రీగిరీశ!'యను మకుటముతో నొక శతకమును రచించెను. అందలి పద్యము మడికి - సింగన కూర్చిన సకల నీతిసమ్మతముసఁ గలదు. మఱియు నీతఁడు 'నవనాథచరిత్రము' ను పద్యకావ్యముగా రచించినట్లు గౌరన రచించిన ద్విపద నవనాథచరిత్రనుబట్టి తెలియుచున్నది. ఈతని మఱియొక గ్రంథము 'శ్రీరంగమాహాత్మ్యము.' ఈ గ్రంథము లేవియు నిప్పుడు లభింపలేదు. ఇతఁడు గౌరనకుఁ బూర్వుఁడగుటచే క్రీ. శ. 1300_1400 నడుమ నుండెనని చెప్పవచ్చునని 'ఆంధ్రకవితరంగిణీ' కారులు వ్రాయుచున్నారు.

## శ్రీగిరికవి - తెనాలి

ఈతఁడు ప్రథమశాఖాబ్రాహ్మణుఁడు. కౌండిన్యగోత్రుఁడు. రామానుపండితుని పుత్రుఁడు. రామకృష్ణునికిని, అన్నయకును సోదరుఁడు. గుంటూరుజిల్లాలోని తెనాలి యీతని నివాసము. ఈతఁడు క్రీ. శ. 1505—1560 మధ్యమున నుండి యుండునని 'ఆంధ్రకవితరంగిణి'లోఁ గలదు.

ఈ కవి 'శ్రీశైలమాహాత్మ్య'మను పద్యకావ్యమును రచించినట్లితని మనుమఁడైన రామభద్రకవి తన యిందుమతీ కల్యాణమునఁ జెప్పి యున్నాఁడు.

## శ్రీధరుఁడు

ఈతని పేరిటఁ గల శ్రీధరచ్ఛందస్సునుబట్టి యీతఁడు కవి యని తెలియుచున్నది. ఆ ఛందము లభింపలేదు. కాని శ్రీధరచ్ఛందస్సులోని కొన్ని పద్యములను కస్తూరిరంగకవి తన 'ఆనందరంగరాట్ఛందస్సు'లో నుదాహరించి యున్నాఁడు.

శ్రీధరుఁడు నీతిశాస్త్రముక్తావళినుండియు, క్రీడాభిరామము నుండియు నుదాహరణములను గ్రహించెనని చెప్పుచున్నారు. అట్లయినచో ఇతని కాలము క్రీ. శ. 1450 ప్రాంతము కావలెనని 'ఆంధ్రకవితరంగిణి'లోఁ గలదు.

శ్రీధరచ్ఛందము అళియరామరాజు ముత్తాత కంకితమఁట ! అతఁడు రెండవ పిన్నమరాజు కుమారుఁడైన సోమభూపాలుఁడయి యుండవలెనఁట! అతఁడు ఆర్వీటి బుక్కరాయలకు సోదరుఁడగును. ఇయ్యది యాతని కంకితమో, మొదటి పిన్నమరాజు పుత్రుఁడగు సోమభూపాలున కంకితమో తెలియరాదు.

## శ్రీనాథుఁడు

కవిసార్వభౌమ బిరుదాంకితుఁడును, మహాకవియు నగు శ్రీనాథుఁడు నియోగిబ్రాహ్మణుఁడు. భారద్వాజగోత్రుఁడు. కమలనాభామాత్యుని పౌత్రుఁడు. మారయామాత్యునికిని, భీమాంబకును కుమారుఁడు.

శ్రీనాథుని తాత కమలనాభామాత్యుఁడు వారిధి తటీకాల్పట్టణాధీశుఁడఁట ! ఈ కాల్పట్టణమే క్రాల్పట్టణమనియు, అదియే క్రొత్త పట్టణమనియు శ్రీవీరేశలింగము పంతులుగారు వ్రాసినారు. ఇది కృష్ణాజిల్లాలోని కాళీపట్టణమయి యుండునని శ్రీ వేటూరి - ప్రభాకరశాస్త్రిగారి యాశయము. శ్రీనాథుఁడు 'పాకనాటింటివాఁ' డయినందున, అతని నివాసము పాకనాటిలోని కాల్పట్టణమో, ఆ శబ్దార్థమును సూచించు గ్రామమో

తెలిసినఁగాని యీతని జన్మస్థలమును నిర్ణయింప సాధ్యముకాదని 'ఆంధ్ర కవితరంగిణి' కారుల యభిప్రాయము.

శ్రీనాథుఁడు క్రీ. శ. 1365 ప్రాంతమున జన్మించెనని కొందఱును, 1380 ప్రాంతమున జన్మించెనని కొందఱును తలంచుచున్నారు. ఇతఁడు తన గురువుం గూర్చి యెచటను పేర్కొనలేదు. తాతయైన కమలనాభామాత్యుఁడే గురువై యుండెనని కొందఱి యభిప్రాయము. కాశీఖండములో "ఘోడెరాయాంక సద్గురురాయ భీమేశ్వరస్వామి' అని చెప్పుటచే ఘోడెరాయఁడని ప్రసిద్ధికెక్కిన భీమేశ్వరుఁడు శ్రీనాథుని గురువైనట్లున్నది. ఇతఁడు పట్టిసనివాసి. వీరభద్రారెడ్డికి గురువు. కావున భీమేశ్వరుఁడు శ్రీనాథునికి మతగురువై యుండవచ్చును.

శ్రీనాథుఁడు కొలంత కొండవీటిప్రభువుల మంత్రులకు గ్రంథముల నంకితముచేసి, యాస్థానమునఁ బ్రవేశమును కల్గించుకొని,ఆస్థానపండితుఁడై, విద్యాధికారిగా 20 ఏండ్లుండెను. తర్వాత ఆ రాజ్యము నశింపఁగా రాజమహేంద్రవరమున కేఁగి యచటి ప్రభువగు వీరభద్రారెడ్డికి మంత్రి యగు బెండపూఁడి అన్నమంత్రి నాశ్రయించి, యాస్థానమునఁ బ్రవేశమును కల్గించుకొనెను. అచటఁ గొంతకాలము గడపి యవసానదశలో నొడ్డె రాజులవలన-పన్నుకట్టలేని కారణమున శిక్ష నొంది మరణించెను. ఈతని యవసానకాలము క్రీ. శ. 1445 ప్రాంతమఁట !

ఈ మహాకవి పెక్కు గ్రంథములను రచించెను. అవి (1) మరుత్తరాట్చరిత్రము. (2) శాలివాహనసప్తశతి. (3) శృంగారనైషధము (4) భీమేశ్వరపురాణము (5) కాశీఖండము (6) హరవిలాసము (7) పల్నాటివీరచరిత్రము (8) క్రీడాభిరామము (9) శివరాత్రి మాహాత్మ్యము (10) పండితారాధ్య చరిత్రము (11) నందనందన చరిత్రము (12) మానసోల్లాసము (13) ధనంజయవిజయము.

పయివానిలో మరుత్తరాట్చరిత్రము, శాలివాహనసప్తశతి, పండితారాధ్యచరిత్రము, నందనందనచరిత్రము, మానసోల్లాసము, ధనంజయ

విజయము లభించలేదు. వల్లభాభ్యుదయమను గ్రంథమునుకూడ నీతఁడు రచించినట్లు తెలియుచున్నది. ఇతఁడొక కామశాస్త్రమును రచించినట్లు నెల్లూరి - శివరామకవి వ్రాసిన కామకళానిధివలనఁ దెలియుచున్నది. అదియే మానసోల్లాసమేమో! నందనందనచరిత్రము నీతఁడు రచించినట్లు రంగకాట్ఛందమునను, ప్రయోగరత్నాకరమునను చెప్పఁబడినది గాని యా మాట విశ్వాసార్హము కాదని శ్రీ వేటూరి - ప్రభాకరశాస్త్రిగారు 'శృంగార శ్రీనాథము' లోఁ దెల్పియున్నారు.

ఇతని యలబ్ధ కృతులలో పండితారాధ్యచరిత్రము మామిడి సింగన్న యన్నయగు ప్రెగ్గడామాత్యున కంకితముచేయఁబడినది. ధనంజయవిజయము గన్న భూపాలునికిఁ గృతి యీయఁబడినది. తక్కిన కృతులెవ్వరి కంకితములైనదియుఁ దెలియదు.

ఉపలబ్ధములగుచున్న గ్రంథములలో 8 ఆశ్వాసముల శృంగార నైషధము నీతఁడు మామిడి-సింగనామాత్యునకుఁ గృతియిచ్చెను. ఈ సింగన పెదకోమటి వేమారెడ్డియొద్ద మంత్రిగా నుండెను. ఇతఁడు విద్యాత్పోషకుఁడే కాక గొప్ప విద్వాంసుఁడుకూడ.

శృంగారనైషధము సంస్కృతమునఁ గల శ్రీహర్షుని నైషధ కావ్యమునకు స్వేచ్ఛానువాదము. ఈ నైషధమును శ్రీనాథుఁడు 1405-1410 ప్రాంతమున రచించి యుండునని 'ఆంధ్రకవితరంగిణీ' కారుల యభిప్రాయము. శాలివాహనసప్తశతి, పండితారాధ్యచరిత్రలను 1400-1405 నడుమ రచించి యుండవచ్చుననియు వారే తెల్పుచున్నారు.

హరవిలాసమును శ్రీనాథుఁడు తన బాలసఖుఁడగు అవచి-తిప్పయ సెట్టి కంకితమొనర్చెను. ఇందు శివుని లీలలు, అతని భక్తపరవశత్వము, కుమారోత్పత్తి మున్నగు విషయములు వర్ణితములు. కొండవీటి రెడ్డిరాజ్య మంతరించినపిదప, రాజమహేంద్రవరమునకు వెళ్లక మునుపు శ్రీనాథుఁ డీగ్రంథమును తిప్పయసెట్టి కంకితముచేసి యుండుననియు, ఆ కాలము

క్రీ. శ. 1425 ప్రాంతమై యుండుననియు ఆంధ్ర 'కవితరంగిణి' కారుల యాశయము. ఇది యేడాశ్వాసముల ప్రబంధము.

భీమఖండమనకే భీమేశ్వరపురాణ మను పేరు ప్రసిద్ధము. ఇందు దాక్షారామభీమేశ్వరుని మహిమ వర్ణింపఁబడెను. రాజమహేంద్రవర మునకు వెళ్లి నపిదప నచటి వీరభద్రారెడ్డికి మంత్రి యగు బెండపూఁడి - అన్నామాత్యున కిది యంకిత మీయఁబడినది. ఈ గ్రంథము 1430 ప్రాంతమున రచింపఁబడినది.

కాశీఖండ మే డాశ్వాసముల ప్రబంధము. సంస్కృతమునందలి కాశీఖండము నాధారముగాఁ జేసికొని కవి యీ గ్రంథమును విపులముగా రచించి, రాజమహేంద్రప్రభువగు వీరభద్రారెడ్డి కంకిత మొనర్చెను. ఈ గ్రంథము క్రీ. శ. 1430–39 నడుమ రచింపఁబడి యుండవచ్చునని 'ఆంధ్ర కవితరంగిణి' లోఁ గలదు.

శివరాత్రి మాహాత్మ్యము శివరాత్రిమహిమను తెల్పు ప్రబంధము. ఇది యసమగ్రము. నాల్గాశ్వాసముల గ్రంథము మాత్రమే లభించినది. శ్రీశైల మల్లికార్జునస్వామి ధర్మకర్త యగు శాంతవృత్తి భిక్షారాయని కోరికపయి, ఇది ముమ్మడి-శాంతయ్య యను భక్తున కంకితముచేయఁబడినది.

పల్నాటి వీరచరిత్రము పల్నాటివీరుల గాథను తెల్పు మంజరీ ద్విపద కావ్యము. ఇది చెన్నకేశవస్వామి కంకితముచేయఁబడినది. ఇందుఁ దర్వాతఁ గొన్ని చేర్పులు, మార్పులు కలిగినవనియు, కావచ్చు గ్రంథ మంతయు శ్రీనాథుని రచన కాదనియు నభిజ్ఞుల యభిప్రాయము.

శ్రీనాథుఁ డిట్లు గ్రంథములను రచించుటే కాక దేశసంచార మొనర్చుచు, దేవరాయలు, సర్వజ్ఞ సింగభూపతి మున్నగు ప్రభువులవలనఁ గనకాభిషేకాదులగు మర్యాదలను, బహుమానములను పొందుచుఁ బెక్కు చాటువులను రచించెను.

ఈతని కవిత్వము ప్రౌఢమై, మనోహరమై, పండిత పామర జనరంజకమై యుండును.

బమ్మెర పోతన యితని బావమఱఁది యని ప్రసిద్ధి. వీ రిర్వురును సమకాలికులు కారని 'ఆంధ్రకవితరంగిణీ' కారుల యభిప్రాయము.

## శ్రీనారాయణతీర్థులు

జయదేవకవియపరావతార మని పేరుపొంది సంస్కృతమున 'కృష్ణలీలాతరంగిణి' ని రచించిన యీ మహాకవి తెలుఁగున 'పారిజాతాపహరణ' మను యక్షగానమును రచించెను. ఈతఁ డచ్యుతనాయకుని కాలమున (క్రీ. శ. 1561-1614 ప్రాంతమున) నుండి యుండును.

## శ్రీనివాసకవి - కొడిచెర్ల

ఈతఁ డాత్రేయగోత్రుఁడు. కొండయభవాని పుత్రుఁడు. ఇతని నివాసము రాజమహేంద్రవరము. ఈతఁడు 250 ఏండ్ల క్రిందట నుండె ననియు, 17-వ శతాబ్ది మధ్యమున నుండి - మధ్యకవులలోఁ జేరియుండ వచ్చునేమో యనియు శ్రీ వీరేశలింగము పంతులుగారి యభిప్రాయము.

ఈ కవి శేషధర్మరత్నాకరమను ఆఱాశ్వాసముల గ్రంథమును రచించెను. ఈతని కవిత్వము ప్రౌఢమై రసికజనహృదయంగమముగా నుండును.

## శ్రీనివాసాచార్యులు - తాళ్లపాక

తాళ్లపాకవారి కుటుంబములోని యీతఁడు వేంకటేశ్వర (సీసపద్య)శతకము' ను రచించెను. దీని యముద్రితప్రతి ఆంధ్రసాహిత్య పరిషత్కార్యాలయమున నున్నది.

## శ్రీమన్నారాయణయ్య

ఈతఁడు శ్రీవైష్ణవబ్రాహ్మణుఁడు. అప్పయార్యుని మనుమఁడు. వేంకటాచార్యుని పుత్రుఁడు. భారద్వాజగోత్రుఁడు. ప్రౌఢకవి. పుదు

కోటను 1730-1769 నడుమను పాలించిన విజయరఘునాథరాయల కాలమున నుండెను. ఈతనికి 'మన్నారయ్య' అనునది నామాంతరము.

సంస్కృతమున భానుదత్తుఁడు రచించిన రసమంజరి నీతఁ డాంధ్రీకరించి యున్నాఁడు. పుదుకోటరాజులపయిఁ గొన్ని చాటువులను చెప్పెను. ఈతని కవిత్వము ప్రౌఢముగా నుండును. ఈతని రసమంజరి యముద్రితము.

## శ్రీరంగాచార్యులు - వాత్స్య

హైదరాబాదుప్రాంతమందలి బూరుగుగడ్డ యీతని నివాసము. రమారమి 200 ఏండ్లక్రిందట నీతఁ డుండెను. ఈతఁడు 'శాల్మలీకందనందనవిలాస' మను పద్యకావ్యమును రచించెను. ఇది బూరుగుగడ్డ దేవాలయమహత్త్వమును తెలుపు గ్రంథము. అముద్రితము.

## శ్రీరామకవి - రాపాక

ఈతఁడు పరకాల నివాసి. క్రీ. శ. 1780 ప్రాంతమువాఁడు. ఈ కవి 'అధ్యాత్మరామాయణము'ను రచించెను.

## శ్రీరామమూర్తి - గురుజాడ

ఈతఁ డార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. తండ్రి దుర్గాప్రసాదరావు. ఈతఁడు 1851 లో జననమొందెను. కొంతకాలము కాకినాడయందును, తర్వాత విజయనగరమునందును నివసించుచుండెను.

ఈతఁడు చిత్రరత్నాకరము, కళాపూర్ణోదయ కథాసంగ్రహము, కలభాషిణి, తెనాలిరామకృష్ణుని కథలు, అప్పయదీక్షితుల చరిత్రము, తిమ్మరుసుచరిత్రము, కవిజీవితములు-మున్నగు గ్రంథములను రచించెను. ఈయన రచించిన 'కవిజీవితములు' మిక్కిలి వ్యాప్తి పొందినది. ఈతని సాహిత్యసేవకు శ్రీ విజయనగరప్రభువులగు ఆనందగజపతి మహారాజుగారు దోహద మిచ్చిరి.

ఈయన కొంతకాలము కాకినాడనుండి 'రాజయోగి' అను మాస పత్రికను ప్రకటించుచుండెను. పెద్దాపురమునుండి 'ప్రబంధ కల్పవల్లి' అను పత్రికను కొంతకాలము ప్రకటించెను.

## సంగమేశ్వరారాధ్యుఁడు - వేమనారాధ్యుల

ఈతఁడు శైవుఁడు. కృష్ణాతీరమునందలి అమరావతిని పరిపాలించిన వాసిరెడ్డి వేంకటాద్రినాయని సోదరపుత్రుఁడగు చంద్రమౌళిప్రభుని సమకాలికుఁడు. ఈ కవి నూటయేఁబది సంవత్సరముల క్రిందట నుండి యుండునని శ్రీ వీరేశలింగముపంతులుగారి యభిప్రాయము.

ఈ కవి అహల్యాసంక్రందనవిలాస మనెడి యైదాశ్వాసముల ప్రబంధమును రచించి వాసిరెడ్డి చంద్రమౌళిప్రభువునకే అంకిత మిచ్చెను.

## సంజీవకవి - కొమరగిరి

ఈతఁడు నందవరీక నియోగిబ్రాహ్మణుఁడు. వసిష్ఠగోత్రుఁడు. శేషయ్య, లచ్చమ్మల పుత్రుఁడు. ఈతఁడు 'శశాంకశేఖరా!' అను మకుటముతో నాశువుగా ఒక వృత్తశతకమును రెండు గడియలలో ముగించెనఁట! హరిహరసంవాదమును కూడ రెండు గడియలలో ముగించెనఁట! అది వేఱేగ్రంథమో, లేక శశాంకశేఖరశతకమునకు నామాంతరమో తెలియదఁట! రచన సరళమైనది.

## సంజీవకవి - చింతలపల్లి

ఈతఁడు మహబూబునగరుజిల్లా గంగాపుర నివాసి. 220 ఏండ్ల క్రిందట నీతఁ డుండెనని గోలకొండకవుల సంచికలోఁ గలదు. చింతలపల్లి వీరరాఘవకవికిఁ బూర్వుఁడు.

ఈ కవి చంద్రాంగదోపాఖ్యాన మను గ్రంథమును రచించెను. అది లభ్యము కాలేదు.

## సంజీవరాయకవి - రావూరి

ఈతఁడు కొలనుపాక నివాసి. క్రీ. శ. 1780 ప్రాంతమున నీతఁ డుండెనఁట !

రుక్మిణీపరిణయము, వీరనారాయణ శతకము, వసుదేవనందన శతకము, త్రివిక్రమ విలాసము, భాగవతమునందలి ఏకాదశ, ద్వాదశ స్కంధములు నీతని కృతులు. ఇందులోఁ జాలవఱకును ముద్రితములు. రుక్మిణీపరిణయ మీతని కృతి కాదనియు, అది కొప్పర్తి - నరసకవి కృత మనియుఁ గొందఱి యభిప్రాయము.

## సంపత్కుమార శ్రీనివాస వేంకటాచార్యుఁడు- నల్లాన్ చక్రవర్తి

ఈతఁడు గోదావరిజిల్లాలోని ముక్తీశ్వరపుర నివాసి. క్రీ.శ. 1790- 1840 నడుమ నుండెనఁట ! శ్రీ వైష్ణవబ్రాహ్మణుఁడు. ఈతఁడు "తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా !" అను మకుటముతో నొక కంద పద్యశతకమును రచించెను. ఇది 'శ్రీ తిరుమల వేంకటేశ్వరశతకము' అను పేరఁ బ్రకటింపఁబడినది.

## సత్యనారన - కొఱవి

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. హరితసగోత్రుఁడు. అమరేశ్వర మంత్రికిఁ బౌత్రుఁడు. సింగయ్య, గంగమ్మలకుఁ బుత్రుఁడు. సింహాసన ద్వాత్రింశికను రచించిన కొఱవి - గోపరాజునకుఁ బిన తాత. ఈతనికి 'భీమన' యనునది నామాంతర మనియు, ఆంధ్రకవితాపితామహ బిరుదు వహించి రామాయణమును రచించెననియు గోపరాజీతనిని స్తుతించి యున్నాఁడు. ఈతని 'రామాయణ' మిప్పు డెచ్చటను లభింపలేదు.

ఇతని పూర్వులు చందవోలు నివాసులైనందున నీతఁడు నచ్చటి వాఁడే యై యుండుననియు, ఈతఁడు 14-వ శతాబ్దిలో ఉత్తరార్ధమున నుండెనని చెప్పవచ్చుననియు 'ఆంధ్రకవితరంగిణి' లోఁ గలదు.

## సదానందయోగి

'నవ్యతరభోగి శ్రీ సదానందయోగి' అను మకుటము గల శతకము సదానందకవి రచిత మొకటి కలదు. సదానందయోగి ఈశ్వర-ఫణిభట్టు గురు వొకఁడు కలఁడు. అతఁడే యీ 'సదానందయోగి' శతకకర్త యయి యుండవచ్చునని శ్రీ వంగూరి - సుబ్బారావుగారు తమ 'శతక కవుల చరిత్ర'లోఁ జెప్పి యున్నారు. ఆయనయూహ వాస్తవమైనయెడల, ఈ కవి ఫణిభట్టుకాలమువాఁడు కావలెను.

పణిభట్టుగ్రంథమందలి వినాయక స్తుతినిబట్టి యాతఁడు పెద్దనామాత్యుని కించుక తర్వాతవాఁడై (16-శతాబ్ది మధ్య) ఉండునని 'ఆంధ్ర కవితరంగిణి' కారుల యూహ. సదానందయోగియు నప్పటివాఁడే యై యుండును.

## సన్యాసికవి - అమలాపురపు

ఈతఁడు కులాలకులమునకుఁ జెందినవాఁడఁట ! శ్రీకాకుళముజిల్లా బొబ్బిలిదగ్గఱ నున్న పాలతేరీతని నివాసము. ఈతఁడు కట్టమూరి-కామేశ్వరకవి శిష్యుఁడు. క్రీ. శ. 1860 లో మృతి నొందెను. ఈతఁడు శతాధికముగ శతకములను రచించుటయే గాక రుద్రాక్షమాహాత్మ్యము మున్నగు మూఁడు ప్రబంధములు రచించెనఁట ! సోమవార వ్రతనియమము కలవాఁడు ! కాశీక్షేత్రాదులు తిరిగి పుణ్యకర్మలు చేసినవాఁడు.

ఈతని శతకములలో పంచముఖేశ (కందపద్య) శతకము, శ్రీ ముఖలింగ (కందపద్య) శతకము, శివ (కందపద్య) శతకము, పంచముఖేశ్వర ప్రభు (వృత్త) శతకము, విశ్వనాథ (సీసపద్య) శతకము, పంచముఖేశలింగ (సీసపద్య) ద్వాత్రింశతి - లభించినవఁట !

ఇతని రచన శబ్దాలంకారములతోఁ గూడి యుండును.

## సరస్వతి సోమయాజి - పట్టమట్ట

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. హారితసగోత్రుఁడు. పట్టమట్ట సోమనాథకవి వంశీయుఁడు. పోతనామాత్యుని మనుమఁడు. పై? పుత్రుఁడు. శివలెంక-గౌరనార్యుని శిష్యుఁడు. గోదావరీమండల నివాసి. ఈ కవి క్రీ. శ. 1670 ప్రాంతమువాఁడని 'ఆంధ్రకవితరంగిణి' కారుల యాశయము.

ఈతఁడు 'పృథుచరిత్రము' అను ప్రబంధమును రచించి దాక్షారామమునందలి భీమేశ్వరున కంకితమొనర్చెను. ఇతని కవిత్వము సలక్షణమయి, శబ్దార్థాలంకారములతో మనోహరముగ నుండును.

## సరస్వతీబాయి

ఈమె 19-వ శతాబ్ది ప్రారంభమునందే పాకశాస్త్రమునకు సంబంధించిన విషయములను వచనకావ్యముగా రచించెను. దీనిని ఆ సమయమునందే-మెకెంజీ దొరవారివద్ద పండితుఁడుగా నుండిన కావలి - వేంకటరామస్వామి ఆంగ్లములోనికి మార్చెను.

## సర్వదేవుఁడు

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు కూర్చిన 'ప్రబంధరత్నావళి' లో సర్వదేవుని 'ఆదిపురాణము' నుండియు, 'విరాటము' (భారత విరాట పర్వము) నుండియుఁ బద్యము లుదాహరింపఁబడినవి. ఎడపాటి యెఱ్ఱనయ్యాతనిని స్తుతించెను. సర్వదేవుఁడు కన్నడమున 'పొన్నకవి' యని పేరుపొందినవాఁడఁట! ఇతని కాలము క్రీ. శ. 953. నన్నెచోడుని కుమారసంభవమున నీతని యనుసరణములు కలవు. ఇతని గ్రంథము లలభ్యములు.

ఆదిపురాణము జైనకావ్యము. మొదటి తీర్థంకరుఁడగు పురుదేవుని చరిత్ర మిందు కలదు. దీనిని జినసేనుఁడు సంస్కృతమున రచింపఁగా 'పంపకవి' కన్నడమునఁ గూర్చెను. సర్వదేవుఁ డాంధ్రమున రచించెను.

## సర్వన్న - మలయమారుతము

ఈతని షష్ఠస్కంధములోని యొక పద్యమును జగ్గనకవి తన ప్రబంధరత్నాకరమున నుదాహరించెను. ఆ షష్ఠస్కంధము లభింపలేదు. ఈ కవి 16-వ శతాబ్దివాఁడని 'ఆంధ్రకవితరంగిణి' లోఁ గలదు.

పోతనామాత్యుని షష్ఠస్కంధము శిథిలమగుటచే నీతఁడు దానిని రచించి యుండవచ్చునఁట !

## సర్వప్ప - కాసె

ఈతఁ డోరుగల్లుప్రాంత నివాసి. ఈతఁడు క్రీ. శ. 1400 ప్రాంతమున నుండెనని 'గోలకొండకవుల సంచిక' లోఁ గలదు. ఆ కాల నిర్ణయమునకుఁ గల యాధారములు తెల్పఁబడలేదు.

ఈతఁడు 'ప్రతాపచరిత్రము, సిద్ధేశ్వరచరిత్రము (ద్విపద)' అను రెండు గ్రంథములను రచించినట్లు గోలకొండకవుల సంచికనుబట్టి తెలియు చున్నది. శ్రీవీరేశలింగము పంతులుగారు మాత్రము ప్రతాపచరిత్రమునకే సిద్ధేశ్వరచరిత్ర మనునది నామాంతరమని ఆంధ్రకవుల చరిత్రలో వ్రాసి యున్నారు.

ఈ రెండు గ్రంథములందును కవితా విషయముకంటె చరిత్రాంశమే ముఖ్య మనియు, చరిత్రవిషయములో నివి ప్రమాణగ్రంథము లనియు శ్రీ శేషాద్రిరమణకవుల యభిప్రాయము.

## సర్వశాస్త్రి - శిష్టు

ఈతఁడు తెలగాణ్యపు వైదికబ్రాహ్మణుఁడు. వసిష్ఠగోత్రజుఁడు; సర్వశాస్త్రి మనుమఁడు. సుప్రసిద్ధ విద్వత్కవి యగు శిష్టు - కృష్ణమూర్తి శాస్త్రి పుత్త్రుఁడు. ఈతఁడు 1830 లో జన్మించెను.

ఈతఁడు తండ్రివలెనే విద్వాంసుఁడు. తండ్రి కాశ్రయుఁడును, గోదావరిజిల్లా కలెక్టరు కచేరీలో సిరస్తాదారు నగు తులసింగసెట్టి

సాయమున రాయవేలూరిలోని ఆంగ్లపాఠశాలలో సంస్కృతాధ్యాపకుఁడుగా పనిచేసెను.

ఈ కవి సంస్కృతమునందలి 'అమరుక' కావ్యము నాంధ్రీకరించెను. మఱియు జ్ఞానప్రసూనాంబికా శతకము, శ్రీలలితాంబాస్తోత్రము, అచ్చుగాని తారావళి, కొన్ని చాటువులు మున్నగువానిని రచించెను.

అమరుకము కాళహస్తిప్రభువగు శ్రీ వేంకటపతిరాయనింగారి కంకిత మొసర్పఁబడినది.

## సర్వేశ్వరశాస్త్రి - పారనంది

ఈతఁడు కాసలనాఁటిశాఖకుఁ జెందిన వైదికబ్రాహ్మణుఁడు. గంజాముజిల్లా నివాసి. బ్రహ్మపురము (బరంపురము)నందలి వేంకటేశ్వర స్వామి కంకితముగా 'వేంకటేశ! బ్రహ్మపురీశా!' అను మకుటముతో సీతఁ డొక కందపద్యశతకమును రచించెను. ఇది బ్రహ్మపురీశ శతకమగును. ఇందలి కవిత్వము రసవంతము. కవి 1840 కిఁ బూర్వుఁడఁట!

## సాంబశివకవి - నుదురుపాటి

ఈతఁ డాంధ్రభాషార్ణవకర్త యగు వేంకనార్యుని పుత్రుఁడు. వెలనాఁటి వైదికబ్రాహ్మణుఁడు. తండ్రి, తాతలవలె ప్రౌఢకవి. 19-వ శతాబ్ది మొదట నుండినవాఁడు.

ఈతఁడు 'బిల్హణీయము, తొండమాన్ వంశప్రతాపమాలిక, చంద్రాననాదండకము' అను కృతులను రచించెను. వీనిలో బిల్హణీయము సంస్కృతగ్రంథమున కాంధ్రీకరణము. ఇందలి కవిత రసవంతమై, ప్రావ్యమయి యుండును. తొండమాన్ వంశప్రతాపమాలిక యొక సీసమాలిక. అందు పుదుకోట్టరాజుల ప్రతాపము వివరింపఁబడినది. చంద్రాననాదండకము 'భోగినీదండకము'వంటిది. ప్రభుని భోగకాంతనుగూర్చి చెప్పినది.

ఇతని కృతులు రాయరఘునాథరాయల కంకితములు. మొదటి రెండును ముద్రితములఁట! దండక మముద్రితము.

## సింగన - ఏర్చూరి

ఈ కవి నియోగిబ్రాహ్మణుఁడు. శ్రీవత్సగోత్రుఁడు. కసవనామాత్యునకును, ముమ్మడాంబకును పుత్రుఁడు. నారయామాత్య, పోలమాంబల పౌత్రుఁడు. ఈతఁడు క్రీ. శ. 1450 ప్రాంతమున నుండి యుండవచ్చును.

సింగన భాగవతమునందలి షష్ఠస్కంధము నాంధ్రీకరించి శ్రీకృష్ణున కంకిత మొనర్చెను. ఈతఁడు షష్ఠస్కంధమును పూర్తిగారచింప లేదనియు, పోతన రచించిన షష్ఠస్కంధములోని కొన్ని భాగములు ఖిలమైపోఁగా నీతఁడు పూరించెననియుఁ గొందఱ యభిప్రాయము. పోతనపద్యములఁ బోలిన పద్యములు కొన్ని షష్ఠస్కంధములో నున్నవి.

ఈతని 'కువలయాశ్వచరిత్ర' లోని కొన్ని పద్యములను పెదపాటి జగ్గనకవి తన ప్రబంధరత్నాకరమునందు సమకూర్చి యున్నాఁడు. దానిం బట్టి సింగనకవి కువలయాశ్వచరిత్రమును గూడ రచించెనని చెప్పవచ్చును.

## సింగన - కర్లపాలెము

ఈతఁడు గుంటూరుజిల్లా బాపట్లతాలూకా కర్లపాలెము నివాసి; ఆర్వేల నియోగిబ్రాహ్మణుఁడు. హరితసగోత్రుఁడు. ఈతని తండ్రి సీతారామయ్య; తల్లి బుచ్చమ్మ. ఈ కవి 1700 ప్రాంతమున జన్మించెనని శతకకవులచరిత్రలోఁ గలదు. ఈతఁడు 'నృసింహా! భక్త సంరక్షకా!' అను మకుటముతో నొక మత్తేభవృత్తశతకమును (నృసింహాశతకమును) రచించెను. అది అల్లూరిలోని నృసింహస్వామిపేర రచింపఁబడినది. రచన సరళము.

## సింగన - మడికి

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. భారద్వాజగోత్రుఁడు. అయ్యలమంత్రికిని, సింగమాంబకును పుత్రుఁడు. అల్లాడమంత్రి మనుమఁడు. తాత

నివసించినది రావెల యైనను తండ్రి 'మడికి' యందు నివసించుటచే నీతని యింటి పేరు మడికివారైరి.

ఈతని కాలమును దెలిసికొనుట కీతని గ్రంథములే సాయపడు చున్నవి. ఈతఁడు రచించిన పద్మపురాణమునఁ దద్రచనాకాలము శా. శ. 1342 (క్రీ. శ. 1420) అని తెల్పఁబడినది. సింగనతండ్రి యగు అయ్యలమంత్రి తొయ్యేటి యనపోత భూపాలునివద్ద మంత్రిగా నుండెను. అతఁడు క్రీ. శ. 1345-1367 నడుమ నున్నవాఁడు. అయ్యలమంత్రి 1330 ప్రాంతమున జన్మించెనని అనుకొన్నచో, అతని పుత్రుఁడు సింగన్న క్రీ. శ. 1375 ప్రాంతమున జన్మించి యుండవచ్చును. ఇతఁడు తన 45-వ ఏట పద్మపురాణమును గృతియిచ్చి యుండును.

కందనమంత్రి కాకతీయగణపతిదేవుని మంత్రి యగు గన్నయమంత్రికి మనుమని మనుమఁడు. గణపతిదేవుఁడు. 1260 వఱకును రాజ్యము చేసి యుండెను. అతని మంత్రి యగు గన్నయకును కందనకును నడుమ నాల్గు తరము లున్నవి. తరమునకు ముప్పదియేండ్ల వంతునఁ జూచినను, కందనకు నలుబదేండ్ల వయస్సున 1420 లో పద్మపురాణము కృతి యీయఁబడినదని చెప్పుట యుచితముగనే యుండును.

సింగన పద్మపురాణోత్తరఖండమును, భాగవత దశమస్కంధ ద్విపదను, వాసిష్ఠ రామాయణమును, సకల నీతిసమ్మత మను సంకలన గ్రంథమును రచించెను.

పద్మపురాణోత్తరఖండము 11 ఆశ్వాసముల పెద్ద గ్రంథము. ఇది వానస వంశీయుఁడగు కందనామాత్యున కంకితము. ఇందుఁ జాల భాగము రామావతార, కృష్ణావతారకథలతో నిండి యున్నది.

ఈతని రెండవ గ్రంథము భాగవత దశమస్కంధము. ఇదియును కందనామాత్యునకే యంకితము. ఇయ్యది పద్యములలోఁ గాక ద్విపదలలోఁ గూర్పఁబడినది.

మూఁడవ గ్రంథము వాసిష్ఠరామాయణము. ఐదాశ్వాసముల వేదాంతగ్రంథము. సంస్కృతమున జ్ఞానవాసిష్ఠ మని పేరుపొందిన విపుల గ్రంథమున కిది సంగ్రహరూపమగు ననువాదము. అతి గహనమగు వేదాంత విషయ మిందు తేట తెనుఁగుమాటలతో సుబోధముగాఁ జెప్పఁబడినది. కవి, ఈ గ్రంథమును కందనమంత్రికోరికపయి వెలిగందల నరసింహస్వామి కంకిత మొనర్చెను. ఈ గ్రంథమునందు కవి తాను ముప్పిడిభూపతి యాస్థాన కవి యైనట్లును, అతనివలన వృత్తులను పొందినట్లును చెప్పికొనెను.

నాల్గవ గ్రంథము సకలనీతి సమ్మత మను సంకలన గ్రంథము. ఇది యైదాశ్వాసముల గ్రంథమఁట! కాని, మూఁడాశ్వాసములే లభించుచున్నవి. ఇది కందనమంత్రియన్న యగు కేశవమంత్రిచేఁ బ్రతిష్ఠింపఁబడిన కేశవస్వామి కంకితము చేయఁబడినది. ఇం దా యా సందర్భములం దుదాహరణములుగా 17 గ్రంథములనుండి పద్యము లీయఁబడినవి. కామందకములోని పద్యము లధికముగ నున్నవి.

ఈతని కవిత్వము సలక్షణమయి, మృదుమధురమయి యుండును.

## సింగయ్య - గోపాలుని

ఈతఁ డార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. మౌద్గల్యగోత్రుఁడు. భాస్కరామాత్యుని పౌత్రుఁడు. వీరనమంత్రి పుత్రుఁడు. ఇతఁడు కర్నూలుమండలములోనివాఁడు. ఈతని పుత్రుఁడు 130 ఏండ్లక్రిందట జీవించి యుండినందున నీతఁడు 150 ఏండ్ల క్రిందట జీవించి యుండునని నిశ్చయింపవచ్చును.

ఈతఁడు సంస్కృతమునందలి కిరాతార్జునీయ కావ్యమును తెలిఁగించి అహోబిలములోని నృసింహస్వామి కంకితము చేసెను. అది అయిదాశ్వాసముల ప్రబంధము. ఈతని కవిత్వము రసవంతమై, సలక్షణమై యుండును.

## సింగయ్య - సిరమర్తి

ఈతఁడు నల్లగొండజిల్లా సిరమర్తి నివాసి. 60 ఏండ్ల క్రిందట నుండినవాఁడఁట!

ఈ కవి భారతము నాంధ్రీకరించెనఁట! అది ముద్రితము కాలేదు. ఈతనిని గురించిన విషయము శ్రీ చిదిరెమఠం వీరభద్ర శర్మగారివలనఁ దెలియవచ్చినట్లు గోలకొండ కవుల సంచికలోఁ గలదు.

## సింగరయ్య - చిత్రకవి

ఈ కవి ఆఱువేల నియోగిబ్రాహ్మణుఁడు. ఇతఁడు 200 ఏండ్ల క్రిందట నుండి యుండినట్లు శ్రీ వీరేశలింగముపంతులుగారి యభిప్రాయము.

ఈతఁడు బిల్హణీయమను మూఁడాశ్వాసముల ప్రబంధమును రచించి శ్రీరామున కంకితము చేసెను. తండ్రియనంతర మీతని పుత్రుఁడు నరసింహకవి కృత్యాదిలోని కొన్ని గద్య, పద్యములను తొలఁగించి పండి. పెద్ది - కృష్ణస్వామి కిచ్చి, యాతనివలన ధనమును గ్రహించినట్లును, దానిని కృష్ణస్వామి తాను రచించిన కావ్యముగా వెల్లడించినట్లును, చెప్పుదురు. కావ్యమునుబట్టి యిది కృష్ణస్వామి రచించినట్లే తోఁచుచున్నది. కాని ప్రథమాశ్వాసముచివరి చక్రబంధమునుబట్టి యిది సింగరయ్య రచించినట్లే తేటపడుచున్నదఁట!

## సింగరాచార్యులు - మరింగంటి

ఇతఁడు శ్రీవైష్ణవ బ్రాహ్మణుఁడు. తిరుమలాచార్యుల పౌత్రుఁడు. వేంకటాచార్యుల పుత్రుఁడు. 'దశరథరాజనందన చరిత్రము' అనెడు రామాయణకథాకావ్యము నీతఁడు నిరోష్ఠ్యముగా రచియించెను. ఈ కవి క్రీ. శ. 1750 - ప్రాంతమున నుండెనని తద్వంశీయులవలనఁ దెలియవచ్చినదని శ్రీ వీరేశలింగముపంతులుగారు 'ఆంధ్రకవులచరిత్ర' లోఁ దెల్పియున్నారు.

సింగరాచార్యులు వేపరకొండసీమ నివాసియఁట! ఏకైక దిన ప్రబంధరచనా ధురీణుఁడఁట! వింశతి ప్రబంధ నిర్మాతయఁట! కాని యితని గ్రంథాంతరము లేవియు లభ్యములు కాలేదు. "దశరథరాజనందన చరిత్ర' గల యొక తాళప్రతిలో గ్రంథము చివర 'సీతాపతీ!' అను మకుటముతో నొక శతక మున్నదనియు, అది యీతని రచనయే కావలెననియు శ్రీ వంగూరి - సుబ్బారావుగారు తమ 'శతకకవుల చరిత్రము'లోఁ దెల్పియున్నారు. ఈ శతకములో శ్రీరాముని మానవత్వము ఖండింపఁబడి యాతని దివ్యత్వము స్థాపింపఁబడినదఁట!

ఈతఁడు 'శ్రీ కృష్ణశతానందీయము, కృష్ణతులాభారము, రామకృష్ణ చరిత్రము, నాటకశాస్త్రము, ప్రేమాభిరామము, ధనాభిరామము, నల యాదవ రాఘవ పాండవీయము, అలంకారసంగ్రహము, ఆంధ్రభాషా భూషణము, రతి మన్మథాభ్యుదయము, రామాభ్యుదయము, నిరోష్ఠ్య శుద్ధాంధ్ర సీతాకల్యాణము' అను గ్రంథములను కూడ రచించెనని గోలకొండ కవుల సంచికలోఁ గలదు.

ఇతఁ డింక నెన్నో గ్రంథములను రచించెనఁట!

## సింగరాచార్యులు

ఈతని నివాసము వేల్పుకొండ. ఈతఁడు క్రీ. శ. 1700 ప్రాంతమున నుండెనఁట! ప్రతివాది భయంకరం - నరసింహాచార్యుల కీతఁడు శిష్యుఁడు. ఈతఁడు 'అర్చిరాది ప్రబంధము' ను ద్విపదగా రచించెను.

## సిద్ధనప్రెగడ

ప్రబంధరత్నావళిలో నీతని శాకుంతలములోని పద్యమొకటి ఉదాహరింపఁబడినది. ఈతని గ్రంథము లభింపలేదు. ఈతనిం గూర్చిన వివరములుం తెలియలేదు. ఇతఁడు 1560 సం. నకుఁ బూర్వుఁడని చెప్పవలెను.

## సిద్ధరామకవి

ఈతఁడు వీరశైవుఁడు. ఈతఁడు 'ప్రభుదేవరవాక్యము' అను పేర నొక శైవ వేదాంతగ్రంథమును వచనముగా వ్రాసెను. దీనికి 'పిండచక్ర నిర్ణయ' మను నామాంతరము కలదు. ఇందు వీరశైవ మత ప్రచారకులలో నొకఁడగు మల్లయప్రభుని తత్త్వోపదేశము కలదు. ఈ కవి 'చిత్కళాధామ! శ్రీ గురుసిద్ధరామ!' అను మకుటముతో నొక శతకమునుకూడ రచించెను. ఇది ప్రాచీన శైవ సమయాచార్యునిఁ గూర్చినదఁట!

ఈ కవి కేదారదేశికుని శిష్యుఁడు. క్రీ. శ. 1560 ప్రాంతమువాఁడు.

## సీనయకవి

ఈతఁడు తిరుమలాచార్యుని పుత్రుఁడు. సెందిన్నివాసి. ఈ సెందియే నేఁటి తిరుచెందూరఁట! అది తిరునల్వేలి జిల్లాలో సముద్రతీరమున నున్నది. అది కుమారస్వామి క్షేత్రము. సీనయకవి కుమారస్వామిపయి వేయిపై నెనిమిది పద్యములు చెప్పెను. ఆ గ్రంథమే 'షణ్ముఖ సహస్రము.' ఇది పది భాగముల గ్రంథము. అముద్రితము.

ఈ కవి 1731-1767 ప్రాంతమువాఁడు. ఇతని రచన సరళము. ప్రశస్తము కాదు.

## సీతారామకవి - అణిమిళ్ల

కూచిమంచి జగ్గకవికి ప్రతిద్వంద్వి యగు వేంకటశాస్త్రి కీతఁడు కుమారుఁడఁట! 18-వ శతాబ్దిలోనివాఁడు. ఈతఁడు 'జానకీపతి' శతకమును వృత్తములలోఁ జెప్పెను. రచన తత్సమభూయిష్ఠమై, జటిలమై ప్రౌఢముగా నుండును.

## సీతారామయ్య - నుదురుపాటి

ఈతఁడు వెలనాఁటి వైదికబ్రాహ్మణుఁడు. ఆంధ్రభాషార్ణవ కర్త యగు వెంకనార్య కవికిఁ దండ్రి. పుదుకోట సంస్థానమున నుండిన విద్వ

త్కవి. ఈతని కాలము 18-వ శతాబ్ది చివరిభాగము. ఈతఁడు వివిధ ప్రబంధములను రచించినట్లు వెంకనార్యుఁడు చెప్పినను, అవి యేవియు లభింపలేదు. కొన్ని చాటువులు మాత్రము లభించినవి.

## సీతారామశాస్త్రి - చదలువాడ

19-వ శతాబ్దిలోని విద్వత్కవులలో నీతఁడు పేరొందినవాఁడు. పుదూరుద్రావిడశాఖకుఁ జెందిన వైదికబ్రాహ్మణుఁడు. ఈతఁడు సంస్కృతనాటకములను - అభిజ్ఞానశాకుంతలము, మాళవికాగ్నిమిత్రము - మున్నగు నాఱింటిని వచనరూపముగా నాంధ్రీకరించెను. దక్కను పూర్వకథ లను పేర దక్షిణదేశమున వాడుకలో నున్న కొన్ని ప్రాచీనకథలను సులభశైలిలో వచనముగా రచించెను. ఈ రెండు గ్రంథములును ముద్రితములు.

## సీతారామశాస్త్రి - పుదూరి

19-వ శతాబ్ది ప్రారంభమున నుండిన విద్వాంసులలో నీయన యొకఁడు. పుదూరుద్రావిడశాఖకుఁ జెందినవాఁడు. ఇతఁడు చెన్నపురిలోని హిందూ విద్యాసభలో సంస్కృతపండితుఁడుగా నుండెను. బాలుర కత్యంతోపయుక్తమును, బాల విజ్ఞాన సర్వస్వ మనఁదగినదియు అగు 'పెద్దబాలశిక్ష'ను రచించెను. అది 1847 సం. న తొలిసారిగా ముద్రింపఁ బడినది. నాఁటినుండి నేఁటివఱకును ఎన్నియో పర్యాయములు ముద్రింపఁ బడుచు, బహుళప్రచారము నొంది యున్నది.

ఈతఁడు పయి 'బాలశిక్ష' నేగాక ఆంధ్రశబ్దచింతామణి ననుసరించి ప్రశ్నోత్తరరూపమున 'ప్రశ్నోత్తరాంధ్రవ్యాకరణము' ను కూడ రచించెను. ఇదియును ముద్రితము.

## సీతారామాచార్యులు - బహుజనపల్లి

ఈతఁడు శ్రీవైష్ణవబ్రాహ్మణుఁడు. 1827 లో ద్రవిడదేశమందలి నాగపట్టణమున జనన మందెను. చెన్నపురమున ఆంధ్రాధ్యాపకుఁడుగా పనిచేసెను.

ఈతఁడు సౌందరరాజస్వామిశతకము, వైకృతదీపిక, పదార్థనామ కోశము, బాలచంద్రోదయము, అలఘుకౌముది, నీతిమాల, సతీధర్మ సంగ్రహము, ప్రపన్నపారిజాతము, ఆంధ్రశబ్దమంజరి, ఉపాధ్యాయబోధిని, వినాయకశతకము, త్రిలింగలక్షణశేష మను ప్రౌఢవ్యాకరణము, శబ్ద రత్నాకర నిఘంటువు - అను గ్రంథములను రచించెను.

ఈతని శబ్దరత్నాకరము, ప్రౌఢవ్యాకరణము మిక్కిలి ప్రసిద్ధికెక్కి, ప్రచారము నొందినవి.

## సుబ్బన్న - బాలకవి

ఈతఁడు శాహరాజుకాలమున నున్నవాఁడు. ఈ కవి 'లీలావతీ శాహరాజీయ' మను నాటకమును రచించెను. ఇందు లీలావతీ, శాహ రాజుల వివాహకథ కలదు. ఈ కవి 17-వ శతాబ్ది చివఱ నుండి యుండును.

## సుబ్బరాయకవి - అనంతరాజు

ఈతఁడు కార్వేటినగర సంస్థానాధిపతి యగు శ్రీ కుమార-వేంకట పెరుమాళ్లు రాజు ప్రేరణమున 'సదాశివశతక' మను సీసపద్య శతకమును రచించెను. అచ్చటచ్చట గర్భకవిత్వము కల పద్యములును కలవు. కవి క్రీ. శ. 1825-1884 నడుమ నుండినవాఁడు. ఈతని రచన ప్రౌఢమైనది.

## సుబ్బరాయకవి - ముప్పిరాల

ఈ కవిని గురించి కాని, కాలమునుగురించి కాని తెలియలేదనియు, ఈతఁడు నూటయేఁబది సంవత్సరములక్రిందట నుండి యుండుననియు ఆంధ్ర కవుల చరిత్రనుబట్టి తెలియవచ్చుచున్నది.

ఈతఁడు కృష్ణాభ్యుదయ మను ఆయిదాశ్వాసముల ప్రబంధమును రచించి చక్కిలాల-వేపయామాత్యున కంకితమొనర్చెను. ఆ గ్రంథమును

బట్టియే యీతఁడు ప్రద్యుమ్న చరిత్రము, సావిత్రీ చరిత్రము, భద్రాద్రి రామ శతకము - అను గ్రంథములను కూడ రచించెనని తెలియుచున్నది.

ఈతని కవిత్వము మృదుమధురమై యుండును.

## సుబ్బరాయకవి - రాజవోలు

ఈతఁడార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. శ్రీవత్స గోత్రుఁడు. ఈ కవి పింగళి - సూరనార్యుని కళాపూర్ణోదయము ననుసరించి 'జయ విజయాభ్యుదయ' మను ఆఱాశ్వాసముల కల్పిత ప్రబంధమును రచించెను. ఈతఁడు 'చిత్రాంగదా పరిణయము, గరుడాంజనేయ సంవాదము, సుదంతా వివాహ ద్విపద, కృష్ణార్జున సంవాదము' అను గ్రంథములను కూడ రచించెను. జయ విజయాభ్యుదయ మొక్కటియే లభించినది. అది శ్రీ వేంకటేశ్వరస్వామికిఁ గృతి యీయఁబడినది. ఈతఁడు పింగళి సూరకవికంటెఁ దర్వాతివాఁడు.

ఈతని రచన సరళమైనది.

## సుబ్బరాయలు నాయఁడు - కొర్మంచి

ఈతఁడు 19-వ శతాబ్దిలో నుండిన కవి. ఈతఁడు 'దశావతారచరిత్ర సంగ్రహ' మను వచనకావ్యమును రచించెను. ఇది 1861 లో ముద్రితమైనదఁట! ఇందు దశావతారముల కథలు కలవు.

## సుబ్రహ్మణ్యకవి - అల్లమరాజు

ఈతఁడు ద్రావిడశాఖకుఁ జెందిన వైదికబ్రాహ్మణుఁడు. హారితసగోత్రుఁడు. తండ్రి రంగశాయి. తల్లి గంగమాంబ. ఈతని నివాసము పిఠాపురముచేరువఁ గల చేబ్రోలుగ్రామము. ఈతఁడు క్రీ. శ. 1831 లోఁ బుట్టి 1892 లో మరణించెనఁట! ఈతఁడు పిఠాపుర ప్రభువగు శ్రీ రావు గంగాధరరామ రాయల యాస్థానమునఁ గొంతకాల

ముండెను. మాడుగుల ప్రభువగు శ్రీ కృష్ణభూపతివలనను సన్మానములు పొందెను. ఈతఁడు గొప్ప పండితుఁడు.

ఈ విద్వత్కవి శ్రీ కృష్ణభూపతిలలామ శతకము, శైవధర్మములను ఆఱాశ్వాసముల పద్యకావ్యము, పాకయమంత్రిశతకము, ఆత్మబోధ మనఁబడు బద్యానువాదము, మణిధ్వజచరిత్రము, సింహాద్రి రామాధిప శతకము, భద్రా పరిణయము, శ్రీ కృష్ణలీలాకల్యాణము, చాటుధారా చమత్కారసారము మున్నగు గ్రంథములను రచించెను.

వీనిలో శ్రీ కృష్ణభూపతి లలామశతకము మాడుగుల కృష్ణభూపతి ప్రశస్తి రూపము. 'శైవధర్మములు' లింగమపర్తి రామప్రభువున కంకిత ముచేయఁబడినదఁట ! భద్రా పరిణయము కాణాదము - పెద్దన సోమయాజి రచించిన 'ముకుందవిలాసము' ననుసరించి రచింపఁబడి పిఠాపురప్రభువు లగు శ్రీ గంగాధరరామరాయల కంకిత మొనర్పఁబడినది.

## సుబ్రహ్మణ్యకవి - గరుడాద్రి

ఈతఁడు చిత్తూరు ప్రాంతీయుఁడు. 'శత్రుఘ్న విజయ' మను కావ్యమును రచించి కార్వేటినగరప్రభువగు తిరుమలరాజున కంకిత మొనర్చెను. ఈ గ్రంథము 1864 లో పూర్తియైనదఁట ! ఈ కవి గతశతాబ్దిలో నున్న వాఁడు.

## సుబ్బాశాస్త్రి - గార్గేయపురము

ఈతఁడు గద్వాలసంస్థానమునం దాస్థానకవి. 17-వ శతాబ్ది మలిభాగమున నుండి యుండును. సోమభూపాలుఁ డీతని పోషకప్రభువు. ఈ కవి యథాశ్లోకతాత్పర్యరామాయణమునందలి అరణ్యకాండమును మూఁడాశ్వాసముల ప్రబంధముగా రచించెను.

## సుభద్రయ్యామ్మ - మదిన

కవయిత్రులలోఁ జేరపడిన యీామె విశాఖపట్టణమండలమున జమీందారులగు రాజా శ్రీ గోడే - నారాయణగజపతి రాయనింగారి మేనత్త. ఈమె క్రీ. శ. 1781 న జన్మించెను.

ఈమె శ్రీరామదండకము, రఘునాయకశతకము, కేశవశతకము, కృష్ణశతకము, రాఘవరామశతకము మున్నగు గ్రంథములను పెక్కింటిని వ్రాసెనఁట !

## సూరకవి - అడిదము

ఇతఁడార్వేల నియోగి. వసిష్ఠగోత్రోద్భవుఁడు; చినలచ్చమంత్రి మనుమఁడు; భాస్కరామాత్యుని పుత్రుఁడు. శాపానిగ్రహసమర్థుఁడైన విద్వత్కవి. 18-వ శతాబ్దిలోని యాంధ్రకవులలోఁ బేరెన్నికఁ గన్న వాఁడు. ఈతని కాలము క్రీ. శ. 1720-1785 అయి యుండునని నిశ్చయింపఁబడినది.

ఈతఁడు విశాఖపట్టణమండలములోని విజయనగర సంస్థానప్రభువుల యాస్థానకవి. ఆ రాజ్యమును పాలించిన పూసపాటి - పెద విజయరామరాజుగారి కాలమునను, చిన విజయరామరాజుగారి కాలమునను గూడ నీతఁడుండెను. చిన విజయరామరాజుగారి కాలముననే ఈతని కీర్తి వ్యాపించినది.

తిట్టుకవిత్వమున కీతనిది పెట్టినపేరు. 'సూరకవితిట్టు కమసాలి సుత్తెపెట్టు' అను లోకోక్తి ప్రసిద్ధమైనది !

ఈతని గ్రంథము లాఱు కానవచ్చుచున్నవి. అవి—(1) కవిజన రంజనము (2) కవిసంశయవిచ్ఛేదము (3) చంద్రాలోకము (4) ఆంధ్ర నామశేషము (5) రామలింగేశశతకము (6) శ్రీరామదండకము. వీనిలో 'కవిజనరంజనము' మూఁడాశ్వాసముల ప్రబంధము. ఇది పిల్లవసుచరిత్ర

మని పేరుపడినది. ఇందు చంద్రమతీ హరిశ్చంద్రుల వివాహము వర్ణితము. కవిసంశయవిచ్ఛేదము వ్యాకరణము. చంద్రాలోక మలంకారగ్రంథము. సంస్కృతమునకుఁ దెలుఁగుసేఁత. ఆంధ్రనామశేషము పైఁడిపాటి లక్ష్మణ మంత్రి వ్రాసిన 'ఆంధ్రనామసంగ్రహ' నిఘంటువునకు శేషగ్రంథము.

ఈ గ్రంథములే కాక యితని చాటువులును పెక్కులు కలవు.

## సూరన - నారన

ఈతఁడార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. నారనమంత్రి పుత్రుఁడు. ఈతఁడాధునికుఁడని చెప్పవచ్చును. ఇతని కాలమును నిర్ణయించుటకుఁ దగిన యాధారములు లభింపలేదు.

ఈతఁడు వనమాలి విలాసమను కావ్యమును రచించి కొండూరి - అక్కదండనాథున కంకితమొసఁగెను. కృతిపతియు నియోగిబ్రాహ్మణుఁడు. ఈతఁడు మంత్రిగా నుండెననియు, యజ్ఞము చేసెననియుఁ దెలియవచ్చుచున్నది. రచన సలక్షణమై మృదువుగా నుండును.

## సూరన - గొంతేటి

ఈ కవి నియోగిబ్రాహ్మణుఁడు. భారద్వాజగోత్రుఁడు. రామయామాత్యుని పౌత్రుఁడు. కాశిరాజు పుత్రుఁడు. 150 ఏండ్ల క్రిందటి వాఁడని శ్రీ వీరేశలింగము పంతులుగారి యభిప్రాయము.

ఇతఁడు కృష్ణాభ్యుదయమను అయిదాశ్వాసముల ప్రబంధమును రచించి లొల్లాప్రగడ కామమంత్రి కంకితమొసఁగెను. ఇందు శ్రీకృష్ణుని లీలలు వర్ణితములు. కవిత్వ మంత ప్రశస్తమైనది కాదు.

## సూరన - నూతనకవి

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. కాశ్యపగోత్రుఁడు. తిప్పయామాత్యుని పుత్రుఁడు. కవి, తాను తిక్కనసోమయాజివంశమువాఁడనని

చెప్పికొనెను. ఈతఁడు 250 ఏండ్ల క్రిందటివాఁడని శ్రీ వీరేశలింగము పంతులుగా రభిప్రాయపడుచున్నారు.

ఈ కవి 'సకలజనాభిరామ' మను నామాంతరము గల ధనాభిరామ మను మూఁడాశ్వాసముల పద్యకావ్యమును రచించి దాక్షారామ భీమేశ్వరున కంకితము చేసెను. కావున నీతఁడు గోదావరిజిల్లావాఁడై యుండునని ఆంధ్రకవుల చరిత్రలోఁ గలదు. ధన, రూపవిషయములలోఁ గుబేర మన్మథులకుఁ గలిగిన వివాదములును, తుదకు రెండును సమానములను విషయము నిందు వర్ణితములు. ఇందలి కవిత్వము హృద్యమైనది.

## సూరనార్యుఁడు - పింగళి

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. గౌతమగోత్రుఁడు. ఈతని తాత సూరన్న. తండ్రి యమరన్న. తల్లి సుబ్బమ్మ. గొంకనామాత్యుఁడు (గోకనామాత్యుఁడని కొందఱు) వీరి వంశమునకు మూలపురుషుఁడట! అతఁ డొక గంధర్వుని స్వాధీనముచేసికొనినట్లు చెప్పుదురు. సూరనయు నా విషయమును తెల్పెను. గ్రామమునుబట్టియే యీ వంశమువారికి 'పింగళి' యను నామ మేర్పడినదఁట!

ఈతఁడు గరుడపురాణము, గిరిజాకల్యాణము, రాఘవపాండవీయము, కళాపూర్ణోదయము, ప్రభావతీప్రద్యుమ్నము నను నైదు గ్రంథములను రచించెను. వీనిలో గరుడపురాణప్రశంస ప్రభావతీప్రద్యుమ్నమునఁ గలదు; గిరిజాకల్యాణములోని పద్యమొకటి అందరంగ రాట్ఛందస్సులో నుదాహరింపఁబడినది.

ఈతని రచనలలో మనకు లభ్యములగువానిలో రాఘవపాండవీయము మొదటిది. ఇది నాలుగాశ్వాసముల ద్వ్యర్థికావ్యము. ఇందు భారతరామాయణకథలు జోడించి వర్ణింపఁబడినవి. ఇట్టి గ్రంథములలో నిదియే మొదటిది. తర్వాత వెల్వడిన పెక్కు ద్వ్యర్థి, త్ర్యర్థికావ్య

మూలకంబైను ఇదియే యుత్తమముగా నున్నదని విద్వద్విమర్శకుల యాశయము. ఆనవీటి పురప్రభువగు పెదవేంకటాద్రి ప్రేరణమున నిది శ్రీ విరూపాక్షస్వామి కంకితము చేయఁబడెను. ఈ యానవీడు తుంగభద్ర ప్రాంతమున నుండి యుండును. ఈ పెదవేంకటాద్రి తాత యిమ్మరాజు శ్రీ కృష్ణదేవరాయల రాజమహేంద్రయుద్ధమునఁ జాల్గొనెనఁట! ఆ యుద్ధము క్రీ. శ. 1515 లో జరిగినది. అప్పటి కతనికి 40 ఏం డ్లుండె ననుకొన్నచో, పెదవేంకటాద్రి 25 ఏండ్లవాఁడుగా నున్నపుడు - అనఁగా క్రీ. శ. 1545 ప్రాంతమున రాఘవపాండవీయము రచింపఁబడి యుండును.

సూరకవి ద్వితీయగ్రంథమగు కళాపూర్ణోదయ మపూర్వకల్పనతోఁ గూడిన 8 ఆశ్వాసముల యద్భుతకావ్యము. ఇయ్యది నంద్యాల కృష్ణమ రాజున కంకితము. ఈతని తాత యగు నారపరాజు కొండవీటివద్ద కుతుబన ముల్కుతో జరిగిన యుద్ధములో శ్రీ కృష్ణదేవరాయలపక్షమునఁ జాల్గొ నెను. ఈ యుద్ధము 1515 లో జరిగినదఁట! అప్పటికి నారపరాజు వయస్సు 35 సం. లు. అతని మనుమఁడగు కృష్ణరాజునకు 25 ఏండ్ల వయ స్సున - అనఁగా 1550 సం. న కళాపూర్ణోదయ రచన జరిగి యుండ వచ్చును. దీనినిబట్టి యీతఁడు 1500 ప్రాంతమున జన్మించి యుండవచ్చు నని యూహింపవచ్చుచు. పై విషయములు 'ఆంధ్రకవితరంగిణి' లోఁ దెలుపఁబడినవి.

మూఁడవ గ్రంథమగు ప్రభావతీ ప్రద్యుమ్నము గ్రంథకర్తచే తండ్రి కంకిత మొనర్పఁబడినది. ఇందలి కథ భాగవతమునందలి ఉషాపరి ణయకథను పోలి యుండును. ఇందలి సంఘటనలు చమత్కారములు. రచన చాల మనోహరమైనది.

## సూరనార్యుఁడు – వెన్నెలకంటి

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. హరితసగోత్రుఁడు. అమర యామాత్యుని పుత్రుఁడు. సూరనార్యుని పుత్రుఁడు. నెల్లూరుజిల్లాలోని

గుడ్లూరిలోఁ గొంతకాల ముండినట్లు గ్రంథస్థప్రమాణమును బట్టియే తెలియుచున్నది. శాసనాధారములను బట్టి యీ కవి 16-వ శతాబ్ది పూర్వార్ధమున నున్నట్లు స్పష్టముగాఁ దెలియుచున్నది.

ఈ కవి విష్ణుపురాణము నాంధ్రీకరించి పంటరెడ్డికులమునఁ బుట్టిన రాఘవరెడ్డి కంకితము చేసెను. ఈతఁడు వేమారెడ్డి వంశమునకుఁ జెందిన వాఁడు.

సంస్కృతమున విష్ణుపురాణము రెండు భాగములుగా నున్నది. మొదటిభాగమున విష్ణుమాహాత్మ్యమును తెలుపు కథలును, శ్రీకృష్ణుని చరిత్రమును కలవు. రెండవ భాగమున ధర్మవిషయములు, వ్రతమాహాత్మ్యములు, అర్థశాస్త్రము, వేదాంతము కలవు. సూరనార్యుఁడు తొలి భాగమునే యాంధ్రీకరించెను. ఇతని కవిత్వము సరళమై, హృదయంగమముగ నుండును.

## సూరపరాజు - ఊడుమూడి

ఈతఁడు వంది (భట్టురాజు) కులమునకుఁ జెందినవాఁడు. ఈ కవి బ్రహ్మరాజు, భద్రమల కుమారుఁడు. అనంతకవి శిష్యుఁడు. ఈతఁడు 'ద్వారకా - తిరుపతి వేంకటాచలపతీ! నను బ్రోవుము వేగ శ్రీపతీ!' అను మకుటముతో వేంకటేశ్వరశతకమును చంపకమాలలలో రచించెను. కవి స్తుతినిబట్టి 16-వ శతాబ్దికిఁ దర్వాతివాఁడని తెలియుచున్నది. కాలము సరిగా తెలియదు. ఈతని నివాసము జొన్నాడ. అది గోదావరిజిల్లా లోనిది. ఈతని కవిత్వము రసవంతమైనది.

## సూరయకవి - చల్లా

ఈతఁడు వెలనాఁటి వైదికబ్రాహ్మణుఁడు. కౌండిన్యగోత్రుఁడు. మారయ, లక్ష్మమ్మల పుత్రుఁడు. మన్నారుగుడి రాజగోపాలస్వామి యీతని యిలువేల్పు. ఈతఁడు 'వివేకవిజయ' మను నాటకమును వ్రాసెను.

ఉపనిషత్కాంతావివేకేంద్రుల వివాహ మిందలి విషయము. గ్రంథ మముద్రితము. రచన సరళము. ఇతనికాలము తెలియలేదు.

## సూరయ్య - కంచిరాజు

ఈ కవి కన్నప్పచరిత్రమును పద్యకావ్యముగా రచించెను. అందలి పద్యములను కొన్నింటిని జగ్గన తన 'ప్రబంధరత్నాకరము' న నుదాహరించెను. కూచిమంచి తిమ్మకవియు నొక పద్యమును తన 'సర్వలక్షణసార సంగ్రహము' న నుదాహరించెనఁట! ఈ కవి క్రీ. శ. 1560 కిఁ బూర్వపువాఁడు.

## సూర్యప్రకాశకవి - ఎఱ్ఱమిల్లి

ఈతఁ డార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. గోదావరి జిల్లాలోని అమలాపుర నివాసి. ఈతఁడు క్రీ. శ. 1800 ప్రాంతమువాఁడు. 'వార్ధిలంఘన సంరంభ! వాయుడింభ!' అను మకుటముతో నొక సీసపద్యశతకమును రచించి తన బంధువైన వాడ్రేవు-కృష్ణప్రభువున కంకితమొనర్చెను. దీనికి 'హనుమచ్ఛతక' మని పేరు. రచన సరళమైనది.

## సూర్యప్రకాశకవి - మంత్రిప్రగడ

ఈతఁ డార్వేల నియోగిబ్రాహ్మణుఁడు; హరితసగోత్రుఁడు. శరభరాజామాత్య, సీతమాంబల పుత్రుఁడు. ఈ కవి క్రీ. శ. 1808 లో జన్మించి 1873 లో మరణించెను. ఈతఁడు విశాఖపట్టణమండలములోని మాడుగుల సంస్థానమునకుఁ బ్రభువైన శ్రీకృష్ణభూపాలుని యాస్థానమున నుండెను. శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి సమకాలికుఁడు.

సూర్యప్రకాశకవి సీతారామచరిత్రమను ఆఱాశ్వాసముల ప్రబంధమును, కృష్ణార్జున చరిత్రమను ద్వ్యర్థికావ్యమును, భీమలింగశతకమును రచించెను. కృష్ణార్జున చరిత్రమున పారిజాతాపహరణ, సుభద్రాపరిణయ కథలు కలవు.

## సూర్యశేఖరకవి

ఈతఁడు రాయ రఘునాథరాయల (1769-89) కాలములో నుండిన కవి. ఈతని చాటువులు మాత్రము లభించుచున్నవి.

## సోమన - నాచన

ఈ కవి నియోగిబ్రాహ్మణుఁడు. భారద్వాజగోత్రుఁడు. నాచన యొక్క కుమారుఁడు. ఈతఁడు రచించిన 'ఉత్తర హరివంశ' మను ఆఱాశ్వాసముల యుత్తమప్రబంధము ముద్రితమై బహుళప్రచారమున నున్నది.

ఈ సోమునికిని, మఱి యెనుగురు బ్రాహ్మణులకును బుక్కరాయలు పెంచుకల దిన్నె యను గ్రామమునకు బుక్కరాయపుర మను పేరుపెట్టి దానము చేసిన ట్లొక శాసనము కలదు. ఈ దాన మిచ్చిన యాతఁడు మొదటి హరిహరరాయల సోదరుఁడైన బుక్కరాయలు. ఈ శాసనమునఁ గల పాఠభేదములను బట్టి దానకాలము శా. శ. 1206, 1216, 1266, 12 92 మున్నగు రీతుల నున్నది. ఉత్తర హరివంశమునకు పీఠికను వ్రాయుచు శ్రీ వేటూరి - ప్రభాకరశాస్త్రిగారు శాసనకాలము శా. శ. 1266 (అనఁగా క్రీ. శ. 1344) గా నిర్ణయించి యున్నారు. దీనినే చాలమంది యంగీకరించి యున్నందున నాచన సోముఁడు 13-వ శతాబ్ది మధ్యమున నుండెనని చెప్పవచ్చును.

హరివంశము పూర్వోత్తరభాగములుగా రెండు ఖండములుగా నున్నది. ఎఱ్ఱాప్రెగ్గడ దీనిని పూర్వోత్తరభాగములుగానే యాంధ్రీకరించెను. నాచనసోమన రచించిన యుత్తర హరివంశములోఁ గృత్యాది కానరాదు. మఱియు నిందలి ప్రథమాశ్వాసమునందలి 3-వ పద్యమును బట్టి సోమన పూర్వభాగమును కూడ రచించెనని యూహించుట కవకాశ మున్నది. కాఁగా నాచన సోముఁడు హరివంశమును పూర్తిగా రచించె

నని యు, పూర్వభాగము ప్రారంభమునఁ గృత్యాది యుండవచ్చుననియు, పూర్వభాగ మిప్పుడు లభింపక యుత్తరభాగమే లభించినందున సోముఁడుత్తర హరివంశమునే రచించెనని భ్రాంతిపడవలవసి వచ్చెననియు విమర్శకుల యభిప్రాయము.

ఉత్తరహరివంశము హరిహరనాథున కంకితము.

ఎఱ్ఱాప్రెగ్గడ నాచన సోముని గ్రంథమునుండి కొంత భాగమును తీసికొనెనని యొక ప్రవాదము కలదు. కాని ఎఱ్ఱాప్రెగ్గడయే సోముని కంటెఁ గొంత ప్రాచీనుఁడైనందున నిట్టి యపోహ కవకాశము లేదు.

ఉత్తర హరివంశము నెఱ్ఱనయు, సోమనయుఁ గూడ తెలిఁగించినను, వారి పద్ధతులు వేఱు. ఎఱ్ఱాప్రెగ్గడది యథామూలానువాదము. అది పురాణపద్ధతి నుండును. సోమన ముఖ్యములైన విషయములను గ్రహించి స్వేచ్ఛగా ప్రబంధపద్ధతి నాంధ్రీకరించినాఁడు. ఎఱ్ఱనరచన యుత్తమమని కొందఱును, సోమనరచనయే మేలైనదని కొందఱును తలఁచుచున్నారు. కాని విభిన్నపద్ధతులలో రచింపఁబడిన గ్రంథములనుబట్టి యెక్కువ తక్కువలను నిర్ణయించుట యుచితము కాదేమో !

సోమన సకలాగమవేది. 'సర్వజ్ఞుఁడు.' సకలపురాణార్థవిజ్ఞాత. అష్టభాషాకవిత్వవిశారదుఁడు. నవీనగుణసనాథుఁడు. ఇతనికవిత్వము ప్రౌఢమై, ధారాశుద్ధి కలిగి, లోకోక్తులతో నిండి మిక్కిలి మనోహరముగ నుండును.

ఈతఁడు 'వసంతవిలాస' మను ప్రబంధమును రచించినట్లు అప్పకవి మొదలుగు లాక్షణికుల వచనములఁ బట్టి తెలియుచున్నది. అయ్యది మాచయ బ్రహ్మకుఁ గృతి యీయఁబడినదని శ్రీ మానవల్లి - రామకృష్ణకవిగారు వ్రాసి యున్నారు. ఆ గ్రంథ మలభ్యము. సోముని 'హరివిలాసము' లోని నాల్గు కందపద్యములను కస్తూరిరంగకవి తన 'ఆనందరంగరాట్ఛందస్సు' న నుదాహరించి యున్నాఁడు. ఇది హరివిలాసమో, హరవిలాసమో, వసంతవిలాసముకంటె భిన్నమో, అభిన్నమో తెలియదు.

## సోమనాథకవి - కొటికెలపూఁడి

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడని 'ఆంధ్రకవితరంగిణి' లోఁ గలదు. కొటికెలపూఁడివారు వెలనాఁటి వైదికబ్రాహ్మణులు ప్రసిద్ధులు. ఈతఁడాత్రేయగోత్రుఁడు. తాత సోమయామాత్యుఁడు. తండ్రి కోటీశ్వర భట్టారకుఁడు. ఈతఁడు విష్ణుమిత్రోపాఖ్యానమను అయిదాశ్వాసముల ప్రౌఢప్రబంధమును రచించి గాఱెపల్లి (గుంటుపల్లి) తిప్పమంత్రి కంకిత మిచ్చెనఁట! ఈ తిప్పన క్రీ. శ. 1535 ప్రాంతమున నుండెననియు, విష్ణుమిత్రోపాఖ్యానము 1530 తర్వాత రచింపఁబడి యుండుననియు 'ఆంధ్రకవితరంగిణీ' కారులు వ్రాయుచున్నారు.

ఈ కవి మఱియొక గ్రంథమునుగూడ రచించెనఁట !

## సోమనాథకవి - పట్టమట్ట

ఇతఁడు హైదరాబాదుప్రాంతమందలి దోమకొండచేరువఁ గల బిక్కనవోలునివాసి. ఈతఁడు క్రీ. శ. 1500-1550 నడుమ నుండెనని గోలకొండ కవుల సంచికలోఁ గలదు. ఈతఁడు నియోగి. హరితసగోత్రుఁడు. వేంకటామాత్యపుత్రుఁడు. ఈతని కాలము 1578 ప్రాంతమని 'ఆంధ్రకవితరంగిణి' లోఁ గలదు; జననము 1530 ప్రాంతమఁట !

ఈతఁడు సూతసంహిత, బ్రహ్మోత్తరఖండము అను రెండు గ్రంథములను రచించెను. ఇవి ముద్రితములు. సూతసంహిత 7 ఆశ్వాసముల ప్రబంధము. బిక్కనవోలు ప్రభువు కామారెడ్డికి కృతి యీయఁబడినది. బ్రహ్మోత్తరఖండ మైదాశ్వాసముల గ్రంథము. ఇది కామారెడ్డి తమ్ముఁడగు ఎల్లారెడ్డి కంకితము చేయఁబడినది. కవిత్వము సలక్షణమయినది.

## సోమనాథకవి

హైదరాబాదు ప్రాంతమందలి లేములవాడ యీతని నివాసము. ఈతఁడు క్రీ. శ. 1650 ప్రాంతమున నుండెను.

ఈతఁడు వసుచరిత్రమునకు 'విద్వన్మనోరంజని' అను వ్యాఖ్యాన మును రచించెను. ఆ వ్యాఖ్యనుబట్టియే యీతఁడు చతుర్భుజాభిషేకము, యాదవచరిత్రము, గంగా గౌరీ సంవాదము' అను గ్రంథములను రచించి నట్లు తెలియవచ్చుచున్నది. ఈతని వ్యాఖ్యానము వేములవాడలోని రాజేశ్వరస్వామి కంకితము.

## సోమనాథకవి - రేకపల్లి

ఇతనికి సోమప్పశాస్త్రి యని వాడుకపేరు కలదు. ఇతఁడు వైదిక బ్రాహ్మణుఁడు. తండ్రి సూర్యనారాయణసోమయాజి. జన్మభూమి గోదావరిమండలములోని తాళ్లపూఁడి. ఇతని తండ్రి దారిద్ర్యమున పీడితుఁడై స్వగ్రామమును విడిచి తునికి దగ్గఱగా, తాండవనదీతీరమున నున్న సత్యవర మను గ్రామమును చేరుకొనెను. ఆ గ్రామము కాకర్ల పూఁడివారికి రాజధాని. అప్పుడు, సత్యవరమును పాలించుచున్న కాకర్లపూఁడి గోపాలరాయ పాయకరావుగారీ కవి నాదరించి తమ యాస్థానకవిగా నొనర్చుకొనిరఁట!

ఇతఁడు సుప్రసిద్ధుఁడగు అడిదము - సూరకవికి ప్రతిద్వంద్వి. పద్యరూపముగనున్న వీరి వాదము ప్రసిద్ధము. కావున నితఁడు క్రీ. శ. 1720-90 నడుమ నుండెనని చెప్పవచ్చును.

సోమనాథకవి వేదశాస్త్రములను చదివిన గొప్ప విద్వాంసుఁడు. వెలివెల గౌతమరాజువద్ద ఆంధ్రలక్షణము నేర్చుకొని 'రుక్మవతీపరిణయ' మను నైదాశ్వాసముల ప్రబంధమును రచించి తన పోషకుఁడగు గోపాల రాయపాయకరావున కంకిత మొనర్చెను. ఈ ప్రబంధమున ప్రద్యుమ్నుఁడు రుక్మవతిని వివాహమాడిన విషయము వర్ణింపఁబడినది. ఈ ప్రబంధము ముద్రితమైనది.

## సోమనాథుఁడు - పాలకురికి

ఓరుగల్లు ప్రాంతమునఁ గల పాలకురికి యీతని నివాసము. వీర శైవాచారపరాయణుఁడగు నీతఁడు బ్రాహ్మణుఁడని కొందఱు, జంగముఁడని కొందఱు తలంచుచున్నారు. ఈతని గ్రంథములనుబట్టి చూచిన నీతఁడు బ్రాహ్మణుఁడని తోఁచక మానదు.

ఈతని కాలమునుగూర్చి యభిప్రాయభేదములు చాల కలవు. మొత్తముమీఁద నీతఁడు క్రీ. శ. 1190 కిని, 1320 కిని నడుమ నుండిన వాఁడని చెప్పవచ్చును.

సోమనాథుఁడు సంస్కృతాంధ్ర కర్ణాటకభాషలలో గొప్ప పండితుఁడు. మహాకవి. మతగ్రంథములను ప్రౌఢరీతిని రసవంతముగా రచించినవారిలో నితఁడే సమర్థుఁడు. ఇతఁడు పెక్కు గ్రంథములను రచించెను.

ఇతని తెలుఁగు కృతులు— బసవపురాణము, పండితారాధ్య చరిత్రము, అనుభవసారము, చతుర్వేదసారము, చెన్నమల్లుసీసములు, వృషాధిపశతకము, బసవోదాహరణము.

సంస్కృతగ్రంథములు—సోమనాథభాష్యము, రుద్రభాష్యము, నమస్కారగద్య, అక్షరాంకగద్య, పంచప్రకారగద్య - పద్యములు, అష్టకము, పంచకము, బసవోదాహరణము.

కన్నడగ్రంథములు—బసవ రగడ, గంగోత్పత్తి రగడ, బసవాధ్య రగడ, సద్గురు రగడ.

పయిగ్రంథములను పిడుపర్తి - సోమనాథకవి తన పద్య బసవ పురాణములోఁ జేర్కొని యున్నాఁడు.

ఇంకను వృషభాష్టకము మున్నగు నీతని రచనలు కానవచ్చుచున్నవి.

సోమనాథుని బసవపురాణ, పండితారాధ్యచరిత్రములు బహుళ ప్రచారమున నున్నవి. కేవల మతాభినివేశము కలవారే కాక, భాషా వాఙ్మయవేత్తలు వీనిని ప్రామాణికములుగ గ్రహించుచున్నారు.

## సోమనాథుఁడు – పిడుపర్తి

ఈతఁడు వరంగల్లు నివాసి. వీరశైవాచార తత్పరుఁడు. బసవన పుత్రుఁడు. దేవనార్యునప, మల్లమదేవికిని పౌత్రుఁడు. ఈతని జననము క్రీ. శ. 1450 ప్రాంతమనియు, గ్రంథ రచనాకాలము 1480 ప్రాంత మనియు 'ఆంధ్ర కవితరంగిణి' లోఁ జెప్పఁబడినది.

పాలకురికి సోమనాథుఁడు రచించిన ద్విపద బసవపురాణమును పద్యకావ్యముగా రచింపవలెనని తన తండ్రి చెప్పఁగా నీ సోమనాథుఁడు పద్య బసవపురాణమును రచించి, తండ్రి యానతిని పాలకురికి సోమనాథుని కే యంకిత మొనర్చెను.

ప్రభులింగలీల యనునది యితని గ్రంథాంతరము. అది ద్విపద కావ్యము. అల్లమప్రభుని లీల లీ గ్రంథమున వర్ణితములు. ఈ ద్విపద కావ్యమునే యీతని సోదరుని పుత్రుఁడైన బసవప్ప ద్విపదకావ్యముగా రచించెను.

ఈతని రచన ప్రౌఢమై, రసవంతముగా నుండును.

## సోమన్న

ఈతఁడు ద్విపద భారతమునందలి కర్ణపర్వము మొదలుకొని చివరివఱకును రచించి గ్రంథమును పూరించినవాఁడు. 18–వ శతాబ్దిలో నుండినవాఁడు. రచన సరళము. ఈతని భారతభాగము ముద్రితము.

## సోమభూపాలుఁడు – ముష్టిపల్లి

ఇతఁడు హైదరాబాదురాష్ట్రమునందలి గద్వాలను పాలించిన ప్రభువు. చెన్నకేశవస్వామి భక్తుఁడు.

గద్వాలప్రభువగు పెద సోమభూపాలుడు శా. శ. 1636 వఱకును రాజ్యముచేసి మరణింపఁగా నాతని భార్య అక్కమ్మ యా పిదప కొంత కాలము రాజ్యము పాలించెను. పిదప తిరుమలరాయలను దత్తత చేసికొనెను. అతఁడు సింహాసనము నధిష్ఠించెను. కాని కొలఁదికాలములోనే యతఁడు దింపివేయఁబడి, యతనిస్థానమున రామరాయలు నిలుపఁ బడెను. రామరాయలు శా. శ. 1642 మొదలు 1684 వఱకును రాజ్యమేలెను. ఇతఁడు సంతానహీనుఁడైనందున తిరుమలరాయని కుమారుఁడైన సోమన్నను పెంచుకొని, గద్దె నెక్కించెను. ఇతఁడే సోమభూపాలుఁడు. ఇతఁడు క్రీ. శ. 1793 వఱకును రాజ్యమును పాలించెను.

ఇతఁడు పెక్కురు విద్వత్కవులను పోషించుటయేగాక స్వయముగ గ్రంథములను రచించెను. హరిభట్టు సంస్కృతమున రచించిన 'రతి రహస్యము' నితఁడు పద్యకావ్యముగా ఆంధ్రీకరించెను. జయదేవమహాకవి సంస్కృతమున రచించిన 'గీతగోవిందము'ను సంస్కృతాంధ్రములలో విపులీకరించుచు 'అష్టపదు'లను వ్రాసెను. ఇతనికి 'నవభోజరాజు' అను బిరుదము కలదఁట !

## సోమయ్య - దామరాజు

ఈతఁడు 'భరతము'ను రచించినట్లు జగ్గకవి కూర్చిన 'ప్రబంధ రత్నాకరము'ను బట్టి తెలియుచున్నది. అయ్యది నాట్యశాస్త్రమునకు సంబంధించిన గ్రంథము. ఆ గ్రంథము లభించలేదు. ఈ కవి క్రీ. శ. 1560-కిఁ బూర్వుఁడు.

## సోమయ్య - పెదపాటి

సంకలన గ్రంథములందు ఉదాహరింపఁబడిన పద్యములనుబట్టి యీతఁడు 'అరుణాచల పురాణము, కేదారఖండము, త్రిపురవిజయము, శివజ్ఞాన దీపిక యను నాల్గు గ్రంథములను రచించినట్లు తెలియుచున్నది. కూచిమంచి - తిమ్మకవి యీతని పద్యము నొకదాని నుదాహరించుచు

"కవిలోకబ్రహ్మ శివజ్ఞానదీపికలోని"దని చెప్పుటవలన, ఈతనికి 'కవిలోని బ్రహ్మ' యను బిరుద మున్నట్లు తెలియుచున్నది.

ఈతఁడు శ్రీనాథుని నుతించుటచేతను, ఈతని గ్రంథములు సంకలనగ్రంథములలోఁ బేర్కొనఁబడుటచేతను సోమయ్య 1500 ప్రాంతమున నుండెనని చెప్పవచ్చును.

ఈతని కవిత్వము సరసమై మనోహరముగా నుండును.

## సోమరాజకవి – పుసులూరి

ఈతఁ డార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. ఆత్రేయ గోత్రజుఁడు. పడమటి గోదావరిజిల్లా తణుకుతాలూకా ఇలింద్రపఱ్ఱు గ్రామనివాసి యఁట! ఈతఁడు పోతనామాత్యుని పేర్కొనెనఁట! కాన, అతనికంటె నవీనుఁడు. 1700 లకుఁ బూర్వుఁడని శతకకవుల చరిత్రలోఁ గలదు. ఈతని తండ్రి ఉమాపతి; తల్లి పాపమ్మ. ఇతఁడు బాలగోపాల భక్తుఁడు.

ఈతఁడు చంద్రదూతశతకము, బాలగోపాలశతకము, నందనందన శతకము – అను మూఁడు శతకములను రచించెను. చంద్రదూత శతకమునకే ఇందు శతకమని నామాంతరము కలదు.

## సోమలింగయ్య – చదువుల

ఈతఁ డారాధ్యబ్రాహ్మణుఁడు. వేంకటాచలమయారాధ్యునకును, అన్నపూర్ణమ్మకును పుత్రుఁడు. ఈతని కాలము సరిగాఁ దెలియదనియు, రమారమి నూట యేఁబదియేండ్లక్రిందట నుండి యుండవచ్చుననియు శ్రీ వీరేశలింగము పంతులుగారు వ్రాసి యున్నారు.

ఈ కవి మదనసాయక విలాస మనెడి యైదాశ్వాసముల శృంగార ప్రబంధమును రచించి శ్రీశైల మల్లికార్జునదేవున కంకిత మొనర్చెను. ఇతని కవిత్వము మృదుమధురమై యుండునఁట!

## సోమశేఖరకవి - ఓరుగంటి

ఈతఁడు వైదిక బ్రాహ్మణుఁడు. కౌండిన్యగోత్రుఁడు. సంస్కృతాంధ్రములలో గట్టి విద్వాంసుఁడు. ఈ కవి రమారమి నూటయేఁబదియేండ్లనాఁటివాఁడని శ్రీ వీరేశలింగముపంతులుగా రభిప్రాయపడుచున్నారు.

ఈ కవి రామకృష్ణార్జున రూప నారాయణీయమను నాలుగాశ్వాసముల త్ర్యర్థి కావ్యమును రచించెను. ఇందు భారత, భాగవత, రామాయణములకు సంబంధించిన కథ లిమిడి యున్నవి. ఇది శ్రీ పూసపాటి నారాయణరాజుగారి కంకితము.

## సోమేశ్వరారాధ్యుఁడు

ఈతఁడు 'ఏకామ్రగురు చిత్త నళిన భృంగ! సోమనాథలింగ!' అను మకుటముతో నొక సీసపద్య శతకమును రచించెను. ఈతనిఁ గూర్చిన విశేషములు తెలియవు. ఈ కవి క్రీ. శ. 1750 కంటెఁ బ్రాచీనుఁడు కావచ్చునని శతక కవుల చరిత్రకారులు వ్రాసియున్నారు.

## సోమేశ్వరుఁడు - పాలపర్తి

జగ్గకవి 'ప్రబంధరత్నాకరము'లో నీతని పద్యములు రెం డుదాహరింపఁబడినవి. అవి యేగ్రంథములోనివో చెప్పఁబడలేదు. పద్యములలోని వర్ణన త్రిపురాసుర సంహారమునకు సంబంధించినది. 'రెండు పద్యములును వేర్వేఱు శతకములలోనివని తోఁచుచున్నట్లు' 'ఆంధ్రకవి తరంగిణి'లోఁ గలదు. ఈ కవి క్రీ. శ. 1560 కంటెఁ బూర్వుఁడు.

## సానాపతి - విశ్వనాథనాయకుని

మధురను పాలించిన విశ్వనాథనాయకుని (క్రీ. శ. 1629-64) కాలమున నీకవి యుండెను. 'రాయవాచకము' అను వచనకావ్య మీతని కృతి. అది ముద్రితము. అందు విజయనగర వృత్తాంతము, శ్రీకృష్ణరాయల

చరిత్ర, అతని విజయములు, తిమ్మరుసు మంత్రి రాజనీతి మున్నగు విషయములు కలవు. చరిత్రకారుల కియ్యది మిక్కిలి యుపయుక్తమైనది. కుమార ధూర్జటి దీని ననుసరించియే 'కృష్ణరాయ విజయము'ను రచించెను. రాయవాచకము చక్కని వ్యావహారిక భాషలో నున్నది.

## హరిభట్టు

ఈతని నివాసము కంభముమెట్టు. ఈతఁడు క్రీ. శ. 1600 ప్రాంతమున నుండెనని గోలకొండకవుల సంచికలోఁ గలదు. 1660 ప్రాంతీయుఁడని శ్రీవీరేశలింగము పంతులుగారి యూహ.

ఈతఁడు సంస్కృతమున రతిరహస్యమను గ్రంథమును రచించెను. దానినే సోమభూలుఁడు తెనిఁగించెను. ఈతఁ డీ రతిరహస్యమునే గాక తెలుఁగులో మత్స్యపురాణమును, నృసింహపురాణమును, భాగవతము నందలి షష్ఠస్కంధమును, ఏకాదశ, ద్వాదశస్కంధములను, వరాహపురాణమును రచించినట్లు తెలియుచున్నది.

ఈతఁడు వరాహపురాణములోని పూర్వభాగమును, నృసింహపురాణమునందలి యుత్తరభాగమును రచించెనని తెలియవచ్చుచున్నది.

ఇతని భాగవత షష్ఠస్కంధము శ్రీజగన్నాథస్వామికిని, ఏకాదశ, ద్వాదశస్కంధములు ఆంజనేయస్వామికిని కృతి యీయఁబడినవి. కవి మరణించిన పిదప నాతని కుమారుఁడగు రాఘవమనీషి, నృసింహపురాణమును ప్రోలుగంటి రంగమంత్రి కంకిత మొనర్చెను.

హరిభట్టు శ్రీకృష్ణదేవరాయల కాలములో నుండినవాఁడనియు, శాసనప్రమాణమును బట్టి యీ కవి కాలము క్రీ. శ. 1513 అనియు శ్రీనిడుదవోలు - వేంకటరావుగారు వ్రాయుచున్నారు.

## హుళక్కి భాస్కరుఁడు

రామాయణమును రచించిన భాస్కరు లిద్ద రుండుటవలన నీతఁడు హుళక్కి భాస్కరుఁడని ప్రసిద్ధుఁడయ్యెను. ఈ కవి రామాయణము నందలి యుద్ధకాండమును రచింపఁ బ్రారంభించి కొంతవఱకును వ్రాసెను. ఈతఁడు రచింపఁగా మిగిలిన భాగము నా తర్వాత 'అయ్యలార్య'డను కవి ముగించెను. కాఁగా యుద్ధకాండమునఁ గొంతభాగమును హుళక్కి భాస్కరుఁడును, కొంత భాగమును అయ్యలార్యుడును రచించిరని చెప్ప వలెను. యుద్ధకాండము సాహిణిమారన కంకితముచేయఁబడినది. ఇతఁడు 13-వ శతాబ్దిచివఱ నుండి యుండవచ్చును. ఈ కవి 'దశగతు'లను గ్రంథమును రచించి సాహిణిమారన కంకితముచేసినట్లు తెలియుచున్నది.

## హొన్నయ్య - చరిగొండ

హైదరాబాదుప్రాంతములోని చరిగొండ యీతని నివాసము. ఆ యూరు మహబూబునగరు జిల్లాలోనిదఁట! చరిగొండ ధర్మన, చరిగొండ నరసింహకవి యీతని వంశములోని వారఁట! ఈతఁడు క్రీ. శ. 1700 ప్రాంతమున నుండెనఁట!

ఈతఁడు జ్యోతిష రత్నాకరమను జ్యోతిషగ్రంథమును పద్య కావ్యముగా రచించెను.

---

# గ్రంథానుక్రమణిక

(ఇచటి సంఖ్య పుటలను తెల్పును)

—: ౦ :—